# బలిగావే-జననీ

( కామోద్ — ఆది )

ప. బలిగావే జననీ - అహింసా
   భావము నెలకొల్పంగా - హింసకు ||బలి||

అ. నిలబడవే నీనిండుమనసుతో
   ప్రళయజలదఘోషలకు చలింపక ||బలి||

చ. పలువంకల రాపిడులకులోనై
   పలుపోకల ఆపదలకు గురియై
   నలిగి నలిగి నీ భౌతిక దేహము
   నశియించనీ నీమదిని చలింపక ||బలి||

(మిత్రులు, శిష్ట్లా సత్యనారాయణ రాజశేఖరంగారి
"జాతీయగీతముల" నుండి)

# ❊ సమర్పణ ❊

మహనీయుల ఆదర్శాలన్నింటి సారమును తన
పవిత్రప్రేమ జీవితంద్వారా మనముందు
బెట్టి, లక్ష్యమును చేరుటకై
అసువుల బాసిన
పూజ్య
"బాపూజీ" కి

★

# కృతజ్ఞుడను

అంతేవాసి నగునాపై అవిరళ వాత్సల్యమును
వెదజల్లు పూజ్యగురువర్యులు శ్రీయలమంచిలి
వెంకటప్పయ్య చౌదరిగారు అనవరతము
నాయందు జూపు ప్రత్యేకశ్రద్ధ వల్లను;
శైశవావస్థలోనున్న నా ఆధ్యాత్మిక శరీర
మును మాతా పితరులవలె తమ ప్రేమదృష్టి
యనెడి మధురాన్నముతో పోషించుచున్న
పూజ్య శ్రీ వెంపటి సూర్యనారాయణగారి
యొక్కయు, వారిసతీమణిగారి యొక్కయు,
పవిత్రవాత్సల్యమువల్లను;
మిత్రులందరి ప్రోత్సాహము తోను;
సంస్కృత వాఙ్మయములోనున్న అనేక
ధార్మిక గ్రంథాలతో బాటు సాయణ, దయా
నంద భాష్యముల ప్రత్యేక తోడ్పాటుతోను;
నా యీ అపక్వహృదయంలో, యేవో తెలిసీ
తెలియని భావాంకురాలు మొలకలెత్తి, బాల్య
చాపల్యంతో పరుగులిడుచూ, అక్షరాల రూ
పంలోకి మారి పుస్తకంగా తయారైనవి.
ఇందుకు వీరందరికీ యెల్లపుడు కృతజ్ఞుడను.

—కూర్మా రావు.

# మనవి

దుఃఖనివృత్తికి దారిగా యేర్పడిన ప్రతి మతము లేక ఇజమ్ యొక్క లక్ష్యము దుఃఖనివృత్తి, ప్రపంచ శాంతియే. ప్రపంచ శాంతికి కృషి జేసే సజ్జనులను, వెనుకటి మతాల పేరుతో బలి గొనడం మానవ లోకంలో పరిపాటి యైనట్లు కానుపించు చున్నది. ఈ అయోమయస్థితినుండి బయటపడకపోతే మనకు మనుగడ వుండుటయే దుర్లభము.

విశాల సముద్రమువలె వైదిక సిద్ధాంతము ప్రపంచములో సర్వ విజ్ఞాన స్రోతస్సులను తనలో జీర్ణము జేసుకొన గలదు. కనుక లోకంలోని మతాలన్నిటి లక్ష్యమేదో, వైదికలక్ష్యము కూడనదియేనను భావము, నాలో మిణుకు మిణుకు మను చున్నది. ఈభావాన్ని పెద్దలముం దిడుటకే, యీ పొత్తమును వ్రాసితిని. "లక్ష్యంబొక్కటే" అను విషయాన్ని యీ పుస్తకంలో సరిగ సమన్వయము జేసి సమర్థింపలేక పోతే, అది నా అసమర్థతయే గాని; ప్రపంచంలోని "మతాలన్నిటి లక్ష్యమే వైదిక లక్ష్యము" అను సిద్ధాంతము శాశ్వతమైనదని నా విశ్వాసము. దీనిని యింకను పుష్టివంతము, శోభావంతము, మాధుర్యము, నగు వాదనలతో రుజువు జేయుటకు పండితులు కృషి జేయాలని నామనవి. అత్యల్ప భాషా పరిచితిగల నాబోటి అతి సామాన్యుడీ విశాలవైదిక మతాన్ని అవలోడించడం సాధ్యంగాని పని. అయితే ఆకాశము అనంత విశాలమైనది.

మనకన్ను మిక్కిలి కొద్ది ప్రదేశము నాక్రమించిన సీమిత పదార్థమే. మఱి మిక్కిలి కొద్ది ప్రదేశాన్నాక్రమించిన కన్నే, విశాలాకాశమును చూడగలిగి, బాహ్య జగత్తులోని వస్తు పరిచయాన్ని హృదయానికి కలిగించుటలేదా ? ఇందుకు విశాలాకాశము నందావరించి యున్న బాహ్య జగత్తును చూచుటకు మూలహేతువు "కాంక్ష". అట్లేవిశాలమగు వైదికసిద్ధాంతాన్ని, సామాన్యభాషా జ్ఞానముగల వారైనను పరిశోధించి అందలి లక్ష్యాన్ని జేరుకొనుటకై కృషి జేయుటలో దోషములేదు. ఇందుకు ముఖ్యముగ హృదయములో కాంక్ష పుట్టాలి. ఇక భాషా పాండిత్యముగల పండితులీ పనికి బూనుకొన్నచో సువర్ణములో సుగంధము జేరినట్లే.

ఈ పుస్తకములోని విషయాలను మాధుర్యమగు తెలుగు భాషలో ప్రకటింప లేకపోతినని సిగ్గిలుచున్నాను. ఏవిషయాన్నైనా మృదుమధుర నుడికారముతో జెప్పినచో, వినువారి హృదయములో వేగముగ జొచ్చుకొని పోగలదు, నేనట్టి మృదు మధుర తెలుగు నుడికారమును వెల్లడించు శక్తి గలిగి యుండక పోవుటచే, పాఠకుల కిందలి శైలి వెగటుగతోచ వచ్చును. అయినను నాహృదయములోని కాంక్షను వెల్లడించుటకు కొంతవరకు ప్రయత్నించితిని. కనుక పాఠకులు దానిని చూచెదరు గాక.

"సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్, నబ్రూయాత్ సత్య మప్రియం" అని పెద్ద లన్నారు. తాను నమ్మిన

సత్యాన్నే, ఇతరులకు జెప్పునప్పుడు హింసా, అసూయ భావాల తోను; కటువైన భాషా శైలితోను జెప్పరాదని పై వాక్యము లోని భావము. ఈపుస్తకంలో ప్రత్యేకంగా ఒక తెగనుగాని, ఒక కులమునుగాని నిందించుట నాయుద్దేశ్యముగాదు. అయినను పాఠకుల కిందేదైన బాధాకరమగు ధోరణి కానుపించినచో, అందుకు క్షమించాలని మిక్కిలి ప్రార్థన. ఆత్మసాధన కొఱవడ్డ నాబోటి చిన్నవాడు జేసే దుడుకుతనమును జూచి క్షమించి పెద్దలు నాపై వాత్సల్యమును గురిపింతురు గాక యని ప్రార్థన.

సంస్కృత భాషలో నున్న ధార్మిక వాఙ్మయమును జదువుకొనుటకై ప్రవేశించు విద్యార్థులకు యీ పుస్తకము తోడ్పడవలెనని సంకల్పించియుంటిని. దాని ఫలితం నాహృదయ పవిత్రతపై నాధారపడియుండును. పుస్తకము కొద్ది. విషయము విశాలము. విస్తారమైన వివరణ ఉంటేనేగాని వినువారికి తృప్తి గలుగదు. కాని విషయవిస్తరణను కొద్దిపాటి పుస్తకంలో చేయ లేక పోతిని. అంతేగాక నాలో అట్టినేర్పు కొఱవడెను. పెద్దల అనుగ్రహ మున్నయెడల షోడశ సంస్కారములు, దర్శనముల పైన విడివిడిగ అవకాశమున్నచో కొంత కృషిజేసి వ్రాయాలని కోరుచున్నాను. పాఠకులందరు తమ ప్రేమ దృష్టుల నాపై ప్రసరింపజేయాలని మనవి.

వేదములను తెలుగులో అనువదించుమాట యెటు లున్నను, దర్శనములను, నిరుక్తమును తెలుగులోనికి అనువ దించాలని పండిత లోకాన్ని ప్రార్థించు చున్నాను. ఇందుకు

పూనుకొను సజ్జనులకు నాశక్తి వంచనలేక తోడ్పడుదునని మాట యిచ్చుచున్నాను. దర్శనములను తెలుగులోనికి అనువదించుటకు ప్రారంభించిన పం. గోపదేవ్ జీ, గారి కీసందర్భమున కృతజ్ఞతను వెల్లడించెదను. విషయవిజ్ఞానాన్ని కలిగించినచో, తరువాత ప్రతివారును తమకామోదమగు సిద్ధాంతాన్ని వరించుతారు. ఇందెవరి నిర్బంధము ఉండరాదు గదా!



# ఉపోద్ఘాతము

బ్రహ్మాండము - పరమాణువు (Atom); సమిష్టి-వ్యక్తి
గతము; సంఘము-మనుష్యుడు; పరమాత్మ - ఆత్మ; దాదాపు
సృష్టి అంతయు యీరూపంలోనే యున్నది. ఒక్కరిమాట
పదుగురి హృదయాలలో ప్రతిధ్వనించినప్పుడు; మనుష్యుడు
సంఘముతో అంతమగు నప్పుడు; ఆత్మ తనఉపాధిని కోల్పోయి
పరమాత్మలో లీనమైనప్పుడు; పరమాణువు అనేక పరమాణు
వుల (Atoms) తో కలసి బ్రహ్మాండరూపమును పొందినప్పుడు;
సత్త్వ-రజ-స్తమోగుణముల భిన్నత్వము తొలగి సామ్యావస్థ
ప్రత్యక్షమైనప్పుడు, జిజ్ఞాసువులు భిన్నత్వమునుండి ఏకత్వమును,
లేక భిన్నత్వము యొక్క లక్ష్యమగు ఏకత్వమును పొందుట
యని తలంతురు.

పుట్టుకకు పూర్వము, మరణమునకు పిమ్మట, మాన
వుడు సామాజిక జీవిగ కానుపించడు. అయితే యీభిన్నత్వము
గూడ భావనలోనిదే. ఎందుకనగ, భౌతికపదార్థము, చైతన్యము;
యీ రెండు మానవుని పుట్టుకకు పూర్వము, మరణమునకు
తరువాత వ్యక్తి ఉపాధినుండి వేరై పోవుచుండును. మధ్యకాల
ములో "తైలబిందువత్"గా భౌతిక పదార్థమగు శరీరము,
చేతనవస్తువగు ఆత్మ-మనస్సు మొదలైనవి కలసి మెలసియుం
డును. ఈ రెండు వ్యక్తి ఉపాధినుండి వేరైనప్పుడు వాటి
పుట్టుక స్థానములగు విశాల రూపములలో లీనమై యుండును.
కనుక పుట్టుకకు పూర్వము, మరణమునకు పిమ్మట మానవుని

ఉనికిరి విశాలత్వమే. విశాలత్వమునకు మారుపేరు ఏకత్వము- అనగ భిన్నత లేనిది.

మధ్యకాలీన జీవితంలో, అనగ పుట్టుక మరణములకు మధ్య మనుష్యుడు వ్యక్తిగ అనుభవించుచుండుటవలన, అతని స్థితి భిన్నత్వము. కాని అతని లక్ష్యము ఏకత్వము. ఏకత్వము కొఱకు విరామములేని కృషి సాగించుట మానవుని స్వభావము గనుకనే లక్ష్యము ఏకత్వమగుచున్నది. దీనిని గుర్తించుటయే ప్రతి మానవుని స్వధర్మము - పురుషార్థము; అనగ పురుష ప్రయత్నంతో సాధించవలసినపని. పుట్టుక సమయంలో తల్లి దండ్రుల వరకే మానవుని కుటుంబము. తరువాత కుటుంబ రూపము తోడి బాలబృందము. పిమ్మట తాను కోరుకొని, అంతకు పూర్వము అపరిచితగా నున్న ఒక వనితను సుపరిచితగా జేసుకొనుటవల్ల, భార్యా బిడ్డలు; యీ విధంగా, అంతస్థులు పెరుగుచూ గ్రామం, దేశం, ప్రపంచం; మొత్తము మానవుని కుటుంబమై పోతుంది. ఎట్లనగ భారతదేశములో నున్న ఒకసోదరుడు, జర్మనీదేశములోనున్న మరియొక సోదరు నితో స్నేహముజేసినచో, వారిరువురిలో, యేవకరు మరణిం చినను, రెండవవారికి తమ కుటుంబములోని వారు మర ణించినట్లే వియోగబాధ కలుగును. ఇట్లే భారతదేశము లోని ఒకసోదరి, చైనా దేశములోని ఒకసోదరుని ప్రేమించి, అతనితో వివాహమాడినచో, వారిరువురు ఒక కుటుంబమగుట వలన, అంతకుపూర్వము భిన్నజాతి (Nation) గనున్న భారత చైనా దేశములు ఏకకుటుంబమైపోవును. ఒక్కడుగనుండి, ఏక

త్వమును జెందుటకు, బుద్ధి ప్రయత్నములు పనిజేయుచున్నవి. కనుక మానవుని పురుషార్థము లేక పురుషప్రయత్నమువల్ల సాధించవలసినపని 'ఏకత్వము.' ఒక్కడుగానుండి పదుగురిఆమోదములేకపోతే లక్ష్యానికి దూరుడగును. మహాయోగి వేమన నుడివిన సుభాషితములో యీ భావము ధ్వనించుచున్నది.

"పదుగురాడుమాట, పాడియై ధరజెల్లు,
ఒక్కడాడుమాట యెక్కదెందు."

సమిష్టి-వ్యక్తి, లేక ఆత్మ-పరమాత్మరూపముల విశ్లేషణ జేయుటకు, దార్శనికులు, ఆకాశమును ఉపమానముగ గైకొందురు. గదిని నిర్మించుటకు పూర్వము, ఆకాశమంతా ఒకటై, విశాలముగనుండును. గదినిర్మాణమైన తరువాత, విశాలాకాశమునకు, గదిలోని ఆకాశమునకు భేదమేర్పడి విశాలాకాశముకంటే, చిన్నదగును. "చుట్టుగోడలు; పైకప్పు" అనే ఉపాధిచేత ఆవరింపబడి యుండుటచేత, గదిలోని ఆకాశము (ఖాళీ) విశాలాకాశముకంటే వేరైనట్లు కనుపించుటయు, కొద్దిరూపమును బొందుటయు కలుగును. చుట్టుగోడలు, పైకప్పు; మధ్యకాలములో నిర్మింపబడిన వగుటచేత; వాటికి శాశ్వత స్థిరత్వములేదు. ఎప్పుడోఒకప్పుడు కూలిపోవును. ఇక మిగిలేది ఆకాశము (ఖాళీ). అది విశాలాకాశములోలీనమగును. గదిలోని కొద్దిఆకాశమునకు గమ్యస్థానము విశాలాకాశము. విశాలాకాశపు గుణము, గదిలోని కొద్ది ఆకాశములోగూడ నున్నదని గ్రహించవలెను. అట్లే విశ్వవ్యాప్తమైన అఖండజ్ఞాన

రూపమగు పరమాత్మ ప్రతివాని హృదయములోను వుండును. ఠాగూరు మహాకవి మధురవాక్కులో యీశాశ్వత సత్యముట్టి పడుచుండును.

"Thou hast made me endless,
Such is thy pleasure.
This frail vessel thou emtiest again, and again,
and fillest it ever with fresh life.
—Gitanjali

ఈ వాక్యాలలో, ఠాగూరు మహాకవి, తనలో విశ్వ రూపమును దర్శించ గలిగినాడు. అంటే వ్యక్తిలో సమష్టి రూపమును గాంచినాడని అర్థము. ఈ లక్ష్యాన్ని జేరుకొనుటకే ప్రపంచంలోని సాధకులందరూ కృషిజేసి, తమజీవితసాధనలను రానున్నతరాలవారికి, అనుభవపాఠములుగ వదలివేసిరి. అవే మతములు. కాబట్టి మతములన్నిటి "లక్ష్యం ఒక్కటే". ఈ లక్ష్యాన్ని చేరుకున్నప్పుడే మానవులకు శాశ్వతసుఖము-శాంతి కలుగును. అనగ ముక్తిగలుగును. ప్రపంచములోని మతాలన్ని టితోబాటు, వేదములు; భారతీయదర్శనములు; ఉపనిషత్తులు మొదలైన ప్రాచీన భారతీయ ధార్మిక వాఙ్మయముయొక్క లక్ష్యముగూడ "ముక్తే". అయితే ఇచ్చట ఒక విషయమును గమనించవలెను. ఆంగ్లభాషలో ఇజమ్ (ism)అని, రెలిజియన్ (Religion) అని రెండుపేర్లు వాడుకలోనున్నవి. థియరీ లేక సిద్ధాంతమునకు 'ఇజమ్' అని వుపయోగింతురు. పవిత్రమైన విశ్వాసము, అభిప్రాయము, దైవప్రార్థన, మోక్షములతో గూడిన సముదాయాన్ని రెలిజియన్ (Religion) అంటారు.

భారతీయభాషలలో, ముఖ్యంగా సంస్కృతభాషలో మతము-
సిద్ధాంతము, అనే పదాలువుపయోగింప బడుచుండును. కాని
వీటిరెంటికి, వుపయోగములో, అట్టిభేదముండదు. సదభిప్రాయ
మును మతమని, దాన్ని తర్కవితర్కములతోను, ప్రత్యక్షాది
ప్రమాణములతోను, బలపరచినప్పుడు 'సిద్ధాంతము' అనుపద
మును వుపయోగింతురు. సిద్ధాంతరూపములోనికి మారినప్పుడే
మతము విస్తృతరూపము ధరించుచుండును. అందువల్లనే
ఆస్తిక, నాస్తిక, హిందూ, బౌద్ధ, అద్వైత, ద్వైతములకు
మతములని, సిద్ధాంతములని రెండు పేర్లుగలవు. సిద్ధాంతమన్నను
మతమన్నను, పైవిషయములే అన్వయమగుచుండును. సామ్య
వాదసిద్ధాంతమన్నను - సామ్యవాద మతమన్నను ఒకే విష
యము అన్వయమగును. "దేవుడు లేడు" అనేది ఒక అభిప్రా
యము. దాన్ని ప్రత్యక్షాది ప్రమాణములతో ఋజువుచేయు
చున్నప్పుడు ప్రత్యర్థి సిద్ధాంతాన్ని ఖండించి తన నిర్ణయమును
బలపరుచుకున్నప్పుడు, నాస్తిక సిద్ధాంతమని; సాధారణంగా
దానిలోని ఉత్కృష్టతను లోకానికి చాటుటమాత్రమునే జేసి
నప్పుడు మతమనవలెను. ఈ మొత్తానికి మతము, లేక అభిప్రా
యమే మూలము గనుక భారతీయ భాషలలో హిందూ,
బౌద్ధ, సిఖ్ఖు, ఆస్తిక, నాస్తిక, సామ్యవాద, సమాజవాదాలను
మతములన్నను, సిద్ధాంతములన్నను భేదములేదు. అన్ని
సిద్ధాంతముల, లేక మతముల లక్ష్యముగూడ ముక్తియే గనుక
యీ గ్రంథములో మతము-సిద్ధాంతము, అని రెండు పేర్లు ఒకే
విషయమునకు వుపయోగింపబడినవి. మతము - సిద్ధాంతాల

లక్ష్యాన్ని సాధించుటకు తీసుకునే మార్గాలలో లక్ష్యానుగుణ్యమగు విధానము లేకపోవుటచేత మతముల వాస్తవరూపము, ఆయామతములను ప్రచారం జేసేవారియందు కనుపించక పోవుట సహజము.

"సంగచ్ఛధ్వం, సంవదధ్వం, సంవోమనాంసి జానతామ్" అనేదే వైదికవాఙ్మయపు ధోరణి. "సమిష్టిరూపము లేక ఏకత్వమును పొందుటయే సర్వమానవలక్ష్యం" అను వైదిక జ్ఞానాన్ని పొందుటకు, విజ్ఞానికి - అజ్ఞానికి; ఇరువురకుగూడ 'ఉతసూద్రో ఉతార్యే' అని తెలుపుచు, అవకాశమును కల్పించినది నాటి వేదవాణి. విశ్వరూపమును పొందుటకు, మానవునకు అడ్డువచ్చే అహంకారము, ద్వేషము మొదలగు సమస్త చెడుగులను నిరసించాలంటూ - 'విశ్వాని దేవ సవితర్దురితాని పరాసువ' అని నాటిఋషులు ఘోషించిరి.

మానవ జీవితంలో-విజ్ఞానము, పని, ఉపాసనా లేక భక్తి, జ్ఞానము లేక ఆధ్యాత్మిక జిజ్ఞాస - ఇవి అన్నియు మిశ్రితమై, విడదీయుటకు వీలుగాకుండ నున్నప్పుడే, జీవితము శోభావంతముగ నుండును. వీటిలో యేదొకటిమైనను, కొరవడినచో జీవిత రూపము వికలాంగమై పోవును. లోకంలో, సత్పురుషుల అభిప్రాయాలు లేక మతములన్ని, ముఖ్యముగా వేదాదివైదిక వాఙ్మయము, "పై నాలుగు, పూర్ణరూపములో ఓతప్రోతమై వుంటేనే జీవితవాస్తవికత" యని చాటుచున్నది. కనుక వైజ్ఞానికులకు, తత్వవేత్తలకు, భక్తులకు మధ్య అగాధమేర్పడినచో

సమాజ కళ్యాణము, సర్వశాంతి, వ్యర్థమైపోవును. ఇట్లే రాజకీయమును, కుటుంబజీవితమును, వ్యక్తిగతమును వేరు వేరుజేసి, వాటిలో కొన్నింటికి సత్యములోను-ధర్మంలోను మినహాయింపులు చేయడంకూడ కృత్రిమమే.

వైదిక వాఙ్మయములో యీ విషయములన్నీ వివరించబడినవి. అందుచేతనే గాంధీమహాత్ముడు, అతి ప్రాచీన కాలములో బయల్పడిన వేదవాణిగల, "హిందూమతము - ఆర్యమతము, ప్రపంచములోని విజ్ఞాన స్రోతస్సుల నన్నింటిని; తనలో లీనంజేసుకుంటూ వచ్చినదని" తెలిపెను. కాని నేడు, దురదృష్టవశాత్తు, యీ హిందూమతము పేరుతోనే, ప్రపంచంలో యే సమాజంచేయని ఘోరకార్యములు చేయబడుచున్నవి. వైదిక వాఙ్మయమందలి లక్ష్యమును, పొరపాటుధోరణిలో, అర్థము జేసుకొనుటగాని, లేక సరిగ అన్వయమైనను, దానినాచరించుటకు స్వార్థపిశాచ మడ్డువచ్చుటగాని, యిందుకు కారణము. కనుకనే 'తప్పు' అని తెలిసికూడ తప్పుత్రోవలోనే కాలు బెట్టుచుందుము.

నెహ్రూపండితుడు ప్రధానమంత్రిగను, భారతీయుడుగను, హిందువుగను గాంధీజీ హత్యాసందర్భమున మిక్కిలి చింతించెను. ఇక మనబాధ్యత యెంత వుండును? "గాంధీజీ అవతారము పూర్తియైనది. నిమిత్తమాత్రుడు 'గోడ్సే'. కృష్ణునివలెనే గాంధీజీ అవతారము చాలించాడ"ని మనమెన్నివిధాల, మనస్సులను సరిపెట్టుకొనుటకు ప్రయత్నించి

సను, ప్రపంచవిఖ్యాతుడై, ప్రపంచంలో అధికసంఖ్యాకుల హృదయాలను చూరగొని, ప్రేమస్థానాన్ని సంపాదించిన ఒక మహాపురుషుణ్ణి: హిందూమత-వైదికమత రక్షణకని కొందరు బుద్ధిపూర్వకముగ కుట్రజేసి బలిగొన్నది యదార్థసత్యము. ఇది ఎవ్వనికి దాగజాలదు. దీనిని మభ్యపెట్టుటకు ప్రయత్నించినను నిష్ఫలమగును. బాపూజీయందు ప్రేమజూపు మనందరిలోను, ఆయన సిద్ధాంతముపై హృదయపూర్వక విశ్వాసము - ఆచరణకాంక్ష కొరవడుటవల్లనే, కొద్దిమంది జేసిన కుట్ర ఫలించగలిగినది. అంటరాని తనమనే మహామారితో, క్రుళ్ళి కృశించిపోతున్న హిందూమతానికి, బాపూజీ విముక్తికలిగించుటకు తీవ్రకృషి సలిపెను. ఇప్పటికైనా అంటరానితనమును మాటలలోను, శాసనాల్లోను గాక - చేతలలో వీడనిచో హిందువులు తమ ముఖములను ప్రపంచజాతుల యెదుట నెత్తగలరా? సాంఘిక పెత్తందారీతనాన్ని, కులాల పేరుతో బలవంతంగా చెలాయించాలనే కోరిక పండితవర్గములో తొలగకపోతే మనము సభ్యతగల వారమయ్యెదమా? కాని గాంధీజీని చంపుటవల్ల యీ దుస్థితి మరింత పెరిగినది. రేపొకనాడెప్పుడైనా కమ్యూనిజమ్, సోషలిజమ్, డెమొక్రసీ అనే పేరుతో ఒక మహాపురుషుణ్ణి బలిగొనవచ్చును. కాని నేటి గాంధీజీ హత్య అట్టిదిగాదు. హిందూమతం పేరుతోనే హత్యజరిగిందనేది ముమ్మాటికి సత్యం. గాంధీజీ హత్యజరిగి షుమారు మూడు సంవత్సరాలైనా, కాంగ్రెసు గోత్రీకులగు హిందువులలోనే,

గాంధీజీ హత్యనాటి మన స్తత్వములు మారలేదు. పై పెచ్చు బలమగుచున్నవి.

నిన్నటి అనుభవము రేపటికి భూతకాలము. నిన్నటి అనుభవములో భాగము, రేపటి అనుభవములో ప్రతిబింబించుచుండును. రేపటికార్యము, పూర్ణముగ నిన్నటి అనుభవము వలె నుండదు. కనుక ప్రాచీనసంస్కృతి నేటికి, రేపటికి గుణపాఠమువలె నుండవచ్చును. కాని ప్రాచీనసంస్కృతినాటి, ఆచార వ్యవహారాలే యెల్లకాలము మారకుండ వుండాలనడం సూర్యోసినడకను ఆపుటకు ప్రయత్నించినట్లే. ప్రాచీనుల విధానాన్ని, నూతనవిధానాలను కలుపుకుంటూ ప్రయాణము సాగించవలసిన ఆవశ్యకతను ఆదర్శపురుషు లెల్లప్పుడు బోధించిరి. 'రైల్వేస్టేషను' అనేమాట పనికిరాదని, ప్రాచీనభాషయగు సంస్కృతములో 'ధూమశకట విరామస్థలమని' వాడుట యెంత అజ్ఞానమో, గృహములోని వారితో మాట్లాడునప్పుడు - తెలుగుమాటలు ప్రాతవిగనుక, క్రొత్తవగు ఆంగ్ల పదములనే ఉపయోగించాలనటంగూడ అంత అజ్ఞానమే. తాముచెప్పేమాట వినువారికి తొందరగ అర్థమగుటలో ప్రాత క్రొత్త భేదాలను పాటించరాదు.

ఆధునిక నాగరికతలో ఆరితేరి, భౌతికవిజ్ఞాన శాస్త్రమును బాగుగపఠించిగూడ, తమయిండ్లవద్ద కర్మకాండలను, (తద్దినాలను-అర్థముగాని మంత్రాలనుచదివే బ్రాహ్మణులకు బానిసలై) జేయుచు; తాము జేయుపనుల యదార్థస్థితిని

గుర్తించనివారు మనలో యెందరో కలరు. వాస్తవముగ వైదిక వాఙ్మయపు తత్త్వము గ్రహించిననో యిట్టిభావా-భావవాదినత్త్వాలకు తావులేదు.

కూరగాయ లమ్ముకొనువాడు జేయు మోసమును జూచి వానిని రచ్చకీడ్చుటకు మనమందరము పెద్దలమే. కాని కూరగాయలమ్ముకొనే కడుదరిద్రుడు డెందులకట్లు మోసముచేయుచున్నదీ, యోచించుటకు ప్రయత్నించము. మోసముతోనే లక్షలాది ద్రవ్యమును కూడబెట్టినవారిని పెద్దలుగ గౌరవించేది మనమే. కనుక, మనము మోసమునే గౌరవించుచున్నామన్నమాట. మఱి మనచేత యీ గౌరవాన్ని పొందడానికే, కడుదరిద్రుడగు కూరగాయలమ్ముకొనేవాడుగూడ మోసముజేయుచున్నాడు. నీతులుజెప్పేవారు ప్రక్కవానికి కనీస అవసరములు తీరుచున్నదీ; లేనిదీ, విచారిస్తే ప్రక్కవానిలో అసహనము గలుగదు. విప్లవ హింసాభావము లంకురించవు. మార్క్స్ మహాశయుడు కమ్యూనిస్టుసొసైటీ పుట్టుకనుగూర్చి యిట్లు తెలిపినాడు.

"what we are dealing with here is a Communist society, not as it has developed upon its own foundation, but on the contrary, just as it is emerging out of capitalist society"

Capital and other writings.' Page 5.

కనుకనే బాపూజీ పీడితప్రజాలోకమునకు సేవజేయుట అమృతముకంటే యెక్కువ మాధుర్యముగలదని తన ద్వారా చాటెను. గాంధీజీవంటి మహనీయునకు తన్ను

సవర్ణుడుగ (Cast Hindu) నుండు వాడు, అవర్ణుడు పడు బాధ లను సరిగ అర్థము జేసుకొనుట దుర్లభము. జాతీయ ఉద్యమ ములో పనిజేసిన ఒక ద్విజసోదరుడు జైలుకువెళ్ళి, హరిజను లతో సైతము కలిసి భుజించుచుండును. అతనియింట వైదిక కర్మలు జేయుటకు గాని, అతని బిడ్డలకు సంస్కృతపాఠములను వేదమంత్రములను, వ్యాకరణ, వేదాంత భాష్యములను జెప్పు టకుగాని, పూర్వాచార పరాయణులగు, సనాతన బ్రాహ్మణ పండితులు పాల్గొందురు. కాని ఆపండితులే యే చాకలిపిల్లవా నికో పై పాఠములను చెప్పరు. ఇది నేటికీ ప్రత్యక్షవిషయమే. మఱి చాకలిపిల్లవాని హృదయములో సనాతన పండితులు ధార్మిక వాఙ్మయమును జెప్పకపోవుటచే గలిగే వేదనను, ఆ సనాతన పండితులచేతనే నిరాటంకముగ ధార్మిక వాఙ్మయ మును తాముగాని, తమబిడ్డలుగాని జెప్పించుకొను జాతీయ వాదులగు, ద్విజసోదరులకెట్లు తెలియగలదు. తామట్టి ప్రత్యేక సౌకర్యములను పొందుచున్నంతవరకు జాతీయ వాదులగు బ్రాహ్మణులు, బ్రాహ్మణేతరుల అసహనాన్ని జూచి కోపగించు కొన్నచో యేమిప్రయోజనము?

ఆస్తిక-నాస్తికవివాదములేగాక; కమ్యూనిజమ్, కేపి టలిజమ్ మొదలగు ఇజములపేర్లతో గూడ ప్రపంచంలో తిండి సమస్యను మభ్యపరచుట జరుగుచున్నది. ఇవిఅన్నీ నేడు మన కండ్లయెదుటి సమస్యలే. "అందరకు సుఖము - శాంతి - అను "లక్ష్యం ఒక్కటే" గల మతాల - లేక సిద్ధాంతముల వాస్త

వికఅన్వయమును, హృదయపూర్వకముగ జేసుకొన్నచో యీ చిక్కులన్నియు తీరిపోవును. కనుక వేదములు - దర్శనములు- ప్రవక్తలు-భక్తులు మొదలగు ముఖ్య విషయాలతోపాటు ప్రత్యక్షసమస్యలనుగూడ పరిశీలింతము.

"ఏకం సద్విప్రా బహుధావదంతి."

గ్రంథకర్త.



# విషయసూచిక

# వేదములు.

ఏవ్యక్తియైనను, తానుప్రత్యేకత్వమును పొందగోరి, తన కంటె భిన్నమైనలోకులకు సూర్యరశ్మిని రానీయనని ప్రయత్నించినచో వాని ప్రయత్నము హాస్యముపాలగును. ఒకవేళ అతడేవైన కృత్రిమసాధనల నుపయోగించి, సూర్యరశ్మికి అడ్డుగలిగించినచో, దానివలనజనించెడినీడ యతనిపైననే సోకి, సూర్యరశ్మి మాత్రము యితరమనుష్యులకు వ్యాపించును. ఇందతని ప్రయత్నము పేలవమగును. ఒక ధనవంతుడు, తనభవనమునకే ముందుగ దక్షిణదిశనుండి బయలుదేరు మలయానిలము చేరవలెనని ప్రయత్నించిన సాధ్యమగునా? అతని యింటికిని, లేక అతని గ్రామమునకును, దక్షిణముగానున్న లక్షలాది గర్భదరిద్రులయిండ్లకే ముందుగగాలి సోకకుండునా? ప్రకృతిమాతకీ బీదభాగ్యమనెడి తరతమ భేదమెక్కడున్నది? నిన్నమొన్నటి అస్సాముభూకంపములో ప్రకృతిదేవత సల్పిన భయంకర వికట నృత్యములో కొండజాతి, నిమ్నజాతీయులే మ్రగ్గినారా! బ్రాహ్మణాది ఉచ్చవర్ణస్థులని; ధనవంతులని; ముస్లిములని; ముస్లిమేతరులని భేదము పాటింపబడినదా? ప్రమాదమునకు గురియైనవారిలో అనేక తెగలు; కులములు; మతములకు చెందినవారున్నారు. ఈప్రకృతిని సృష్టించిన సర్వేశ్వరుడే సర్వులకు పిత. అతనిచేతనే, లోకహితార్థమై వేదములు సృజింపబడినవని చెప్పుకొనుచున్నాముగదా? మఱి వేదములు ప్రత్యేకజాతికే

చెందవలసిన జ్ఞానభండారమనుట దగునా? చాలకాలమునుండి మనము, వేదములు మనవేననియు, వాటియందలి గీర్వాణ భాష మనము గుత్తకుగొన్న భాష.యని; అందలిధర్మములుమనకే వుపదేశింపబడినవని, సంకుచిత భావములోపడి అన్యదేశీయులను, అన్యమతస్థులను; అవైదికులనుగ భావించి న్యూనముగ చూడసాగితిమి. మహోన్నతపురుషుల తపోసాధనల పేరుల నూతగగ్రైకొని, బ్రతుకుచు, వారిసిద్ధాంతములపై గోరీలుకట్టుటకుప్రయత్నించుట యిదియేనని చెప్పవలెను. కాని మహాత్ముల సాధనాకిరణములు, వేదములలోని ధర్మములు, మనముచేయు కృత్రిమపు ఏర్పాటులక్రింద మరుగుపడవు. పైపెచ్చు అవియితర లోకానికితప్పక వాటిజ్యోతిఃపుంజములను వెదజల్లును. నిజముగ వేదములలో మనుష్యమాత్రునకు కావలసిన మనుష్యత్వమే బోధింపబడినది.

వేదములు సంస్కృత భాషలోనున్నవని సాధారణముగ తలంతురు. కాని వేదములయందలి భాషకు వైదికభాషయని పేరిడిడుట యుక్తము. వాడుకలోనున్న సంస్కృతభాషా నియమములన్నియు వైదికభాషపై చెల్లనేరవు. కనుకనే దాక్షీపుత్రుడగు పాణినిమహాముని తన 'అష్టాధ్యాయి' యను వ్యాకరణశాస్త్రమందు వైదిక, లౌకిక ప్రయోగముల నియమములను వేర్వేరుగ విశదపరచి, లోకమునకు మహోపకార మొనర్చినాడు. వైదిక లౌకికశబ్దవివరణ మిందుండుటచే దీనినే శబ్ద శాస్త్రమనిన బాగుండును.

పాణినీ మహామునికి పూర్వపు చాంద్ర, ఆపిశల, శాకటాయన మొదలగు వ్యాకరణములలో వైదిక, లౌకిక, పదప్రయోగముల వివరణచేయబడి యుండకపోవుట వలన పాణినీయ వ్యాకరణమునకే ఉత్తమస్థానం లభించినది. వైదిక, లౌకిక, సంస్కృత భాషానియమములకున్న భేదములను కొలదిగ పరిశీలింతము.

సామాన్యముగ సంస్కృత భాషలో, అకారాంతపుం లింగబహువచనము, తృతీయ విభక్తిలో నున్నప్పుడు దాని రూపమిట్లుండును.
ఉదా:- రామైః, కృష్ణైః, వృక్షైః, [అతోభిసఐస్ - అష్టా
అ 7. పా। సూ. 9]
అకారాంతాద జ్ఞాదుత్తరస్యభిసఐసిత్యయమాదేశోభవతి.
అకారాంతము కానిచో, సుబంత ప్రత్యయములలోని "భిస్" "భిస్" గానే యుండును. ఉదా:- హరిభిః; అగ్నిభిః వాయుభిః.

కాని వేదములందీనియమము విభాషయగుచున్నది. ఎట్లనగా పై సూత్రము చెప్పిన వెంటనే పాణిని "బహుళంఛందసి" [అ 7. పా 1. సూ. 10.] అని వుపదేశించినాడు. ఈ రెండు సూత్రములవద్ద పతంజలి మహాముని మహాభాష్యమునందు ["అతోభిస్ఐస్॥ అతోభిస్ఐస్ భవతి॥ చందసి విభాషేతి॥"] [అ 7. పా 1. ఆ 1. సూత్రం 9.] అని వివరించినాడు. కనుక వేదములో అచ్చటచ్చట కనుపించు "దేవేభిః; మానుషేభిః"

మొదలగు ప్రయోగములను తృతీయబహువచనముగనే అర్థముచేసుకొనుచున్నాము. సామవేదమునందాదిలోనే యీ ప్రయోగము కనిపించును.

ఉదా:- అగ్న ఆయాహివీతయే; నిహోతా సత్సి బర్హిషి।
దేవేభిర్మానుషేజనే॥

ప్రత్యేకముగ వేదములలోని యిట్టిప్రయోగాల కొరకే కొన్నిసూత్రములను పాణినీముని పఠించినాడు. "పునర్వసూ" అనుపదము ద్వివచనము. కాని వేదములో అది ఏకవచనముగ గూడ ప్రయోగింపబడిన చోట్లున్నవి. అందుకు 'అష్టాధ్యాయి' లో ఒకనియమము నేర్పరచిరి. "ఛందసిపునర్వస్వో రేకవచనమ్" [అధ్యా 1. పా 2. సూ 61"] అనికలదు, "పునర్వసు నక్షత్రమదితిర్దేవతా" అని ప్రయోగము కనుపించుచున్నది.

ఇవిగాక "ఛందసిలిట్" (అష్టా 3. 2. 105.) "ఉపసంవాదాశంక యోశ్చ" (అష్టా 3. 4. 8) "ఆతఐ" (అష్టా 3. 4. 95) మొదలగు నియమములనేకములు వైదికపదప్రయోగములకే అన్వయించును.

ఈ ప్రయోగములను చూచినచో, వేదములు ప్రస్తుతం వాడుకలోనున్న సంస్కృత వాఙ్మయానికి, చాలపూర్వకాలపువని, తెల్లమగుచున్నది. ప్రాచీనార్యగ్రంథము లీపరంపరలోనున్నవి.

1. వేదములు:- ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వవేదము.

2. బ్రాహ్మణములు లేక వేదముల కాదివ్యాఖ్యానములు:- శతపథ, గోపథములు మొదలయినవి.

3. ఉపనిషత్తులు-ఆరణ్యకములు:- ఈశావాస్యము; కేన; కఠ; ముండక; తైత్తరీయ; ఐతరేయ; ఛాందోగ్య; బృహదారణ్యకము మొ॥

4. షడంగములు:- (1) శిక్షా (2) వ్యాకరణము (3) నిరుక్తము (4) ఛందస్సు (5) కల్పము (6) జ్యోతిష్యము. ఇందు శిక్షా, వ్యాకరణములు పాణినీముని ప్రణీతములంగీకృతములు. (3) నిరుక్తము:-యాస్క మహామునిచే రచింపబడినది. (4) ఛందస్సును పింగళ నాగుడు రచించినాడు. (5) శ్రౌతగృహ్యసూత్రములే కల్పములు.

5. షడ్దర్శనములు:- (1) న్యాయము, (2) వైశేషికము, (3) సాంఖ్యము, (4) యోగము, (5) మీమాంస లేక పూర్వమీమాంశ, (6) వేదాంతము, లేక ఉత్తర మీమాంస,

6. ధర్మశాస్త్రములు:- ఇవి ప్రాచీన భారత దేశము నందలి సామాజిక వ్యవస్థలు సక్రమ పునాదుల పై నిలబడు[illegible] యేర్పరుపబడిన శాసనములు: వాటిలో [illegible]

మనుస్మృతి; యాజ్ఞవల్క్య; గౌతమ; పారాశరస్మృతులు యీకోటిలోనివే.

7. వైద్యశాస్త్రములు:- (1) చరకము. (2) సుశ్రుతము. (3) వాగ్భటము మొదలైనవి. చరక, సుశ్రుతములు అతిప్రాచీనమైనవియు ఆర్షములైయున్నవి. వాటిపిమ్మట గూడ అనేక వైద్యగ్రంథములు సంస్కృతమున రచింపబడినవి. వీటినన్నింటిని ఆయుర్వేదగ్రంథములందుము. కక్షపుటతంత్రమువంటి రసాయనిక గ్రంథములీ వర్గములోనికి జేరును.

8. ఐతిహాసికములు:- రామాయణము, మహాభారతము.

9. అష్టాదశ పురాణములు :- ఈ పురాణములుగూడ చాలభాగము ఇతిహాసముతో నిండియుండి, ఇతిహాసమే ఉపాఖ్యానరూపములలో చెప్పబడినవి.

10. కావ్య; నాటకాది సాహిత్యక గ్రంథములు, తంత్రగ్రంథములు.

## వే ద ము ల పు ట్టు క

మనకున్న చరిత్రాత్మకాధారములచేత బౌద్ధకాలము 2 వేల సంవత్సరములకు పూర్వమని తలంచుచున్నాము. 'తిలక్' మహాశయుడు మహాభారత కాలమును 5 వేల సంవత్సరములని నిర్ణయించెను. ఈవిషయమును పలువురామోదింతురు. ఇక మిగిలినది రామాయణకాలము. మొహంజదారో శిల్పముల

నాధారముగ జూచిన రామాయణకాలమింకను పూర్వమని చెప్పవచ్చును. మహాభారతకాలమునకు చాల పూర్వపు ఆధారములిందున్నవని పరిశోధకులు తెలిపిరి. రామాయణ కాలమునకు, మహాభారత కాలమునకు మధ్య రెండు వేల సంవత్సరముల వ్యవధి వున్నట్లు పండితభగవద్దత్తగారి అభిప్రాయము.

ఋగ్వేదములోని పదియవమండలము వరకు 22 వ సూక్తముతోకూడ నున్న భాగము రామాయణ కాలమువరకు ప్రచలితమై యుండెను. మాంధాత సమయమునుండి మిగిలిన 168 సూక్తములు ప్రచలితమైనవి. కనుక వేదములంతకు పూర్వమే కొన్ని వేల సంవత్సరములనాటివని పండితులు తెలుపుదురు.

దయానందునివంటి వైదికశిఖామణులు వేదోత్పత్తి కాలమును లక్షలకొలది సంవత్సరములుగ ఉదహరించిరి. వారి నిర్ణయములను విమర్శించుటకు మనకు శక్తిలేకపోయినను, అసంఖ్యాక వత్సరముల క్రితమే వేద ముత్పన్నమైనదనుటలో మనకు రానున్న ఘనత యేమియులేదని తలంచవచ్చును.

## వేదరచన ఎవరిది?

ఈ విషయమునందు లోకమున రెండు భిన్నాభిప్రాయములున్నవి. వేదముల నీశ్వరుడే సృజించినాడని యొకపక్షము; వేదరచన మానవునదేనని వాదించుమరియొకపక్షము గలదు. అంటే వేదములుపౌరుషేయములని తలంచువారుకొందరు; అపౌ

రుషేయములని తలంచువారు కొందరు గలరు. అలంకారము లతో గూడిఛందస్సులతో నిండి, శబ్దమయమైయున్న వేదములను నిరాకారుడైన భగవంతుడెట్లు సృజించగలడు? మానవులేదీనిని రచించి ఈశ్వర నిర్మాణమని చెప్పిరి. లేనిచో ప్రతి మంత్రము నకుఋషులపే ర్లెందుకుండునని పౌరుషేయవాదులువాదింతురు.

ఇక రెండవవారు అపౌరుషేయమని వాదించువారు. సర్వస్సృష్టిని రచించిన నిరాకారుడగు దేవునికీవేదనిర్మాణము కష్టముగాదు. తనబిడ్డలజ్ఞానమునకై తానీ వేదముల ప్రసాదించెనని చెప్పుదురు.

వీరిరువురు గాక విచిత్ర వర్గమొకటున్నది. వీరే మన దేశములో తమనుతాము వైదీక నిష్ఠాపరులని భావించుకొందురు. వీరు మాటలలో వేదముల పౌరుషేయములందురు. కాని వీరి చేతలలో వేదములు పౌరుషేయములేయని భావించు చున్నట్లు కనుపించును. వేదము దైవనిర్మాణమని ఒకవైపు తెలుపుదురు. మఱియొకవైపు "నాలుగు ముఖములుగల బ్రహ్మ వేదములను నిర్మించి వాటిని బ్రాహ్మణుల కిచ్చినాడనియు, అవివారి సొత్తనియు, శూద్రులా వేదములను విన్నచో వారి చెవులలో సీసము కరిగి పోయుటకుగూడ తమకుహక్కు పత్ర మునువ్రాసియిచ్చి, వేదములను తమకు దఖలుపరిచినాడని''యు తలచుచు దాని కనుగుణ్యాముగ ప్రవర్తింతురు. ఇట్లుచేయుట ఆ బ్రహ్మకుమాత్రము న్యాయమా? ఒకే ముఖముగల మానవునకే యిందున్న యన్యాయము పొడగట్టుచున్నదిగదా?

నాలుగు ముఖములుగల బ్రహ్మదేవుడీ ఘోరతప్పిదము నెట్లొనరించినాడని ప్రశ్నించినచో అయోమయ తత్వశాస్త్రము లోనికి దిగుదురు. ఆధోరణి చెప్పువారికి తెలియదు. వినువారికర్థముగాదు.

వేదోత్పత్తినిగూర్చి కేవలము మేధాశక్తి, పాండిత్యములతోనేగాక హృదయముతోగూడ నాలోచించవలయును. ఋగ్వేదమునందొక 'అనుష్టుప్' ఋక్కు కనిపించును.

తస్మాద్యజ్ఞాత్ సర్వహుతఋచస్సామాని జజ్ఞిరే।
ఛందాంసి జజ్ఞిరే తస్మాద్యజుస్తస్మాదజాయత॥
[ఋగ్వే, మం 10 సూ 90 మం 9]

**తస్మాత్** = ఆ; **యజ్ఞాత్** =సచ్చిదానంద. రూపుడు; సర్వహుతః= అందరిచేతను ఆరాధింపబడునట్టి లేక ఏ పరమాత్మకు లోకులందరు తమసర్వస్వమును సమర్పింతురో, అట్టి పరమేశ్వరునినుండి ఋచః= ఋగ్వేదము; **సామాని**= **సామవేదము**; జజ్ఞిరే= సృజింపబడెను; ఛందాంసి= అధర్వవేదము; తస్మాత్ = ఆపరమాత్మనుండియే జజ్ఞిరే= ఉత్పన్నమాయెను; యజుః= యజుర్వేదము; **తస్మాత్** = ఆపరమాత్మనుండియే, **అజాయత**= సృజింపబడెను.

ఈ విషయమునుగూర్చి, శతపథ బ్రాహ్మణమున యిట్లున్నది.

ఏవంవా అరేఽస్యమహతో భూతస్యనిఃశ్వసితమేత

ద్యదృగ్వేదో యజుర్వేదః సామవేదోఽథర్వాంగీరసః॥

[శత. కాండ 14 అధ్యా 5 బ్రా 4 కండి 10]

పై మంత్రాభిప్రాయము:- యాజ్ఞవల్క్యుడు మైత్రేయి తో యిట్లనును —

ఓ మైత్రేయీ! మహాతో భూతస్య=ఆకాశముకంటెగొప్ప రూపముగల పరమేశ్వరునినుండి ఋగ్వేదము మొదలు నాలుగు వేదములు; నిశ్వసితమ్=గాలివదలుటవలె బయటికివిడువబడినవి. ఊపిరివదలుట యెంతసహజమో అంతసహజముగ పరమేశ్వరునివలన వేదములుత్పన్నమైనవి. (మరల ఆవూపిరి వలెనే పరమేశ్వరునియందు కలియుచున్నవి అను భావము గూడ గలదు.)

తేభ్యస్తప్తేభ్యస్త్రయో వేదాఅజాయంతాగ్నే ఋగ్వే దో, వాయోర్యజుర్వేదః, సూర్యాత్సామవేదః॥

శతపథం, కాండ 11 అధ్యా 5 బ్రాహ్మణం 2 కండిక 3.

భావార్థము:- సృష్టికి ఆదిలో అగ్ని, వాయువు, సూర్యులనెడి పేర్లుగల ముగ్గురు తాపసులుండిరి. ఆముగ్వురు తాపసులద్వారా ఈశ్వరునిచే ప్రేరేపింపబడిన మూడు వేదములు సృజింపబడినవి. అగ్నియనువానిద్వారా ఋగ్వేదము; వాయువను వ్యక్తిచే యజుర్వేదము; సూర్యుడనువానిచే సామవేదము బయల్పడి, బ్రహ్మమొదలగు ఋషులద్వారా లోకమున ప్రసిద్ధికెక్కినవి. ఇందునుగూర్చి మనుస్మృతిలో యిట్లున్నది.

శ్లో॥ అగ్ని వాయురవిభ్యస్తు, త్రయంబ్రహ్మసనాతనమ్॥
దుదోహయజ్ఞ సిద్ధ్యర్థమృగ్యజుః సామలక్షణమ్॥

అర్థము:- సనాతనబ్రహ్మ అనగా కల్పాది మొదటిబ్రహ్మ, అగ్ని; వాయు; రవియను ముగ్గురు తాపసులవద్ద లోకకల్యాణమునకై ఋగ్వేద, యజుర్వేద, సామవేదములను (దుదోహ) పితికెను. అనగా అధ్యయనము జేసి క్షుణ్ణముగ గ్రహించెను.

పై నుదాహరింపబడిన ప్రమాణములను చూచినచో ఒకవిషయము తెల్లమగుచున్నది. ఈ భూమియందెద్దియో ప్రళయము సంభవించినట్లును, పిమ్మట నూతనసృష్టిలో (కల్పములో) అగ్ని, వాయువు, సూర్యులను పేర్లుగలిగిన శరీర ధారులగు వ్యక్తులుండినట్లును; వారుముగ్వురు స్వార్థరహితులై ఆత్మజిజ్ఞాసతో తపమాచరించినట్లును, వారిజ్ఞానములోనుండి ఈశ్వరునిద్వారా వేదములు బయల్పడినట్లును; వారివద్ద బ్రహ్మలలో మొదటివాడగు సనాతనబ్రహ్మ చక్కగా వేదాధ్యయనముచేసినట్లును; అతనినుండి లోకమున వేదములు అనేక మంది ఋషులద్వారా ప్రచారమైనట్లు ధ్వనించుచున్నది.

పై ప్రమాణములవలన కలుగు సందేహములను మన మొక్కటొక్కటిగ విచారింతము. ఈశ్వరుడు మానవునకు వేద మెట్లు బోధించెననునదొకటి. అగ్ని, సూర్య, వాయువులనునవి ప్రత్యక్షముగకనుపించు జడపదార్థములుగదా? వాటిద్వారా శబ్దమయమగు వేదమెట్లు ప్రచారమైనదనునది రెండవది. వారు మానవులేయైనచో వారిచేరచింపబడినవి మనుష్యనిర్మితము

లేగదాయనునది మూడవది. సృష్టిమొదటిలో ఈముప్పురే మనుష్యులెట్లుండిరనునది నాల్గవది. ఇట్లు నాలుగుప్రశ్నలుదయించకతప్పదు.

అందు మొదటిప్రశ్న నాలోచింతము. 'వేదము' అను శబ్దము 'వేద్రు' 'విద' అనుధాతువులనుండిపుట్టినది. జ్ఞానముతో నిండియుండిన లోకములోజ్ఞానప్రయోజనము చేయునదివేదము. కృత్రిమవ్యసనములను, అసత్యజీవితమును ప్రేరేపించునది వాస్తవికజ్ఞానముకాదు. సత్యము, పరిశుద్ధాత్మతత్త్వములతో నిండినదే వాస్తవికజ్ఞానము. పవిత్రసత్యస్వరూపము నారాధించుటచేత నే అట్టిజ్ఞానము కలుగును.

మనమొక సుదీర్ఘవిషయమునుగూర్చి గాఢముగ నాలోచించవలెనన్న ఇంద్రియములనన్నిటిని, యొకచో లగ్నముజేసి లక్ష్యమునందున్న విషయమును ధ్యానించుచు, అందే మనస్సును లగ్నము జేసుకొందుము. ఆసమయమున బుద్ధి; భయము; సిగ్గు; కోరిక; పేరాస మొదలైన మానసిక వికారములన్నియు, వాటివాటి ప్రత్యేకరూపములు నశించిపోవుటచే, మనస్సునందేలీనమగును. ఆలోచనాధ్యాన పెరిగినకొద్ది మనోవికారములనెడివి పూర్తిగ నశించుటచే, మనస్సు ఆత్మలోలీనమగుట ప్రారంభమగును.

ఇక బయటప్రపంచపు వ్యవహారములు, దృశ్యములు, చూచుచున్నను ఆతనికవిపట్టవు. పైగా లక్ష్యమునందున్న విషయమునుగూర్చి తదేకనిష్ఠతో ఆలోచనసలుపునప్పుడు, కండ్లు

చూచుచున్నను, చెవులు వినుచున్నను ఆలోచనచేయు సమయమున నాతడు బయటవిన్నది, చూచినది చెప్పమనిన చెప్పజాలడు. ఒక వుపాధ్యాయుడు విద్యార్థిని యేదేని ప్రశ్న వేసినప్పుడు, ఆప్రశ్నకావిద్యార్థి సరియైనజవాబివ్వనిచో వెంటనే వుపాధ్యాయుడతని కిట్లు హెచ్చరికజేయును. "ఏకాగ్రచిత్తముతో, యితరమాటలు వినక, యితర దృశ్యాలుచూడక శ్రద్ధతో ఆలోచించి చెప్పుము'' అని.

అట్లతడు చేసినప్పుడే గురువడిగిన ప్రశ్నకు సరియైన సమాధాన మొసగగలడు. కనుక లక్ష్యవిషయమునుగూర్చి ధ్యానించు మనుష్యుని బాహ్యేంద్రియములు, యింద్రియార్థముల సంబంధముల బోగొట్టుకొనును.

ఇట్లే అగ్ని, వాయు, సూర్యులనెడి యాతాపసుల విషయముగూడనైయుండెను. సత్యవిషయజ్ఞానమే వేదము. దానిని బడయుటకే వారు తపమొనరించిరి. బాహ్యేంద్రియముల వాసనలన్నిటిని కట్టిపెట్టి, మనస్సునేకాగ్రము చేయుటయే తపస్సు. "యోగశ్చిత్తవృత్తి నిరోధః'' అని పతంజలి తనయోగదర్శనమునందు తెలిపినాడు. పై మువ్వురీ తపమెందుకొనర్చిరి? బయటిప్రపంచములోనున్న దృశ్యాలన్నిటికి సత్యస్వరూప మెద్ది? మన వాస్తవిక కర్తవ్యమేది? ఏమార్గముతో శాశ్వతసత్యము నారాధించి, ఆనందమును బడసెదము - అనునదే వారి లక్ష్యమందున్న విషయము. అందుకై వారు విశ్వవ్యాప్తమైన ఆత్మయందు (లోకములోని మానవులందరి హృదయముల కల

యిక భావమునందు) మనస్సును లీనమొనర్చి తపస్సానరించిరి. అప్పుడు వారికావిశ్వవ్యాప్తమైన సత్యముయొక్క జ్ఞానము కలిగినది.

అజ్ఞానము కలుగుటకు కారణము - కర్తృత్వము - భిన్నరూపమైన జీవునదిగాదు. ఎందులకన తపస్సమయముననే మనస్సు ఆత్మలో లీనమైపోయినది. ఆత్మకప్పుడు భిన్నభావముతొలగి మబ్బువీడిన చంద్రునివలె నిజప్రకాశము కలుగును. అంటే విశ్వవ్యాప్తమైన పరమాత్మ సామీప్యంకలుగునన్నమాట.

ఈశ్వరుడు - అఖండాత్మ; అఖండ సత్యరూపుడు; విశ్వవ్యాప్తుడనెడి పేర్లుగలవాడు. అందుచే అమువ్వురు తాపసులకు కలిగిన వేదజ్ఞానమునకు కారణము - కర్తృత్వం - ఈశ్వరునదైన దన్నమాట. కర్త ఈశ్వరుడై, వేదజ్ఞానము పైముఫ్వురి మనుష్యదేహధారులైన తాపసుల తపోజ్ఞానమధ్యమున ప్రేరేపింపబడినది.

బుద్ధుడు తనకాలమునందు లోకమున జరిగెడి దుఃఖకరమైన విషయములనుచూచి జిజ్ఞాసచెంది వాస్తవికసత్యమునకై వెదుకనారంభించెను అంతటనతడు గట్టి తపమొనరించెను, ఎంతయోకాలమునకతనికి దివ్యజ్ఞానము కలిగినది. పిమ్మట ఆమహాశయుడాజ్ఞానమును లోకమునకుపదేశింప మొదలిడెను. ఇట్లే మహమ్మదు; జీసను మహాశయుడు మొదలగువారు లోకకల్యాణమునకై సత్యవిషయముల నుపదేశించిరి. గాంధీ మహాత్ముడనేక పర్యాయములు మనకెన్నో యుత్కృష్టవిష

యాలను తన అంతర్వాణి ప్రబోధమని తెలిపియున్నాడు. ఆమహనీయుడెన్నో సత్కార్యములను తానీశ్వరప్రేరేపణచేతనే-ఆయనయాజ్ఞచేతనే-చేయుచున్నానని చెప్పుచు, ఈశ్వరేచ్ఛకు భిన్నముగ నడువజాలనని తెలుపుచుండెను.

కనుక పవిత్రజీవితమును గడుపుచు కఠినతపమాచరించి యెవరేని, యేదేని ఉత్కృష్ట సిద్ధాంతమును తెలిపినచో అది ఈశ్వరప్రేరిత (సర్వుల హృదయవాణి) మనుకొనుటలో మనకున్న ప్రజ్ఞయేమియుతగ్గదు. అగ్ని, వాయు, సూర్యులనెడి యా తపసులద్వారా పరంపరగ బహుప్రాచీనకాలమునుండి ప్రచారముకాసాగిన వేదములు, ఈశ్వరునిద్వారా ప్రేరేపింప బడినవేయనుటలో మనకెట్టిబాధయులేదు. విశాలప్రపంచము ముందు మనకున్నస్థానము తెలియును.

ఇక రెండవప్రశ్న:- అగ్ని, వాయువు, సూర్యులనెడివి జడపదార్థములుగదా? వాటిద్వారా శబ్దార్థములతోనిండిన వేదములెట్లు ప్రచారమైనవి?

ఈప్రశ్న చాలసమంజసమైనదే. అసలీప్రశ్నకలుగుటకు ప్రస్తుతము మనలోనున్న ధార్మికగ్రంథముల పఠనాకాలమున నుండు, అర్థరహితమైన సంప్రదాయములే కారణము. ప్రస్తుతము మనకీప్రశ్నకొక సమాధానము లభించును. రాముడు, అర్జునుడు, కృష్ణుడనే పేర్లుగలవారు మనలో అనేకులున్నారు. వారందరాపేర్లు గలిగినంతమాత్రమున చరిత్రాత్మకమైన (Historical) రామ కృష్ణులేనని భావనూ? అట్లెన్నటికిని

గాదు. చరిత్రాత్మకమైన వ్యక్తులపేర్లను వారు భక్తితోగాని, ప్రేమతోగాని ధరించుచుందురు. అట్లే అతిప్రాచీనకాలమున ఆయావ్యక్తులు ప్రకృతిలోనున్న ఉత్కృష్టవస్తువులపేర్లనే భక్తితోను, ప్రేమతోను ధరించియుండిరి.

ఈనాడు మనలో కొందరుమిత్రులు 'లవణము'ని 'విజయము' అని 'మధుర' మనేపేర్లను ధరించుటలేదా? అంత మాత్రముచేత వారాపదార్థములైపోవుచున్నారా? కనుకఅగ్ని, వాయు, సూర్యులనువారు ఆపేర్లుగల మనుష్యులేననుకొనుటకు సందేహామక్కరలేదు. వారు మనుష్యులేగనుక వారినుండి శబ్దమయమైన వేదములు ప్రచారము కాబడవచ్చును. అగ్ని, వాయు, సూర్యులనెడి జడపదార్థములచేత, శబ్దమయమైన వేదములు ప్రకటింపబడజాలవు. ఆజడపదార్థములచేతనే, బ్రహ్మ మొదలయిన వారికవి చెప్పబడినవని తలంచినచో పెద్దచిక్కేర్పడును. అగ్ని, సూర్య, వాయువులనెడి జడపదార్థములీనాడు గూడనున్నవిగదా? ముందుగూడ నుండునుగదా? మనమెరిగియున్నంతవరకు యీ ప్రకృతి పదార్థములవద్ద యెవరును పాఠములువల్లించినట్లుగాని, అవి యెవరికేని పాఠములు చెప్పినట్లుగాని తెలియదు.

మనుస్మృతిలో 1అ 23 శ్లోకమునకు కుల్లూకభట్టుని వ్యాఖ్యానము చూచిన ఒకవేళ భ్రమగలుగవచ్చును. వారి వ్యాఖ్యానమున దెలుపబడినది హేతువాదమునకు నిలువజాలదు

మూడవప్రశ్నకు సమాధానము మొదటిప్రశ్నకు మనకు లభించిన సమాధానములోనే చాలభాగము కనుపించును. అయితే ఒకసూక్ష్మవిషయ మీప్రశ్నయందు దాగియున్నది. ప్రతిమానవునియందు స్వభావసిద్ధమైన జ్ఞానము పుట్టుకతోనే యుండునుగదా? ఆస్వాభావసిద్ధజ్ఞానము (Instinctive Knowledge) వలననే యితరజీవులకంటె మనుజుడు భిన్నముగ కనుపించును. ఆస్వాభావికజ్ఞానముచేతనే అతడు వేదములను రచించియుండవచ్చునుగదా? ఇందీశ్వరుని ప్రమేయమెందులకని సందేహము. దీనికేమనము సమాధాన మన్వేషించవలెను.

ప్రేమతో గన్నబిడ్డను తల్లిదండ్రులు యే దేనియొక గది యందుంచి, బోనముబెట్టి పోషింపసాగుచు, అతనిని బయట ప్రపంచముతో నేస్తములేనివానిగ కొన్నిసంవత్సరములవరకు ఉంచి కొంతకాలమునకు చూచినచో ఆబాలుడు ఎట్టిబాహ్యజ్ఞానము లేనివాడై యుండును. అతని చేష్టలకు, మనవ్యవహారములకు ఎట్టిసంబంధము ఉండదు. కారణ మతనికి, సహజజ్ఞానమున్నను (Instinctiveness) లోకానుభవ జ్ఞానము లేకుండుటయే. లోకానుభవజ్ఞానమును తల్లిదండ్రులయొద్దను, ఇతర బృందము యొద్దను పొందవలెను. ఆటవికప్రజలకు, నాగరికప్రజలకు కానుపించెడి భేదమిందుచేతనే. అట్లే భౌతికవాసనలకు దూరమై, నిజాయితీజీవితముగడిపి, తపమాచరించినచో దైవసంబంధమైన జ్ఞానముకలుగును. సర్వప్రజానీకపు హృదయసమ్మేళనమే భగవంతుడు. అందు సహజజ్ఞాన మీశ్వరజ్ఞానముతో కలసి ప్రకాశించుచుండును. ఆపొందిన జ్ఞానముచేతనేగద అగ్ని,

వాయు, సూర్యులనెడివారు వేదములనుపదేశింప గలిగినది? వారికి సహజజ్ఞానమున్నను అనుభవజ్ఞానములేనిచో ఆపని చేయుట అసంభవమయ్యెడిది. ఆయనుభవజ్ఞానము ఈశ్వరజ్ఞానమేగదా? కనుక వ్యక్తులు పైముప్పురైనను, కర్తృత్వమీశ్వరునిదనుటచేత మనకేమి హానిజనించును?

ఇక నాల్గవప్రశ్న:- సృష్టికిమొదట అగ్ని, వాయు, సూర్యులనెడివారు ముప్పురే యెట్లుండిరి? ఇంక యితర మానవులు లేరా?

ఈ ప్రశ్న అతిసహజముగ ఉదయించును. అసలట్లు ఉదయించుటకూడ అవసరము. బుద్ధుడు; జీససు; మహమ్మదు; సుక్రటీసువంటి మహనీయులకాలములను చరిత్రాత్మక ఆధారములతో చరిత్రకారులు (Historians.) నిర్ణయించగలరు. రాముడు; కృష్ణుడు; మనువు; యాజ్ఞవల్క్యుడు మొదలైనవారి జీవితకాలములను, చరిత్రకారుల రచనలులేకపోయినను, పౌరాణిక వాఙ్మయముద్వారా నిర్ణయించవచ్చును.

కాని వేదములా పురాణపురుషులకాలమునకెంతయో పూర్వమునుండి ప్రచారమగుచుండెను. కనుక వేదములను బోధించిన పై ముప్వురి కాలనిర్ణయము చేయుటతిదుస్తరము. అందుచే స్మృతులను, బ్రాహ్మణములను రచించినవారు వేదోత్పత్తికాలము, తమ అంచనాలకందకపోవుటచేత సృష్టికి మొదటికాలములేక చరిత్రకెంతయో పూర్వకాలము అని భావించియుండిరి. అప్పటికి (డార్విన్) క్రమవికాసవాదము

(Evelution) జనించియుండకపోవచ్చును. అందుచే సృష్ట్యాది కాలమున వారుముువ్వురేగలరని స్మృతికారు లనుకొనవచ్చును. కాని ఆకాలమున సైతము యితరవ్యక్తులెవ్వరు లేరనుట ఆలంకారిక భాషయగునేమో!

వాదవివాదములతో యిందలి సత్యమును గ్రహించుట కష్టమగును. ఏదేని యొకకాలమందలి మహాపురుషులనుగూర్చి చెప్పుకొనునప్పుడు, అప్పటి జనాభాలోనున్న మానవులందరి పేర్లను తలంచము. అసలు వారెవరోగూడ మనకు తెలియదు. చరిత్రకారులుసైతము (Historians) ఆయాకాలపు ముఖ్య వ్యక్తులనే విచారింతురుగాని, అప్పటి సామాన్య ప్రజలందరి పేర్లను ఆలోచించుటకు వారికాధారము లెవ్వియులభించవు. అట్లాలోచించుటయు అప్రస్తుతము. కనుక స్మృతికారులా ముువ్వురిపేర్లనే, సృష్ట్యాదిలోనున్న వారివని గ్రహించియుండ వచ్చును.

వారికప్పటి చరిత్రాత్మకాధారములెవ్వియు లభించక పోవుటచే పైముువ్వురి కాలమునే సృష్ట్యాదియని తలంచిరేమో? కనుకయిందునుగూర్చి వివాదముజరుపుటకంటె వేదములయం దున్నఉత్తమాదర్శములను గ్రహించుట మనకుసులభము. "సృ ష్ట్యాదిలోనే వేదములను; మాంగోత్రీకులే రచించిర"ని తలంచుట చేతనే, మనకురానున్న ఘనతయేమియు నుండదు.

## వే ద ము లు ని త్య ము లు.

వేదములు నిత్యమనుటకంటె "తేభ్య స్తప్తేభ్యః" అను బ్రాహ్మణవచనమునుబట్టి తపోనిష్ఠయందున్న అగ్ని; వాయు; సూర్యులద్వారా ఈశ్వరునిచే ప్రకటింపబడిన ధర్మములు-వేదములు-నిత్యమన్నచో, ప్రస్తుతమొకే వస్తువునుచూచిభాషా మార్పుచే కలహించుకొనునట్టి, యీ మతకలహములు కొంత వరకు తగ్గవచ్చును.

వేదములాకాలపు భాషలోనున్న శబ్దములతోనిండిన పద్యసమూహము పద్యరూపములతోనే ఎందులకుండవలెనను విషయము వేరు. ప్రాచీనకాలపు భాషలోనున్న వేదములందలి శబ్దములకొక ప్రత్యేకప్రాధాన్యమున్నది. సాధారణమనుష్యులు చెప్పుమాటలకంటె, ఆదర్శవంతులమాటలకు ప్రత్యేకతనిత్తుము. అవి శాశ్వతమైనవని తలంతుము. ఎందుకన, అట్టి ఆదర్శవంతుల పవిత్రడెందములనుండి బయటికివచ్చిన మాటలలో శాశ్వతమైన సత్యములు, పవిత్రతయు ఆవరించియుండును. ఈ విషయమును గౌతముడు తన న్యాయదర్శనమునందు చక్కగ వివరించినాడు.

ఆప్తోపదేశః శబ్దః ॥ న్యాయదర్శనము, [అధ్యా 1. అహ్నికం1 సూత్రం 7.]

ఈసూత్రమునకు వాత్స్యాయనుడిట్లు భాష్యమునువ్రాసెను:-

ఆప్తఃఖలుసాక్షాత్ కృతధర్మాయథాదృష్టస్యార్థస్య చిఖ్యాపయిషయాప్రయుక్త ఉపదేష్టా। సాక్షాత్ కరణమర్థ స్యాప్తిః; తయాప్రవర్తతఇత్యాప్తః॥

ఇందలి భావము:- ప్రత్యక్షముగ పదార్థ విజ్ఞానమెరిగి సత్యజీవితముతోను, పూర్ణజ్ఞానముతోను; ఆత్మస్వరూపమును నిర్ణయించి, లోకమునకు తెలుపుచు, ప్రకృతి; బ్రహ్మాండము; పరమాత్మల వునికినాలోచించి, వాటినిజతత్వములను, లోకమున కుపదేశించుట 'ఆప్తి' యనబడును. అట్టి "ఆప్తి" గలవాడు ఆప్తుడు. ఆప్తుడు చెప్పినది శబ్దము.

"శబ్దఐతిహ్యానర్థాంతర భావాదనుమానేఽర్థాపత్తి
సంభవాభావానర్థాంతర భావాచ్చాప్రతిషేధః॥"

న్యాయదర్శనం అధ్యా 2- అహ్నికం 1 సూత్ర 2.

పై సూత్రములకు భాష్యముప్రాయుచు వాత్స్యాయనుడు అనుమానమునుగూర్చి "ప్రత్యక్షేణాప్రత్యక్షస్యసంబద్ధస్యప్రతిపత్తిరనుమానమ్।— — — వాక్యార్థసంప్రత్యయే నానభిహితస్యార్థస్యప్రత్యనీకభావాద్గ్రహణ మర్థాపత్తిరనుమానమేవ" అని తెలిపినాడు.

సత్యమైన ప్రమాణములతో ఋజువుచేసి, ఏసత్యజీవి లోకమున కుపదేశించునో, ఆయుపదేశమందున్న శబ్దముప్రమాణమని భావము.

మన్త్రాయుర్వేద ప్రామాణ్యవచ్చ తత్ప్రామాణ్యమాప్తప్రామాణ్యాత్ ॥

* న్యాయ, అధ్యా 2 అహ్ని 1 సూత్రం 68

ఆయుర్వేదము నందలి అనగా వైద్యశాస్త్రమందలి ప్రయోగ సిద్ధాంతములెట్లు ప్రమాణములో, అట్లే ఆప్తవాక్యమైన వేదవాక్యము నిత్యమగుటచే సర్వకాలములందును, ప్రమాణమని పై సూత్రములద్వారా బోధపడుచున్నది. "నిత్యత్వాత్ వేదవాక్యానాం ప్రమాణత్వే" అని వాత్స్యాయనుడు పైసూత్రభాష్యములో వ్రాసినాడు

ఈ విషయమున ఇతర దర్శనకారులుగూడ యిట్లే తమ అభిప్రాయమును తెలిపిరి.

వ్యాసముని:—శాస్త్రయోనిత్వాత్ ॥ వేదాంతదర్శనం, 1అ,1పా; 3 సూ॥ శాస్త్రయోనిత్వాత్ (వేద) గ్రహించుము. దేనిని; బ్రహ్మను. (లోకములోని స్థూల, సూక్ష్మ పదార్థములన్నిటికిని, సర్వవిద్యలకును బీజరూపమైన భండారమగు వేదశాస్త్రములకు కర్త బ్రహ్మయని తెలుసుకొనవలయును)

ఈ సూత్రముపై, శంకరాచార్యుడు చేసినవ్యాఖ్యానమిది:-

* వాత్స్యాయన భాష్యము (ఈసూత్రమునకు)నందు చివర "ఆయుక్తమ్" అని ప్రస్తుతము లభించు చౌఖంబా, నిర్ణయసాగర ప్రెస్ మొదలైన తావుల పుస్తకములన్నిటిలోను వున్నది.

"ఋగ్వేదాదేః శాస్త్రస్యానేక విద్యాస్థానోప బృంహితస్య ప్రదీప వత్సర్వార్థావద్యోతినః, సర్వజ్ఞకల్పస్య యోనిః కారణం బ్రహ్మ నహీదృశస్యర్గ్వేదాది లక్షణస్య సర్వగుణాన్వితస్య సర్వజ్ఞాదన్యతః సంభవోస్తి। యద్యద్విస్తరార్థం శాస్త్రంయస్మాత్ పురుష విశేషాత్సంభవతి యథావ్యాకరణాది పాణిన్యాదేర్జ్ఞేయైక దేశార్థమపిసతతోప్యధికతర విజ్ఞానఇతిసిద్ధం, లోకే కిము వక్తవ్యం."

వేదాంత దర్శనమునందే:- అతఏవచనిత్యత్వం॥ అ1 పా3 సూ29

(అతఏవ) కనుకనే (నిత్యత్వమ్) నిత్యత్వమైయున్నది. ఈసూత్రమునకు పూర్వసూత్రమైన "శబ్దఇతిచేత్ -న-ప్రభవాత్ ప్రత్యక్షాను మానాభ్యామ్" అనుసూత్రమునందున్న "ప్రత్యక్షాను మానాభ్యాం" అనుటచేత, ప్రత్యక్ష అనుమానప్రమాణములతోగూడిన, శబ్దరూపమైన ఉత్పత్తి జరిగినదను విషయమును అన్వయమునకు తెచ్చుకొనవలెను. అప్పుడుగాని "అతఏవ" అన్నపదమునకు భావము తెలియదు. కనుక యీ సూత్రమునందు నిత్యత్వమనగ, అఖండనీయమని యర్థము. ప్రత్యక్ష అనుమానములతోగూడిన శబ్దప్రమాణములన్ని వేదములకు సహాయకములు. కనుక ఆశబ్దము (వేదము) ఖండింప నలవి గానిది.

ఇంతవరకు మనకు ప్రాచీనదార్శనికులు వేదమునిత్యమని ఎట్లుతలచిరో తెలిసినది. ఇక పతంజలిమహాముని వ్యాకరణ భాష్యమందు, శబ్దము నిత్యమను విషయము చక్కనిహేతువు

లతో నిరూపించిరి. ఎట్లన:- "అ, ఇ, ఉ ణ్" అనుసూత్రము నకు భాష్యము వ్రాయునప్పుడిట్లు తెలిపిరి.

(ఆదిత్యవత్ స్యుః) అన్న చోటునఏకత్వమునుసూచించుటకు, (అకారమపినోపలభ తే కింకారణమ్?) శ్రోత్రోపలబ్ధిర్బుద్ధి నిర్గ్రాహ్యః ప్రయోగేణాభిజ్వలిత ఆకాశ దేశః శబ్దః, ఏకంచ పునరాకాశమ్॥ వర్ణసమామ్నాయే జాతిపక్షాధికరణమ్.

1 అ, 1 పా, 2 ఆహ్నికం

పైన శబ్దమున కివ్వబడిన లక్షణమతిసహజము, సందేహ రహితమునై యున్నది. చెవిచేతపొందబడి, బుద్ధిచేతదానిభావము గ్రహింపబడి, ప్రయోగించితే బయటకుప్రకాశించి, ఆకాశమే ఆవరణగ గలిగినది శబ్దము అని అర్థము.

ఈ వాక్యములదగ్గరనే మనకు మరియొక వివరణము కానుపించును.

"నైవం శక్యం | అనిత్యమేవంస్యాత్ ॥ నిత్యాశ్చశబ్దాః | నిత్యేషుచ శబ్దేషు కూటస్థైరవిచాలిభిర్వర్ణైః ర్భవితవ్యమనపాయోపజన వికారిభిః॥" అని. 1 అ 1 పా 2 ఆహ్నికం

పై అధికరణములో "శబ్దములు నిత్యములు. ఎందుకనగ, నిత్యములైన శబ్దములమధ్య నాశనములేనట్టియు, మారనట్టియు; నివృత్తి ఆగమము ఆదేశములు లేనట్టివి అక్షరములు గనుక అవి నిత్యముల"నుభావముగలదు.

అయితే వ్యాకరణమునందు ఆగమ, ఆదేశాదులెందు కున్నవను సంశయమిచట తీర్చినారు.

ఉదా:- "సర్వేసర్వ పదా దేశాదాక్షీపుత్రస్య పాణినః।
ఏక దేశవికారేహి నిత్యత్వంనోపపద్యతే॥"

సంధులలో ఆగమ, ఆదేశములు మొదలైనవి స్థానత ఆదేశములేగాని వస్తుతః అక్షరములు నశించవు. శబ్దమక్షర సమూహము. ప్రతిఅక్షరమునకొక్క ధ్వనియుండును. 'మార్గము' అను శబ్దము లో 'మా' అన్నప్పుడు 'గ' కారముండదు. 'గ' కారము పలుకునప్పుడు 'మ' కారముండదు. 'మ' కారముచ్చరించునప్పుడు 'ఉ' కారముండదు. అంతమాత్రముచేత, పూర్వాక్షరములన్నియు నశించినవనిగాని; లోపించినవనిగాని అందుమా? ఉచ్చారణ సమయములో ఆ యక్షరమునకు పూర్వపరాక్షరముల ధ్వనులు వినిపించకపోయినను "మార్గము"ను శబ్దముయొక్క మొత్తమురూపము అన్ని అక్షరములు కలిసిన ఏకరసమువలె, ప్రవహించును. ఏఒక్కఅక్షరమునకే మార్గమను శబ్దార్థము లభించజాలదు.

మరియొక విషయమును జూడుడు. "ఆవు" అనుమాటను నేనొకప్పుడనవచ్చును. మఱియొకప్పుడనక పోవచ్చును. నేనామాట నుచ్చరించకపోయినసమయముననే, నేనెరుగకయే ఎందరో"ఆవు"అనుమాటను అందురు. కనుక అక్షరములు, అక్షరములతోగూడినశబ్దములన్నియు నిత్యములే. ఈవివరము లెక్కవగగోరువారు పతంజలి మహాభాష్యమునందుప్రథమ, ద్వితీయా

హ్నికములలో జూడవచ్చును. ఏతావతా, లౌకికమైన శబ్దభాండారమంతయు నిత్యమైనదే యగుటచేత ఆప్తోపదేశమైన వేదము గూడనిత్యమనుటకు సందేహామక్కర లేదు.

## ఇతరమతముల సుభాషితములుగూడ నిత్యములే.

ఇక అన్యమతస్థుల సుభాషితములు అనిత్యమైనవని ప్రస్తుతము మనలో కొందరు తలంచుటలో కొంతచిక్కువున్నది. న్యాయదర్శనములో 'ఆప్తోపదేశ' మను శబ్దమున కివ్వబడిన లక్షణమునుబట్టి సత్యశీలముకలిగి, ప్రత్యక్ష ప్రమాణములతో వుపదేశించిన మహనీయుల వుపదేశములు సత్యములేగదా? అవి యేభాషయందున్నను ఆభాష శబ్దమయము; శబ్దము అక్షరమయమగుటచే, ఆభాషాశబ్దములును శాశ్వతమైనవగుచున్నవి. అందుచే ఏభాషలో యేసత్పురుషుడు సత్యప్రబోధముచేసినను, దానిని నిత్యము, శాశ్వతమని మనము నమ్మవచ్చును. కాని పక్షపాతము, అహంకారము మనలనట్లు నమ్మనివ్వవు. శాంతిని పొందనీయవు.

ఆ యాయావ్యక్తుల ఉపదేశరూపములలో మార్పుగనిపించినను వాటన్నిటిలో మూలసత్యమొకటే నిండియుండును.



# వేదములందలి విషయములు.

వేదములలో అనేక విషయములున్నవనునది సత్యము. కాని ప్రస్తుతకాలమున వైజ్ఞానికులెందరో కనుగొను వైజ్ఞానిక విషయములలో ప్రతియొక్క విషయము వేదములలోనే వున్నదనుట అతిశయోక్తియగును. హైందవులలోయిట్లుతలంచువారే యెక్కువగ కనిపింతురు. ఇట్లనుటచే వారు కోపగించుకొనకుందురుగాక ! ఒకనాటినాగరికత, కాలము పొడవైనకొద్ది, కాలగర్భమున మరుగుపడిపోవచ్చును. మొహంజదారోనాటి శిల్పము మధ్యకాలమున కానుపించకపోవచ్చును. గ్రీకులపరాక్రమ సంఘటనలుమరపుకురావచ్చును. బౌద్ధకాలమునజీవకునివంటివైద్యులు జీవపుచ్ఛ మొదలైన ఓషధుల సాయముతో అమోఘమైన వైద్యప్రయోగములు చేసియుండవచ్చును. అనేక భూకంపములుకలిగి అందాయాకాలముల శిల్పములు మరుగుపడియుండవచ్చును. తక్షశిల, నలందావంటి విశ్వవిద్యాలయముల శిక్షణాపద్ధతినితలచుకొని మనము గర్వించవచ్చును. ఎల్లోరా, అజంతా గుహాల శిల్పనైపుణ్యము మనపూర్వీకుల శిల్పచాతుర్యమును చాటవచ్చును. అతి ప్రాచీనకాలమున, ప్రతి గ్రామమునందు ఉత్తమ ఓషధులతోగూడిన అగ్నిహోత్రముల ధూమములలో నిత్యము ప్రతి గృహస్థుని ప్రాంగణము పరిశుద్ధమగుచుండెడిదని మనము తలచి, మన పూర్వీకుల కర్తవ్యనిర్వహణకు అంజలి ఘటించవచ్చును. కాని సృష్టిక్రమములో (పూర్వోత్తర జన్మ

వాదనలనుబట్టిగూడ) మానవునిసాధనలో-అనేకక్రొత్త అనుభవములు బయటపడగలవు. కాలగతిని అవి మార్పులు చెందుచు యింకను క్రొంగ్రొత్తరూపములుధరించుచుండును. కనుక వేదములందున్న విషయములుఅని పరిశీలించునప్పుడు యీవిషయమును మరువరాదు.

వేదములందున్న విషయములన్నిటిని పరిశీలించినచో, వాటిని నాలుగు భాగములుగ విభజింపవచ్చును. అవి:-

(1) విజ్ఞానవిషయము (2) కర్మవిషయము (3) ఉపాసనావిషయము (4) జ్ఞానవిషయము.

## 1. విజ్ఞాన విషయము:

ఈ విషయమునకుముందు వేదములలో యీనాలుగు విషయములే యెందుకుండవలెనని మనము విచారించవలెను. వేదములనేవివి సృష్టిరహస్యమును, కర్తృత్వమును బోధించెడి జ్ఞానభండారములు ప్రతి సత్కార్యమును చేయుటకుముందు మంచిచెడుగల నాలోచించవలెను. పిమ్మట పనికుపక్రమించవలెను. ఆపనిచేయుచు శ్రద్ధాభక్తులతో దైవోపాసన పూనవలెను. అప్పుడు వాస్తవికజ్ఞానము (బ్రహ్మజ్ఞానము) కలిగి ముక్తి అనగా శాశ్వతానందముతో బ్రహ్మత్వమునందులీనము కావచ్చును. అనగ జ్ఞానము, పిమ్మట కర్మ; తరువాత ఉపాసన, తుదకు ముక్తి: ఈనాలుగు జీవితసాధనకత్యవసరమే. విజ్ఞానముతోనే ఆగినచో తెలివిమాత్రము పెరిగి జీవితము నిస్సారమగును.

అందుకు కర్మయావుసరము. కేవల (Thiery) సిద్ధాంతమును సృజించి ప్రయోగము (Practice) లేనిచో వైజ్ఞానికుడు తాను చేయు సిద్ధాంతమును లోకమున ఫలప్రదమైనదని చాటలేడు.

పోనీ, విజ్ఞానము కర్మలతోనే ఆగి ఉపాసన (ఆధ్యాత్మిక దృష్టి) లేనిచో, అదియు ఉపకారమునకు బదులు భయంకర ప్రమాదమునకు దారితీయును. ఎట్లనగా, ఒక తత్త్వపరిశోధకుడు ప్రకృతితత్త్వ రహస్యములను విజ్ఞానముతో పరిశోధించి, కార్య రూపములో యేదేని వస్తువును నిర్మించును. అతనికి ఆధ్యాత్మిక దృష్టిలేనిచో ఆ నిర్మింపబడిన వస్తువుతోనే లోకమున కెంతయో అపకారమొనర్ప గలడు.

నేడు వైజ్ఞానికుల మహోన్నత వైజ్ఞానికకృషి ఫలితంగా రైలు, విమానము, ఆటంశక్తి మొదలైనవి కనుగొన బడినవి. వీటిని కోట్లకొలది జనుల రక్షణకు ఉపయోగించ వచ్చును. నాశనమునకు కూడ వీటినే ఉపయోగించవచ్చును. "ఆత్మ శాశ్వతమని, శరీరము మార్పుచెందునని, శరీరము ఆత్మ యధీనమునందే యుండవలసిన వస్తువనియు, కేవల శారీరక సౌఖ్యముకై ఆత్మవిరుద్ధముగ కోట్లకొలది ప్రాణులను హింసించరాదనియు; ఎందులకన, ఆత్మ అంతటను వ్యాపించి అణురూపములో భిన్నమైనదేననియు; కనుక ఇతరజీవులకు కలుగుబాధ, తనదేననియు; వారియందు సహానుభూతి కలిగి యుండుట తన కర్తవ్యమనియు; అట్లుండనిచో పరస్పరద్వేషము పెరిగి, ఏశాంతి కావలెనని కోరుదుమో, అధి యెండమావుల

రూపమైపోవునని" యెడ ఆధ్యాత్మికదృష్టి యుండినచో, ఆవైజ్ఞానికుడు తాను నిర్మించిన పదార్థములను మానుషహింసకు నుపయోగించడు. అట్లెవరైనా మానుషహింసకు ఉపయోగించ గోరినచో, వారికి తోడ్పడక, అసమ్మతిప్రకటించును. ఆధ్యాత్మికదృష్టిలేనిచో, తానే నరహత్యకు పాల్పడినవాడగును. ప్రస్తుతము యుద్ధములలో పోటీపడి వైజ్ఞానిక కృషిఫలితముగ నిర్మించబడిన వస్తుసముదాయము మానుషహింసకు ఉపయోగింపబడుట జూచుచున్నాము. కోట్లకొలది ద్రవ్యము నీదారుణ హింసకు వెచ్చించుచున్నారు. ఇందులకు ఆధ్యాత్మికదృష్టి (Spiritual outlook) తగ్గి కేవల భౌతికదృష్టి (Material-outlook) పెరుగుటయే కారణము. కనుక విజ్ఞాన, కర్మలు ఉపాసనలేనిదే నిష్ప్రయోజనమన్న మాట.

పోనీ పైమాటిని సాధనలో పెట్టుకొని నాల్గవదియగు బ్రహ్మతత్వజ్ఞానము లేనిచో, అదియు పై తరగతిలోకే పోవును. ఆధ్యాత్మిక వాదనలనే మతతత్త్వములందుము. ఎవరెవరి మతములలో వారు తమతమ అంతస్థులకు తగినట్లు ఆత్మజిజ్ఞాసంతో నుందురు. కాని తామెట్లు సాధనచేయుచున్నారో, ఇతరులు కూడ అట్లే సాధనచేయవలెననియు, తను ఉపాసనాపద్ధతినే వారామోదించవలెననియు, లేనిచో వారికి ముక్తి, ఆనందము కలుగవనియు, భావించి వారిని భేదముగజూచుచు, విశ్వమంతట అఖండమైన బ్రహ్మవ్యాపించుటను, ఆబ్రహ్మను అనగా విశ్వమంతటిని తనలోను, తనను విశ్వములోను జూచుకొనజాలక

పోయినచో, ఉపాసనలేని విజ్ఞానకర్మలకంటే ప్రమాదమై క్షమిం
చరాని దోషమగును.

ప్రస్తుతము కలుగుచున్న హిందూ, ముస్లిముల కలహా
ములున్నూ; చాలాకాలమునుండి మనదేశమునందు కానుపించు
చున్న ద్వైత - అద్వైత - విశిష్టాద్వైత; జైన, బౌద్ధమతభేద
ములున్నూ, ప్రపంచమున ఇతరదేశములలో మతముల పేరిట
జరిగిన యుద్ధములున్నూ, యీనాల్గవదియగు బ్రహ్మజ్ఞానమును
వాస్తవముగ బడయనిలోటుయొక్క పరిణామమై యున్నది.
కనుక విజ్ఞాన, కర్మ, వుపాసనా, జ్ఞానములు ఆదర్శజీవితసాధన
కవుసరమని తేలినది.

వేద మీనాల్గింటితో నిండియున్నది. వేదములలో
యీ విషయములనంతజ్ఞానములుగ కానుపించును. ఋగ్వేదము
లోను, అధర్వవేదములోను విజ్ఞానవిషయ మెక్కుడుగకలదు.
ఋగ్వేదం పదవమండలములోని 90 వ సూక్తము (పురుష
సూక్తము) నందును, యమసూక్తము (11 వ సూక్తము)
లోను; యితర మండలములలోగూడ యీ విజ్ఞానవిషయములు
కానుపించును. అధర్వవేదములో అనేక తావులందును, యజు
ర్వేదమున కొన్ని తావులందునుకూడ యీవిషయములభించును.
సృష్టియంతటను ఈశ్వరుడున్నాడని తెలుసుకొనుట:—

"తద్విష్ణోః పరమంపదం సదాపశ్యంతి సూరయః
దివీవచక్షురాతతమ్"॥, ఋగ్వే; మం 1; సూ 20 మం 20.

ఆ (విష్ణోః) సర్వమును వ్యాపించిన పరమాత్మయొక్క స్థానమును (సూరయః) జ్ఞానులెల్లప్పుడు దర్శింతురు. ఎట్లనగ, ఆకాశమున (చక్షురాతతమ్) కంటిదృష్టివ్యాపించునట్లు. కంటి దృష్టి ఆకాశమంతట వ్యాపించుననునది వైజ్ఞానిక సత్యము. యజుర్వేదము 8 వ అధ్యాయము, 36 వ మంత్రమున "ప్రజాపతిః ప్రజయాసంరరాణాస్త్రీణి జ్యోతీంషిసచతే సషోడశీ" అని కలదు. ఇందు పరమాత్మ (త్రీణిజ్యోతీంషిసచతే సషోడశీ) మూడుకాంతులు అనగా అగ్ని, సూర్యుడు, విద్యుత్తు అను కాంతులను, ప్రజాకాంతికై యితరసృష్టిలో కలిపినాడు. అందుచేత అతనికి షోడశీ అని పేరువచ్చినది. దీనిని షోడశీ కళయందురు.

షోడశీకళకు సంబంధించి ప్రశ్నోపనిషత్తునందిట్లున్నది:- సప్రాణ మసృజత ప్రాణాత్ శ్రద్ధాం, ఖం, వాయుః, జ్యోతి, రాపః, పృథివీన్ద్రియం, మనో, అన్నమన్నాద్వీర్యం, తపో మన్త్రాః, కర్మలోకా, లోకేషుచ, నామచ॥ ప్రశ్న అ6. మం 4

ఇందు "అన్నాద్వీర్యం" అనువరకు శంకరాచార్యులు చక్కని వాఖ్యానముచేసిరి. ఆకాశమునకంటె వాయువును (అంటే తాకిడి), వాయువునకంటె, అగ్నికిని; ఒకదానినుండి మఱియొకటి పుట్టుటచేత రెట్టింపుగుణము కలదని తెలిపిరి. దీనినే కళయందురు. "ఖం శబ్దగుణమ్. వాయుఃస్వేన స్పర్శే నకారణ గుణేచ విశిష్టంద్విగుణం" ఇట్లు చివరివరకు వారుక్రమ వృద్ధిచెందిన గుణములను తెలిపిరి.

అథర్వవేదము బ్రహ్మచర్యసూక్తములో గలవిజ్ఞాన విషయము

త్రిష్టుప్॥ "బ్రహ్మచారీ ష్ణంశ్చరతిరోదసీ ఉభే తస్మిన్ దేవాః సంమనసో భవంతి సదాధార పృథివీందివంచ, సఆచార్యం తపసాపిపర్తి॥" అథర్వ (11-5-1)

అర్థము:- బ్రహ్మచర్యమునందు ప్రతివ్యక్తి (ఉభేరోదసీ)భూమి, ఆకాశముల రెంటిని (ఇష్ణంశ్చరతి) అనుకూలము చేసుకొని జీవించుచుండును. (తస్మిన్) ఆబ్రహ్మచారి యందు (దేవాః) దేవతలు (సంమనసోభవంతి) అనుకూలముగ నుండును. ఆ బ్రహ్మచారి ఆకాశమును, భూమిని ధరించును. మఱియు తపస్సుచేత గురువుగారిని (పిపర్తి) తృప్తిపరచును.

ఇక్కడ దేవతలనగ ఆకాశమునందుండు గ్రహములు, లోకమునందలి విద్వాంసులు; పురాణములలోని దేవతలనెడి తెగకు చెందిన మనుష్యులును గారు. "త్రయస్త్రింశత్రి శతాః షట్సహస్రాః" అని వేదములలో చెప్పబడిన దేవతలిక్కడ అన్వయింపబడవలెను. లోకమునందలి అగ్ని, సూర్యుడు మొదలైన దేవత (కాంతిగలవగుటచే) లనుండి జనించినవే బ్రహ్మచారిలోను, అనుకూలించియుండును. అయినచో అతనిలోనుండు దేవతలెవ్వి? సామాన్యముగ "ముల్లో

కములలోని దేవతలు" అని అనుచుందుము. ముల్లో
కములివి:—

(1) స్వర్గలోకము (2) భువర్లోకము (3) భూలోకము

స్వర్గలోకమనగా విశాలాకాశము. దీనినే ద్యులోకమం దురు. భువర్లోకమనగ అంతరిక్షము అనగా ఆకసము. భూలోకమనగ అందరకు తెలిసిన భూమియే. ఈ మూడులోకములలోనున్న అగ్ని, సూర్యుడు, విద్యుత్తు మొదలైన పదార్థములే దేవతలు. ఈవిషయము నిరుక్తములో స్పష్టముగను, విపులముగను తెలుపబడినది.

పై అగ్ని, వాయువు మొదలైన దేవతలే, శరీరము; తల; కండ్లు; మనస్సనెడి రూపములలో ప్రవేశించియుండును. ఆత్మయేగాక సర్వమానవుల భౌతికశరీరతత్వముగూడ ఒక్కటే యనుటకు యీమంత్రమే నిదర్శనము. మఱియు శతపథ బ్రాహ్మణమున "యద్దేవతా అకుర్వన్, తత్కరవాణి"
శతంబ్రా 7-3-26

అని వున్నది. దేవతలుచేసినదానిని నేను చేతునని భావము. అనగా బ్రహ్మాండగోళములోనున్న అగ్ని మొదలైన పదార్థముల గుణకర్మలే నాశరీరమందున్న శిరస్సు మొదలైన ఇంద్రియములకు కలవని భావము. తపస్సుచేత వాటినుండి ఇంద్రియములకు శక్తికలుగును. ఆభౌతికపదార్థములే (దేవతలు) మానవ శరీరేంద్రియములుగ మారినవిషయము ఐతరేయోపనిషత్తునందును, అథర్వవేదమునందును గలదు. ముందీమానవశరీర

అవయవముల క్రమమును జూచి పై గ్రంథములలో వీటినిగూర్చి యివ్వబడిన ఉదాహరణలను పరిశీలింతము.

బయటస్థానమున ముల్లోకములు:—

బయట (1) భూలోకము:- మనకుకన్పించెడి భూమియే.
(2) భువర్లోకము:- అంతరిక్షము లేక ఆకసము.
(3) స్వర్గలోకము:- ద్యులోకము లేక విశాలాకాశము.

శరీరమున ముల్లోకములివి:—

(1) భూలోకము:- నాభి, శిశ్నము, కాళ్ళు.
(2) భువర్లోకము:- కంఠము, ఊపిరితిత్తులు, హృదయము.
(3) స్వర్గలోకము:- తల.

ఈ లోకములలోనున్న దేవతలు:—

| లోకములు | దేవతలు |
|---|---|
| బయట (1) భూలోకమునందు | (అనగా భూమియందు;) మట్టి; నీరు; ఆవిరి; మృత్యువు; |
| (2) భువర్లోకమునందు | (ఆకసమునందు): గాలి; చంద్రుడు; విద్యుచ్ఛక్తి; మరుత్ అంటే ధాన్యాదులు పండుటకు మూలమైన వర్షసంబంధ వాయు పదార్థతత్వములు |

(3) స్వర్గలోకము (విశాలాకాశమునందు): ద్యౌః; సూర్యుడు; దిక్కులు; అగ్ని.

శరీరమున (1) భూలోకము: (నాభి, శిశ్నము; కాళ్ళు) అపాన వాయువు, రేతస్సు, వీర్యము, కాళ్ళు.

(2) భువర్లోకము: (కంఠము, ఊపిరితిత్తులు, హృదయము): లో: ఆత్మ, మనస్సు; ముఖ్యము గౌణమునగు ప్రాణములు

(3) స్వర్గలోకము (శిరస్సున): శిరోభాగము, కండ్లు, చెవి, ముఖము, నోరు.

పై పట్టికనుబట్టి శరీరములోని ముఖ్యాంగములే, దేవతలుగ యీ మంత్రమున జెప్పబడినవని తెలుసుకొనవలెను. ఈ పట్టికలోని విషయము ఐతరేయమునందెట్లున్నదో జూడుడు.

(1) అగ్నిర్వాగ్భూత్వాముఖం ప్రావిశత్; ఐతరేయ ఉప 2 అ।4-1

(అగ్ని వాగ్రూపమై ముఖమునచేరెను.)

(2) వాయుః ప్రాణోభూత్వానాసికే ప్రావిశత్,

(గాలి ప్రాణమై ముక్కున చేరెను)

(3) ఆదిత్యశ్చక్షుర్భూత్వాఽక్షిణీప్రావిశత్,

(సూర్యుడు చక్షువై కండ్లను ప్రవేశించెను అనగా కన్ను అనెడి ఆవరణలో చూచెడిశక్తిగా మారినది)

(4) దిశః శ్రోత్రం భూత్వా కర్ణౌ ప్రావిశన్,
(దిక్కులు శ్రోత్రమై (వినెడిశక్తిరూపమై) చెవుల నాశ్రయించెను)

(5) ఓషధి వనస్పతయో లోమాని భూత్వాత్వచం ప్రావిశన్
(ఓషధి, వనస్పతులు, _ మూలికలు, శరీరమున బుట్టెడి వెంట్రుకలై చర్మమున జేరెను)

(6) చంద్రమామనో, భూత్వాహృదయం ప్రావిశత్,
(చంద్రుడు మనసుగమారి హృదయమున జేరెను.)

(7) మృత్యురపానో, భూత్వానాభిం ప్రావిశత్,
(మృత్యువు అపానవాయువై నాభిస్థానమున జొచ్చెను)
(మృత్యువు వచ్చుటయనగ అపానము నాభిస్థానమునుండి కంఠగతమై అటనుండి శరీరమును, వీడుటయనియర్థము)

(8) ఆపోరేతో భూత్వా శిశ్నం ప్రావిశన్,
(జలతత్వములు రేతస్సయి, జననేంద్రియమున (Sex) జొచ్చెను.)

కనుక బయటిజగత్తున ఏయే విశాల పదార్థములున్నవో (దేవతలు) వాటియొక్క అంశమాత్రములుగ అవి ప్రతివాని శరీరములో నున్నవని తెలియుచున్నది. ఇంద్రియములను నిగ్రహించుకొన్న బ్రహ్మచారి యింద్రియముల జన్మస్థానమైయున్న బయటి జగత్తులోని ప్రధాన పదార్థములను (దేవతలను) అనుకూలము జేసుకొనగలడు. అనగా యింద్రియములశక్తిని పెంచుకొనగలడు.

బయటి జగత్తులోని విశాలపదార్థముల అంశమాత్రమైన భాగములు శరీరమున జేరువిషయము అథర్వవేదమున యిట్లున్నది.

సర్వాంసంసిచ్యమర్త్యం, దేవాః పురుషమావిశన్
గృహాంకృత్వా మర్త్యం దేవాః పురుషమావిశన్
సూర్యశ్చక్షుర్వాతః ప్రాణం పురుషస్యవిభేజిరే
అథాస్యేతర మాత్మానం దేవాఃప్రాయచ్ఛన్నగ్నయే.
అథర్వ 11/8/24, 18, 31

బ్రహ్మచర్యసూక్తము అథర్వవేదములోనే 11-5-2 వ మంత్రము

"బ్రహ్మచారిణం పితరోదేవజనాః, పృథగ్దేవాః
అనుసంయంతిసర్వే।

గన్ధర్వా ఏనమన్వాయన్, త్రయస్త్రింశత్ త్రిశతాః
షట్ సహస్రాః। సర్వాన్స దేవాంస్తపసాపిపర్తి"

అని వున్నది. "బ్రహ్మచారికి పితరులు అనగా అస్థులు, మాంసము, రసము మొదలైనతల్లిదండ్రుల శరీర భాగములున్నూ, దేవతలు అనగా పైన పట్టికలో యివ్వబడిన ఇంద్రియాదులున్నూ, సహాకరించును. ఇక " గ ం ధ ర్వు ల ను, త్రయస్త్రింసత్ త్రిశతాః షట్ సహస్రాః", అనగా మూడు, ముప్పది, మున్నూరు, ఆరువేల దేవతలను బ్రహ్మచారి తృప్తి

పరచును." అని యున్నది. ఈ గంధర్వులు, ఆరువేల దేవతలు యెవరో విచారించుదము.

"గాంధారయతి, ఇతి గంధర్వః" భూమికి ప్రధానముగ ఆశ్రయ భూతమైనవి చంద్ర - సూర్య కిరణములు, గనుక అవి గంధర్వు లన బడును.

శరీరము మూడు భాగములుగ చేయబడుట పట్టికలో గమనించ వచ్చును. నాభిస్థానమున ఆకలిలో గల అగ్ని, హృదయములో మనస్సు, దాని కధిష్టానమైన చంద్రుడు లేక ఇంద్రుడు, మస్తిష్కమున సూర్యుడు వున్నారని కూడ ఒక అభిప్రాయము కలదు. ప్రతి దేవతకు పదేసి అధీన (గౌణ) దేవత లుందురు. అవి మొత్తం ముప్పదిమూడు. వీటికి అధీనముగ 33 అంగములున్నవి. వీటన్నింటిలోను జీవుడు సంచరించు చుండును. అధర్వవేదము కాం. 10-7 వ లో 13 - 27, 23 మంత్రములు బ్రహ్మాండ లోకములో ఆయా భాగములలోని అగ్ని మొదలు సమస్త దేవతల (అఖండ పదార్థములు) లోను, పరమాత్మ సంచరించు నట్లు జీవుడీ శరీర భాగములలో సంచరించు నను భావమును వెల్లడించు చున్నవి.

ఈ ముప్పది మూడు దేవతలు మేరు పర్వతముపై నుండును. యోగ సాధకు లీమేరు పర్వతమును వెన్నెముక యందురు. ఈ వెన్నెముకలోనున్న బెజ్జము ద్వారా పైనుండ హరించిన శరీరములోని తత్వములు (దేవతలు) సర్వత్రా సంచరించు చుండును. దీనినిగూర్చి పూర్తి వివరము యోగ

సాధకులకు తెలియును. మూడు స్థానములలో కలిసి ప్రధాన తత్వముల శాఖలు మూడువంద లుండునని తెలుపుదురు. ఇక ఆరువేలు యెవ్వి? వెన్నెముకకుగల ఆధార, స్వాధిష్ఠ, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞా చక్రము లనెడివి ఆరు చక్రములు, కలవు. ఈ ఆరింటిలో ఆరు వేలకు పైగా మొదటి మూడు తత్వముల శాఖలు గలవని, వీటినే ఆరువేల దేవతలని తలంచవలెను. జీవుడు వీటన్నిటిని దాటి మస్తిష్కమునందు కేంద్రీకరింప బడినప్పుడు బ్రహ్మలోకమునకు, చేరుట యనబడును. ఆరువేల దేవతలను ఆరువేల నాడులన వచ్చును. నాడులు ఆరు వేలేకాదు, లక్షలు, కోట్ల సంఖ్యలో సూక్ష్మాతి సూక్ష్మరూపమున గలవు. అన్ని నాడులలోను ఆయుర్వేదమతము ననుసరించి వాత, పిత్త శ్లేష్మముల తత్వములు హెచ్చుతగ్గులుగ నుండును.

వెన్నెముకనుండి కోట్లకొలది నాడీసముదాయములు శరీరమంతట వ్యాపించుటను జర్మను దేశీయుడైన డాక్టర్ బాబిట్ గారి Human Culture and Cure అను గ్రంథము సమర్థించుచున్నది. బాబిట్ గారు సూర్యకిరణములలో నుండెడి ఏడు రంగులు, శరీరమంతటను వుండునని నిరూపించిరి. మానవ శరీరమున కోట్లకొలది నాడీసముదాయము కలదని, దానికి కేంద్రస్థానము వెన్నెముక యనియు, శరీరావయవములలో నుండెడి ఆయా నాడీసముదాయములలో చైతన్యము కలిగించుటకు కేంద్రస్థానములైన వెన్నెముకలోని ఆయా భాగములకు చికిత్సచేయవలెనని నిరూపించిరి.

వేదమునందలి వైజ్ఞానిక విషయమునకు మఱియొక ఉదాహరణ:- భూమి, సూర్యుడు, చంద్రుడు, వీటిలో సూర్యుడు లేనిదే, భూమి, చంద్రుడు మొదలైనవి స్వయముగ ప్రకాశింపలేవని చెప్పుమంత్రములు.

(1) సత్యేనో త్తభితా భూమిః, సూర్యేణో త్తభితాద్యౌః।
ఋతేనాదిత్యా స్తిష్ఠంతి। దివిసోమో అధిశ్రితః।

అధర్వ కాం. 14 వ. 1 మం. 1

(2) కఃస్విదేకాకీచరతి, కఉస్విజ్జాయతే పునః।
కింస్విద్ధిమస్య భేషజం, కింవావపనం మహత్ ॥

యజు. అ. 23 మం 9

(3) సూర్యఏకాకీచరతి చంద్రమాజాయతేపునః।
అగ్నిర్హిమస్య భేషజం భూమిరావపనంమహత్ ॥

యజు. అ. 23 మం 10

(1) ఈ భూమి ఆకాశమధ్యమున పరబ్రహ్మచేతను, సూర్యునిచేతను, ధరింపబడియున్నది. దివిలోకము సూర్యునిచేతను, గాలిచేతను, (ఆదిత్యాః)-శతపథ బ్రాహ్మణములో పన్నెండుమాసములను ద్వాదశాదిత్యులుగ చెప్పుటచే -పన్నెండు మాసములు; (దివిద్యోతనాత్మకే) సూర్యప్రకాశమున (సోమః) చంద్రుడును సూర్యుని ఆధారముచేతనే ప్రకాశించుచున్నవి.

(2) (కఃస్విదేకాకీచరతి) స్వతంత్రముగ నేది తిరుగును? (పునఃకఃజాయతే) మరలమరల యేదిపుట్టును? చల్లదనమునకు, విరుగుడు యేది? మిక్కిలివిశాలమై (ఆవపనం) బీజము మొలచు క్షేత్రమేదైయున్నది?

(3) ఈ మంత్రము, పై మంత్రములలోని ప్రశ్నలకు సమాధానము.

సూర్యుడు స్వతంత్రుడై చరించును. చంద్రుడు అమవస పున్నమలకు కళలు తగ్గుచు పెరుగుచుండుటచే - మాటికి మాటికి పుట్టి పెరుగుచుండును. (ఇచ్చట సూర్య చంద్ర శబ్దములకు పరమాత్మ, జీవాత్మ అన్వయము కూడగలదు) చల్లదనమునకు నివారణోపాయము అగ్నియైయున్నది. భూమి విశాలమైన (విత్తనములు నాటుటకు యోగ్య) బీజ క్షేత్రమైయున్నది. ఇచట సాయణుడు తై. బ్రా. భాష్యంలో యిట్లు వ్రాసియుండెను.

ఆదిత్యస్యహి, సహాయనైరపేక్ష్యేణ జగద్భ్రమణం ప్రసిద్ధమ్। కృష్ణపక్షేక్షీణశ్చంద్రః। శుక్లపక్షే పునర్జాయత ఇతిప్రసిద్ధమ్। అగ్నిసేవయాహి శైత్యోపద్రవో నివర్తతే ॥

ఇక సూర్యుడు స్వతంత్రుడై చరించుచున్నాడని పైమంత్రములోగలదుగదా? సూర్యుడుతిరుగడనియు, భూమి, చంద్రులే సూర్యునిచుట్టు తిరుగునని యీనాటి వైజ్ఞానికుల అభిమతము గదా అని సందేహము కలుగనొప్పును. కాని సూర్యుడనగ

బ్రహ్మాండ అగ్నిజ్వాలలతోగూడిన గోళము. ఆసిప్పామంటలు కదలుచునే యుండునుగదా ? అందుచే స్వస్థానమును వీడక సూర్యుడు తిరుగవచ్చును. ఇటీవలనుండి ఖగోళపరిశోధకులు సూర్యుడుకూడ తనస్థానము మారక (తనచుట్టుతాను) తిరుగు గొప్ప అగ్నిగోళమని ప్రకటించుచున్నారు.

పై నుదహరించిన విధముగ వేదములలో పదార్థవిజ్ఞాన శాస్త్రము, విమానయాన విషయము, సోమలత మొదలగు ఓషధుల విషయము, క్రిమిసిద్ధాంత విషయము, సృష్టివిషయము మొదలైన అనేక వైజ్ఞానిక విషయములు కానుపించుచుండును

## 2. కర్మ విషయములు

జీవుడు శరీరధారియైనప్పటినుండి కర్మచేత ఆవరింపబడి (స్వధర్మముచే) యుండును. దానినుండి విడివడడు. అనగా కర్మను విడువజాలడు. అట్లు కర్మనువీడవలెనని అనకొనుటకూడ అసహజము. జ్ఞానముతో కర్మనుచేయుచున్నచో కర్మవలన జనించు పరిమాణములతనిని బాధింపవు. శాశ్వతసుఖమును బొందగలడు. ఇక్కడ "కర్మ" అనుపదము "పని" అనుఅర్థము లోనే వాడబడుచున్నది. ఆపనియు అభ్యుదయ నిశ్రేయసకరమై యుండవలెనని, అదియే ధర్మమగునని వైశేషికకారుని యభిమతము. కావున మానవుడు శరీరమును వీడువరకు ధర్మబద్ధముగ పనిచేయు చుండ వలసినదే. లేనిచో అతనికి ఆనందము, సుఖములేదని వేదములలో బోధింపబడినది. యజుర్వేదమున

అనేకమైన యజ్ఞ కర్మలను (సేవాదృష్టితో చేయుపనులు) వర్ణించి తుదకు నలుబదియవ అధ్యాయమున మానవుడుతప్పక పనిచేయుచు జీవించవలెనని తెలుపబడినది.

కుర్వన్నే వేహాకర్మాణి జిజీవిషేచ్ఛతగ్ సమాః ॥
ఏవంత్వాయినాన్య థేతో స్తిన కర్మలిత్య తేనరే ॥
యజు, అ 40 మం 1

(ప్రభోధాత్మక శైలిలో ఈ ఛందస్సు చెప్పబడినది. ఈశైలిలో మనకనేక ఛందస్సులు వేదములందు గానబడును) పై మంత్రములకు భావార్థము:—

(ఇహా) ఈలోకమున (కర్మాణికుర్వన్నేవ) యిందు తెలుపబడిన ధర్మయుక్తమగు పనులనుచేయుచునే మరణపర్యంతము జీవయాత్ర సలుపుడు. ఈశ్వరాజ్ఞయగు నీకర్తవ్యమిదియే. (త్వాయి) నీకు (అన్యథానఅస్తి) లోకమునకు అపకారములేని విధముగ సేవాదృష్టితో చేయువనులుతప్ప వేరు మార్గము నీకులేదు. ఒకవేళ కర్మయొక్క వాసనలు నిన్ను బాధించునని తలచెదవా? అట్లినట్టికినిగాదు. ఎందుకన (నకర్మలిప్యతేనరే) యింతకుపూర్వము వేదమున చెప్పబడిన కర్తవ్యకర్మలను అహంకారము మమకారమును వీడి చేయవలసినవే యగుటవలన అట్లుజేయునప్పుడు నిన్ను అవి అంటియుండవు. అనగా వాటివలన నీవు బాధపడవు. కారణమువాటి ఫలితము పైనీకు స్వార్థముండదుగదా.

సిద్ధాంతజ్ఞానము (Theoritical knowledge) ప్రయోగజ్ఞానము అనగా దానిని అమలులో పెట్టుట ఈరెండును జీవితమునకు విడువరాని సాధనమార్గములని పై అధ్యాయములోనే మఱియొకమంత్రములో గలదు.

ఉదా:- విద్యాం చా విద్యాం చ యస్తద్వేదోభయగ్ సహ।
అవిద్యయామృత్యుంతీర్త్వా విద్యయామృతమశ్నుతే॥
యజు, 40 అ 14 మం

ఈ మంత్రముతరువాత యజుర్వేదమున మూడు మంత్రములేగలవు. గనుక దీనినిగూడ తుదిమంత్రములలో జేర్చవచ్చును. (యజ్ఞ) సత్కార్యములెన్నో చెప్పితుదకు యీ వాక్యములు చెప్పబడినవి. కనుక దీనికి మిక్కిలి ప్రాధాన్యతగలదు. దీని భావార్థము.

(విద్యాం) మనస్సు మొదలైన సూక్ష్మేంద్రియముల ద్వారా పరమాత్మనుపాసించెడి విద్యను (అవిద్యాంచ) శరీరముతోచేయు పనులను ఎవడైతే తెలుసుకొనునో, అతడు అవిద్యచే అనగ కర్మచే (మృత్యుంతీర్త్వా) పనిచేయని దోషమనెడి మృత్యువునువీడి, జ్ఞానముతో (అమృతమశ్నుతే) శాశ్వతసుఖమును అనగా మోక్షమును బడయుగలడు. ఇక్కడ విద్యయనగా'జ్ఞానము' అవిద్యయనగా'పని'యని అర్థము మఱియొక మంత్రము ఈరెంటిలోను యేఒకటి లేకున్నను జీవితమువ్యర్థమేనని తెలుపుచున్నది.

అంధతమః ప్రవిశంతియేఽవిద్యాముపాసతే।
తతో భూయ ఇవ తేతమోయఉవిద్యాగ్ంరతాః॥

యజు అధ్యా 40 మం 12

భావార్థము:- ఏమానవులు (అవిద్యాముపాసతే) జ్ఞానములేకనే కేవలము పనిచేయు చుందురో, వారు (అంధతమః) అంధకారమగు దుఃఖములో పడిపోయెదరు. (య ఉ) ఎవరైతే (విద్యాగ్ంరతాః) కేవల జ్ఞానము అనగా సిద్ధాంత జ్ఞానమునే కలిగియుందురో, వారు (తతో భూయ ఇవతమో) మొదటి వానికంటె అంధకారమునబడి నాశనమగుదురు. ఎందుకనగ ఒక వ్యవసాయదారుడు సమాజమునకు, తనకువున్న సంబంధమును, తెలుసుకొని ఆధ్యాత్మిక జ్ఞానమును పొందనప్పుడు, అతడు భౌతిక సుఖమును బడసినను అతని వలన లోకమునకు కొంత అపకారము కలుగును. అతడు ప్రక్కవాని భూమిలోనికి, నీటిని రానీయక యిబ్బంది గలిగించును. దేశమున కేవస్తువవసరమో దానిని ఉత్పత్తిజేయడు. సిద్ధాంత జ్ఞానము లేకపోవుట వలన, తాత్కాలిక ప్రయోజనములకై కృత్రిమపు ఎరువులను ఉపయోగించి భూములను పాడుజేసు కొనును. కేవల సిద్ధాంతవాదివలన కూడ, యింతకంటె మించి సంఘమునకును, అతనికిని, అపకారము వాటిల్లును.

పుట్టుకనుండి మనుష్యులకు రెండురకముల పనులు చేయవలసి యుండును. (1) తన శరీరమున (వ్యక్తిగతమైనవి)కు సంబంధించినవి. (2) సంఘమునకు, దేశమునకు సంబంధిం

చినవి. వివాహము, గర్భాదానముల వంటి సంస్కారములు, ఉదయ సాయంకాలముల ఈశ్వరధ్యానము, అగ్నిహోత్రము మొదటి రకమునకు చెందును. రాజ్యాంగము, గ్రామనిర్వహణ; కులవృత్తులు; సభలు; సమావేశములు రెండవరకము. ఈ రెండవ రకములోని కొన్ని కర్మలు వేదములలో యజ్ఞముల పేర్లతో నున్నవి. అయితే ఈ కర్మల (పనుల) వర్ణన వేదములలో కనుపించదు. ఆయా పనుల గూర్చిన మంత్రములను సూత్రకారులు ఫలానా "సందర్భమున యీ మంత్రము అన్వయింపబడునని" తెలిపిరి.

పురుషసూక్తములో, సృష్టినిగూర్చిన వర్ణనలో విరాట పురుషుడే పని (కర్మ) ప్రారంభించెనని భావము గలదు.

## 3. ఉపాసన.

వేదములందున్న విషయములలో మూడవది 'ఉపాసనా' విషయము. ఉపాసనకు శ్రద్ధ మిక్కిలి అవసరము. అసలు శ్రద్ధ అనే ఆవరణలోనే ఉపాసన (ఆధ్యాత్మిక సాధన) జేయవీలగును. కనుక వేదములో శ్రద్ధనుగూర్చి యిట్లున్నది.

శ్రద్ధయాగ్నిః సమిధ్యతే శ్రద్ధయాహూయతే హవిః ।
శ్రద్ధాం భగస్యమూర్ధని, వచసా వేద యామసి॥ ఋగ్వే
మం 10 సూ 5 మం ।

అగ్ని శ్రద్ధతోనే ప్రజ్వలింపజేయబడుచున్నది. శ్రద్ధతోనే హోమము చేయబడు పదార్థములు (హూయతే) ఆహుతి చేయబడుచున్నవి. సంపద యొక్క శిరస్సుపైన అనగ సుఖమునకు మూలము శ్రద్ధయని ఘోషించుచు నివేదించుచున్నాము. (We declare with proclamation that the faith is on the head of wealth) ఇట్లు శ్రద్ధను గూర్చి ఋగ్వేదమునందు కొన్ని మంత్రములు గలవు. "శ్రద్ధాం దేవా యజమానా వాయుగోపా ఉపాసతే" అని యున్నది. "శ్రద్ధయా విందతేవసు" (శ్రద్ధతో ధనమును పొందుదురు.) అని కూడ చెప్పి యున్నది. ఇక శ్రద్ధతో ఉపాసన ఫలించు ననుటలో సందేహ మక్కరలేదు.

పరమేశ్వరుని యందు జీవుని, లయము జేసుకొనుటకు యోగ సాధన; యితరజీవులలో పరమాత్మదర్శనము, అనగా సమత్వము, యీ రెండును ఉపాసనకు అంగములు. ఇతర జీవులలో పరమాత్మ దర్శన మనగ అందరియందు ప్రేమ - సత్యములతో సంచరించుటయే.

యుంజతే మన, ఉతయుంజతేధియో, విప్రా విప్రస్య బృహతో విపశ్చితః। విహోత్రాదధే వయునా విదేక - ఇన్మహే దేవస్య సవితుః పరిష్టుతిః॥ ఋగ్వే మం **5.** సూక్తం **81** మం। ఇదేమంత్రము యజుర్వేదమున 11వ అధ్యాయములో చూడనగును.

భావము :— యోగులు, మేధావులు, బుద్ధిమంతులు, సర్వజ్ఞుడైన పరమేశ్వరుని మధ్య తమ మనస్సును లగ్న మొనర్తురు. అన్ని విధములైన విజ్ఞానములను, పనులను, లోకములను తెలిసికొనియుండి యీ ప్రపంచమును అనేక రూపములుగ సృజించి, దాని ననేక శక్తులతో నిలువబెట్టు నట్టివాడు పరమేశ్వరుడొక్కడే కనుక జ్ఞానులారా! (సవితుః) సమస్తమును సృజించునట్టి ప్రకాశ స్వరూపుడైన పరమేశ్వరుని శక్తిని వర్ణించునదే వేదవాణి స్తుతియైయున్నది. (శతపథమునందీ మంత్రమునకు గల వివరణలో యీ భావము గలదు) ఈ అధ్యాయమున మఱికొన్ని మంత్రములీ ఉపాసన విషయమును బోధించును ఋగ్వేదము, మం 5 సూ 82 మం 5, ఉపాసన గూర్చి యిట్లున్నది.

విశ్వాని దేవసవితర్దురితాని పరాసువ।
యద్భద్రంతన్న ఆసువ॥

"హే దేవ! లోకమునందుగల సమస్తమైన చెడుగులను నా దరికి చేరకుండ తొలగించుము. యేది శుభప్రదమైనదో, దానిని నాకు చెందునట్లు చేయుము" అని భావము. వాస్తవముగ ఉపాసన ధర్మమిదియే. చెడుగులను చేయవద్దని కోరుచూ, ఈశ్వరుని "యేది శుభమైనదో, దానిని కలిగించుమను" చున్నాడు. శుభమైన దేదో ఈశ్వరునకే తెలియును. గనుక తన ప్రత్యేకమైన కోరిక యేమియు లేదు. కనుక ఉపాసన కోరికతో చేయగూడదని దీనివలన తెలియును. కనుక "ఈశ్వరో

పాసన చేసినామని; అనేక శక్తులు పొందినామని,..వాటి కొరకే ఉపాసన చేయవలెనని" చెప్పు ధోరణి సమంజసమైనదిగాదు.

ఉపాసనకు 'గాయత్రి' అన్ని విధముల యోగ్యమైనది. యజుర్వేదమున 8 అధ్యా 9 మంత్రములలో 'గాయత్రి' విషయము కనుపించును. ఆ మంత్రములు రాజులకు, విద్వాంసులకు సంబంధించినవి.

"—ఋచాస్తోమం గాయత్రేణ రథన్తరం' అనియు 'ఆద దే గాయత్రేణ' అని వున్నది. గాయత్రీ అనే శబ్దము 'గాయతః ప్రాణం' అని "అగ్నిర్గాయత్రీ," గాయత్రో వా అగ్నిః" అని 'గాయత్రో వై బ్రాహ్మణః' 'గాయత్రో బ్రహ్మవర్చసం' "వీర్యం వై గాయత్రీ" మొదలగు అనేక అర్థములలో వాడబడుచుండును. కేవలగాయత్రీ మంత్రోచ్చారణయేగాక ఆ మంత్రములోని భావమును హృదయమున, మననము జేసుకొనుట చేతనే గాయత్రీ వుపాసన సార్థకమగును. ఉపాసనకు వలయు యమ నియమములను పతంజలి యోగ దర్శనమున వివరించినాడు.

ఉపాసనకు రెండవ అంగమైన సర్వ భూతదయ, సమత్వము—భక్తిని గూర్చి వేదములలో కొన్ని మంత్రములు కనుపించును.

సర్వభూతములయందు దయతోను, ప్రేమతోను, సంచరించుటకు ముందు నీ తల్లిదండ్రులతో కూడిన కుటుంబము

తోను, యితర బృందములతోను, పరిసర వాసులతోను, ప్రేమతో కలసి మెలసి యుండుటనేర్చుకొనవలెను. "నాసన్నిహితులతో నేను కఠినముగ నున్నను యితర లోకముతో ప్రేమతో నున్నానని" ఎవరైనా చెప్పినచో ఆ మాటను నమ్ముట కష్టము. సన్నిహితులలోనే ఆదర, ప్రేమలను సంపాదించ లేనివాడు బయటి ప్రపంచమున ప్రేమ సాధన చేయ కలుగుట అసంభవము. బయటి ప్రపంచములో గడుపవలసిన జీవితమునకు గృహము పరిశోధనాలయము. కనుక ఈ విషయము వేదమునం దిట్లుగలదు.

> అనువ్రతః పితుః పుత్రో మాత్రాభవతు సంమనాః ॥
> జాయాపత్యే మధుమతీం వాచలి వదతు శంతివామ్ ॥
>
> అధర్వ 3 కా 10 వ 2 మం.

కుమారుడు తండ్రికి అనుకూలముగ పనిచేయుచు తల్లి యొక్క హృదయముతో కలసిమెలసి యుండవలెను. భార్యా భర్తతో మధురమైనట్టియు, శాంతిని కలిగించునట్టియు, మాటలను మాట్లాడుచుండవలెను.

> మాభ్రాతా భ్రాతరం ద్విక్షన్ మాస్వసారము తస్వసా।
> సమ్యంచః సవ్రతా భూత్వావాచం వదతుశంతివామ్॥
>
> అధర్వ 3 కాం. 30 వ 3 మం

ఒకసోదరుడు తన సోదరుణ్ణి, ఒకసోదరి తన సోదరిని ద్వేషించుకొనరాదు. కలసిమెలసి ఒకేలక్ష్యముతో పనిచే

యుచు పరస్పరము శుభప్రదమైన మాటలు మాట్లాడుకొన వలెను. లోకములో ప్రేమసాధనను అలవాటు జేసుకొనుటకే మనము సోదరులను, సోదరీమణులను కలిగియున్నామని తలంచవలెను. ఇక బాహ్యలోకములో అందరితోను, ప్రేమసాధన చేయవలసిన విషయం, "సహృదయం, సాంమనస్యమవిద్వేషం కృణోమివః। అన్యోఅన్య మభిహర్యత, వత్సంజాతమి వాఘ్న్యా అధర్వ 3 కాం 30 వ మం।

భగవంతుడు చెప్పుచున్నాడు. "మీరందరు సమానమైన హృదయముకలిగి సమానమైన మనసుతో, ఒండొరులను ద్వేషించుకొనవద్దని వుపదేశించుచున్నాను. అప్పుడేపుట్టిన లేగ దూడయందు ఆవువలె మీరు ఒండొరులు ప్రేమతో మెలగుడు".

## ప్రతిపనిలోను సమత్వముండవలెననెడి విషయము :

> సమానోమంత్రః సమితిః సమానీ । సమానంమనః
> సహచిత్తమేషామ్। సమానంమంత్రయేవః సమానేన
> వోహవిషాజుహోమి॥ ఋగ్వే 10/191/3 మం

" మీ అందరి (మంత్రః) ఆలోచనలు సమానముగా నుండవలెను. మీఅందరి (సమితి) సభా-గ్రామపంచాయతీనుండి రాజసభవరకు - అందరకు సమానముగ నుండవలెను. మీ అందరి మనస్సు సమానముగా నుండవలెను. నేను మీ అందరికి ఆలోచించి ఒకే ఆలోచనను (మన్త్రః) కలుగజేయుచు

న్నాను. మీ అందరికి నేను (సమానేనవహవిషాజుహోమి) ఒకే హవిః పదార్థముద్వారా హోమముచేయుడని ఆదేశించుచున్నాను.'' ఈ వుపదేశము మానవమాత్రులందరికి చేయబడినది. అంతేగాని ఒక తెగకుగాని, ప్రత్యేక కులమునకుగాని, జాతికిగాని, మతవర్గమునకుగాని, ఉపదేశించలేదు.

సమానీవ ఆకూతిః, సమానాహృదయానివః ।
సమానమస్తువో మనోయథావః సుసహాసతి ॥
ఋగ్వే మం 10 సూ 191 మం 4

ఋగ్వేదము చివరిలోనుండుటచే ఈమంత్రము మిక్కిలి ప్రధానమైయున్నది. పదిమండలములలోను తెలుసుకొన్న జ్ఞానము, ఈమంత్రములో చెప్పినట్లు నడచుకొనకపోతే వ్యర్థమైపోతుంది. భావార్థము:—

మీ (ఆకూతిః) సంకల్పము సమానముగా నుండుగాక! మీ హృదయములు సమానముగ నుండుగాక! మీమనసులు సమానముగా నుండుగాక! అందుచే మీరందరు (సు - సహ) మంచిపద్ధతిలో కలసిమెలసి వుందురుగాక! భక్తిమార్గము గూడ యీరెండవ అంగముక్రిందకేవచ్చును. ప్రకృతిలో అనేక వస్తువులను చూచివాటిలో ఈశ్వరరూపము నారాధించుటయే భక్తిరూపము. యజుర్వేదములోని నమకచమకములు భక్తులు చేయు భగవంతుని గుణగానము. యజుర్వేదమున 19 అధ్యాయమున 9 మంత్రమిట్లున్నది.

తేజోఽసి తేజోమయి ధేహి। వీర్యమసి వీర్యంమయి ధేహి।
బలమసి బలంమయి ధేహి। ఓజోఽస్యోజోమయి ధేహి।
మన్యురసి మన్యుం మయి ధేహి। సహోఽసి స
హోమయి ధేహి।

పరమాత్మ తేజస్సు, వీర్యము, బలము, ఓజస్సు, మన్యు, సహఃరూపములు గలవాడని, వాటన్నిటిని జీవుడు కోరుకొనుట యందలి వర్ణనము. మన్యుః= అంటే కోపము. అనగా శరీరములో ఎట్టిదుష్టశక్తిని సహించలేని గుణము; సహః= అంటే ఆత్మోన్నతిని నాశనముచేయు ఎట్టిదుష్టశక్తినైనను నాశనము చేయు గుణము, భగవంతునిముందు తన అల్పత్వమును జ్ఞాపకమునకు తెచ్చుకొని అతనినుండి శక్తిని కోరుటయే భక్తిమార్గములోని ప్రధానాంశము. ఇందులో సాధకునకు తన సాధనలోనే మాధుర్యము మిక్కుటముగ లభించును.

ఈవిధముగ యోగసాధన, సమదృష్టి, భక్తిమార్గములతో కూడిన, ఉపాసనా విషయములు వేదములందనేకచోట్ల కానుపించుచుండును.

## 4. జ్ఞాన విషయము :—

స్థూలజగత్తులోని రహస్యవిషయమును తెలుసుకొనుట; బ్రహ్మస్వరూపనిర్ణయము;- ధర్మ; కర్మకు కర్తయైన తనస్వరూపమును - కర్తృత్వమును తెలుసుకొనుట జ్ఞానము. జ్ఞానమార్గము, చివరనుండుటచే దీనిని జీవితములో చివర ఆలోచిం

చుకొనవలసిన విషయమనుకొనుట పొరబాటు. విజ్ఞాన - కర్మ- ఉపాసనా - జ్ఞానములు ప్రతివాని జీవితములో అనుక్షణము ఓతప్రోతమై యుండుటచేత శోభాయమానముగ నుండును. బ్రహ్మ - ప్రకృతి - జీవాత్మలనుగూర్చి వేదమునందు చక్కని అలంకారశైలిలో యిట్లున్నది.

ద్వాసుపర్ణాసయుజో సఖాయా, సమానంవృక్షం పరిషస్వజాతే॥
తయోరన్యః పిప్పలంస్వాద్వత్త్య నశ్నన్నన్యోఅభిశాకశీతి ॥

ఋగ్వే మం 1 సూ 164 మం 20

రెండు (సుపర్ణా) పక్షులు (జీవాత్మ-పరమాత్మ) ఎల్లప్పుడు కలసి, మెలసియుండునట్టివి - ఒకేవృక్షము నాశ్రయించి యున్నవి. అందొకటి చెట్టుయొక్క పండ్లను తినుచుండును. రెండవదిమాత్రము దాని ఫలమునుతినక సాక్షిమాత్రముగ చూచుచుండును. "సుపర్ణా" అంటే నిరుక్తములో అనేకతావులందు "సుపతనా" అనివున్నది. కనుక ఇక్కడ సుపర్ణా అంటే జీవాత్మ - పరమాత్మలని, వృక్షమనగ ప్రకృతియని, పండు అనగా ప్రకృతిలోని ఫలితమని వేదాభిప్రాయము. ప్రకృతి - జీవుడు - పరమాత్మల విషయముతోగూడిన యీజ్ఞానకాండను ఆధారముగ తీసుకొనియే మనదేశమున ద్వైత,- అద్వైత,-విశిష్టాద్వైత సిద్ధాంతములను స్వామి శంకరాచార్యులవంటి మహనీయులు ప్రచారముజేసి తమప్రతిభను లోకమున జాటిరి.

యితే ఈసిద్ధాంతముల పేరుతో దేశమున అనేక ఘోరకార్యములుగూడ జరుగుచున్నవని తెలుపుటకు విచారము కలుగుచున్నది.

పైవిధముగ వేదములు విజ్ఞాన - కర్మ - ఉపాసనా - జ్ఞానవిషయములతో నిండియున్నది. ఇందివ్వబడిన విషయములేగాక వేదములందనేక విషయములు కానుపించును. కాని వాటన్నిటిని పైనాలుగు వర్గములలో జేర్చుకొనవచ్చును.



# వేదములలోని భాషాస్వరూపము



## వైదిక శైలి

వేదములు అలంకారములతో గూడి పద్యముల రూపములో నున్నవి. అందుచేతనే వాటికి "ఛందాంసి" అను పేరు వచ్చినది. గద్యశైలికి పద్యశైలికి గొంతభేద ముండును. కర్త; కర్మల క్రమము లేక పోవుటయేగాక, అందుపయోగింపబడెడి పదముల రూపములు ప్రత్యేకార్థములు గలిగి యుండుట పద్య శైలి లక్షణము. ఎంతో పురాతనకాలపు పద్యశైలి గనుక, వేదములందలి శబ్దములకు అర్థములను గ్రహించుటకు, యాస్క ముని రచించిన నిఘంటువుతో గూడిన నిరుక్తము, ఇతరశాస్త్ర గ్రంథములు తోడ్పడును. కనుక ముందు వైదిక పద్యముల (ఛందస్సు) శైలిని విచారింతము.

శైలినిబట్టి వైదిక ఛందస్సులు మూడు తెఱగులు. (1) ప్రత్యక్షము (2) పరోక్షము (3) ఆధ్యాత్మికము. ఫలానా రూపముండిన-చో, ఫలానా వర్గము క్రిందకు జేరునని నిరుక్తము నందు వివరింపబడినది.

నిరుక్తం సప్తమోధ్యాయము దైవత కాండమునందు యిట్లు గలదు :—

తాస్త్రివిధాఋచః ॥ వేదములందలి ఋక్కులు మూడు విధములు.

పరోక్షకృతాః; ప్రత్యక్షకృతాః; ఆధ్యాత్మికశ్చ॥ అవి పరోక్షములు; ప్రత్యక్షములు; ఆధ్యాత్మికములు.

(1) పరోక్షకృతాః =కనుపించని అర్ధములను (2) ప్రత్యక్షకృతాః = కనుపించు అర్ధములను (3) ఆధ్యాత్మికః = జ్ఞానముచే తెలియదగిన ఆత్మ, పరమాత్మల పరమైనవి.

(1) పరోక్షకృతములు:— తత్ర పరోక్షకృతాః సర్వాభిర్నామ భిర్విభక్తిభిర్యుజ్యన్తే ప్రథమ పురుషైశ్చాఖ్యాతస్య ॥ పరోక్షకృతములు (కనుపించని అర్ధములను తెలుపునట్టివి) ప్రథమ పురుషలో అన్ని విభక్తులలో ఆయా క్రియాపదములతో గూడి వుపయోగింప బడుచుండును.

ఉదా. ఇంద్రం వాణీరనూషత ॥ (ఋగ్వే (1-7-1)
వాక్కులతో మాట్లాడునట్టి మీరు ఇంద్రుని ప్రశంసించుడు.

ఇంద్రాయ సామగాయత॥ ఋగ్వే (8/91/1)
ఇంద్రుని కొఱకు సామగానము జేయుడు.

ప్రత్యక్ష కృతములు :— ప్రత్యక్షార్థమును దెలుపునవి.

అథ ప్రత్యక్షకృతాః, మధ్యమ పురుషయోగా స్త్వమితి చైతేన సర్వనామ్నా ॥ మధ్యమ పురుషతో కూడిన మంత్ర

ములు (త్వమ్) - నీవు - అను సంబోధనతో దేవతా వర్ణనగల మంత్రములు ప్రత్యక్షకృతములు. "యుష్మద్యుపపదే సమానాధి కరణే మధ్యమః"॥ అష్టాధ్యాయీ, అ। పా 4. సూ 105.

ఉ దా హ ర ణ,

త్వమింద్ర బలాదధి ॥ ఋగ్వే. (10-153-1)
హే ఇంద్ర! నీవు బలమువలన ఉండి యున్నావు.
త్వమ్ వృషన్ వృషేదసి ॥ ఋగ్వే (10-153-2)
వర్ష కర్తవగు ఓఇంద్ర! నీవు వర్షమును కురిపించు వాడవు.

ఆధ్యాత్మికములు :—

ఆధ్యాత్మిక్య ఉత్తమపురుషయోగాః॥ అహామితి చైతే ససర్వ నామ్నా॥ (అహమ్) నేను అను సర్వనామము, దానిని తెలుపు క్రియగలది-(ఉత్తమపురుష యోగము) గలది- ఆధ్యాత్మికము. (అస్మద్యుత్తమః॥ అష్టా. అ। పా 4. సూ 104.)

ఉ దా హ ర ణ,

అహంభువం వసునః పూర్వ్యః॥ ఋగ్వే (10.48)
నేను వస్తువులకు పూర్వుడను.

ఇవి గాక వేదములందు శపథము; శాపము; భావము; ఉత్పత్తి; విలాపము; నిందా; ప్రశంసార్థములలో గూడ మంత్ర

ములుండును. నిరుక్తములో మధ్యమ పురుషనియమమునద్ద మఱియొక నియమము గలదు. "అథాపి ప్రత్యక్షకృతాఃస్తోతారో భవంతి, పరోక్షకృతాని స్తోతవ్యాని"॥ స్తుతి జేయబడు పరోక్ష పదార్థములు, స్తుతిజేయు ప్రత్యక్షములు గల చోట్ల గూడ మధ్యమ పురుషయగును.

ఇక్కడ దయానంద మహర్షి తమ ఋగ్వేదాది భాష్య భూమికలో యిట్లు తెలిపిరి. "- - పరంతు వైదిక శబ్దవ్యం హారేజడేపి ప్రత్యక్షే మధ్యమ పురుష యోగాసంతి। తత్రేదం బోధ్యం జడానాంపదార్థానాముప కార్థం ప్రత్యక్ష కరణ మాత్రమేవ ప్రయోజనమితి॥ "జడపదార్థములు స్తుతింప బడు నవై యుండగ మధ్యమ పురుష ప్రాప్తించును అను విషయ ములో ఆజడపదార్థముల ఉపయోగమును ప్రత్యక్షము జేసుకొ నుటకే" అని దయానందునిభావము. వేదమునందు ల్లేఖింపబడిన అయాజడపదార్థములను పూజించుటకుగాదు. వాటి ఉపయోగ మును గ్రహించుటకొఱకే"నని దయానందుని ఉద్దేశ్యమైనటుల స్పష్టమగుచున్నది. కాని సాయణాదులు "స్తోతవ్యాః" అన్న చోట "పూజనీయములే" నని తలంతురు. ఇక్కడే సాయణా దులకు, దయానందునకు భేదమెక్కుడుగనున్నది. ఉభయులవాద ములను విమర్శించుటకు శక్తిలేకపోయినను వారిరువురిభావాలను జూచినప్పుడు మనహృదయములలో కలిగెడి అభిప్రాయాలను సవినయముగ పెద్దలముందిడుటలో దోసగేమున్నది.

స్తుతియనగ ఉపాసనలోని ఒకభాగము. ఉపాసన నిరాకారుడగు పరమేశ్వరునిగూర్చి చేయవలెను. అతడు సర్వత్ర వ్యాపించియున్నాడు. నిరాకార పరమేశ్వరోపాసననే వేదములు ప్రబోధించును. కనుక స్తోతవ్యములగు పరోక్షములు; వాటి ప్రయోజనము; ఈశ్వర నిర్మితమైనవగుటచే పదార్థములు, పదార్థప్రయోజనములు, గుర్తింపబడవలసినవేగాని, అవి పరమేశ్వరోపాసన స్థానమాక్రమింపజాలవని దయానందుని అభిమతమైయుండవచ్చును. కాని ఆపదార్థములందలి గుణమును గుర్తించునప్పుడు ఆపదార్థమునకు, దానియందున్న ఈశ్వరనిర్మాణకౌశలమునకు కృతజ్ఞతజూపి, ఆకౌశలమును స్తుతించుట లేక గానముజేయుటలో దోషముండదు. జీవయాత్రగడుపుకొనుటకు పుష్టివంతమైన శరీరమునొసగిన తలిదండ్రులకు బిడ్డ కృతజ్ఞుడై వారిని స్తుతించిన తప్పేమున్నది? ఒక మహానది జడపదార్థమైనను, దానిచే ప్రయోజనముబొందు రైతులనేకులు, ఆమహానదికి కృతజ్ఞులై దానిశక్తిని స్తుతించుటలో దోషమేమున్నది? ఇందు సర్వవ్యాపకుడగు నిరాకారపరమేశ్వరోపాసనకు భంగము రాదు. పైగా ప్రకృతిపదార్థాలను జూచినప్పుడు మనలో మాధుర్యభావము, గుణపాఠములు, వినయము ఉద్భవించుచుండును.

సాయణాదులు పైఅభిప్రాయముతోనే "పరోక్షకృతములగు పదార్థములు పూజనీయము"లని భావించినవో మంచిదే. లేక అనేక తగవులకు దారితీయు ప్రత్యేకపదార్థోపాసనే, అనగ

గుణియొక్క గుణమునే గుణిగాభావించి, గుణిని మరచుటయే వారి లక్ష్యమైనచో అది వివాదాస్పదమగును.

"యజ్ఞము లేక యజ్ఞాంగముయొక్క వర్ణనలో అచ్చటి దేవతయజ్ఞము లేక యజ్ఞాంగమని, యజ్ఞవర్ణనలేని తావులలో పరమేశ్వరుడే దేవతయని తెలుసుకొనవలసినదిగ యాజ్ఞికుల ఉద్దేశ్యము. కాని నిరుక్తకారులు "ఈమంత్రములు (నారాశంస) మనుష్యకర్తవ్యమును తెలుపునవియని యందురు. వేదముల శైలిలో మఱియొకవిషయము.

* కొన్ని మంత్రములకు ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతిక అర్థములుగూడ నుండును.

ఆధ్యాత్మికము= శరీరము; జీవుడు; మనస్సు; ఆత్మ; పరమాత్మ

ఆధిదైవికము= విశాలాకాశమునందలి సూర్యుడు; మరుత్తు; చంద్రుడు; గాలి మొదలైన విశాల జడపదార్థములు.

ఆధిభౌతికము= రాష్ట్రము; ప్రజలు; రాజ్యాంగము; రాజు; సాంఘికవ్యవహారములు; జంతువులు మొదలైనవి.

ఉదాహరణ:-

వాగాంభృణీఋషికా - ఆత్మాదేవతా - త్రిష్టుప్

* దృష్టినిసారించిచూడగ భౌతికమునకు, ఆధ్యాత్మికమునకు విడదీయుటకు వీలులేని సంబంధమున్నట్లు కానుపించుచున్నది.

అహంరుద్రేభిర్వసుభిశ్చరా మ్యహమాదిత్యైరుతవిశ్వదేవైః
అహంమిత్రా వరుణోభాబిభర్మ్యహమింద్రాగ్ని అహమశ్వినోభా
ఋగ్వే (మం 10. సూ 125. మం 1)

సామాన్యార్థము:- (అహం) నేను, (రుద్రేభిః) రుద్రులతోను (వసుభిః) వసువులతోను (చరామి) సంచరించుచున్నాను. (అహం) నేను (ఆదిత్యైః) ఆదిత్యులతోను (ఉత) మఱియు (విశ్వదేవైః) సమస్తదేవతలతోను (చరామి) సంచరించుచున్నాను. (అహం) నేను (మిత్రావరుణోభా) మిత్ర, వరుణులిరువురిని (బిభర్మి) ధారణజేయుచున్నాను. (అహం) నేను (ఇంద్రాగ్నీ) ఇంద్ర, అగ్నులను ధారణజేయుచున్నాను. నేను (ఉభావశ్వినా) అశ్వినీదేవతలిరువురిని ధారణజేయుచున్నాను.

ఆదిభౌతికం:- నేనువీరులతోను, పరాక్రమవంతులతోను సంచరించుచున్నాను. (ఆదిత్యైః) స్వాతంత్ర్యవీరులతో సంచరించుచున్నాను. మిత్రులను, శ్రేష్ఠులను ధరించుచున్నాను. సేనాపతి, రాజు మొదలగువారిని ధరించుచున్నాను. జ్ఞానప్రచారకులను పోషించుచున్నాను. (అశ్వినా) చికిత్స శస్త్రములతోగూడిన వైద్యము ధారణజేయుచున్నాను.

ఆధిదైవికం:- నేను విశాలాకాశమున నుండెడి రుద్రులనెడి పదార్థములతోను, సూర్యకిరణములతోను; భౌతికాగ్నితోను విద్యుచ్ఛక్తితోను కలసిసంచరించుచున్నాను. (అశ్వినౌ) రేయిం

బవళ్ళును; భూమి ఆకాశములను; సూర్య చంద్రులను ధారణ జేసుకొనుచున్నాను.

ఆధ్యాత్మికం:- నేను (రుద్రేభిః) పదివాయువులతోను; శరీరములో నుండెడి వేడితోను, నేత్రములతోను, ఘ్రాణితోను, పోషకశక్తితోను, మనస్సు ఆత్మతోను, (అశ్వినా) శ్వాస, ఉచ్ఛ్వాసలతోను కలసి సంచరించుచున్నాను.

ఆత్మసాధనద్వారా ప్రకృతినంతటిని స్వాధీనము జేసుకొనుట యీ మంత్రములో కాననగును. ఇవిగాక అనేకకూటార్థములుగల మంత్రములుండును. భాష్యకారుల అభిప్రాయములనుబట్టి వాటి అర్థములను గ్రహించవచ్చును.

## వైదిక ఛందస్సులు

వేదములు పద్యరూపములలో నున్నవి. అయితే పద్యరూపములోనే అవి యెందులకుండెనను ప్రశ్న ఉదయించక మానదు. దానికి సంపూర్ణమగు సమాధానమును పొందలేక పోయినను కొంతయోచించినచో ఒక విధమగు కారణము గోచరమగుచున్నది.

ఒక వాక్యము భావగర్భితమై, హృదయమునుండి బయలుదేరి, వినువారి హృదయమున హత్తుకొనపోవునట్లుగ జెప్పబడి అలంకారభూయిష్టమై యుండినచో అది కవిత్వమనబడును. కవిత్వ మిరుతెరగులు. (1) పద్యకవిత్వం, (2) గద్యకవిత్వం. మధురమగు స్వరాలతో సంగీతధ్వనులనుజేర్చి గానము

చేసుకొనుటకు వీలైయుండుటచే గద్యకవిత్వముకంటే పద్యకవిత్వమే మనోహరముగనుండి, పలువురి హృదయాలలోనికి వేగముగజొచ్చి పనిజేయగలదు. కనుక పద్యకవిత్వము వలన శ్రోతలు వెంటనే ప్రభావితులయ్యెదరు. అగ్ని; సూర్య వాయువులను పేర్లుగల మనుష్యులు తమతమ తపోజన్యభావాలను వినువారు వేగముగను, హాయిగను, అర్థము జేసుకొనుటయే ముఖ్యముగ తలంచిరి. అందుచేత పద్యశైలిలోనే వేదములు చెప్పబడెను. అయితే "ఛందశ్శాస్త్రము జనుపకనే వారు వైదిక పద్యములనల్లినారా? లేక వైదికఛందస్సులు జన్మించినతరువాతనే ఛందశ్శాస్త్రము రచింపబడెనా?" అనేదిగూడ ముఖ్యమైనప్రశ్నయే. భాష జనించిన పిమ్మటనే వ్యాకరణ ముదయించును. వ్యాకరణముద్వారా తరువాతతరములవారు భాషకువన్నెచిన్నెలనుదెత్తురు. కాని సర్వసామాన్య ప్రజానీకపు వాడుక భాషయే వ్యాకరణమున కాధారము. కనుక ఛందశ్శాస్త్రము పుట్టుటకు పూర్వమే కవిత్వము నల్లవచ్చును. కొందరుబాలురు చదువుకొనకపోయినను, ప్రాసలతోగూడిన పద్యములవలె అనేక వాక్యాలను గీతాలుగ పాడుచుండుట మన మప్పుడప్పుడు జూచుచుందుము. వైదిక ఛందస్సులతో బరిచయమున్నను, వాల్మీకికి పూర్వమెవ్వరు సంస్కృతభాషలో కవిత్వము నల్లలేకపోయిరను మాట లోకవిదితమేగదా? వాల్మీకి హృదయము నుండి బయటికి వచ్చిన భావోద్గారమే ఆదికావ్యమందలి మొదటి అనుష్టుప్ ఛందస్సు. అట్లే, అతి ప్రాచీన కాలపు భాషయగు వైదిక సంస్కృతమునందు ముందా మువ్వారు మహా

నీయులు తమ హృదయాలనుండి బయల్వెడలే భావోద్గారమును ఆలంకారికముగ జెప్పిరి. అటు పిమ్మటనే ఛందశ్శాస్త్ర మేర్పడి యుండవచ్చును.

పద్యము అక్షరముల లెక్కనుబట్టి యుండును. ఒక సారి జెప్పిన పాదములోనుండు అక్షరములసంఖ్య ననుసరించి, అదే సంఖ్యలో అనేకసార్లు పాదములను (వాక్యాలను) చెప్పినచో అందొక లయ యేర్పడును. ఈ లయను క్రమబద్ధముజేసి అనేక పాదములను జెప్పుచుండినచో పద్యకవిత్వ మగును. కనుక క్రమము దప్పక అక్షరసముదాయపు లెక్కననుసరించి వాక్యసమూహములున్నచో పద్యరూప మేర్పడును. వేదములలో యిట్టి అనేకములైన వాక్యాలు క్రమమైన సంఖ్యానియమములతో గూడి యున్నవి. వాటిని సర్వానుక్రమణిక కారులు ఫలాని వాక్యసమూహానికి, ఫలాని పద్యము లేక ఛందస్సని పేరిడిరి.

వేదములలో నుండెడి ఛందస్సు లన్నిటికి పుట్టినిల్లు గాయత్రీఛందస్సు. దాదాపు దీనినుండియే మిగిలినవైదికవృత్తము లన్నియు జనించినట్లు కానుపించును. పింగళనాగుని ఛందశ్శాస్త్రములోను, సర్వానుక్రమణికలోను ఇదే అభిప్రాయము గలదు. వైదిక ఛందస్సు లన్నిటిలోను ముఖ్యమైనవి యేాభై ఆరు. ఈ యేబది ఆరింటినీ, గాయత్రీ భేదము లనవచ్చును. పింగళ నాగుని ఛందశ్శాస్త్రమునందు ఛందః॥ (2. 1.) అను సూత్రము తరువాత గాయత్రీ॥ (2-21) అను అధికారసూత్రము గూడ గలదు. ఇందు దైవీగాయత్రీ ఒకే అక్షరము గల

దని పింగళనాగుడు తెలుపుచున్నాడు. [దైవ్యేకం, అ2 సూ 3.]

(1) గాయత్రీ (2) ఉష్ణిగ్ (3) అనుష్టుప్ (4) బృహతీ (5) పంక్తిః (6) త్రిష్టుప్ (7) జగతీ, యని గాయత్రీలో యెనిమిది **జాతులున్నవి.** (1) ఆర్షీ (2) దైవీ (3) ఆసురీ (4) ప్రాజాపత్యా (5) యాజుషీ (6) సామ్నా (7) ఆర్చీ (8) బ్రాహ్మీ అని ప్రతిజాతికి యెనిమిది తెగలున్నవి. ఋగ్వేదంలోని మొదటి మంత్రము ఆర్షీగాయత్రీ ఛందస్సులోనిది. సర్వానుక్రమణికలో "త్రిపదా గాయత్రీ" అని యున్నది. ఛందశ్శాస్త్రములో గాయత్ర్యావసవః॥ (అ 3. సూ. 3.) ననుసరించి, గాయత్రీకి యిరువదినాలు గక్షరములు. కనుక సర్వాను క్రమణికలోనే "చతుర్వింశత్యక్షరాగాయత్రీ" అని కలదు. ఛందస్సున కంతటికీ కేంద్రస్థానమగు గాయత్రీచందస్సే ఋగ్వేదమునం దాదిలో నుండుటచేత గూడ ఋగ్వేద మితరవేదములకంటే ప్రాచీనమైనదని తలంచవచ్చును. పింగళనాగుని ఛందశ్శాస్త్రము, కాత్యాయనమహర్షి యొక్క ఋగ్వేదసర్వాను క్రమణిక వైదిక ఛందస్సుల వివరములను తెలుపును.

## అలంకారములు

ఒక వస్తువునుగూర్చి జెప్పునప్పుడు, ఆ వస్తువులో నున్న గుణమును, సమీపములోని మఱియొక వస్తువు యొక్క గుణముతోఁ బోల్చి జెప్పినచో వినువారికి బాగుగా బోధపడును. "అతని బుద్ధి కుశాగ్రమువలె నున్నది" అనగ దర్భ యొక్క చివరి భాగమెంత సూక్ష్మముగను, వాడిగను ఉండునో,

అంత సూక్ష్మగ్రాహియగు బుద్ధియని అర్థము కాని దర్భ యొక్క కొనవలెనే వున్నదని అర్థముగాదు. ఏదేని వాక్యము యొక్క పైరూపమే అలంకారము. ఇట్టి అలంకారములెన్నో కవిత్వమున ప్రవహించు చుండును. ఛందోమయమగు వేదమునందు అలంకారము లుండుట సహజము. వేదములలో గూడ ఉపమా; ఉత్ప్రేక్ష; రూపకము; శ్లేష; అపహ్నుతి మొదలగు అలంకారము లనేకములు గలవు. ఉపమానము, ఉపమేయము, వాచకము, ధర్మము గలగి ఉపమాలంకారము. ఇందు కొన్నిలోపించినచో లుప్తోపమాలంకారమగును. ఇట్లే రూపకాలంకారము మొదలైనవాటిలోగూడ కొన్ని లోపించు చుండును. కనుక ఉపమాన, ఉపమేయ, వాచక, ధర్మములను దెలుసు కొనుచు వేదములలోని అలంకారములను గ్రహించు చుండవలెను.

తద్విష్ణోః పరమమ్పదమ్ । సదాపశ్యంతి సూరయః ।
దివీవ చక్షురాతతమ్॥ ఋగ్వే. (మం 1.సూ 20మం 20)

ఈ మంత్రములో "సూరయః సదా తద్విష్ణోః పరమమ్ పదం పశ్యంతి" విద్వాంసులు వ్యాపకుడైన పరమాత్మ యొక్క ఉత్కృష్టమైన స్థానమును జూచుచుందురు అనునది ఉపమేయము. దివీవ చక్షురాతతమ్=ఆకాశములో కంటిదృష్టి వ్యాపించు నట్లు అనేది ఉపమానము.

## స్వరములు.

వేదమనుట తోడనే స్వరమనుమాటయొకటి వచ్చును. స్వరములేనిదే వేదము నుచ్చరించుట నొక దోషముగ పరిగణింతురు. చదువునప్పుడు ఆయా అక్షరములవద్ద పైకి క్రిందికి, ధ్వనిని వత్తిడిజేయు చుండుటను, వైదికస్వరములలో గమనించవలసిన విషయము. స్వరములతో గలసి వేదమెందుకుండవలెను? స్వరముల వలని ప్రయోజన మేమి? అను విషయము నాలోచింతము.

భావమును వెల్లడించుట కుపయోగపడు సాధనయే భాష. భాషకు భావమునకు మధ్య అభినయ మొక త్రోవ వంటిది. నోటితో మాట్లాడుటకు భాషగాని మాటలుగాని రానట్టి మూగవారు బాహ్య చేష్టలతో తమ భావాలను దెలుపుచుందురు. గొంతుతో నుచ్చరించు ధ్వనులు, చేతిసైగలు, ముఖవికృతులన్నియు అభినయము లేక బాహ్యచేష్టల క్రిందకే వచ్చును. మాట్లాడునప్పుడు వీనిలో మొదటివగు గొంతుసైగలు భాషతో పూర్ణముగ కలిసియుండి, మిగిలిన బాహ్యచేష్టలు గౌణములగును. అభినయములేనిచో భాషలో యిమిడియున్న భావముల నొరులు గ్రహించుట సులభముగాదు. కనుక ప్రతి భాషలోను ఈ ధ్వనికి లేక అభినయమునకు ప్రాధాన్యతగలదు. ఈ ధ్వనులను స్వరము లందురు. ఇవి మిక్కిలి స్వతంత్రము లైనవి. అందువల్లనే పతంజలి మహాముని "స్వయంరాజంతఇతి స్వరాః" అని భాష్యమునందు తెలిపిరి. కనుక ఏ భాషలో

నైనను ఆయా మాటల ఉచ్చారణనుబట్టి (స్వరములను బట్టి) మాటలను అర్థము జేసుకొనుటలో మార్పు కలుగుచుండును. నాటకములలో యీ నియమమును బాగుగ జూడవచ్చును. "తమరు చాలా గొప్పవారే" అను మాటను భక్తితోను; వెక్కిరింతతోను; ద్వేషముతోను; నిశ్చయముతోను అన వచ్చును. అప్పుడు ఆయా అక్షరములపై నిధ్వనులను తేలిక జేయుచు; పెద్దవిగా జేయుచు; ఎత్తుచు; క్రిందికి దించుచు మార్పు జేయుదుము. అనేకార్థములలో ఒకే శబ్దమైనను, దానిపై నుండు ధ్వనుల నొకేరీతిగ నుంచము. బాలురకు మాతృ భాషను నేర్పునప్పుడు ధ్వనిని అలవాటుజేస్తూ పాఠములను నేర్పుచుండుట మనమెరుగుదుము. అంటే యేయే భావము లలో శబ్దములుపయోగింప బడినవో, ఆయా భావములను గ్రహించుకొనుటకే స్వరజ్ఞానము కావలెను.

ఇది మామూలు భాషలన్నిటి విషయము. సంస్కృతము, అందులోను వైదిక సంస్కృతభాష ప్రత్యేకమైనది. సంస్కృతములో అధికపాలు శబ్దాలన్నియు యౌగికములు అనగ ధాతువులనుండి పుట్టినవి-పనినుండి యేర్పడినవి. ధాతువుల స్వరములు పాణినీముని విరచితమగు ధాతుపాఠమునందు గలవు. వీటిపై నాధారపడి సంస్కృతభాషయందలి ఉపసర్గలు, ప్రత్యయములు, ప్రాతిపదికలు; వాటివలన యేర్పడు కారకాది శబ్దములన్నిటికి స్వరనియమ మేర్పడినది. ధాతువులకు, ప్రత్యయములకును గల స్వరములు వేర్వేరైనను, మరల అవి రెండును కలిసిన పిమ్మట యేర్పడు శబ్దమునకు వేరుగ నొక స్వరమేర్ప

డుటను; ఆశబ్దము లుపయోగింపబడు భావమునుబట్టి వాటి స్వరములు మారుచుండుటను అష్టాధ్యాయీ ద్వారా మనము తెలుసుకొన గలుగుచున్నాము.

వేదముల విషయముగూడ యిట్లే వుండును. కాని వాటి శైలి అతి ప్రాచీనము, కవితా శైలియు నగుటచేతను, ఒకే శబ్దమునకు ప్రయోగమునుబట్టి వేర్వేరర్థములు జనించుట చేతను, వైదిక శబ్దముల స్వరములు (ధ్వనులు) కట్టు దిట్టము జేయుబడెను. మహార్షుల హృదంతరాళములనుండి బయల్వెడలిన వైదిక శబ్దములకుగల ఉచ్చారణల నాధారముగ దీసుకొని, వైయాకరణులు స్వరశాస్త్రము నేర్పరచిరి. పెద్ద కాలమునుండి వేదములు లిపిబద్ధములుగాక, శృతిబద్ధములగుటచేత, వ్యాకరణ శాస్త్రము జదువకయే అనేకులు వేదములను ధ్వని చెడకుండ వల్లించ గలుగుచున్నారు. ఇంతేగాక వారు మంత్రమునకు గల పదమునుగూడ వేరే వల్లింతురు. ఈ పదముల వరుసలను తల్లక్రిందుగా జేయుచు ఘన; జట; పనసలను పేరుతో అష్ట వికృతులు జేసి పఠింతురు. వాక్యమునుండి విడదీయబడిన ప్రతి పదము లేక శబ్దముయొక్క ధ్వని మారిపోకుండుటయే అష్ట వికృతుల వలన గలుగు ప్రయోజనము. పెక్కు వత్సరముల నుండి ప్రచారములోనున్న వేదములు అర్థము జెడకుండ ఉచ్చరింప బడుట యీ విధానములో గమనించ వలసిన విషయము. ఈ కృషి జేయుచున్నందుకు వేదములను వల్లించు మహానీయులు వందనీయులు.

అయితే భావము జెడని ఉచ్చారణతో అనగ స్వర యుతముగ వేదములను జదివి, అర్థము దెలుసుకొనక పోయినను, అర్థము దెలుసుకున్న ఫలితము జేకూరునా? అట్లు చేకూర జాలదు. అక్షరములకు; వాక్యములకు; ఆశ్రయభూతమైన పుస్తకములు, వాటికి ఆశ్రయభూతమగు బీరువాలు, స్తవనీయ మైనవే. కాని వాటిలోని అర్థమును అవి గ్రహించి ఫలితము నొందు చున్నవా? నెహ్రూపండితుని ఉపన్యాసమును ఎలెక్ట్రిక్ రికార్డు చేయబడిన ప్లేటుపై భద్రముజేసినా మనుకొందము. కావలసినప్పుడల్లా ప్లేటుద్వారా మనమా ఉపన్యాసమును వినవచ్చును. రికార్డుచేయబడిన ప్లేటుద్వారా వినే ఉపన్యాసాని కిన్నీ, నెహ్రూపండితుడిచ్చిన ఉపన్యాసానికిన్నీ, తేడావుండదు. కాని నెహ్రూ పండితుడిచ్చిన ఉపన్యాసములోని భావము, రికార్డుచేయబడిన ప్లేటుకేమైనా తెలియునా? దానిపని ఉపన్యా సమును రికార్డుచేసి కావలసినప్పుడు వినిపించుటయే. అట్లే కేవలము మంత్రములను వల్లించువారు వేదములను వాస్తవిక ధ్వనులతో భద్రపరుపవచ్చును కాని అర్థము తెలుసుకొనని-చో వారికి ప్రయోజనముండదు. అచ్చుయంత్రములు ప్రబలమైన యీ కాలములో వల్లించుటలోకంటె అర్థమును గ్రహించుటకే ఎక్కువ శ్రద్ధను జూపుట మంచిది. నెహ్రూపండితుడు మాట్లా డినట్లు మాట్లాడక పోయినను; వారి ఉపన్యాసములో యిమిడి యున్న భావమును, అర్థమును గ్రహించి, తదనుగుణ్యముగ జీవించుట ప్రయోజనకారి. వేద మంత్రములను స్వరయుతముగ జదివి, అర్థమునుగ్రహించి, తదనుగుణ్యముగ జీవించుట మంచిదే.

సంగీతశాస్త్రమును తెలిసికొని బాగుగా గానము చేయగలిగి యుండి త్యాగరాజు గీతములను గానముజేసి, అందులోనుండెడి అర్థమును గ్రహించని ఒకవ్యక్తియుండును. త్యాగరాజు గీతము లోని అర్థమునుగ్రహించి తదనుగుణ్యముగ జీవితమును సరిదిద్దు కొనుటకు వేరొకవ్యక్తి ప్రయత్నించును. కాని ఇతనికి గానము చేయుటచేతగాదు. వీరిరువురిలో సార్థకులెవరు? రెండవవారేనని చెప్పకతప్పదు.

స్థాణురయం భారహారఃకిలాభూత్ । అధీత్య వేదం నవిజానాతి యోఽర్థమ్। యోఽర్థజ్ఞఇత్ సకలంభద్రమశ్నుతే। నాకమేతి జ్ఞాన విధూతపాప్మా॥ (నిరుక్తం)

వేదమును జదివి అర్థమును తెలుసుకొనని మనుష్యుడు, కాయలతో బరువెక్కిన చెట్టు, ఆ ఫలితముననుభవించని విధమున, స్థాణువైపోవును. వేదార్థమును తెలుసుకొన్నవాడు, సమస్తకళ్యాణమును పొందును.

స్వరవిధి ననుసరించి నాగరిఅక్షరముల నేర్పరచి ప్రాచీన భారతీయులు మహోపకారమొనర్చిరి. స్వరములకు కావలసి నన్ని అక్షరములుండుటయే నాగరిలిపిలోని మహోత్తమ గుణము. అట్లు లేనియెడల భాషనుచ్చరించునప్పుడు క్రమమేర్ప డక అనేక యిబ్బందులు వచ్చును. ఆంగ్లభాషలోని శబ్దముల స్వరముల ననుసరించి లిపి యేర్పడకపోవుటచేత, శబ్దములను పలుకునప్పుడనేక చిక్కులేర్పడుచున్నవి.

కనుక పరంపరగవచ్చిన స్వరజ్ఞానము; దాని ననుసరించిన నాగరిలిపి వేదమును చదువుటలోను, అర్థము తెలుసుకొనుట లోను తోడ్పడుచున్నవి.

## స్వరముల రూపము :

స్వతంత్రముగ పలుకబడుటచే అచ్చులకు స్వరములని పేరు. కాని స్వరములు ఉత్పత్తినిబట్టి మూడు. (1) ఉదాత్తము (2) అనుదాత్తము (3) స్వరితము. ఏదేని అక్షరస్థానములో, ఒక అచ్చునోటిలోని ఏదేని ఒకస్థానములో వున్నత స్వరముతో పలుకబడునో అది ఉదాత్తమనబడును. అనగా పైకివూపి ధ్వనిని పెంచినచో అట్టిస్వరము ఉదాత్తమనబడును. ధ్వనిని క్రిందికి దించిన ప్రయత్నముతో నుచ్చరింపబడు స్వరము అనుదాత్తమనబడును. ఉదాత్తము, అనుదాత్తము కలసినచో స్వరితమగును.

ఉచ్చైరుదాత్తః। నీచైరనుదాత్తః। సమాహారస్స్వరితః॥

అష్టాధ్యాయీ॥ అధ్యాయం **1** పా **2** సూ **29; 30; 31.**

వేదములలో ఈస్వరములకు గుర్తులుండును. వుదాత్తమునకు అక్షరముపైన యేవిధమగు గుర్తువుండదు. అనుదాత్తమునకు గల గుర్తు అక్షరమునకు క్రింద అడ్డగీటు వుండును. (క॒). స్వరితమునకు అక్షరమునకు పైన చిన్న నిలువు గీటుండును. (క॑న్యా) వైదికపదములకు సాధారణ స్వరనియమములే

గాక కొన్ని ప్రత్యేక నియమములుండును. అవి అష్టాధ్యాయీ లో గలవు.

వరుణః ప్రావితాభువన్మిత్రో విశ్వాభిరూతిభిః కరతాం

నఃసురాధసః ॥ యజుర్వేదం, అధ్యా 33 మంత్రం 46.

పదవిభాగము జేసినప్పుడీ స్వరములు క్రిందిరీతిగా మారును.

వరుణః। ప్రావితేతి। ప్రఽఅవిత । భువత్ । మిత్రః। విశ్వాభిః।

ఊతిభిరి త్యూతిభిః। కరతామ్। నః। సురాధసఇతిసుఽరాధసః।

## వైదికభాష అతి ప్రాచీనమైనది

వేరు వేరు ప్రదేశాలలోని భాషలు వేరు వేరుగ నుండును. మన దేశమునందే లిపిబద్ధమగు భాషలు- వ్రాయుటకు వీలైనవి అనేకమున్నవి. చాలకాలమునుండి వ్రాయుటకువీలైన భాషలు, అట్టిభాషాధారక రాష్ట్రములు ఏబదియారని ప్రతీతి. ఆంధ్ర; కేరళ;కర్నాటక; ఘూర్జర; గుజరాతీ; వంగ-బెంగాలీభాష లీయేబదిఆరులోనివే. ఈ భాషలలో కొంతసామ్యము, కొంత భేదము గానుపించుచుండును. సామ్యమును జూచినప్పుడు వీట న్నిటికి మూలమగు భాషయొకటి యుండవచ్చుననెడి తలంపు, భేదమును గాంచినప్పుడెందుకీ భేదములున్నవా? యనెడి జిజ్ఞాస యు కలుగుచుండును. సంస్కృతముతో సంబంధము కలుగక పూర్వమున్న తెలుగునకు; తరువాత ప్రచలితమైన తెలుగునకు పారసీకభాషతో సాంగత్యము కలిగినతరువాత రూపొందిన

తెలుగునకు; క్రమముగ ననేకరూపములు మారుచూవచ్చినవి. ఉత్తర హిందూస్థానము నందలి భాషలు సంస్కృతముతో సంబంధముగల ప్రాకృత రూపాంతరములైనను, వాటికి అరబ్బీ పారసీకములతో నేస్తము గలిగిన బిమ్మట యింకను క్రొత్తరూపాంతరము లేర్పడినవి. ఈ చిత్రమును గాంచి భాషావిజ్ఞానవేత్తలనేక పరిశోధనలను జేయుచుందురు. ఒకే ప్రదేశమునుండి విడివడిన మనుజులేయైనను వారు నివసించెడి ప్రదేశముల వాతావరణమును బట్టియు, ఆహార వ్యవహారములను బట్టియు భాషాధ్వనులలోను, రూపములలోను మార్పు రావచ్చును. కనుక ఒకేచోటనుండి బయలుదేరిన తెగలలోనే, అనేక మార్పులు వచ్చియుండవచ్చును. భాషావిజ్ఞాన శాస్త్రవేత్తలుగ పతంజలికి పిమ్మట పతంజలివలె కృషి జేసినవారు బహుశా తక్కువగ నుండిరని తోచుచున్నది. దానికి కారణము ఆకాలమున వారికట్టి అవసరము లేకపోయి యుండవచ్చును. కాని 19వ శతాబ్దమునుండి మన దేశీయభాషలనుగూర్చి పాశ్చాత్యులనేకులు పరిశోధనలను సల్పిరి. వారిలో అబ్రహామ్‌గ్రియర్సన్, జాన్‌బీమ్స్ మొదలగువారు ముఖ్యులు వైదికభాషను మాక్సు మిల్లర్, గ్రిఫిత్ మహాశయులు బాగుగ పరిశోధించిరి. ఇటీవలి కాలమునందు, తిలక్ మహాశయుడు, ఆర్. జి. భండార్‌కర్ ఓఝూ; సాంకృత్యాయన్‌లవంటి అనేక భారతీయ పండితులు భారతీయ భాషలనుగూర్చి పరిశోధనలను జేసిరి. "వైదికభాష" ను గూర్చి విచారించుటకు ముందు ప్రపంచ భాషలకును, సంస్కృత భాషకునుగల సంబంధమును తెలుసుకొనుట

యుక్తము. ఆధునిక భాషావిజ్ఞానవేత్తల దృష్టినిబట్టి మధ్యఆసియాలోనే మానవుని పుట్టుకయని, అటనుండియే అనేక తెగలు దేశదేశములందును అలముకొని పోయెననునదొక సిద్ధాంతము. కశ్యపప్రజాపతికి (కాస్పియన్ సముద్రప్రాంతానికి ప్రజాపతి) పురాణకాలంలోగల ప్రాధాన్యతనుబట్టి యీనిర్ణయము కొంత యుక్తముగనే వున్నది. మంగోలియా, టిబెట్ ప్రాంతములలోనే మానవునిపుట్టుక కలిగెనను అభిప్రాయము లేకపోలేదు. టిబెట్ అను ప్రాంతమే ప్రాచీన త్రివిష్టపమని దయానందుడు మొదలైన వైదికవిద్యాపారంగతులు తెలిపిరి. స్వర్గీయ త్రిపురనేని రామస్వామి చౌదరిగారును ఇదే అభిప్రాయము గలిగియుండిరి. టిబెట్‌నుండి ముందుగ భారతదేశమువైపు మళ్ళినవారు ఆదిమవాసులు. తరువాత వచ్చినముఠాలు ఆర్యులై వుండాలి. రావణాసురుని తెగకు, రాముని తెగకు వేదములే ప్రమాణములుగ నుండెను. కనుక ప్రపంచభాషలన్నింటికి మూలక్షేత్ర మొకటై యుండవలెనని యీ నిర్ణయాలనుబట్టి మనము గ్రహించవచ్చును. అందులోను, అతి ప్రాచీన రూపములోనున్న వైదిక సంస్కృతభాష, కనీసము ఆసియా భాషలన్నింటితోనైనను సంబంధముగలదై యుండవచ్చును.

ప్రపంచములోని భాషలన్నియు 12 తెగలుగ విభజింపబడినవి (1) భారతయూరప్ (2) సెమెటిక్ (3) హెమెటిక్ (4) టిబెట్ చైనా (5) యూరల్ ఆల్టైక్ (6) ద్రావిడ (7) మైలో పాలినేషియన్ (8) బంటూ (9) మధ్యఆఫ్రికా (10) అమెరికాభాషలు (11) ఆస్ట్రేలియా పసిఫిక్ ఓషన్ (12)

శేషించినభాషలు. ఈ విభజన Encyclopedia Britenica లోగలదు. సంస్కృతము, పాళీ, జెండ, ప్రాచీనఫారశీ, గ్రీక్, లాటిన్, ఆంగ్లము, ఫ్రెంచి, జర్మనీ, నూతన ఫారసీ, పుష్తూ, యింకనూ భారత దేశములోని కొన్ని ప్రాంతీయ భాషలు భారత ఐరోపా తెగకుచెందినవి. తెలుగు, అరవము మొదలగు ద్రావిడ భాషలకు సంస్కృతమునకు దగ్గరపోలికలు లేకపోవుటచేత, ద్రావిడ తెగను వేఱుజేసిరి. ఇతర దేశములలో బౌద్ధమతము నవలంబించినభాషలన్నియు దాదాపుటిబెట్ చైనా తెగకు చెందినవి.

లౌకిక సంస్కృతమునకును, యూరప్ భాషలకును సంబంధముగలదు. లౌకిక సంస్కృతమునకు; వైదికభాషకు సామ్యమున్నను, భేదముగూడ గలదు. ద్రావిడ భాషలకు సంస్కృత భాషకు దగ్గరపోలికలు లేకపోయినను రావణాసురునకు పూర్వమే దైత్యులనే తెగకూడ వేదముల నభ్యసించి యుండెను. యజుర్వేద శాఖలలో కొన్ని యవన - గ్రీక్ - దేశమునకు జెందియుండెను. కనుక వైదికభాష, ఆసియా అంతటి జనాభాలోని ఒకప్పటి మాధ్యమిక భాషకు జెందియుండవచ్చును. ఋగ్వేదము ప్రథమ మండలము, మొదటి సూక్తములో "త్వామచ్ఛాచరితారః" అనియున్నది. "అచ్ఛావద" అనుమాట అనేకతావులందు గలదు. ఈ అచ్ఛాశబ్దమునకును, అరబ్బీ ఫారసీకశబ్దమగు "అచ్ఛా" కును అర్థములో కొంత సంబంధము గలదు. లౌకిక సంస్కృతములో యీ "అచ్ఛా" శబ్దప్రయోగము కనుపించదు. ఫారశీకుల "జెండవెస్టా" గ్రంథభాషకు

ఋగ్వేదభాషకు దగ్గరసంబంధము గలదు. ఈ కారణమువలన వైదికభాష అతి ప్రాచీనభాషయని తెలుసుకొనవచ్చును.

అనేకదేశముల భాషా శబ్దములు వైదికభాషలో కానుపించుటకు మఱియొకకారణ ముండవచ్చును. ఒక ప్రాంతీయ భాషలో యేదేని కావ్యరచనను గాని, లేక వైజ్ఞానిక రచనను గాని జేయబూనినచో, అందు ప్రజలలో స్థిరముగ ఉపయోగింపబడు శబ్దములే దీసుకొనబడును. అట్లే భిన్న ప్రాంతీయులు కలసి తమ కందరికి కావలసిన రాజ్యాంగచట్టమునో, వైజ్ఞానిక శాస్త్రరచననో, పుస్తక రూపములో రచించ గోరినచో, ఆప్రాంతములన్నింటిలో యెక్కువగ వాడుకలోనున్న భాషను మాధ్యమిక భాషగ గ్రహించి, అందుస్థిరముగ వాడబడు శబ్దజాలముతో, ఆయా విషయములను రచింతురు. ఈ రూపములోనే సంస్కృతభాష జనించెను. అంతకు పూర్వపు భాషయగు వైదిక భాషగూడ, యిట్లే అనేక దేశముల భాషలలో, స్థిరరూపమైన శబ్దజాలముతో గూడిన అంతర్జాతీయ మాధ్యమిక భాషయై యుండవలెను. వ్యాకరణములో పాణినీ పతంజలులు వైదిక ప్రయోగాలకు ప్రత్యేకనియమాలనేర్పరచుట గూడ యిందు కొక నిదర్శనము. వేదముల శాఖ లనేక దేశాలకు జెందియుండుట మరియొక నిదర్శనము (చరణ వ్యూహాములనుబట్టి) వ్యాకరణములో లౌకిక సంస్కృతమునకు సంబంధించినంతవరకు అనేక ప్రయోగాలను, ఫలానా ప్రాంతానికి జెందినవని జెప్పిరి. కాని వైదిక పదములకు

ప్రత్యేకప్రాంత నిర్దేశములేదు. కనుక వైదికభాష అతి ప్రాచీన మైన దనుటకు సందేహాము లేదు.

## యౌగిక యోగరూఢి పదములు

వైదిక భాషలో గమనించవలసిన మరియొక విశేష మున్నది. దేవతాది శబ్దములు, ఇంకా యితరపదములు యౌగిక యోగరూఢిపదములే. ఇవి రెండుగూడ ధాతుజనితములే. ఉపసర్గనిపాతలుదప్ప మిగిలిన పదములన్నియు ఆఖ్యాతజాత ములు, అనగా క్రియావ్యాపారములకు మూలమైన ధాతువుల నుండి (Roots నుండి) జనించినవేనని నిరుక్తకారునిమతము. ఉణాదికోశకర్తయగు శాకటాయనుడుగూడ పద్యములన్నియు ఆఖ్యాత జాతములనియే తెలిపెను. పాణిని పతంజలులు రూఢి వాదులైనను, యీ విధానమునుగాదనలేదు.

"ఉణాదయో బహుళం" అన్నచోట—

నామచధాతుజ మాహనిరుక్తే,వ్యాకరణే శకటస్యచతోకమ్
యన్నపదార్థ విశేషసముత్థం, ప్రత్యయతః ప్రకృతేశ్చత
దూహ్యామ్॥

సంజ్ఞాసుధాతురూపాణి ప్రత్యయాశ్చతతఃపరే।
కార్యాద్విద్యాదనూ బన్ధమేతచ్ఛాస్త్ర ముణాదిషు॥
(మహాభాష్యం.)

అ ౩. పా. ౩. ఆర్చి। సూ ౩.

# వేదాంగములు

శిక్షా, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషము, కల్పములు. ఇవి వేదాంగములుగ పరిగణింపబడును. కాని బ్రాహ్మణములను, ఉపనిషత్తులను, దర్శనములను, భాష్యములనుగూడ వేదాంగములుగ భావించుట యుక్తము. ఎందుకనగ ఇవిలేనిదే నేడు వేదాధ్యయనము కష్టసాధ్యముగ నున్నది. కనుక యీకాలానికి వీటినిగూడ వేదాంగములనుగ పరిగణించవచ్చును. వీటిలోకొన్నిటి వివరములను క్రింద పొందుపరచుచున్నాను.

## శిక్షా :

ఇది వర్ణోచ్చారణ శిక్షాయనబడును. పూర్వము ఉపనయన సంస్కారముతోనే దీనినినేర్పి వేదములను బోధించెడివారు. అక్షరములకు సరియైన ధ్వనులను నిర్ణయించి, ఆ యక్షరముల నెట్లుచ్చరింపవలెనో తెలుపు శాస్త్రము (Phonetic - syllabus) శిక్షాశాస్త్రము. పూర్వము యాజ్ఞవల్క్యుడు మొదలైనవారు యీ వర్ణోచ్చారణ శిక్షలను వ్రాసినట్లు కొన్నిచోట్లగలదు. కాని పాణినీమహాముని రచించిన శిక్షయే నేడు వాడుకలో నున్నది. "పాణినీయం శిక్షా" అను పేరుతోనున్నది మాత్రము పాణినీముని రచించిన గ్రంథము

గాదు. పాణినీ రచించిన కొన్ని శిక్షాసూత్రములను, పతంజలి దెల్పిన కొన్ని శిక్షావిషయాలనుజేర్చి దయానందమహర్షి ప్రకటించినాడు. దానిని చదువుటమంచిది. (గ్రంథ విస్తరభీతిచే శిక్షలోని వివరాలనిట ఉదాహరించుటలేదు. కనుక పాఠకులు క్షమింతురుగాక.)

## వ్యా క ర ణ ము :

ప్రజానీకములో ప్రచలితమై స్థిరరూపముగనుండు ప్రయోగాలను (భాషాప్రయోగాలను) దెలుపుచు వాటికి నియమముల నేర్పరచుటయే వ్యాకరణము. భాష జనించిన పిమ్మటనే వ్యాకరణ ముదయించునుగాని వ్యాకరణముదయించినపిమ్మట భాష పుట్టదు. అట్లు తలంచుటగూడ భ్రమకావచ్చును. నూతనముగ నొక భాషనలవరుచుకొను మనుజుడు, వ్యాకరణ సాయముతో లోకమునందుండు భాషా తీరులను తెలుసుకొనుచు తానాభాషను మాట్లాడునప్పుడుగాని, వ్రాయునప్పుడుగాని, వ్యాకరణసాయమున దొసగులు రానీయక భాషను అందముగ నుంచుకొనును. వ్యాకరణకారుడు సృష్టించిన వ్యాకరణముద్వారా నూతనాభ్యాసము బొందిన మనుజుడు నేర్చుకొన్న భాష, వ్యాకరణములోనిదే గనుక భాషకుమూలము వ్యాకరణమని తలంచరాదు. లోకప్రచలితములుగాని భాషారూపముల నావ్యాకరణకర్త సృజించలేడు. అది యాతని ధర్మముగాదు.

పసిబిడ్డ పుట్టుకతో భాష నెరుగడు. ఆకలియైనప్పు డేడ్చుట; కడుపునిండినప్పుడు సంతసించుటయే అప్పటి యాతని భాష. కాని అతడు పెరిగి పెద్దవాడైనకొద్దీ, పరిసరవాసుల భాషను నేర్చుకొనును. ఇందుకు కావలసిన ప్రథమ శిక్షణ తల్లి వద్దనే. తల్లి తన బిడ్డకు తానుపయోగించు పదజాలమును, వాక్యములను నేర్పుచుండును. బిడ్డ నేర్చుకొనుచుండును. కాని ఆబిడ్డడు పలుకు ఉచ్చారణలో దోషముండినగాని, భావ మును గ్రహించుటకు వీలులేని మాటలు పలికినప్పుడుగాని, అతనితల్లి ఆపలుకులను సరిదిద్దుచు, భావమును స్పష్టముగ దెలుసుకొనుటకు వీలైనట్టి వాడుకలోనుండు మాటలనునేర్పి, తప్పులను సరిజేయుచుండును. ఈ సరిజేయుటనే వ్యాకరణమన వచ్చును. అతడు ముందు తల్లిచెంత భాష లేక - పదజాలమును నేర్చుకొని, పిమ్మట వ్యాకరణము నభ్యసించు నన్నమాట. కనుక భాషకు పిమ్మట వ్యాకరణముదయించును. ప్రతిమాన వుడు ప్రారంభదశలో తన మాతృభాషకై తల్లిచెంతనే కొంత వరకు వ్యాకరణము నభ్యసించుచున్నాడు. కుటుంబములో బిడ్డకు తల్లి వ్యాకరణ కర్తయైనట్లు, సమాజమునకు భాషలోని క్రమమును, తీరులను తెలుపువారు వ్యాకరణ కర్తలు లేక వైయ్యాకరణులు నగుదురు. కనుక వ్యాకరణమును శబ్ద శాస్త్రమనిగాని, శబ్దానుశాసనమనిగాని యందురు. తల్లినేర్పు చుండు శబ్దజాలమును నేర్చుకొనుట బిడ్డకు లక్ష్యము. తల్లి తన బిడ్డకు శబ్దజాలపు వాస్తవరూపములను, నియమాలను తెలు పుట లక్షణము లేక సాధనయగును. ఇట్లే వేదములందలి పదము

లకు వ్యాకరణమునకుసంబంధముగలదు. లక్ష్యము శబ్దజాలము. లక్షణము వ్యాకరణములోని సూత్రము. లక్ష్య లక్షణములను గూర్చిపతంజలి యిట్లు తెలిపియున్నాడు.

లక్ష్యంచలక్షణం చైతత్సముదితం వ్యాకరణంభవతి।
కింపునర్లక్ష్యం, కింవాలక్షణమ్॥

శబ్దోలక్ష్యః, సూత్రంలక్షణం॥ (వ్యాకరణ మహాభాష్యం) అధ్యా। పా। ఆహ్ని। 'శబ్దోలక్ష్యః, సూత్రం లక్షణం' అనుట చేత వ్యాకరణముయొక్క లక్ష్యము శబ్దజాలమును సరిగ్రహించుటయని, అట్లుగ్రహించుటకు సూత్రములు లక్షణములని - సాధనములని తెలియుచున్నది. శబ్దముల వాస్తవిక రూపమును దెలుసుకొన్నచో వాటికి భిన్నమైనవన్నియు, అపశబ్దములని యాతడు గ్రహించగలడు. ప్రత్యేకముగ అపశబ్దములను తెలుసుకొనబనిలేదు. "యోహిశబ్దాన్ జానాత్యపశబ్దానప్యసౌజానాతి" అని మహాభాష్యకారుడు తెలిపెను. అనగా యెవడు శబ్దములను తెలుసుకొనునో అతడు అపశబ్దములను గూడ దెలుసుకొనగలడని యర్థము. మఱియొక తావున పతంజలి మహాముని "వైదిక లౌకిక పదముల వాస్తవికతను తెలుపు సాధన వ్యాకరణము"ని నిర్వచించిరి.

సంస్కృతభాషలో, షుమారు యెనిమిది వ్యాకరణములున్నట్లు దెలుపుదురు. నేడు రెండుమూడే గానవచ్చుచున్నవి. వాటిలోను పాణినీ వ్యాకరణమే సర్వసమ్మతమై

వైదిక లౌకిక పదములను గ్రహించుటకు సాధనమై యున్నది. ఈ వ్యాకరణములో వైదిక లౌకిక ప్రయోగము లెక్కుడుగ వివరించబడెను. పాణినీముని సృజించిన ప్రత్యాహార అధ్యాహార విధానములు సర్వ కాలములకు ఆశ్చర్య జనకములై యున్నవి. అచ్చులు, హల్లులు, అని మనము వ్యవహరించు పేర్లు పాణినీ రచించిన "అ ఇ ఉ ణ్" మొదలు 14 సూత్రములలో నుండి ప్రత్యాహారపద్ధతితో గ్రహించ బడినవే. కాత్యాయనుడు పాణినీ సూత్రములకు వార్తికము రచించెను. అనగా, సంస్కృతభాషలో పాణినీ ముని సూచించిన శబ్ద ప్రయోగములేగాక, ఇతరత్ర గల ప్రయోగాలను; పాణినీముని విధించిన నియమాలు పాణిని తెలిపిన తావులందేగాక అన్యత్ర గూడ పనిజేయునట్టి సందర్భములను జేర్చి ఆయా సూత్రముల వద్ద వార్తికములను రచించెను. ఈ అష్టాధ్యాయీకి వార్తికముతో కలిపి పతంజలి మహాముని భాష్యమును వ్రాసెను. పాణినీ; కాత్యాయన; పతంజలులు వ్రాసిన అష్టాధ్యాయీ, వార్తిక, మహాభాష్యములతో కలిపి వ్యాకరణశాస్త్రమును జదివి వైదిక లౌకిక పదజాలమును సులభముగ గ్రహించుచున్నారు. పతంజలి యోగదర్శన కారుడగుటచేత ఆయన రచించిన మహాభాష్యము గూడ యోగసాధన వల్లనే సిద్ధమైనదానివలె బహుకట్టుదిట్టముగ నుండి; మొదటినుండి చివరివరకు అతి సహజముగ వ్యాకరణ విషయమును బోధించుచుండును. ఈ మహానీయుని వ్యాకరణ మహాభాష్యము, అనేక హేతు వాదములతోను; శాస్త్ర ప్రమాణములతోను; వైజ్ఞానిక మనస్తత్వ విషయా

లను ఉదాహరించుటతోను కూడియుండుటచే, దీనిని జూచు కొని మన దేశము ప్రపంచముయెదుట తన ప్రత్యేకతను చాటు కొనుటలో ఆశ్చర్యము లేదు.

## అష్టాధ్యాయీ :

పాణినీముని రచించిన వ్యాకరణశాస్త్రమును "అష్టాధ్యాయీ" యని యందురు. ఎనిమిది అధ్యాయములతో గూడియుండుటచే, దీనికీ పేరువచ్చినది. ప్రతి అధ్యాయమునకు నాలుగు పాదములుండును. "అథశబ్దానుశాసనమ్" అను సూత్రమునుండి "హల్" అను సూత్రము వరకు అక్షర సమామ్నాయమైయున్నది. "వృద్ధిరాదైచ్" అను సూత్రముతో ప్రారంభమై "అ అ" అను సూత్రముతో ఎనిమిది అధ్యాయములు పూర్తియగుచున్నవి. ఆదిసూత్రమగు "అథశబ్దానుశాసనమ్" పతంజలివిరచితమని కొందరును, పాణినీముని విరచితమే నని కొందరును భిన్నాభిప్రాయములు గలిగియున్నారు. ఆర్షేయ శాస్త్రి సంప్రదాయాను సారముగ "అథశబ్దానుశాసనమ్" అనెడి సూత్రము పాణినీ రచితమే అయివుండవచ్చునని తల చుట బాగుండునని నాయుద్దేశ్యము. దయానందమహర్షికి పూజ్యగురువర్యులగు విరజానందమహర్షి అంధుడయ్యు, షుమారు తన శతసంవత్సర ఆయువును, అష్టాధ్యాయీ; మహాభాష్యముల ప్రచారములోనే వినియోగించెను. అష్టాధ్యాయితో వ్యాకరణమును చదువు అలవాటును ఎంతోకాలము నుండి మన దేశమున మానివేసిరి. ఈస్థితివలన విరజానందుడు

మఃఖితుడై; తానొక ప్రయోగవిధులను ఉదహరించు వ్యాకరణగ్రంథమును రచించియు, దానిని ప్రకటింప నిరాకరించెను. వారి తరువాత దయానందమహర్షి అష్టాధ్యాయితోనే ప్రారంభించి వ్యాకరణమును చదువుకొనుటకు సులభముగ నుండుటకై "అష్టాధ్యాయీ భాష్యమ్" అను గ్రంథమును రచించెను. కాని ఇందు మూడవ అధ్యాయమువరకే భాష్యము గలదు. ఈగ్రంథములో జయాదిత్యుని కాశికావృత్తిపైన అక్కడక్కడ విమర్శనగూడ గలదు. కాని మహాభాష్యమును అధ్యయనము జేయుటకు పూర్వము "దయానందుని అష్టాధ్యాయీభాష్యమ్" చదివి జయాదిత్యుని కాశికావృత్తినిగూడ పఠించినచో మిక్కిలి ప్రయోజనముండునని అనుభవముద్వారా తెలియుచున్నది.

## మహాభాష్యం:

మహాభాష్యం విశాలమైనది. ఇది ఆహ్నికముల రూపములోనున్నది. అష్టాధ్యాయిలోని ప్రథమాధ్యాయం ఒకటవ పాదంవరకు తొమ్మిది ఆహ్నికములు గలవు. ఈ భాగమును నవాహ్నికమందురు. ఈ భాష్యమును జూచినచో పతంజలి ప్రతిభ అనల్పమని బోధపడకమానదు. నవాహ్నికములో అనేక ధార్మిక, వైజ్ఞానిక విషయాలను బోధించిరి.

కాశికావృత్తియేగాక భట్టోజీ దీక్షితుని కౌముదీగూడ దేశములో మిక్కిలి ప్రచారమునందున్నది. పాణినీసూత్రముల నాధారముగ దీసుకొని కొంతవరకీ కౌముదీస్వతంత్రముగ

నడచిన గ్రంథమున వచ్చును. ఇందలి ప్రకరణ విభాగము బాగుండును.

## నిరుక్తం:—

పుస్తకరూపములో ఇది రెండుభాగములు. ఒకటి వైదిక నిఘంటువు. రెండవది నిరుక్తము. నిఘంటువులోని పదజాలమునకు విశేషపూర్వకమైన వ్యాఖ్యాన రూపము నిరుక్తము. ఛందస్సులనుండి అనేకశబ్దములను ఒకచో జేర్చి, ఏకార్థమును దెలుపు శబ్దాలను; అనేకార్థములను తెలుపు శబ్దాలను; పట్టికలుగ యేర్పరచుటయే వైదిక నిఘంటువు. ప్రాచీన కాలమునుండి యాస్కమునిరచించిన నిరుక్తము వేదాంగములలో ఒకటిగ పరిగణింపబడుచు, ఋగ్వేదాధ్యయనములో ఒకభాగముగ యెంచబడుచున్నది.

వేదమునకు వ్యాఖ్యానరూపమగు మంత్ర బ్రాహ్మణ మున్నది గదా ? మఱి నిఘంటు వెందులకని అడుగవచ్చును. ఒకపద్యానికి అనేకులు వ్యాఖ్యలు వ్రాయవచ్చును. అంత మాత్రముచేత ఆపద్యాలను చదువుకునేటప్పుడు నిఘంటువు యొక్క (Dictionary) అవసరము లేదట్లా? ఒకవేళ వ్యాఖ్యానములలోని కొన్ని ఆధారములను నిఘంటు రచయితలు నిఘంటువులలో ఉదహరించ వచ్చును. వ్యాఖ్యానము జదువునప్పుడు వ్యాఖ్యానకారుని హద్దులోనే సంచరించె దము. దాదాపు బుద్ధిని ఉపయోగించ వలసిన తరుణ ముండక

పోవచ్చును. కాని నిఘంటువు సాయమున పద్యములందలి పదములలోని అర్థములను గ్రహించునప్పుడు, బుద్ధి ప్రయోజనము; స్వతంత్రశక్తి; పురుషప్రయత్నము అధికమగును. ఒక్కమాటలో చెప్పాలంటే వ్యాఖ్యానాలకంటే నిఘంటువులే పాఠకులకు స్వేచ్ఛనొసగి, శబ్దాన్వయము జేసుకొనుటకు శక్తిని పెంచుచు, మహనీయుల వాక్యాలకు దేశకాలముల ననుసరించి ధర్మబద్ధమైన అన్వయము జేసుకొనుటకు బుద్ధికి అవకాశ మొసంగుచున్నవి. అంతమాత్రముతో వ్యాఖ్యానములను అవహేళన చేయాలని అర్థముగాదు. ఒకే వ్యాఖ్యాత ఒకే పద్యమునకు కాల భేదమువల్ల అనేక వ్యాఖ్యానములను గూడ జేయవచ్చును.

కనుక వేదమునకుగూడ నిరుక్తము ప్రధానమైయున్నది. పాఠకునికి స్వతంత్ర మొసగి, పురుషార్థమును పెంచుకొనుటకు అవకాశమొసంగు చున్నది. మూఢనమ్మకాలకు, అంధవిశ్వాసాలకు అవకాశమొసంగదు. కాని దురదృష్టవశాత్తు భాష్యాలను వ్రాసేటప్పుడు నిరుక్తమును దయానంద మహర్షి తప్ప పాశ్చాత్య భాష్యకారులగు మాక్సుమిల్లర్, గ్రిఫిత్ మొదలైన పండితులుగూడ ప్రధానముగ తీసుకొనలేదు. వైదికనిఘంటువు-నిరుక్తము వేదార్థమును గ్రహించుటకు ప్రధానాంగములలో చేరినదా? లేదా? అని తర్కవితర్కములలో పడుటకంటే దానిని దేశభాషలలోనికి అనువదించినచో దాని ఆవశ్యకత యెట్టిదో పాఠకులే ఊహించుకొనగలరు. కాని తెలుగునాడు యీసత్కార్యమునకెప్పుడు నోచుకొనునో తెలియదు!

## వై దిక ని ఘం టు వు

నిరుక్తానికి మూలమగు వైదికనిఘంటువునకు 5 అధ్యాయములున్నవి. 1 వ అధ్యాయమునకు 17 ఖండములున్నూ, 2 వ అధ్యాయమునకు 22 ఖండములున్నూ, 3 వ అధ్యాయమునకు 30 ఖండములున్నూ, 4 వ అధ్యాయమునకు 3 ఖండములున్నూ, 5 వ అధ్యాయమునకు 6 ఖండములు మొత్తము 78 ఖండములు గలవు. వేదములోని కఠినపదములను ఆయా ఖండములుగ నేర్పరచి, ప్రతిఖండములోని పదములన్నియు ఫలానా అర్థములో నుపయోగింపబడినవని తెలుపబడును. వీనిలో పదనామములు మినహా తక్కినవన్నీ, నైగమ; నైఘంటుకకాండలనే పేరుతో నిరుక్తమునందు వ్యాఖ్యచేయబడినవి. పదనామములకు దైవతకాండలోనే ప్రధాన స్థానముగలదు. ఈ వైదిక నిఘంటువుద్వారా యౌగిక, యోగరూఢిపదములలోనుండియున్న అతి ప్రాచీనమగు వైదిక వాఙ్మయమును గ్రహించవచ్చును. నిఘంటువులోని ఒక ఖండమును మచ్చునకు జూడుడు.

అద్రిః। గ్రావా। గోత్రః। బలః। అశ్నః। పురుభోజాః। బలిశానః। అశ్మా। పర్వతః। గిరిః। వ్రజః। చరుః। వరాహః।శమ్బరః। రౌహిణః రైవతః। ఫలిగః। ఉపరః। ఉపలః। చమసః। అహిః। అభ్రమ్। వలాహకః। మేఘః। దృతిః। ఓదనః। వృషన్ధిః। వృత్రః। అసురః।

కోశః॥ ఇతిత్రింశన్మేఘనామాని॥ పై ముప్పది శబ్దములు మేఘము పేర్లు.

## నిరుక్తము

నిఘంటువులోని పదముల ఉత్పత్తులను, వాటి ప్రయోగములను ఉదాహరణసహితముగ నిరుక్తము తెలుపుచుండును. నిరుక్తమును నిఘంటుభాష్యమని కూడ జెప్పవచ్చును. కశ్యపుడు రచించిన, నిఘంటువునకు యాస్కముని నిరుక్తమును వ్రాసెను. కాని దయానందమహర్షి మాత్రము నిరుక్త, నిఘంటువుల రెంటిని యాస్కమహాముని యే రచించెనని దెలిపినాడు.

నిరుక్తము 12 అధ్యాయములుగ విభజింపబడినది. మొదటి ఆరుఅధ్యాయములకు పూర్వషట్కమని, చివరి ఆరు అధ్యాయములకు ఉత్తరషట్కమని పేరు. ప్రతి అధ్యాయము లోను కొన్ని ఖండములుండును. నైఘంటుక కాండము, నైగమ కాండము దైవతకాండము అనుమూడు కాండములుగ నిరుక్తములోని 12 అధ్యాయములున్నూ విభజింపబడినవి. ఆయాకాండలలో నిర్వచింపబడిన కొన్ని శబ్దముల ఉదాహరణము :—

(1) నైఘంటుక కాండలో

ఆదిత్యశబ్దం. { ఆదిత్యః కస్మాత్ ? ఆదత్తే రసానాదత్తే భాసం [జ్యోతిషామ్।

ఆదీప్తో భాసేతివా। అదితేః పుత్రఇతివా ॥

మేఘశబ్దం- మేఘఃకస్మాత్ మేహతీతిసతః ॥ (తడుపు గుణ ముండుటవల్ల మేఘశబ్దము యేర్పడినది.)

నదీశబ్దం- నద్యఃకస్మాత్ ? నదనాభవంతి శబ్దవత్యః॥ శబ్దముతో గూడినవై యుండుటచే నదులని పేరు వచ్చినది.

(2) నైగమకాండలో

సంవత్సర శబ్దం :— సంవత్సరం సంవసన్తేఽస్మిన్భూతాని॥
వర్షము వర్షా వర్షత్యాసు పర్జన్యః॥

(3) దైవత కాండలో,

వరుణశబ్దం :— వృణోతీతి సతస్తస్యైషాభవతి॥

నిరుక్తమునందు యివ్వబడిన ఉదాహరణములన్నీ ఋగ్వేదములోని ఋక్కులే. విక్రమశకము షుమారు 687 వ సంవత్సరములో దుర్గాచార్యుడు నిరుక్తమునకు "ఋజ్వర్థ వ్యాఖ్యా" అను పేరుతో నొక వ్యాఖ్య రచించెను. నిరుక్తము జదువునప్పు డీవ్యాఖ్యనుగూడ కలిపి చదువు కొన్నచో వైదిక శబ్దముల తీరులు బాగుగా తెలియును.

## ఛ ం ద స్సు :

వేదాంగములలో ఛందస్సుగూడ నొకటియైయున్న ది. పింగళనాగుడు రచించిన ఛందశ్శాస్త్రమే వేదాంగములలో

నొకటిగా గణింపబడుచున్నది. ఈ శాస్త్రములో వైదిక లౌకిక ఛందస్సుల వివరణము, వాటి లక్షణములు సోదాహరణము లుగ నీయబడినవి. పింగళనాగుని ఛందశ్శాస్త్రమునకు 8 అధ్యాయములుగలవు. ప్రథమాధ్యాయమునుండి 4 వ అధ్యాయము 7 వ సూత్రమువరకు వైదిక ఛందస్సులనుగూర్చి విశేషముగ తెలుపబడినది.

కల్పము :

నిరుక్త వ్యాకరణములంత ప్రధానము గాకపోయినను, మంత్రాల ప్రయోగాలను వివరించుటచేత, ఆయాసంస్కార సమయాల్లో ఉపయోగింపబడే మంత్రములను తెలుసుకొని వాటిని సందర్భానుసారముగ అన్వయము జేసుకొనుటకు వీలై యుండుటచేత, కల్పమును వేదాంగములలో జేర్చిరి. శ్రౌత, గృహ్యసూత్రములను భేదముతో కల్పము, యిఱు తెఱగులు. గర్భాదానము మొదలు అంత్యేష్టివరకును గల సంస్కారములను దెలుపునవి గృహ్య సూత్రములు. యజ్ఞవిధులను, వృత్తి నియమాలను; సంఘమునకు వ్యక్తికి గల బాధ్యతలను దెలుపునవి శ్రౌతసూత్రములు.

స్మృతులుగూడ కల్పములవలెనే శ్రౌత, గృహ్య కర్మలను; రాజ్యాంగ నియమాలను విధించుచూ కల్పానుగుణ్యముగ నడచుచుండును. అందుచేత కల్పమును జదువునప్పుడు స్మృతులనుగూడ కలిపి చదువుదురు. కల్పములు, స్మృతులు

అన్నీ ఒకేతీరున, నియమాలను బోధించవు. కాలానుగుణ్య ముగ నియమములు మారిపోవుటను వీనిలో గమనించవచ్చును. శీతాతప బాధలనుండి కుటుంబమును రక్షించుకొనుటకు యిల్లు కట్టుకోవలెను. ఒకప్పటి విజ్ఞానాన్నిబట్టి పూరిగుడిసెలోనే కుటుంబము నివసించి యుండవచ్చును. సౌకర్యమును వృద్ధిజేసు కొను శక్తి పెరిగిన కొలదీ, శిమెంటుతో నిర్మాణమైన యింటి లో, విద్యుద్దీపముల అలంకారములతో సహా, మానవుడు నివ సించును. ఎప్పుడో పూరిగుడిసెలో కాపురమున్నామను కార ణంతో నేడుగూడ, పూరిగుడిసెలోనే కాపురముండాలని; శిమెంటు భవనములో కాపురముండుట నిషేధమని; ఎవ్వరును తలంచరు. చలిబాధలేని దేశాలలో, కొద్దిపాటి వస్త్రముల తోనే కాలము గడుపుకొందుము. కాని చలిబాధ ఎక్కువగగల దేశాలలోనికి వెళ్ళినచో చర్మములను గూడ ధరించవలసినదే. బాపూజీ ప్రార్థనసమయంలో నిశ్శబ్దముగ నుండవలెనని కోరి యుండెను. కాని వస్తూత్పత్తిని యెక్కువ జేయవలసిన అవసర మునుబట్టి వినోబాజీ ప్రార్థనసమయంలో గూడ తునాయి; నూలుదీయు కార్యక్రమముల నేర్పరచినారు. ఇట్లు దేశకాలముల ననుసరించి ఆచారవ్యవహారములను మార్చుకొనుటకే మనకు బుద్ధి లేక వివత్తుతాజ్ఞాన మీయబడినది. ఇట్టి బుద్ధిని మాన వుడు వినియోగించుకొనవలసిన ఆవశ్యకము కల్పములను,స్మృతు లను జూచినచో బోధపడగలదు. ఆచార వ్యవహారాలను, మూలధర్మములను వదలక - దేశకాలముల ననుసరించి మా

ర్చుకొనుటకు కల్పములు, స్మృతులు అడ్డురావు. ఎందుకనగ అవియన్నియు కలిసి ఒకే ఆచారనియమాన్ని విధించలేదు.

కశ్యప, అగ్నివేశ, జాతుకర్ణ, ఆలంబాయనులను వారు కూడ కల్పములను వ్రాసినట్లు పురాణములలో కనుపించును. కాని నేడు ఆశ్వలాయన, ఆపస్తంబగోభిల, పారస్కర కల్పములే ప్రచారములో నున్నవి. వీటి శైలి మనోహరమైనది.

కల్పసూత్రములు, స్మృతులు నియమాలను బోధించుతీరులు-

షష్ఠేమాస్యన్న ప్రాశనమ్॥ ఘృతౌదనం తేజస్కామః ॥
దధి మధుఘృత మిశ్రిత మన్నం ప్రాశయేత్॥ ఆశ్వ గృ.
(1.16.1-3.)

"బిడ్డకు ఆరవ మాసమున అన్న ప్రాశన జేయవలెను. తన బిడ్డ తేజస్సంపన్నుడుగా నుండగోరినచో, నేతితోగాని లేక నెయ్యి-తేనె-పెరుగుతోగాని అన్నమును కలిపి బిడ్డనోటి యందు ప్రాశన జేయవలెను."

దహన సంస్కారమునందు,

ద్వివర్ష ప్రభృతిప్రేతమా స్మశానాత్సర్వేఽనుగచ్ఛేయుః॥
యమగాథాంగాయంతో, యమసూక్తంచజ పంత
ఇత్యేకే॥

పారస్కర. గృ. కాం 3. కండి 10 సూ 8-9.

"శవము వెంట, రెండు సంవత్సరముల వయస్సునిండిన వారు మొదలు అందరును స్మశానము వరకు వెళ్ళవలెను. వారు (ఋగ్వేదములోని) యమ సూక్తమును చదువుచు లేక సామవేద ధ్వనులతో గానముఁజేయుచు, శవము వెంట వెళ్ళ వలెనని కొందరు ఆచార్యులు చెప్పుచున్నారు."
వివాహ సంస్కారములో,

> శమీపలాశమిశ్రాంశ్చ లాజాంశ్చతురంజలి మాత్రాన్ సూర్పేణో పసాదయన్తి పశ్చాదగ్నేః॥ గోభిల. గృ.
> ప్ర 1-కం 10 సూ 15.

(జమ్మి ఆకులతో కలసి యున్న పేలాలను నాలుగు దోసిలులకు సరిపడునన్ని - అగ్నివద్ద చేటలో నుంచెదరు.)

> సకృత్సంగహీతం లాజానామంజలి భ్రాతా, వధ్వాం జలావా
> పవతి॥ గోభిల గృ. ప్ర 2. కండి 2. సూ. 5॥

మొదటి పర్యాయము దోసిలినిండ దీసుకొన్న పేలాలను వధువు యొక్క సోదరుడు ఆమె దోసిలిలో పోయును.
స్మృతుల తీరు :-

> శూద్రో బ్రాహ్మణతామేతి, బ్రాహ్మణశ్చైతి శూద్రతామ్॥
> క్షత్రియాజ్జాత మేవంతు విద్యాద్వైశ్యాత్తథైవచ॥
> మను. అ 10. శ్లో 65.

(శూద్రుడు బ్రాహ్మణత్వమును, బ్రాహ్మణుడు శూద్రత్వము నుబొందును. ఇట్లే క్షత్రియ వైశ్యులకు జనించినవారుగూడ వృత్తినిబట్టి ఆయా కులముల వారయ్యెదరని భావము.)

కల్పములలోను, స్మృతులలోను కొందరకు మంత్రరహితముగ కర్మలు విధింపబడినమాట నిజమే. వేదాది జటిలవాఙ్మయమేగాక, సామాన్య సంస్కృతమునుగూడ చదువుకొనుటకు వీలులేక కేవలము చేతిపనులవంటి వృత్తులతోనే జీవించువారికి అర్థముగాని భాషలో మంత్రములుజెప్పి భావ, భాషా బానిసత్వాలకు వశంచేయుట మంచిదిగాదు. కేవలము సేవావృత్తిలో నుండువారే శూద్రులని ప్రాచీనకాలమున ఋషులుజెప్పుచుండిరి. అంతేగాని పుట్టుకనుబట్టిగాదు. కనుక వారి సౌకర్యము కొఱకట్లు జేసియుండవచ్చును. భావమును గ్రహించక భాషను మాట్లాడుటవల్ల మనుష్యునకు రసానుభూతిగలుగదు. అందులో పవిత్ర సంస్కార సమయాల్లో అట్లుచేయుట భాషా బానిసత్వమగును. కనుక సంస్కృతం తెలియనిచో తెలుగుమాటలలో ప్రమాణములు పలుకుటయే సర్వోత్తమము.

భా ష్య ము లు :

భాష్య సాయములేనిదే కొందరు మహనీయులు వేదాధ్యయనము జేయగలిగి యుండవచ్చును. కాని సర్వసామాన్యముగ, యీనాడు భాష్యముల సాయములేనిదే వేదాధ్యయనము సాధ్యమగుటలేదు. భాష్యకారులలో అభిప్రాయ భేదము

15]

లున్నను, వైదికశైలి మాత్రము భాష్య సాయముననే మనకు బోధపడుచున్నది.

దేవస్వామి, స్కందస్వామి, ఉవటాచార్యుడు, భట్ట భాస్కరుడు, సాయణుడు, రావణుడు, మహీధరుడు, దయానందుడు వీరందరు భాష్యకారులే. (1) స్కందస్వామి, సాయణ, మహీధర, దయానంద, ఉవటాచార్య భాష్యములు ప్రస్తుతము వాడుకలోనున్నవి. ఇవిగాక గ్రిఫిత్, మాక్సుమిల్లర్ వంటి యూరోపియనులు రచించిన భాష్యములు గలవు. వీటిలో దయానంద భాష్యమే నిరుక్తమునకు ఎక్కువసంబంధము కలిగియున్నది.

వేదముల ననువదించిన పాశ్చాత్యులలో గ్రిఫిత్ మహాశయుడు ముఖ్యుడు. వీరు తమకుపూర్వపు పాశ్చాత్యవైదిక పండితుల అభిప్రాయాలనుగూడ తిరస్కరించలేదు. అందులోను ప్రఖ్యాత వృత్శాస్త్రజ్ఞుడు, వైదికవిజ్ఞాన పరిశోధకుడునగు ప్రొఫెసరు వెబర్ మహాశయుడు రచించిన "Indische studien" అను మహత్తర గ్రంథము గ్రిఫిత్ మహాశయుని వేదానువాదమునకు, భాష్యమునకు తోడ్పడినది. కనుక గ్రిఫిత్ మహాశయుడు ఆధిదైవిక, ఆధిభౌతిక, ఆధ్యాత్మిక అన్వయాలను పాశ్చాత్యులలోకెల్ల బాగుగా చేయగలిగెను. కాని

---

(1) పండిత భగవద్దత్తగారి అభిప్రాయము.

భారత దేశములో చాలకాలమునుండి విశేష ప్రచారములో నున్న ఊహాకల్పిత దేవతలను - సిరు క్రమునకు విరుద్ధమైనవి - ఉటంకించుటను గ్రిఫిత్ మహాశయుడు మానియుండినచో పాఠకులకు స్పష్టమైనదారి కానుపించియుండెడిది. అప్సరస శబ్దమునకు గ్రిఫిత్ మహాశయుని నిర్వచనమును ఉదాహరణముగ జూడ వచ్చును.

అనవద్యాభిః సముజగ్మ ఆభిరప్సరాస్వపిగన్ధర్వ ఆసీత్।
సముద్ర ఆసాంసదనం మఆయుర్యతః సద్యఆచపరాచయంతి॥

అధర్వ కాం 2-సూ 2 మం 3.

ఈ మంత్రములో "అప్సరాస్వపిగన్ధర్వ ఆసీత్" అనగా అప్సరసలతో గన్ధర్వుడుండెను అను వాక్యములో "అప్సరసలు" "గన్ధర్వుడు" అను శబ్దములకు గ్రిఫిత్ మహాశయుడీ క్రింధివిధముగ అన్వయము జేసెను.

Apsarases: (perhaps from ap, water, and Sri, to go) celestial nymphs who dwell among the clouds, the waters of the sea of air, the consorts of the Gandhrva or of the class of Gandhrvas.

Atharvaveda Vol 1. Page 43
translated by Grifith.)

Gandharva : Vena, the rising sun,

Vol. 1. Page 41 (Atharvaveda.)

'ap' water, sri to go' అనే ఉత్పత్తి నిరుక్తము లోనిది. కనుక Perhaps అని అనకుండవున్నచో బాగుండె డిది. ఇక Celestial nymphs ను (స్వర్గలోకములోని దేవ కన్యలు) అప్సరసలకు అన్వయించుట నెందుకో తోచుటలేదు. ఎందులకన who dwell among the clouds (మేఘము లతో కలసి నివసించును.) the waters of the sea of the air (వాయుసముద్రములోని జలములు) the consorts of the Gandhrva or of the class of Gandhrvas (గంధర్వులతో కలసి సంచరించునవి లేక గంధర్వజాతికి చెంది నవి.) ఈ వాక్యాలన్నీ అప్సరస శబ్దమునకు గల అర్థములే. గంధర్వుడంటే (the rising sun)ఉదయించుచున్న సూర్యు డని యిదే వాల్యూమ్‌లో తెలిపిరిగదా! కనుక మేఘములతో కలసి నివసించేవి; వాయుసముద్రములోని జలములు; గంధర్వ జాతికిచెంది గంధర్వులతో కలసి నివసించేవి సూర్యకిరణములు, మేఘ సమీపములోని వాయువులు మొదలైనవని స్పష్టమగు చున్నది. ఇక Celestial nymphs స్వర్గలోకములోని దేవ కన్యలు అనేవియేవో స్పష్టమగుటలేదు. (మంత్రములోనే సముద్ర ఆసాంవసనం సముద్రము యీ అప్సరసలకు నివాస స్థానము అని వుండుటగూడ గమనించవలెను.)

దయానందుని భాష్యములో ఇట్టి అస్పష్ట నిర్వచన ములు లేకపోవుటచేత మన దేశములోనేగాక ప్రపంచములో అనేకమంది మహాసీయులు దయానందుని భాష్యములనుగూర్చి

ప్రశంసించియుండిరి. దయానందునిగూర్చి యోగిఅరవిందులిట్లు తెలిపిరి:

*............Amidist the choas and obscurity of old ignorence and age long misunderstanding, his was the eye of direct vision that pierced to the truth and fastened on that which was essential. He has found keys of the doors that time had closed.

"చాలాకాలమునుండి అజ్ఞానమువల్ల యేర్పడిన అస్పష్టత, గందరగోళము, అపార్థముల మధ్య అతనిదే సరియైన దృష్టియై యుండెను. ఆయనదృష్టి సత్యమునకు సూటిగా నుండెను. అవసరమైనదానిని బలపరచెను. కాలప్రవాహంలో మరుగుపడిన యదార్థమార్గాలను తెలుసుకొనుటకు ఆయన సాధనలను కనుగొనెను."

జ్యో తి ష ము :

జ్యోతిషము నేడు విశేషప్రచారములోనుండి లోకవిదితమగుటవలన దాని వివరములనిట పొందుపరచుటలేదు. అయితే సిద్ధాంత భాగములో దాదాపు సూర్యుని ఛాయలే— ఇతర గ్రహాగమనములను గుణించునప్పుడు ఆధారముగ తీసుకొనబడుచుండును.

* Life of Swami Dayananda, by H. V. Sarada.

# బ్రాహ్మణములు - ఉపనిషత్తులు.

## బ్రాహ్మణములు

ఐతరేయ, శతపథ, సామ, గోపథ, తైత్తిరీయ మొదలగు పేర్లతో బ్రాహ్మణ గ్రంథములున్నవి. వీటిలో శతపథము యజుర్వేదమునకు వ్యాఖ్యానమని చెప్పవచ్చును. మిగిలిన బ్రాహ్మణములు తక్కిన వేదములకు వ్యాఖ్యానరూపమై యున్నవి. బ్రాహ్మణములు సంహితలలోని మంత్రములకుగల ప్రయోగము, ప్రయోజనము, విధి మొదలైన అనేక విషయములు దెలుపును. శ్రౌత సూత్రములకు బ్రాహ్మణములకు, మంత్రప్రయోగ విషయమునందు సమన్వయము గనుపించుచుండును. బ్రాహ్మణ గ్రంథముల పరిచయమునకై శతపథ బ్రాహ్మణమును గూర్చి పరిశీలింతము.

యజుర్వేద శాఖలను బట్టి శతపథ బ్రాహ్మణమునకు గూడ పలు శాఖలు యేర్పడినవి యాజ్ఞవల్క్యుని వద్ద కణ్వుడు అధ్యయనము జేసి ప్రచారము సలిపిన కాణ్వశాఖా వేదమునకు (యజుర్వేదంకు) కాణ్వశతపథ బ్రాహ్మణము, మాంధ్యదిను డధ్యయనము జేసిన మాంధ్యదిన శాఖా వేదమునకు మాంధ్యదిన బ్రాహ్మణమును గలవు. ప్రతిశాఖవారును తమ శాఖా బ్రాహ్మణమే యితర బ్రాహ్మణముల

కంటే గొప్పదని భావించుచుందురు. ఒకే మంత్రభాగమునకు విభిన్న ఋషులు తమతమ ప్రతిభతో బ్రాహ్మణములను వ్రాసి యుండవచ్చును. కాని మూలమంత్రభాగ మొకటే యగుటవలన ఆయా శాఖీయులు తమ బ్రాహ్మణ శాఖలను జూచుకొని పరస్పరము హెచ్చుతగ్గు దృష్టితో మెలగుట భావ్యము గాదు.

శతపథమనగా నూరధ్యాయములు గల గ్రంథమని భావము. పథిన్ శబ్దము సంఖ్యావాచకముతో కలసి సమాస మగు నపుడు పథమ్ అగును. కనుక 'శ త ప థ మ ను' రూప మేర్పడుచున్నది. శతపథమునకు కాణ్వశాఖవారు 104 అధ్యాయములుగల గ్రంథమనియు, మాధ్యందిన శాఖ వారు 100 అధ్యాయములు గల గ్రంథమనియు అర్థము జెప్పుదురు. కాణ్వశాఖవారు 'పథిన్' అనుపదమునకు నాలు గనియు, మాధ్యందినులు ఆశబ్దమునకే అధ్యాయమనియు అర్థము జెప్పుదురు. ఈ శాఖా భేదములతో గూడిన బ్రాహ్మ ణముల పూర్తి వివరములు ఆయా శాఖీయులద్వారా గ్రహించ వచ్చును.

బ్రాహ్మణములలో చివరి భాగము (పరావిద్య) వేదాంత విషయమును బోధించుచుండును. యజుర్వేదము నలుబదియవ అధ్యాయము ఉపనిషత్తులలో ఈశోపనిషత్తుగ బరిగణింపబడు చున్నది. అట్లే శతపథములోని చివరి అధ్యా యము 'బృహదారణ్యకోపనిషత్తు' అని పిలువబడు చున్నది.

వేదములందెట్లు అపరావిద్య (విజ్ఞాన, కర్మ, ఉపాసనా) పరావిద్య (జ్ఞానం) లుండునో అట్లే బ్రాహ్మణములలో గూడ పరా అపరావిద్యలు రెండునుగలవు. వీనినిబట్టిగూడ బ్రాహ్మణములు వేదములకు వ్యాఖ్యానములనియే జెప్పవచ్చును. వేదముల లోని అనేక సత్కర్మలను వివరించుచు వాటికి కొన్ని చారిత్రిక ఉదాహరణలుగూడ జోడించబడిన వ్యాఖ్యానములు బ్రాహ్మణములందు గానవగును.

Ex. హరిశ్చంద్రోహ, వైధసఐక్ష్వాకో రాజాఽపుత్రఆస । తస్యహ శతంజాయా బభూవుః। తాసుపుత్రం నలేభే। తస్యహ పర్వతనార దౌగృహం ఊషతుః। సహానా రధం పప్రచ్ఛ

(ఐతరేయ బ్రాహ్మ-పంచకం 7 లో)

(ఇక్ష్వాకు రాజగు హరిశ్చంద్రునికి పుత్ర సంతానము లేకుండెను. అతనికి నూరుమంది భార్యలుండిరి. వారియందు గూడ పుత్రుని బడయలేదు. హరిశ్చంద్రుని యింటికి నారద పర్వతులు వచ్చిరి. అతడు నారదుని యిట్లు అడిగెను.)

బ్రాహ్మణములలో అచ్చటచ్చట వైదిక పదములకు నిరుక్తిగూడ కానుపించుచుండును. ఏకాదశ రుద్రులకు ప్రాణాపానాది పదివాయువులు, ఆత్మయు కలసి మొత్తము ఏకాదశ రుద్రులని అర్ధము జేయబడినది. ఇవి శరీరమును వీడునప్పుడు జీవుని బాధించును గనుక రుద్రులైనవి. (రోదయంతి తద్యద్రో

జయంతి తస్మాద్రుద్రా ఇతి ॥ )

శత. బ్రా. 17 కాం. 3 అ. 9 బ్రా. 4.

ఇట్లే అష్టవసువులు: ద్వాదశాదిత్యులు అను పేర్లకు శతపథమునందెట్లు నిరుక్తి చేయబడినదో జూడుడు.

## అష్టవసువులు :

కతమే, వసవఇత్యగ్నిశ్చ పృథివీచ వాయుశ్చాంతరిక్షంచాదిత్యశ్చ ద్యౌశ్చచంద్రమాశ్చ నక్షత్రాణిచైతే వసవఏతేషుహీదం, వసుసర్వం హితమితి తస్మాద్వసవఇతి॥

శత. బ్రా. 17. 3. 9. 3.

అగ్ని, భూమి, గాలి, అంతరిక్షము, సూర్యుడు, విశాలాకాశము, చంద్రుడు, నక్షత్రము – ఇవి అష్టవసువులు.

## ద్వాదశాదిత్యులు :

కతమ ఆదిత్యాఇతిద్వాదశవై మాసాః సంవత్సరస్యైతఆదిత్యా ఏతేహీదగ్ సర్వమాదదానాయంతి, తేయదిదగ్ సర్వమాదదానాయంతి, తస్మాదాదిత్యాఇతి॥ (సంవత్సరములోని 12 మాసములే ద్వాదశాదిత్యులు.)

## బ్రాహ్మణ గ్రంథములను గూర్చి వివాదము:

బ్రాహ్మణ గ్రంథములను గూర్చి వివాదము జేసుకొను రెండువర్గములు మనకు కనుపించుచుండును. వానిలో బ్రాహ్మ

ణగ్రంథములు గూడ వేదములేనని తలచునది మొదటివర్గము. బ్రాహ్మణము లెన్నటికి వేదములు గానేరవనియు, కొన్ని తావు లందవి వేదవిరుద్ధములుగా గూడ గన్పట్టుచున్నవనియు జెప్పు నది రెండవ వర్గము. ఈ రెండు వర్గములమధ్య అప్పుడప్పుడు కలహములుగూడ జరుగుచుండును.

సంహితభాగము (మంత్రభాగము) నకు వేదమనియు, బ్రాహ్మణ భాగమునకు బ్రాహ్మణమనియు పేర్లు. వేదముల వ్యాఖ్యానరూపము బ్రాహ్మణములు. అందుచేతనే అష్టాధ్యాయిలోని సూత్రములలో వాటికి వేరు వేరు పదప్రయోగములు చేయబడినవని గమనించవలెను.

* ద్వితీయా బ్రాహ్మణే॥ అష్టా 2. 3. 60
చతుర్థ్యర్థే బహుళం ఛందసి॥ అష్టా 2-3-62
పురాణప్రోక్తేషు బ్రాహ్మణ కల్పేషు॥ అష్టా 4-3-105
(ణినిః ప్రత్యయవిధి)

పై సూత్రములనుబట్టి బ్రాహ్మణములు వేదార్థమును గ్రహించుటకు సాధనాభూతమైనవేనని తలంచవచ్చును. ఋగ్వేదభాష్యము వ్రాయుచు సాయణాచార్యుడు (మంత్రేతర వేదభాగో బ్రాహ్మణమ్) మంత్రభాగము కానిది బ్రాహ్మణమని దెలిపినాడు. కారణము మంత్రము లన్నియు ఛందో

* అష్టాధ్యాయిలో వైదిక ప్రయోగాలకు "ఛందసి" అనియు తరువాత భాషకు "బ్రాహ్మణే" అనియు; నేటిసంస్కృతమునకు "లోకే" అనియు గలదు.

బద్ధమైయుండును. అందుచేతనే వేదమునకు ఛందస్సను పేరు వచ్చినది. ఇక బ్రాహ్మణ మంత్రములు ఛందోబద్ధమైనవిగావు. బ్రాహ్మణములలోని భాష వైదిక భాషకు తరువాతను, నేటి లౌకిక సంస్కృతమునకు పూర్వపు వ్యవహారములోనిదై యుండెను. కనుక మొదటి వర్గమువారు బ్రాహ్మణములు కూడ వేదములేనను వాదమును వీడుదురుగాక. వారు తమ బ్రాహ్మణములను వేదతుల్యములుగ జూచుకొన్నచో యితరులకు అభ్యంతరముండదు. అట్లుగాక బ్రాహ్మణములనుకూడ వేదములేనన్నచో సాంకేతికముగ వేదార్థమును జెప్పునపుడు బాధకలుగును.

ఇక రెండవ వర్గమువారికొక మనవి. బ్రాహ్మణములు వేదవ్యాఖ్యానములని వారు తలంతురుగదా? అట్లయిన వేద విషయములతో నిండియున్న వ్యాఖ్యానరూపమగు బ్రాహ్మణములను వేదతుల్యములైనవని దలచి వాటిని పవిత్రముగా జూచుకొన్నచో వారికేమి హానిజనించును? ఒకవేళ వేదవిరుద్ధమైయుండి, హేతువాదమునకు నిలువజాలని భాగములా బ్రాహ్మణములలో కానుపించినచో వాటిని ఆయా కాలముల ప్రభావజన్యములనిగాని లేక ప్రక్షిప్త ప్రక్షేపములందుండ వచ్చుననిగాని, దలచి పరస్పరము సుహృద్భావముతో నుందురుగాక. మూలసిద్ధాంతమును తలక్రిందులుజేయక శబ్దాలకు దేశ కాలములననుసరించి అర్థములను గల్పించుకొన్నచో ఎవరికెట్టి హానియు జనించదు.

## ఉపనిషత్తులు :

వేదములన్నియు అపరా, పరా యను రెండు విద్యలను బోధించును. విజ్ఞాన కర్మభాగమంతయు అపరావిద్య క్రిందకువచ్చును. ఉపాసనా జ్ఞాన భాగము పరా విద్యయనబడును. బ్రహ్మ సర్వత్రా వ్యాపించియున్నాడు. జీవాత్మకూడ బ్రహ్మయొక్క అంశరూపమే. కాని ఉపాధిభేదముచేత బ్రహ్మకంటె భిన్నుడగుచున్నాడు. ఉపాధిరహితమైనచో బ్రహ్మలో లీనమగును. అనగా బ్రహ్మత్వమును బొందును. అపుడు బ్రహ్మకును తనకును భేదము గనుపించదు. ఉపాధిరహితమైన వెంటనే మార్పులతో కూడియున్న ప్రకృతితనకు స్వాధీనమై అందు తనకంటె విలక్షణమైనదేదియు లేదని భావించును. ఇట్లు బ్రహ్మ; ప్రకృతి;జీవాత్మ; విషయమును బోధించి మానవుణ్ణి ముక్తిమార్గమునకు గొంపోవునది పరావిద్య. ఉపనిషత్తులందీ పరావిద్యయే ప్రతిపాదింపబడియున్నది. ఉపనిషత్తులకు ఆరణ్యకములను పేరుగూడ గలదు. ఉపనిషత్తను శబ్దమునందు బ్రహ్మసమీపమునకు జీవునిజేర్చు విద్యయను భావమిమిడియున్నది. కొన్ని ఉపనిషత్తులు వేదములలోని తుదిమంత్రభాగములే యగుటచేతను; వేద ప్రతిపాదిత విద్యలలో తుదివిద్యయగు పరావిద్యను బోధించుటచేతను; ఉపనిషత్తులకు వేదాంతశాస్త్రమనుపేరువచ్చినది. వ్యాసభట్టారకుడురచించిన వేదాంత

దర్శనమును యీ ఉపనిషత్తులతో కలిపి అభ్యసింపవలెను. ఉపనిషత్తులు భారత దేశమందేగాక, ఖండాంతరములలో గూడ, అనేక మహనీయులచే కొనియాడ బడు చున్నవి. అపరా విద్యలో, అంతర్గతమగు, కర్మకాండ భాగమును ఆచరించునపుడు వేదముల మూల సత్యమును గ్రహించని కారణముచేత, యజ్ఞములో పశుహింస; నేటికిని ప్రత్యక్షములోనున్న కులభేద ద్వేష పిశాచములు అనేక శతాబ్దములనుండి ధర్మ సమ్మతమైనవిగ ఎంచబడుచు వచ్చెను. ఈ అన్యాయమునుజూచి మన దేశమందనేకమంది మహనీయులు తమతమ హృదయములందెన్ని విధములుగనో బరితపించిరి. తుదకు చేయునది లేక, కర్మకాండ భాగమువైపు దృష్టినుంచి పండితులతో తగవులకు దిగుటకంటే, వారికి సర్వోత్తమమార్గము ఉపనిషత్తులలోనె గానుపించెను. అప్పుడు వారు అగ్నిహోత్రాది కర్మలను వీడి ఉపనిషత్ప్రీతి పాదితమగు బ్రహ్మతత్త్వమునే ఆరాధించ మొదలిడిరి. స్వర్గీయ రాజా రామమోహన్‌రాయ్‌గారీసం ధర్మమున చిరస్మరణీయులు. కర్మకాండ పేరుతో మనలో అనేక బాధాకరమగు పనులను మానివేయుటకు బదులు ఉపనిషత్తులనే ప్రమాణముగ గ్రహించిన శ్రీరాజా రామమోహన్ రాయ్‌గారివంటి మహనీయులను నిందించుట ఘోరతప్పిదము గదా! వాస్తవముగ, అనేక శతాబ్దాలనుండి నిన్న; నేటివరకు, మన దేశమందు వైదికమతము పేరుతో జరుగుచున్న అనేక లజ్జాకరమగు పనులవలన జనించు దోషములనుండి; ఉపనిషత్తులనే ఆధారముగ దీసుకొని, పై మహనీయులు భారతమాతను

కొంతవరకు గాపాడిరి. ఈ యదార్థమును గాంచినచో వారి యందు ద్వేషముగలుగుటకు తావుండదు.

ఉపనిషత్తులను గూర్చి వర్ణించుటకు నాబోంట్లకు శక్తి జాలదు. ప్రాచీన భారతదేశపు హృదయమే ఉపనిషత్తులనిన బాగుండును.

(1) ఈశావాశ్య (2) కేన (3) ప్రశ్న (4) కఠ (5) ముండక (6) మాండూక్య (7) ఐతరేయ (8) తైత్తిరేయ (9) ఛాందోగ్య (10) బృహదారణ్యకములు ఉపనిషత్తులలో ముఖ్యములు. వీనిని త్రిమతాచార్యులు స్వీకరించిరి. విశాలమగు వేదధర్మముల సారమంతయు యీ ఉపనిషత్తులలో యిమిడియున్నది. కర్మను మానవుడెన్నటికిని వీడరాదు. అయితే కర్మ నాచరించునప్పుడు ఫలితమును దృష్టిలో నుంచుకొన్నచో కర్మ నాచరించుట జేతగాదు. ఫలాపేక్షలేని కర్మ జేయునప్పుడు ఫలితము దానంతటదియే చేకూరును. కర్మ యందు జ్ఞానము ఓతప్రోతమైయుండనిచో మానవుడంధకారమున బడిపోవును. సర్వత్రా వ్యాపించు బ్రహ్మయొక్క వాస్తవ రూపము, జ్ఞానాధికరణమై, ఓంకారరూపములో నుండును. ఈ విధమైన విషయములన్నింటిని ఉపనిషత్తులు బోధించుచుండును.

ఉపనిషత్తులకు ద్వైత – అద్వైత – విశిష్టాద్వైతులు, తమ సిద్ధాంతములననుసరించి అన్వయముచేయుచు ప్రచారమును జేసిరి. విభిన్న దృక్పథములుగల మహనీయులు, ఉపనిషత్తు

లనే, తమ మతప్రచారమునకు ప్రాతిపదికగా గైకొనుటవలన ఉపనిషత్తులకు వన్నె పెరిగినదేగాని తగ్గలేదు. ఐతరేయోపనిష త్తులోని "ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీత్"- "నాన్యత్కించ నమిషత్" "స ఈక్షతలోకాన్ను సృజా ఇతి" "సమా ఇంల్లోకాన సృజత" అను వాక్యములకు విభిన్న సిద్ధాంతులు జేసిన భాష్యములను జూచినచో ప్రాచీనభారతీయుల ఆధ్యాత్మిక జిజ్ఞాసయు, వారిప్రతిభయు భోధపడి, ఆమతాచార్యుల సంతతి వారమైనందుకు, మనము సంతోషపులకితగాత్రులముగాక తప్పదు. అసలుఉపనిషత్తులే, ఆధ్యాత్మిక సాధకులకు మాతృ దేవివంటివి. బిడ్డలందరు పరస్పరము కలహించుకొన్నను, తమ తమ పుట్టుక తల్లినుండియే కలిగినదని గుర్తింతురు. తల్లి ఆ బిడ్డలందరికి తన మాతృవాత్సల్యమును ప్రసాదించుచునే యుండును. ఇట్లే ఉపనిషత్తులుద్వైత - అద్వైత - విశిష్టాద్వైత మతస్థులపై మాతృవాత్సల్యము నెల్లప్పుడును ప్రసాదించు చుండు ననుభావముతో, ఉపనిషత్తుల నధ్యయనము జేసిన యెడల తప్పక మేలు కలుగును. మన పురాతన ఋషులు భౌతిక ప్రపంచమునం దెల్లప్పుడు మోహామును అసూయను వీడి నిత్యశాంతిని బొందెడి వారనుటకు యీ ఉపనిషత్తులే ఆధారములు.

ఉపనిషత్తులలో అనేక కథలు గానుపించును. అవి దాదాపు, కల్పిత కథలైనను, మిక్కిలి మనోహరముగనుండి, చక్కని విషయబోధకములుగ నున్నవి. ఉపనిషత్తులను చదువు నపుడు, "అవి యీనాడు మనలో వ్యాపించియున్న జాతి,

మత, కులభేదముల కతీతమైయున్న ఉత్కృష్ట సత్యసిద్ధాంతము లనే బోధించినవ"ను మాటను మరచినచో చిలుకపలుకులకు మన ఉపనిషత్పఠనకు భేదముండదు. ఉపనిషత్తులలో "సహ నావవతు"-"అసతోమాసద్గమయ" అను ప్రధానమంత్రములు మన హృదాయాలలో ప్రవేశించనట్లే!

గ మ ని క :

తైత్తిరీయోపనిషత్తును గూర్చి ఒక గాధ జెప్పెదరు. యాజ్ఞవల్క్యమహర్షి గురువుతో విరోధము పెట్టుకొనగా గురువు కోపించి "నావిద్య నాకిచ్చివేయుమ" ని చెప్పినాడట. అంతట యాజ్ఞవల్క్యుడు విద్యను గ్రక్కినాడట. అప్పుడు, ఇతర శిష్యులు, తిత్తిరిపక్షులై ఆవిద్యను గ్రోలినారట. ఈకథ వినుటకు ఒకవేళ మనోహరముగ నున్నను, సత్యదూరమైనది. విద్యను గ్రక్కుట; మనుష్యులు పక్షులై ఆవిద్యను తినుట; అసహాజమైనపని. తిత్తిరిమునిచే చెప్పబడినది తైత్తిరీయోపనిషత్తని తెలుసుకొనవలెను. ఇందుకుఆధారము అష్టాధ్యాయిలో యిట్లున్నది:—

తేనప్రోక్తం। తిత్తిరివరతంతు ఖండికోఖాచ్ఛాణ్। కాశ్య పకౌశికాభ్యామృషిభ్యాం, ణినిః॥ అ 5-పా. ౩,

సూ 101 – 102 – 103

తిత్తిరి మొదలైన శబ్దములకు తేనప్రోక్తం అను విషయము

నందు "ఛణ్" ప్రత్యయము; కాశ్యపాది శబ్దములకు ణినిః ప్రత్యయమగును.

తిత్తిరిణా ప్రోక్త మధీయతే తైత్తిరీయాః ।
కాశ్యపేన ప్రోక్తం, కల్పమధీయతే, కాశ్యపినః ॥

మహాభారతమునందు సభాపర్వము ప్రథమాశ్వాసములో మయుడు నిర్మించిన సభాభవనములోనికి వచ్చిన మునులలో యాజ్ఞవల్క్యునితో బాటు 'తిత్తిరి' అను మునిగూడ వచ్చినట్లు గలదు. కనుక తైత్తిరీయోపనిషత్తు తిత్తిరి పక్షులచే జెప్పబడినదని తలంచుట పొరబాటు.

(......కఠకలాపసుమిత్ర, హారీతతిత్తిరియాజ్ఞవల్క్య)
ఆంధ్ర మహాభారతం సభాపర్వం. ప్రథమాశ్వాసము
21వ పద్యం



# దర్శనములు — దార్శనికులు.



లోకంలో మానవుడు దుఃఖాన్ని కావాలనికోరుకొనడు. కాని దుఃఖమునుండి సులభముగ ముక్తిని పొందలేడు. అతడు శాశ్వత సుఖమును పొందగోరును. కాని ఆశాశ్వత సుఖము మనుష్యునకు దూరమైపోవుచుండును. కనుక మనుష్యుణ్ణి ఎల్లపుడు దుఃఖమావరించి యుండునని భావము. ఈదుఃఖమునుండి విడివడుటకు; తనకు సృష్టికి గల సంబంధాన్ని, గ్రహించవలెను. అట్లు గ్రహించుటయే ముక్తియనబడును. సృష్టిలోని రహస్యమును-సృష్టియొక్క నిజరూపమును - గ్రహించిననేగాని ముక్తి గలుగదు. ఈ సృష్టి రహస్యాన్నన్వేషించువారే దార్శనికులు. దార్శనికదృష్టి అలవడినకొలది భౌతికమునకు చేతనమునకు భేదము కానుపించుట దుర్లభమగును.

నేటి వరకు జరుగుచున్న సృష్టిరహస్యాన్వేషణకు అగ్రతాంబూలము భారతమాతకీయదగును. ఈయమసంతానమే, మున్ముందుగ విశ్వమునకుగల, కార్యకారణాన్వేషణ జేయ మొదలిడెను. ఇందుకు నిదర్శనము, అతి ప్రాచీనములగు భారతీయ దర్శనములే. నాటినుండి నేటివరకు యీసృష్టిలోని పదార్థాన్వేషణ ప్రపంచమంతటను సర్వతోముఖ వికాసమునందుచున్నది.

దార్శనికులు జేయు తత్త్వపరిశోధనలో అనగా సృష్టికి గల కారణములను వెదకుటలో ఆదార్శనికులనాటి దేశ, కాల, సామాజిక, పరిస్థితుల ప్రభావము ప్రతిబింబించు చుండును. క్రమముగ ప్రపంచములోని తాత్త్వికుల తత్త్వ శాస్త్రములను జూచినచో మనకీ విషయము బోధపడును.

ప్రాచీన భారతదేశములో సాంఘికవ్యవస్థ సక్రమముగ నుండి; ఒరులను హింసించుట, అబద్ధమాడుట మానవుడు చేయజాలని పని యని తలచుచు, ఒకరి నొకరు హింసించుకొనజాలని రోజులలో; వారు అధ్యాత్మిక బాధలనుండి ముక్తిని పొందగోరి, జగత్తునకుగల సూక్ష్మకారణాలను వెదుక నారంభించిరి. సూక్ష్మాతి సూక్ష్మకారణాన్వేషణలో ఆత్మ, బ్రహ్మ, పునర్జన్మలు కారణరూపములుగ వారుగ్రహించి దుఃఖనివృత్తిని పొందెడివారు. ఇందులో వారికి వైదిక సారస్వతము తోడ్పడి యుండెను. ఈ రకమైన పరిశోధన సల్పినవారిని ప్రాచీన భారతీయ ఋషులని యందురు.

మరల యీ దేశము నందే అట్టికాలము మారినకొలదీ, పునర్జన్మ, దైవము, ఆత్మ, స్వర్గభోగమునుభవించుట అను విషయాలను వాదనలో గైకొని హింసా కృత్యములు జేయుట మొందాయెను. శరీరయాత్రం జాలించిన పిమ్మట జీవుడు స్వర్గ సుఖముల ననుభవించునను నమ్మకము ప్రబలెను. ప్రత్యక్ష హింసగానుపించినను, యజ్ఞాలలో పశువులను జంపుచు, ఆ యజ్ఞాలద్వారా తమకుఉత్తర

జన్మలో రంభాసంభోగము లభించునని సంతసించెడివారు దరిద్రమునకు, ఐశ్వర్యమునకు అర్థములేని కర్మసిద్ధాంతము నాధారముగ గైకొని యెవరి సుఖముతో వారే తృప్తి జెంద సాగిరి. ఈ పరిస్థితిలో బుద్ధు డుదయించెను. కనుక బుద్ధుని పరిశోధనలో ప్రత్యక్షముగ కనుపించని, 'ఆత్మ - బ్రహ్మ' వాదములు లేవు.

ఇట్లే ఐరోపాఖండములోని ఇటాలియనులు సామ్రాజ్యము నేలుచు, బహుదేవతారాధనను ఆధారముగ దీసికొని, ప్రజలను హింసించునప్పుడు జీసను మహాశయుడు జన్మించి దైవ చింతన; ప్రేమ సిద్ధాంతములను ప్రచారము సలిపెను. కాని జీసను బోధించిన సిద్ధాంతములోని దైవము, ఆత్మ పేర్లతోనే పెట్టుబడిదార్లు, బీదప్రజానీకమును నానా హింసల పాలు జేయుచుండగ, మార్క్సువంటి తత్వవేత్తలు సృష్టిస్వభావాన్ని అన్వేషించిరి. అందుచేత వారి సిద్ధాంతాలలో 'మానవుడు భౌతికముగ బాధ నొందకుండుటయే ముక్తి' యనియు, కంటికి కనుపించనిచేతనపదార్థమేదియు సృష్టికి కారణముగా జాలదను' వాదములు బయల్పడినవి.

నేడు భౌతిక సుఖముతోనే శాంతిని బడయలేక ప్రతి మానవుడు తనకొక ప్రత్యేక ఆధిపత్యమును కోరసాగినాడు. అట్టిఆధిపత్యము కొఱకే పరస్పరహింస పెరుగ సాగెను. శాంతి సౌఖ్యములకని హింసజేయుటలో పోటీ ప్రారంభమైనది. పర్యవసానము ప్రపంచయుద్ధమే. కనుక గాంధీమహాత్ముడు భౌతిక

మును, చేతనమును కలుపుకొని రెంటిలోని అవినాభావ సంబం ధాన్ని; ఆధ్యాత్మిక సత్యాన్ని; లోకానికి బోధించినాడు. * 'తనలోని చేతనము, యితరులలోని చేతనము ఒకటేగనుక, ఒరులను హింసించుటకు ఎవ్వరికీ హక్కులేదనీ; అట్లు హింసిం చుట తనకే దుఃఖహేతువ'’నీ సిద్ధాంతీకరించినాడు.

తాత్వికులలో పైవిధమైన మార్పుభావాలను జూచి ఆతాత్వికులను దూషించుట పాడిగాదు. తత్వపరిశోధనలన్నిటి లక్ష్యము దుఃఖనివృత్తియేగదా! పరిశోధకుల మార్గములు భేదించ వచ్చును. అందుఆయా కాలములలోని పరిస్థితులే హేతువులై యుండును. కనుక దర్శనములను చదువునప్పుడు గాని, చర్చించునప్పుడుగాని దర్శనముల లక్ష్యాన్ని మరువక సమదృష్టితో వ్యవహరించుట యుక్తము; శాంతి దాయకము గూడ.

## భారతీయ దర్శనములు

దర్శనమనగాచూపు. సృష్టిలోని వాస్తవికతను చూచు టయే దర్శనము. ఆత్మ ఉండుటను గుర్తించుట ఆస్తిక దర్శ నము. ఆత్మ సత్తా (ఉండుటను)ను గుర్తించకయే సృష్టి రహస్యమును అన్వేషించుట నాస్తిక దర్శనము. ఈవిధముగా, భారతీయ దర్శనములు రెండుభాగములు. (1) ఆస్తికదర్శ నములు (2) నాస్తికదర్శనములు. గౌతమ, కణ్వ, కపిలాది మహర్షులు జెప్పినవి ఆస్తిక దర్శనములనియు; చార్వాక బౌద్ధ

* సర్వజీవులలోని భౌతిక పదార్థమంతా యెట్లు ఒక్కటేయగునో; అట్లే చేతన పదార్థ మంతా ఒక్కటే యగును.

దర్శనములను నాస్తికములనియు వ్యవహరింతురు. నాస్తిక దర్శనము లనుటతోడనే చులకన భావము కలుగుట తగదు. దర్శనకారులందరు జీవితములో క్రమశిక్షణ కొఱకు నియమాలను విధించిరి. ఆత్మ సత్తాను గుర్తించక పోవుటచేత నాస్తిక దర్శనము లైనవి. బౌద్ధ దర్శనములలో బుద్ధికి ప్రధానస్థానమీయబడుటచే, వానిని బౌద్ధదర్శనములనియే చెప్పుటయు క్తము. భారతీయ దర్శనములలో తరచుగ నిమిత్త; ఉపాదాన; సాధారణ కారణములు అను పదములు ఉపయోగింపబడు చుండును.

నిమిత్త కారణము = తాను నిర్మింపబడక యితరమును నిర్మించుట.

ఉపాదానము = ఏది లేనిదే ఏమీ నిర్మింపబడదో, ఏది దానంతటది తయారై నశించునో అది.

సాధారణము = ఏదినిర్మాణములో సాధనమై, సాధారణముగ నుండునో అట్టి కారణము.

## ఆస్తిక దర్శనములు

ఆస్తిక దర్శనములను, వాటి రచయితలను క్రిందజూడుడు.

(1) న్యాయము-కర్త గౌతముడు (2) వైశేషికము - కర్త కణాదుడు (3) సాంఖ్యము - కర్త కపిలుడు (4) యోగము-కర్త పతంజలి (5) పూర్వమీమాంస-కర్త జైమిని (6) వేదాంతము లేక ఉత్తర మీమాంస-కర్త వ్యాసుడు.

పై ఆరుదర్శనములనే షడ్దర్శనములందురు. ఈ ఆరు దర్శనములు వేదములను ప్రమాణములుగ అంగీకరించును. ఆత్మ సత్తాను - ఉండుటను - ఒప్పుకొనును. ఈదర్శనముల భాష సూత్రరూపములతో నుండుటచేత చదువుటకు విసుగుగ నుండును. పూర్వకాలమున అచ్చు యంత్రములు లేకపోవుట చేత; విషయమంతయు కంఠస్థము జేసికొనుటకై, ఆయా దర్శనములను అర్థవంతమైన కొద్దిపాటి సంఖ్యగల సూత్రరూపములలో రచించియుండిరి. కనుక వాటి యందిమిడి యున్న మహత్తరమగు ప్రకృతిసత్యముల వివరణలను శ్రమయని తలంచక అధ్యయనము (Study) జేయుట అవసరము. [ఈ దర్శనములలో నాకు విశేష పాండిత్యము లేకపోయినను వాటిని సంగ్రహముగ వివరించుటకు సాహసించితిని.]

## (1) న్యాయ దర్శనము.

ప్రమాణములతో లక్ష్యమందున్న విషయమును పరీక్షించుట న్యాయమగును. ఈ దర్శనమునందు యితర దర్శనముల కంటే సృష్టికిగల ఉపాదాన కారణము, ప్రమాణ వివేచనము, ప్రత్యేకముగ వివరింపబడినది. 'ప్రమాణైరర్థపరీక్షణం న్యాయః' అని వాత్స్యాయనుడన్నాడు. అంటే ప్రమాణములతో అర్థమును పరీక్షించుట న్యాయము. (Logic) న్యాయదర్శనపక్షము నవలంబించువారు నైయ్యాయికులు. న్యాయదర్శనమునందు ప్రమాణము మొదలు

నిగ్రహస్థానమువరకు 16 మూలతత్వవిషయములు గలవు. వీటిని తెలుసుకొనుటచేతనే ముక్తికలుగునని, అనగా దుఃఖము తొలగునని న్యాయమతము. ఆ తత్వవిషయములివి.

(1) ప్రమాణము (2) ప్రమేయము (3) సంశయము (4) ప్రయోజనము (5)దృష్టాంతము (6) సిద్ధాంతము (7) అవయవము (8) తర్కము (9) నిర్ణయము (10) వాదము (11) జల్పము (12)వితండము (13)హేత్వాభాస (14)ఛలము (15) జాతి (16) నిగ్రహ స్థానము. న్యాయ. (1-1-1)

ప్రమాణములు నాలుగు___ (1)ప్రత్యక్షము (2)అనుమానము (3) ఉపమానము (4) శబ్దము.
(అ 1- ఆహ్ని 1-సూ. 3.)

ప్రమేయములు- ప్రమాణములద్వారా గ్రహించవలసినవి___ (1) ఆత్మ (2) శరీరము (3) ఇంద్రియములు (4) ఇంద్రియార్థములు (5) బుద్ధి (6) మనస్సు (7) ప్రవృత్తి (8) దోషము (9) ప్రేత్యభావము (10)ఫలము (11)దుఃఖము (12) అపవర్గము లేక మోక్షము అనగా దుఃఖము తొలగుట. (న్యాయ. అ1-ఆహ్ని 1-సూ 9.)

ఈ సూత్రమునకు వాత్స్యాయనుడు భాష్యము వ్రాయుచు, ఆత్మ భోగించుటకు 'శరీరము' నిలయమని; భోగ సాధనములు ఇంద్రియములని; భోగింపబడునవి ఇంద్రియార్థములని (Matter); చావు పుట్టుకల యేర్పాటును త్రెంచు

కొనుట, సర్వదుఃఖములను తొలగించుకొనుట మోక్షమని (Salvation) తెలిపినాడు. మోక్షమునే అపవర్గమందురు.

(1) ప్రత్యక్షప్రమాణము= ఇంద్రియ, ఇంద్రియార్థముల కల యికతో యేర్పడు జ్ఞానము. (అ1-ఆహ్ని 1-సూ4.)

(2) అనుమాన ప్రమాణము= లింగమును - గుర్తును - జూచి, గుర్తుగల వస్తువును - లింగిని - ఊహించుట. (సూ. 5) మేఘము దట్టముగ ఆవరించుటను జూచి వర్షము రానున్న దని ఊహించుట.

(3) ఉపమానప్రమాణము= సారూప్య జ్ఞానము. ఒకవస్తువును రెండవ వస్తువు యొక్క పోలికతో ఊహించుట.

(4) శబ్దప్రమాణము = ఆప్తులైనవారి ఉపదేశము.
(అ1-ఆహ్ని 1-సూ 7)

ఈ నాలుగు ప్రమాణములతో ఆత్మ మొదలు పన్నెండు విషయాలను తెలుసుకొనవలెను.

(1) ఆత్మ = కోరిక; ద్వేషము; ప్రయత్నము; సుఖము;దుఃఖము జ్ఞానము; ఇవి ఆత్మకు గల గుర్తులు.

ఇచ్ఛాద్వేషప్రయత్నసుఖ దుఃఖజ్ఞానాన్యాత్మనోలిఙ్గమ్.
న్యాయ. (అ1.ఆ1. సూ 10.)

(2) శరీరము = పని చేయుటకు; ఇంద్రియమునకు; ఇంద్రియా

ర్థమునకు ఆశ్రయమైనది శరీరము. చేష్టేంద్రియార్థాశ్రయః శరీరమ్. (అ1-ఆ1 సూ 11.)

(3) ఇంద్రియములు = ముక్కు; నాలుక; కన్ను; చర్మము; చెవి అనునవి ఇంద్రియములు. ఇవి పంచభూతములనుండి యేర్పడినవి.

ఘ్రాణ రసన చక్షుస్త్వక్ శ్రోత్రాణీంద్రియాణిభూతేభ్యః (1-1-12)

పంచభూతములు = మట్టి నీరు; వెచ్చదనము; గాలి; ఆకాశము లేక ఖాళీ -Space- (1-1-12)

(4) ఇంద్రియార్థములు = వాసన;రసం-రుచి; రూపము; తాకిడి; శబ్దము; ఇవి ఇంద్రియార్థములు. ఇవి పంచభూతముల గుణములు (అ 1-ఆ 1. సూ 14)

( గంధరసరూపస్పర్శశబ్దాః పృధివ్యాదిగుణాఃతదర్థాః ॥ )

(5) బుద్ధి = భోగరూపమే బుద్ధి. ఇది దేహ-ఇంద్రియ-సంఘాతములకు వేరుగ వుండును. 'భోగోబుద్ధిః' (వా. భా.) 1-1-15.

(6) మనస్సు = ఒకే సెకండు - నిమిత్తము - లో ఇంద్రియార్థములన్నిటి కలయిక వలన కలుగు జ్ఞానము లేకపోవుట మనస్సునకు గల గుర్తు. అనగ జ్ఞాపకము మనస్సుయొక్క గుర్తు. యుగపద్జ్ఞానానుత్పత్తిర్మనసోలింగమ్. (1-1-16) స్మృతి-జ్ఞాపకము; అనుమానం;ఆగమం;సంశయం;ప్రతిమా;

స్వప్నజ్ఞానం; ఊహా ; సుఖ దుఃఖముల ప్రత్యక్షము; కోరిక మొదలైనవి మనస్సునకు గల గుర్తులు. (వా. భా) 1-1-16.

(7) ప్రవృత్తి = మాట; బుద్ధి; శరీరములతోటి ఆరంభము ప్రవృత్తియగును. ప్రవృత్తిర్వాగ్బుద్ధి శ్శరీరారంభః॥ (1-1-17)

అరంభము రెండు విధములు. (1) పుణ్యారంభము (2) పాపారంభము. దానము, రక్షణ, సత్యముమాట్లా డుట పుణ్యారంభము. అసత్యము, హింస మొదలైన చెడ్డపనులు పాపారంభము. (వా. భా. 1-1-2).

(8) దోషములు = రాగాదులలో ప్రవర్తించుటయే దోషము. (ప్రవర్తనాలక్షణా దోషాః॥)

యత్రమిథ్యాజ్ఞానం తత్ర రాగ ద్వేషావితి॥ మిథ్యాజ్ఞానము గల చోటునందే రాగద్వేషములుండును. అనగామిథ్యాజ్ఞానమే దోషమన్నమాట. (వా. భా).

(9) ప్రేత్యభావము=దేహ; ఇంద్రియ; బుద్ధి; వేదనాదులతో సంబంధముగల ఆత్మకు మొదటి శరీరముతో సంబంధము తొలగి, రెండవ శరీరముతో సంబంధము గలుగుట ప్రేత్య భావమనబడును.

పునరుత్పత్తిః ప్రేత్యభావః॥ (ఉత్పన్నస్యక్వచిత్ సత్వనికా యేమృత్వా, యాపునరుత్పత్తిః స ప్రేత్యభావః॥ వా. భా.

(10) ఫలం= ప్రవృత్తి దోషములనుండి కలిగిన పదార్థమే ఫలమ్. (ప్రవృత్తిదోష జనితోఽర్థః ఫలమ్). సుఖదుఃఖ సంవేదనమే ఫలమని వాత్స్యాయనుడు తెలిపినాడు. (సుఖదుఃఖ సంవేదనంఫలమ్. వా. భా.)

(11) దుఃఖము= బాధ- పీడాలక్షణము దుఃఖము. (బాధాలక్షణం దుఃఖమ్.)

(12) మోక్షము= ఆదుఃఖమునుండి పూర్తిగ విడుదల కలుగుటయే మోక్షము లేక అపవర్గము. తదత్యంత విమోక్షోఽపవర్గః॥ ఇక్కడ వాత్స్యాయనుడు దుఃఖముతో గూడినజన్మ లేకపోవుటయే ముక్తియని తెలిపినాడు.

ఇట్లే సంశయము, దృష్టాంతము, ప్రయోజనము, మొదలగు విషయములన్నియు యీదర్శనమునందు వివరింపబడినవి.

శరీరేంద్రియములకు భిన్నమైయుండునది ఆత్మ. కనుక దానిని నిత్యమని యీ దర్శనము చెప్పును. ఆత్మ నిత్యము గనుకనే ప్రేత్యభావము సిద్ధించునని నైయ్యాయికుల మతము. (ఆత్మనిత్యత్వే ప్రేత్యభావసిద్ధిః॥ అ 4-ఆ 1-సూ 10.) పూర్వ శరీరంహిత్వా, శరీరాంతరోపాదానం ప్రేత్యభావః॥ (వా. భా) పూర్వశరీరమును పొంది; దానిని వదలివేసి; మిమ్మట క్రొత్త శరీరమును బొందుటచే ఆత్మ నిత్యమైనది. చావు, పుట్టుకలే ప్రేత్యభావము.

సృష్టియొక్క ఉత్పత్తికిగల కారణములు అధ్యా 4. ఆహ్ని 1. సూ 14. నుండి విచారింపబడినవి. శూన్యత; ఈశ్వరుడు; ఆకస్మికము అనువాటిలో ఏఒక్కటి మాత్రమే సృష్టికి ఉపాదానకారణమని అంగీకరింపబడలేదు. సర్వము అనిత్యము, సర్వము నిత్యము; సర్వపృథక్త్వము - భిన్నము లేక వేరగుట Separation; సర్వము శూన్యము; అను వాదనలను నైయ్యాయికులు నిరాకరించిరి. ప్రకృతి (Nature) సృష్టికి ఉపాదాన కారణమైనదని వీరి యుద్దేశ్యము.

ఈశ్వరుడే కారణమా? అను విషయమునుగూర్చి ఇట్లు చర్చింపబడినది. ఈశ్వరఃకారణం, పురుష కర్మాఫల్యదర్శనాత్॥ న, పురుష కర్మాభావే ఫలానిష్పత్తేః॥ (అ 4-ఆ 1 సూ 19 - 20.) "పురుషుడు తానుచేయు పనియొక్క ఫలితమును కోరుకొనుచుండియు, ఆ ఫలితమును పొందలేక పోవుచున్నాడు. కనుక పురుషుడు పరాధీనుడైనాడు. ఫలితము ఈశ్వరాధీనమైనది. అందువలన ఈశ్వరుడు కారణరూపుడు" అని ప్రశ్నించుకొని అట్లుకాదని సమాధానము చేయబడినది. ఎట్లనగా పురుషుడు పనిచేయనిదే, ఫలితము గలుగదు గదా! కనుక కారణరూపుడు ఈశ్వరుడేగాదు. పనిజేసినవానికి ఫలితమునిచ్చువాడే ఈశ్వరుడు.

"వేదము నిత్యమ"ని వాత్స్యాయనుడు 2 అధ్యా 1 ఆహ్ని. 68 సూత్రమునకు భాష్యము వ్రాయుచు తెలిపినాడు. అదే అధ్యాయంలో 2 ఆహ్నికం, 2 సూత్రమునుండి 56 సూత్ర

మువరకు 'శబ్దము' పరిణామము జెందుటచే, అనిత్యమని తెలుప బడినది. కనుక ప్రత్యక్షాది ప్రమాణముల పరీక్షకు నిలుచునట్టి అప్తోపదేశమగు శబ్దము నిత్యమని న్యాయశాస్త్ర మతము. అప్తోపదేశము వేదమనిభాష్యకారుడు మాత్రము తెలిపినాడు.

ఆత్మకు శరీరమునకు, ఆత్మకు మనస్సునకుగల భేదము; ఆత్మ నిత్యత్వము; ఇంద్రియ అనేకత్వము; బుద్ధిస్వరూపనిర్ణయము; ప్రవృత్తి దోషముల విపులీకరణ; ప్రేత్యభావ అపవర్గముల వివరణ; యీ దర్శనములో చూడనగును.

ఋణక్లేశప్రవృత్త్యనుబంధాదపవర్గాభావః॥ (4-1-59)

ఋణక్లేశములతో సంబంధముండువరకు మోక్షములేదు అనగా దుఃఖము తొలగదు.

సుషుప్తస్య స్వప్నాదర్శనే క్లేశాభావాదపవర్గః॥ (4-1-63)

నిద్రించువాడు స్వప్నమును చూడకపోయినచో అతనికి రాగానుబంధము, సుఖదుఃఖాను బంధము దొలగునట్లు అప వర్గమునందు - ముక్తియందు - బ్రహ్మజ్ఞానముగల ఆత్మకు క్లేశాదులుండవు.

ఆత్మకు, ఇతరప్రకృతికి గల భేదమును, సంబంధమును భ్రమాజ్ఞానముతో గాక ప్రత్యక్ష; అనుమాన; శబ్దప్రమాణ ములతో నెఱిగిననేగాని దుఃఖనివృత్తి కలుగదను విషయము న్యాయదర్శన ఉద్దేశ్యము. ఈ సృష్టికి ఈశ్వరుడే కారణరూ

పముగాదు (అ 4 - 1 ఆ - 19-20 - సూ) అనువిషయమును ముఖ్యముగ గమనించవలెను.

## 2. వైశేషిక దర్శనము

పదార్థముల స్వరూప నిర్ణయమునుగూర్చి ప్రపంచమునందు యీ దర్శనమే ముందుగ కృషి జేసెను.

"Kanada, founder of Vaiseshika system of Hindu philosophy, suggested the atomic constitution of matter and also spoke about the indestructibility of matter."

L. M. Mitra M. Sc; B. L,

"వైశేషిక కారుడగు కణాదుడు ద్రవ్యముయొక్క పరమాణునిర్మాణమును దెలిపెను. మఱియు ద్రవ్యము నాశనముగాక శాశ్వతముగ నుండుటనుగూడ వివరించెను." ఈవాక్యములను Inorganic Chemistry అను గ్రంథములో యల్. యమ్. మిత్రా, యమ్. యస్. సి; బి. యల్. గారు, "మొట్టమొదటి సైంటిస్టు కణాదుడని" చెప్పుచు వ్రాసినారు. కనుక వైశేషికదర్శనము ఉత్తమ పదార్థ విజ్ఞానశాస్త్రమని గూడ జెప్పవచ్చును.

న్యాయదర్శనముకంటె యిది యెక్కువ యుక్తియుక్తముగ నుండుటచేతను, ఇతర దర్శనములకంటె ఇందులో కాలము; విశేషము అను పదార్థముల వివరణ అధికముగ

నుండుటచేతను, యీ దర్శనమును వైశేషిక దర్శనమనిచెప్పిరి. వైశేషిక దర్శనముననుసరించి * పదార్థములు ఆరు. అందు చేత వైశేషికులను షట్పదార్థవాదులని యందురు.

వైశేషికుల మూలసిద్ధాంతములు.

లక్ష్యము:— మోక్షము అనగా దుఃఖముతొలగుట.

లక్షణము లేక సాధన:— ధర్మాచరణ; ధర్మమును తెలుసు కొనుట.

ధర్మము:— దేనిచేత మానవునకు అభ్యుదయము, ముక్తి కలుగునో అట్టికార్యము [అ 1 - ఆ 1-సూ 2]

ప్రమాణము:— వేదము. 'తద్వచనాదామ్నాయస్యప్రామా ణ్యం [1-1-3]

పదార్థములు:— 6. ద్రవ్యము; గుణము; కిర్మ-పని; సామాన్య ధర్మము; విశేషము; సమవాయము (1-1-4) సూత్ర ములో 'సాధర్మ్యవైధర్మ్యాభ్యాం తత్త్వజ్ఞానాత్, అని యుండుటచే యీ ఆరు పదార్థములలో పరస్పర కల యిక, వేరుపడుటలయొక్క యదార్థస్థితిని గుర్తించి నచో ముక్తి కలుగునని భావము.

---

* పదార్థమునుగూర్చి అధునిక వైజ్ఞానికులు చేయు నిర్వచనము

Matter:— Anything which possesses weight, occupies space, offers resistance and can transfer motion is matter. (L. M. Mitra.)

ద్రవ్యములు:— 9. భూమి; నీరు; తేజస్సు-వేడి; గాలి; ఆకాశం -ఖాళీ (Space); కాలము (Time); దిక్కు; ఆత్మ; మనస్సు. పృథివ్యాపస్తేజోవాయురాకాశంకాలో దిగాత్మామనఇతి ద్రవ్యాణి॥ (1-1-5)

గుణములు:— 24. రూపము; రసము-రుచి; వాసన; స్పర్శ - తాకిడి; సంఖ్య; పరిమాణము; పృథక్త్వము- వేఱగుట; సంయోగము; విభాగము; పరత్వము; అపరత్వము; బుద్ధులు; సుఖము; దుఃఖము; కోరిక; ద్వేషము; ప్రయత్నము; సూత్రములో 'చ'కారముండుటచేత బరువు; ద్రవత్వము; స్నేహము; సంస్కారము; ధర్మము; అధర్మము; శబ్దము. "రూపరస గంధస్పర్శాః సంఖ్యాః పరిమాణాని పృథక్త్వం సంయోగ విభాగౌ పరత్వాపరత్వేబుద్ధయః సుఖదుఃఖేచ్ఛాద్వేషౌ ప్రయత్నాశ్చ గుణాః॥ (1-1-6) ఈగుణములు ద్రవ్యములలో ఉండును.

కర్మలు అనగా పనులు:— 5. పైకెత్తుట; క్రిందికి దించుట; ముడుచుకొనుట; చాచుట; గమనము-నడచుట. "ఉత్క్షేపణ అపక్షేపణ ఆకుంచనం ప్రసారణ గమనమితి కర్మాణి॥ [1-1-7]

సామాన్యము:— 1. ద్రవ్య; గుణ; కర్మలలో ద్రవ్యమొక్కటియే సమవాయికారణమగుట సామాన్యధర్మము.

(ద్రవ్యగుణ కర్మణాం ద్రవ్యంకారణంసామాన్యం)

(1-1-18)

విశేషము:— *పదార్థములలో ప్రతియొక్కటియు ఇతరపదార్థములనుండి వేరుపరచుకొను స్వాభావము. (ఇతరదర్శనములు యీ విషయాన్ని ప్రతిపాదించలేదు.)

(అ 1-ఆ 2-సూ 6)

సమవాయము:— ఎల్లప్పుడు సంబంధము గలిగియుండుట. శబ్దమునకు ఆకాశము సమవాయి కారణము.

అభావము:— 4. ప్రాగభావము, ప్రధ్వంసాభావము, అత్యంతాభావము, అన్యోన్యాభావము.

(1) ప్రాగభావము - కార్యముజరుగుటకు ముందు కార్యము లేకపోవుట.

(2) ప్రధ్వంసాభావము - ఉత్పన్నమైన వస్తువు నశించిన తరువాత లేకపోవుట.

(3) అత్యంతాభావము - ఒకచోటవున్న వస్తువు మరియొకచోట లేకపోవుట.

---

* వైశేషికదర్శనం అ 1-ఆ 2-సూ 6, ప్ర. భాష్యములో విశేషప్రకరణముయొక్క ఆధారములతో యీ నిర్వచనము చేయబడినది.

(4) అన్యోన్యాభావము - ఒక పదార్థము యింకొకదానిలో లేకపోవుట. వస్త్రము కుండయందుండదు. కుండ వస్త్రములో నుండదు.

## ద్రవ్యముల నిర్వచనము

(1) పృథివీ - భూమి. (Earth):— రూపము; రసము- రుచి; వాసన; స్పర్శగలదిభూమి. రూపరసగంధ స్పర్శవతీ పృథివీ॥ (2-1-1)

[ఆధునిక వైజ్ఞానికులు తెలుపు మూలతత్వములు (Eliments) భూమి; నీరు; అగ్ని; గాలిలో అంతర్గతమైనవే.]

నిప్పు; నీరు; గాలి; ఆకాశములతో సంయోగము పొందుచుండుటచే భూమియొక్క గుణములు రూపము మొదలు అపరత్వమువరకు పదకొండున్నా, బరువు; ద్రవత్వము, సంస్కారము కలసి మొత్తం 14 గుణములు భూమికిగలవని ప్రశస్తపాదులు తెలిపినారు. మఱియు భూమినిగూర్చి ప్రశస్తపాదుల భావ్యమిట్లున్నది.

* భూవికారమగు పదార్థము క్రిందికిపడును గనుక భూమిలో గురుత్వమున్నది. ఉత్తరకర్మ పృథివీద్రవ్యమునకుండుటచే సంస్కారగుణము అనగా మార్పుపొందు గుణము కలిగినది భూమి. "ఉత్తరకర్మవచనాత్ సంస్కారః॥

* ప్రశస్తపాదభాష్యం — పృథివీ నిరూపణ ప్రకరణము.

భూమియొక్క గుణవివరము:—

"క్షితావేవగంధః" అనుటచేత ముఖ్యముగ ద్రవ్యవిభజన జేసుకొని పోగాపోగా, వాసనభాగమే భూమియని నిర్ణయించుకొనవలెను. అనగ 'వాసన' అనేది ఇతరద్రవ్యాలలో ఉండదు. ఆకారము— తెలుపు మొదలు అనేకరూపములు.

రసము— తీపి; ఉప్పు; వగరు; చేదు; కారము; పులుపు. 'రసః షడ్విధః మధురాదిః॥'

వాసన రెండువిధములు— 'సురభిరసురభిశ్చ.' సువాసన, చెడ్డవాసన.

స్పర్శ— ఉష్ణము; శీతము. 'అనుష్ణాశీత త్వేసతిపాకజః॥' ఉష్ణత్వము లేకపోతే శీతము. కనుక స్పర్శ పాకజము. అనగ పాకముతో ఉత్పన్నమగును.

భూమి రెండువిధములు:- నిత్యము, అనిత్యము.

నిత్యము— పరమాణురూపమైనది నిత్యము. 'పరమాణు లక్షణానిత్యా,' (ప్ర. భా.) 'సదకారణవన్నిత్యమ్'

వై శే. ద. అ 4 ఆ 1-సూ 1.

అనిత్యము— కార్యలక్షణాత్వనిత్యా. (ప్ర. భా.) అణువునుండి మహద్రూపముగను, మహద్రూపమునుండి అణురూపముగను మారునప్పుడు ఇతర ద్రవ్యాలతో

సంయోగ వియోగములు పొందుచుండుటచే కార్య రూపమైనది అనిత్య 'భూ' ద్రవ్యము.

పరమాణువు--- ఇతర ద్రవ్యాలతో సంయోగ వియోగాలను వేరుజేయగ కార్యరూపములేనట్టి అనగా విశ్రాంతి కలిగియున్నట్టి యే సూక్ష్మాతిసూక్ష్మమగు ద్రవ్యముండునో అది పరమాణువు (Atom) గనుక అది నిత్యము. ఆధునిక వైజ్ఞానిక దృష్ట్యా యీ వాదము బలపడుచున్నది. ప్రతిపరమాణువు (Atom) లోను అంతర్భూతమైయున్న ఎలక్ట్రాన్ ప్రోటానులయొక్క సంఘటన-విఘటనాశక్తులను పూర్తిగ ధ్వంసము జేసినచో ఎలక్ట్రాన్-ప్రోటానులు వేరై, స్థిరరూపముగలిగి యుండునని ఆధునిక పరిశోధకులు తెలుపుచున్నారు. అయితే పరమాణువు అనిత్యమని సాంఖ్యమతమునందు గలదు. అది యిచట వర్తించదు.

కార్యరూపమైనభూమి అనగా మార్పులను పొందునట్టి భూమి మూడు విధములు. త్రివిధంచాస్యాః కార్యమ్, శరీరేంద్రియ విషయసంజ్ఞకమ్. (ప్ర. భా.)

శరీరము, ఇంద్రియము, విషయము అను భేదముచే కార్యరూపమగు అనగ అనిత్యమగు భూమి మూడు విధములు. వైశేషిక దర్శనం (అ 4-ఆ 2-సూ 5)

శరీరము రెండు విధములు— యోనిజము, అయోనిజము.
తత్రశరీరం ద్వివిధం, యోనిజమయోనిజంచ. (అ 4 ఆ 2-సూ 5) వై. ద.

యోనిజ శరీరము— శుక్రశోణిత సన్నిపాతజం యోనిజమ్. (ప్ర. భా.) పురుషవీర్యమగు శుక్రము, స్త్రీవీర్యమగు శోణితము కలియుటచే పుట్టినది యోనిజశరీరము.

అయోనిజ శరీరము— 'దేవర్షీణాం శరీరం ధర్మవిశేష సహితే భ్యోఅణుభ్యో జాయతే॥ (ప్ర. భా.)వై.అ4-ఆ 2-7-10 సూ) పృథివీసంబంధమైన పరమాణువులే (Atoms) వాటిస్వధర్మరూపమగు సంయోగమువలన బృహద్రూప మేర్పడుట వలన అయోనిజశరీరము కలుగుచున్నది. భూమి; గ్రహాలు, చంద్రుడు, మేఘములు మొదలైన మహత్తర పదార్థములు; ప్రకృతిలోని అనేక గోళాలు (దేవతలు); సూర్యకిరణములు (ఋషులు)యిట్టివి అయోనిజ శరీరములుగలవి. * "ధర్మవిశేషసహితేభ్యో అణుభ్యో" అనేమాటను ముఖ్యముగ గుర్తుంచుకొనవలెను.

యోనిజములు రెండురకములు:— జరాయుజము, అండజము.
జరాయుజ శరీరము:— మనుష్య; పశు; మృగశరీరములు.

---

* దేవ, ఋషిశబ్దములకు నిరుక్తము దైవత కాండలో గల అర్థముల ఆధారముతోను; నీటియొక్క అయోనిజ శరీరము వైశేషిక దర్శనములోనే వివరించబడిన తీరులనుబట్టి;సూత్రములో "అణుభ్యో" అనుట వల్లను యీ అర్థము యుక్తమగును.

(మానుష పశు మృగాణాం జరాయుజం) ప్ర. భా.

అండజ శరీరము:— పక్షులు; పాములు మొదలైనకీటకములు.
(పక్షిసరీసృపాణామండజం.)

ఇంద్రియరూపమగు భూమి--(Nose) ముక్కు. (తత్రనాసాగ్ర వర్తి అనుటచే ముక్కు చివరిభాగము.) ప్ర. భా.(9-2-6)

విషయరూపమగు భూమి:— మృత్తిక; పాషాణము;స్థావర రూపమైనది.

మృత్తిక — మామూలు మట్టి.

పాషాణము — రాళ్ళు, మణులు, వజ్రములు.

స్థావరము —గడ్డి, ఓషధి, వృక్షము, పూలతీగలు, వనస్పతులు మొదలైనవి.

(2) నీరు - (అప్)= రూపము; రసము-రుచి; స్పర్శ - చల్లని తాకిడి; ద్రవత్వము;స్నిగ్ధత్వముగలది నీరు. అయితే నీటిలో గూడ భూమిలోగల 14 గుణములు సంయోగముచేత కనుపించును. నీరుకూడ నిత్య-అనిత్య భేదముతోనుండును. నిత్యమైనది పరమాణువు. అనిత్యమైనది కార్యరూపము.

కార్యరూపమైన నీరు గూడ భూమివలెనే శరీర, ఇంద్రియ, విషయభేదములతో మూడు విధములు. అయోనిజ శరీరము వరుణలోకము ఉండును. అనగామేఘరూపము బొందునప్పటి ఆకాశములో నుండు ఋతుపవన

కలదో అది కాలము. ఆకాశము "నిన్న పుట్టుట, రేపు పెద్దదగుట" అనునదిలేదు. కాని అనిత్యద్రవ్యములు-కార్య రూప ద్రవ్యములు నిన్న నిర్మాణమై, రేపు రూపముమారి, సంయోగ వియోగములను చెందును. కార్యరూపక ద్రవ్య సంయోగము - వియోగములు కాలాశ్రితములు. లేత మామిడికాయ పండిన రూపమును పొందుటకు కొంత సమయము పట్టునుగదా? లేతమామిడిపింద ఆక్రమించిన అవకాశము (space) కంటె పండినపెద్దకాయకు యెక్కువ అవకాశము (space) కావలెను. అవకాశము కాలము వెంట పెరుగుచుండును. కాలములేనిదే పదార్థ సంయోగము ఆకాశము (space) నుకోరజాలదు. కనుక ఆకాశాం తర్గతమైనను కాలమే సృష్టికి మూలమగుచున్నది. కనుక కార్యరూపకద్రవ్యముల ఉత్పత్తి స్థితిలయములకు కాలమే కారణము. నిన్న; రేపు; నేడు; వెంటనే; ఆలస్యము; మొదలైనవి కాలములు.

(7) దిక్కు— ఆకాశాంతర్గతమగుటచేత దిక్కు అంతయు ఒక్కటే. నిత్యము గూడానై యున్నది. మూర్తద్రవ్యపు పరిణామాలను బట్టి తూర్పుపడమర అనే వ్యవహార హేతువు 'దిక్కు' అని చెప్పబడును.

(8) ఆత్మ— ప్రాణము; అపానము; కన్నుమూయుట - తెర చుట; జీవనము, మనస్సునడక; ఇంద్రియాలలోని వికార ములు; సుఖం; దుఃఖం; కోరిక; ద్వేషము; ప్రయత్నము. ఇవి ఆత్మకుగల గుర్తులు. (అ 3-ఆ 2 - సూ 4.)

## ఆత్మయేకీభావమే పరమాత్మ.

(9) మనస్సు—రూప; రస; గంధ; స్పర్శలగు ఇంద్రియార్థములకును, ఆత్మకును సంబంధము కలుగునప్పుడు యేజ్ఞానమైతే కలుగునో అదివుండుట, లేక పోవుట మనస్సనెడి ద్రవ్యానికి గల గుర్తు. 'మననాత్ మనః' అనుటచే జ్ఞాపకశక్తి మనస్సునకు గల గుణము. సంస్కారముగూడ దీనికి గలదు. (అ 3- ఆ 2- సూ 1)

పరిమాణము— పరిమాణరూపమై, సంయోగ వియోగాలతో సృష్టి కూడియుండును. కనుక అణువు; మహత్తు దీర్ఘము; హ్రస్వమని పరిమాణము నాలుగు రకములు.

కర్మ అనగా పని:— కార్యరూపక ద్రవ్యముల సంయోగ వియోగమే సృష్టిరూపములో గల మార్పు. కనుక వైశేషికములో 'ఆత్మయొక్క సంయోగము; ప్రయత్న; గుణముల నుండి హస్తమునందు ఎత్తుట అనేకర్మ - పని పుట్టును. పిమ్మట చేతిసంయోగముచేత రోకలిలో పని కలుగునని తెలుపబడినది. (అ5-ఆ1-సూ1-7). చేతనము, నిత్యము నగు ఆత్మయొక్క ప్రయత్నములేనిదే కార్యము జరుగదనుట నిశ్చయము.

కారణాభావాత్ కార్యాభావః। నతు కార్యాభావాత్, కారణాభావః॥ కారణము లేనిదే కార్యములేదు, కాని కార్యము లేకపోయినను కారణముండును. (వై.1-2-1-2) కనుక దుఃఖరూపకమగు కార్యమునకు మిథ్యాజ్ఞానమే కారణమని; పదార్థ

ముల వాస్తవిక జ్ఞానముకలిగినచో దుఃఖనివృత్తియై ముక్తి గలుగునని, వైశేషికదర్శనము బోధించును.

వైశేషికము ఆరవ అధ్యాయంలో ధర్మస్వరూప నిర్ణయము; ధర్మసంరక్షణ విధులు, తెలుపబడినవి. ఆకాలమున ధర్మసంరక్షణార్థము హింస జేయుట జనసమ్మతమై యున్నటుల ఈదర్శనముద్వారా బోధపడుచున్నది. ఐనప్పటికీ వైశే.అ6-ఆ 1-సూ 14 'హీనేపరేత్యాగః' ధర్మసంరక్షణార్థము ప్రతిపక్షి బలహీనుడైతే సంహరించవలెను' అన్న సూత్రమును సమన్వయము జేసుకొనుటకు కష్టముగనున్నది. హింసాయుత పోరాటములో హైద్రాబాద్‌పై భారతప్రభుత్వము తీసుకొన్న సైనికచర్యవంటివానిలో శత్రువు బలహీనుడైతేనే సంహరింపబడుట సహజముగనుక పైసూత్ర మీఅర్థములో వ్రాయబడి యుండవచ్చును. వ్యక్తిగతముగ ప్రతిమనుష్యుడు యీ సూత్రమును తనకొఱకే అన్వయించుకొని తాను జేయు హింసాకృత్యములను సమర్థింపబూనుకొన్నచో సమాజమునుండి హింసారూపము తొలగి, శాంతియేర్పడుట కష్టమగును.

## (3) సాంఖ్య దర్శనము

ఈ దర్శనమునందు మూలతత్వముల పరిశోధన; వాటి వివరణము కానుపించును. మూలతత్వములు; దోషములు; గుణములు; వాటి సంఖ్యావివరణము ఉండుటచే యీదర్శనమునకు 'సాంఖ్యదర్శన' మని పేరువచ్చినది. సాంఖ్యులు సృష్టి ఈశ్వరాధీనమని అంగీకరించరు. సృష్టియంతయు అహంకారా

ధీనమైయుండునని వీరిమతము. అహంకారము మూలతత్వములలో నొకటి. ఈశ్వరు డహంకార రహితుడగుటచే సృష్టికి కారణరూపుడుగాడని వీరియభిమతము. ఈదర్శనములో ఆత్మ నిత్యత్వమంగీకరించబడినది. కాని ఉపాధిభేదముచే అనేకత్వము కలుగునని సాంఖ్యసిద్ధాంతము. సాంఖ్యదర్శనమునకు భగవద్గీతలో ప్రముఖస్థాన మీయబడినది. దుఃఖనివృత్తియే ముక్తి యని సాంఖ్యమతము దుఃఖము మూడు విధములు.

(1) ఆధ్యాత్మిక (2) ఆధిభౌతిక (3) ఆధిదైవికదుఃఖములు.

ఆధ్యాత్మికదుఃఖము—శారీరక మానసిక బాధలు.

ఆధిభౌతికదుఃఖము—ఇతరమనుష్యులవల్లను, పశుపక్ష్యాదుల వల్లను కలుగు బాధలు.

ఆధిదైవికదుఃఖము—అగ్ని, జల, వాయువైపరీత్యములతో కలుగుబాధలు. అథత్రివిధం దుఃఖాత్యంత నివృత్తిరత్యంతపురుషార్థః॥ (సా. 1 అ. సూ. 1) అనుటచే పైమూడు విధములగు బాధలులేకుండుటే ముక్తి లేక పురుషార్థమని భావము.

మూలతత్త్వములు—25, ఇవియన్నియు సత్వ; రజ; స్తమోగుణరూపమగు మూలప్రకృతినుండియే జనించినవని సాంఖ్యులు తలంతురు. ఈ యిరువదియైదు మూలతత్వములకు గణములని పేరుగలదు. ఈగణములన్నిటికి అధిపతియగుటచే పరమేశ్వరునకు 'గణపతి' అను పేరుగలదు.

మూలతత్త్వములు లేక గణములు:—

సత్త్వరజ స్తమసాం సామ్యావస్థా ప్రకృతిః, ప్రకృ తేర్మహాన్, మహతోఽ హంకారోఽహంకారాత్ పంచతన్మాత్రాణ్యు భయమింద్రియం, తన్మాత్రేభ్యః స్థూలభూతాని, పురుషఇతి పంచ వింశతిర్గణః॥ (అ 1- సూ 61 )

త్రిగుణాత్మకమైన ప్రకృతినుండి మహత్తు; మహత్తు నుండి అహంకారము; అహంకారమునుండి పంచతన్మాత్రలు; ఇంద్రియములును; పంచతన్మాత్రలనుండి పంచభూతములు గలిగి పురుషునితోసహా యిరువదియైదు గణములు. ఈ గణ సముదాయమే సాంఖ్యదర్శనమునకు ప్రాతిపదిక.

త్రిగుణములు___ సత్త్వము; రజము; తమము.

మూలప్రకృతి— 1, త్రిగుణములు కలిసిన రూపము లేక సామ్యావస్థ

మహత్తు— 1, దీనిని అధ్యవసాయము లేక బుద్ధియనిఅందురు.

అహంకారము— 1, ఇది మహత్తునుండి కలుగును. అంటే అహంకారమునకు మూలస్థానము బుద్ధియని అర్థము. దీనిని అభిమానమనికూడ అందురు.

పంచతన్మాత్రలు—5, శబ్దతన్మాత్ర; స్పర్శతన్మాత్ర; రూపతన్మాత్ర; రసతన్మాత్ర; గంధతన్మాత్ర. (ఇతర దర్శనకారులు యీ తన్మాత్రలను ద్రవ్యగుణములుగ భావించిరి.)

ఇంద్రియములు— 11, చెవి; చర్మము; కండ్లు; నాలుక; ముక్కు; నోరు; చేతులు; పాదములు; గుదస్థానము; ఉపస్థజననేంద్రియము (Sexual organ) వీటన్నిటికి ఆదేశాత్మకమైన మనస్సు, మొత్తము 11 ఇంద్రియములు.

పంచభూతములు—5, భూమి; నీరు; తేజస్సు; గాలి; ఆకాశము. ఇవి పంచతన్మాత్రలనుండి పుట్టినవి.

పురుషుడు-ఆత్మ-1, దేహాదులకంటే వేరైయుండును. 'శరీరాది వ్యతిరిక్తః పుమాన్. (అ.1-సూ. 139). మొత్తము 25 మూలతత్త్వములు.

అంతఃకరణములు—4, మనస్సు; బుద్ధి; చిత్తము; అహంకారము. మూలతత్వముల జ్ఞానమునుపొందుటకు సాంఖ్యులకు ప్రమాణములు మూడు.

(--- యత్తత్ త్రివిధం ప్రమాణమ్. 1-87.)

(1) ప్రత్యక్షము (2) అనుమానము (3) శబ్దము.

శబ్దము—ఆప్తుల సదుపదేశమే శబ్దము. ఆప్తోపదేశ శ్శబ్దః (1-101). పై మూడు ప్రమాణములతో సాంఖ్యమునందు ఆత్మ శాశ్వతమని ఋజువుచేయబడినది. ద్వితీయాధ్యాయము తొమ్మిదవసూత్రమునుబట్టి సృష్టికారణము 'రాగమని' నిర్ణయింపబడినది. ఇరువదియైదు తత్వముల సంయోగము పెరిగిన కొలది విశాలసృష్టియేర్పడు క్రమము; ఈవిశాలసృష్టిలో క్రమవృద్ధిజెందునప్పటి భిన్నపదార్థముల సంఖ్య, వాటిలక్షణములు, యీశాస్త్రమందు వివరింపబడినవి.

మూలతత్వములను క్రమముగ గ్రహించినచో సర్వ సృష్టికి ఉత్పత్తిస్థానము సత్వ, రజ, స్తమోగుణముల మూడింటి సామ్యావస్థయని తెలియగలదు. అప్పుడు పురుషుడు భోక్త మాత్రుడై -అనుభవించువాడై-సృష్టికి కారణము, రాగము అని గ్రహించును. రాగవిముక్తుడైనచో పురుషుడు ముక్తి నొందగలడని యీదర్శనములో ఉద్దేశింపబడినది. భగవద్గీతలో ప్రతికార్యమునకు ఐదుకారణములని తెలుపబడినది. (1) అధిష్ఠానము, (2) కర్త, (3) వివిధసాధనలు — కరణములు, (4) వివిధచేష్టలు, (5) దైవము. ఈకారణాలు సాంఖ్యములో అంగీకరింపబడును.

త్రిగుణములు:—సత్వగుణము-ప్రీతిఅనగా సుఖం. సుఖాత్మకమైనది సత్వగుణము.

రజోగుణము— అప్రీతి-దుఃఖము, దుఃఖాత్మకమైనది రజోగుణము.

తమోగుణము—విషాదం అనగా మోహం. మోహాత్మకమైనది తమము.

ముక్తి—జ్ఞానాన్ముక్తిః॥ అ 3. సూ 23. వివేక సాక్షాత్కారముద్వారా దుఃఖము తొలగును. ఈశ్వరుడే సృష్టి కార్యమునకు కారణమూపుడు గాకపోయినను సర్వము తెలిసినవాడని, సర్వకర్తా అని యింనుస్నిర్ణయింపబడినది.

(అ 3. సూ 65-67.)

ఉపాధిభేదముచేత ఆత్మకు అనేకత్వముకలుగును.

(అ 6. సూ 45, 46)

వైశేషికుల షట్పదార్థవాదనను; పరమాణు నిత్యవాదనను సాంఖ్యు లంగీకరించరు. ఎలెక్ట్రాన్లు ప్రోటానులమధ్య సంఘటన విఘటనాశక్తిని ఛేదించక పూర్వము ప్రతి పరమాణువు కార్య రూపములో నుండును. కనుక దానికి అస్థిరత్వముకలిగి అనిత్య రూప మేర్పడవచ్చును. అందుచేత సామాన్యముగ పరమాణువు నకుగల ధర్మాన్నే చూచి సాంఖ్యులు పరమాణువు అనిత్య మన్నారు. ఇందుకు యింకొక కారణముగూడగలదు. దర్శనము లన్నింటిలోకి మొదటిదర్శనము సాంఖ్యదర్శనమే. అతి ప్రాచీనకాలమునాటి విజ్ఞానరూపమగుసాంఖ్యతత్వము (పరమాణు అనిత్యత్వము) వైశేషిక దర్శన రచనాసమయానికి వికాసము నందియుండుటవల్ల వైశేషికులు పరమాణు నిత్యత్వమును కనుగొనియుండిరి.

సాంఖ్యమతములో బుద్ధికి ప్రధాన స్థానమీయబడుట చేత బౌద్ధదర్శనమునకు, దీనికీసంబంధమున్నది. యోగసాధనకు; వేదాంతప్రవేశమునకు; వైద్యశాస్త్రమును చదువుటకు ముందు సాంఖ్యవైశేషిక దర్శనములను చదువుటముఖ్యము.

## (4) యోగదర్శనము.

వాస్తవికజ్ఞానము గలిగినపిమ్మటనే దుఃఖముతొలగి ముక్తి కలుగును. అట్టి జ్ఞానమును సాధించు విధానము యోగ దర్శనమునందు వివరింపబడినది. సర్వేంద్రియములను నిగ్రహించి మనస్సును ఆత్మ స్వాధీనము జేసుకొనుట యోగమన బడును. ఈ యోగముద్వారా పవిత్రజ్ఞానము (Pure know-

ledge) కలుగును. దానిని దివ్యమానసికశక్తి (Super mind) అనికూడ అనవచ్చును. యోగవిషయమును వివరించుటచే యీదర్శనమునకు యోగదర్శనమని పేరువచ్చినది.

యోగసాధన వలన ముక్తియేగాక భౌతికముగ మానవుడనేక విభూతులను పొందవచ్చునని యోగదర్శనము తెలుపును. "విభూతి పాదము" అను ప్రకరణములో యీ విషయము విపులీకరించబడినది. పంచభూతములను స్వాధీనము జేసుకొని మానవుడు అద్భుతమైన శరీరశక్తిని సంపాదించగలడని ప్రతిపాదించబడినది. కొద్ది దశాబ్దములనాటి వ్యక్తియగు స్వామీ దయానందమహర్షి యోగసాధనద్వారా అనేక శారీరక శక్తులను సంపాదించెను. హరవిలాస్ శారదాగారు 'Life of Swami Dayananda' అను గ్రంథములో దయానందుడు పొందిన శారీరకశక్తులను తెలిపియున్నారు. అనేకులు తమశరీరములను మిక్కిలి తేలికగను, మిక్కిలిబరువుగను చేయుచుందురు. అయితే యీ యోగసాధన అత్యంత కష్టదాయకమైనది.

ఆసనశుద్ధి, మానసిక, శారీరిక క్లేశములు లేకపోవుట అనేవి సమాధినిష్టకు యోగమునకు ప్రధాన అంగములు. సమాధినిష్టకు-యోగమునకు- ప్రాణాయామము సాధనగగైకొనబడినది.

యోగదర్శనములోని ముఖ్యవిషయములు:

యోగము___ ఉపాసనలోగాని; ఇతరవ్యవహారములోగాని; పరమేశ్వరవిషయమునందుదప్ప, యితరమైన ప్రవృత్తులలో

మనస్సునుచోరనివ్వకపోవుట. 'యోగశ్చిత్తవృత్తినిరోధః॥ వృత్తిసారూప్య మితరత్ర' (1-2, 4)

**వృత్తులు**— 5, సర్వజీవులలోను క్లేశము; క్లేశరహితము, అను భేదముతోనుండు వృత్తులు ఐదు విధములు. (1) ప్రమాణము (2) విపర్యయము (3) వికల్పము (4) నిద్ర (5) స్మృతి.

**ప్రమాణము**— 4, ప్రత్యక్షము; అనుమానము; ఉపమానము; ఆగమము - వేదము.

**విపర్యయము**= మిథ్యాజ్ఞానము; వికల్పము= వస్తువులేకపోయినను వస్తువు ఉన్నదను జ్ఞానము; నిద్రా= జాగ్రత్స్వప్నములలో ఆభావమును ఆశ్రయించుట; స్మృతి= ప్రత్యక్షముగ జూచిన వస్తువును చిత్తమునందు గుర్తుపెట్టుకొనుట.

**యోగాంగములు**— 9, యమము; నియమము; ఆసనము; ప్రాణాయామము; ప్రత్యాహారము; ధారణ; ధ్యానము; సమాధి (2 పా. 29 సూ)

**యమములు**— 5, అహింస; సత్యం; అస్తేయం; బ్రహ్మచర్యం; అపరిగ్రహం. (2పా. 30 సూ)

**నియమములు**— -, శౌచము; సంతోషము; తపస్సు; స్వాధ్యయనము. ఈశ్వరప్రణిధానము. (2పా. 32 సూ)

**ప్రాణాయామము**— ఊపిరివదలుట - పీల్చుటలయొక్క నడకను విచ్ఛేదము అనగా స్వాధీనముజేసుకొనుట ప్రాణాయామమగును. 'శ్వాసప్రశ్వాసయోర్గతి విచ్ఛేదః ప్రాణాయామః॥

ఈశ్వరుడు— మంచిచెడుగు పనులు; వాటిఫలము; వాటివా
  సనలకు సర్వకాలములలోను సంబంధములేనివాడు. 'క్లేశ
  కర్మవిపాకాశయైరపరామృష్టః పురుషవిశేష ఈశ్వరః'
  (2 పా 27సూ)

వాచకము— ఈశ్వరునికిగల పేరు 'ఓం' అను ధ్వని.
  తస్యవాచకః ప్రణవః॥ (2పా 27 సూ)

ఈ దర్శనములో ప్రాణాయామ నియమములు, విభూతులు మిక్కుటముగ వివరింపబడినవి. సమాధి, సాధన, విభూతి; కైవల్య అను పేరులతో యీ దర్శనము నాలుగుపాదములుగ విభజింపబడినది.

## (5) పూర్వమీమాంస — (6) ఉత్తర మీమాంస *

పూర్వమీమాంస కర్మవిషయమును తెలుపును. ఉత్తరమీమాంస బ్రహ్మస్వరూపనిర్ణయము జేయును. ఉత్తరమీమాంసకు వేదాంతదర్శనమని, శారీరక మీమాంసయని పేర్లుగలవు. సృష్టికిగల కర్మకారణమును పూర్వమీమాంస; బ్రహ్మయొక్క నిమిత్తకారణము వేదాంతదర్శనము,బోధించును. ఈ రెండుదర్శనములకు వేదములే ప్రమాణములు. అందులోను ముఖ్యముగ వేదాంతదర్శనమునందు 'శాస్త్రయోనిత్వాత్ 'అని యున్నది. ఈవాక్యముచేత వ్యాసుని ప్రత్యేకప్రతిభ; విశాల

* ఈ రెండు శాస్త్రములు సమాజములో మిక్కిలి ప్రచారములో నుండుటచేతను, గ్రంథవిస్తర భీతితోను, క్లుప్తముగ వీటినిగూర్చి వ్రాయడమైనది. కాని ఉత్తమములగు యీశాస్త్రములపై చులకనభావముతో గాదు.

త్వము కనుపించుచున్నది. శాస్త్రము అను పదములో 'విశాల ప్రపంచములోని ఉత్తమ శాస్త్రములన్నీ' అనికూడ అర్థము యిమిడియున్నది. ప్రధాన లక్ష్యమునకు దూరముగాకుండ శబ్దములకు అర్థములను స్వతంత్రముగ నిర్ణయించుకొనుటకు వ్యాసభట్టారకుడే పునాది వేసినాడనుటకు నిదర్శనము యీ సూత్రమే చాలును.

వేదాంతదర్శనమును త్రిమతాచార్యులంగీకరించి భాష్యములను వ్రాసిరి. ఈ దర్శనమునందు ఆత్మ-పరమాత్మ-ప్రకృతి విషయములే చర్చింపబడినవి. మూడింటిలోను బ్రహ్మదర్శనము వివరింపబడినది. మిథ్యాజ్ఞానముద్వారా భిన్నత్వము, వాస్తవిక జ్ఞానముద్వారా అభిన్నత్వమెట్లు కలుగునో వివరించబడినది. 'భేదదృష్టియే మిథ్యాజ్ఞానము' అనువరకు వేదాంతదర్శనము వివరించినది. ఉపాధిభేదముచేత ఆత్మకుకలుగు భిన్నత్వమంగీకరింపబడినది. బ్రహ్మజ్ఞానము లేకపోవుటయే దుఃఖము; అట్టి జ్ఞానము కలుగుటయే ముక్తియని వేదాంతుల మతము. ఈ దర్శనమునందలి సూత్రములకు అధికరణములను స్వామీ శంకరాచార్యులే నిర్ణయించినారు. శంకరాచార్యుని భాష్యమునందు "కుండలోమట్టి సర్వత్రా వ్యాపించి యున్నట్లు ఈశ్వరుడు ప్రకృతి అంతటను వ్యాపించియుండు"నని తెలుపబడినది. ప్రపంచములో అనేకమంది యీ దర్శనమును మిక్కిలి శ్రద్ధతో అధ్యయనము జేయుచున్నారు.

బుద్ధుని పేరుతోనే బుద్ధునితరువాత కొన్ని శతాబ్దములకు బుద్ధుని లక్ష్యాలకువ్యతిరేకముగ జైనులు మొదలైనవారు దేశమునందు మతప్రచారము సలుపసాగిరి. ఇట్లే హిందువులలో అనేక శాఖలుబయలుదేరి ప్రతిశాఖయు, తాను జేయు ప్రతిపనియు వైదికమేనని ప్రకటించుకొనసాగెను. వేదముల పేరుతోనే వైదికధర్మాన్ని మరువసాగెను. సమాజము అల్లకల్లోలముగనుండెను. అట్టిస్థితిలో స్వామీశంకరాచార్యులు తమగురువగు గౌడపాదులు రచించిన మాండూక్యోపనిషత్తునకుగల అద్వైత కారికలను; వేదాంతదర్శనమును, చేబూని వివాదములతో ప్రొద్దుపుచ్చు శాఖోపశాఖలన్నిటిని ఖండించి అద్వైతమతమును స్థాపించెను. అప్పటినుండి వేదాంతదర్శనము మిగిలిన దర్శనముల కంటే మిక్కిలి ప్రచారములోనికి రాసాగెను.

## బౌద్ధదర్శనములు - నాస్తికదర్శనములు

బుద్ధిపైనాధారపడి బుద్ధికిప్రధానస్థానమిచ్చి పరిశోధనలు సలుపు తత్త్వవిచారణ బౌద్ధమతము. సిద్ధార్థుడీ మతమును - అభిప్రాయమును-ప్రచారము సలుపుటచే అతనికి గౌతమబుద్ధుడను పేరు వచ్చినది. గౌతమబుద్ధుని ఉపదేశాల నాధారముగా గైకొని అతని శిష్యులు రచించిన తత్త్వశాస్త్రములు బౌద్ధదర్శనములు. ఈ బౌద్ధదర్శనములు నాలుగు. సాంఖ్యదర్శనమునందువలెనే యీ దర్శనములలోగూడ (1) బుద్ధికి ప్రధానస్థానమీయబడినది. బౌద్ధదర్శనములు నాల్గింటిలోను ముక్తిని

(1) 'బుద్ధిర్వివత్యతాజ్ఞానం' అమరకోశం॥

గూర్చి ఏకాభిప్రాయమున్నది. రాగము; మమకారము; క్రోధము మొదలైన వికారముల వాసనయే బంధము. ఆవాసన నశించుటయే ముక్తియని యీ దర్శనములు బోధించును. ఆత్మ సత్తాను - ఆత్మఅనేది ఉన్నదిఅని - ఈదర్శనములు అంగీకరించవు. "ఆత్మవిషయము అప్రస్తుతము" అని బుద్ధునిబోధనలలోనే వుండుటచే బౌద్ధదర్శనకారులు ఆత్మప్రసక్తిని తీసుకొనిరాలేదు. కనుక వీటిని నాస్తికదర్శనములని చెప్పసాగిరి. బౌద్ధదర్శనములలోనున్న ముఖ్యభేదములీక్రింది విధముగా నుండును.

బౌద్ధ దర్శనములు— 4. వైభాషికము; సౌత్రాంతికము; యోగాచారము; మాధ్యమికము.

(1) వైభాషికము— పదార్థములోని జ్ఞానము పదార్థమునాశ్రయించుకొనియుండుననితలచి జ్ఞానములోని పదార్థమునే వైభాషికులు ప్రత్యక్షముగ నెంతురు.

(2) సౌత్రాంతికము— ఆంతరిక స్థితినే యీ దర్శనము ప్రత్యక్షమని భావించి, అనుక్షణము మారుచున్న అశాశ్వతమగు ప్రకృతి ప్రత్యక్షముగాదని బోధించును.

(3) యోగాచారము— ఆకారసహితమైన జ్ఞాననిష్ఠబుద్ధినే ప్రమాణముగ అంగీకరించును.

(4) మాధ్యమికము— ఈదర్శనము ప్రతిజీవియు తనలోనుండు పదార్థసంబంధమైన బుద్ధినే అంగీకరించవలెనని బోధించును.

ఈదర్శనములన్నింటికి ప్రమాణములు రెండు (1) ప్రత్యక్షము; (2) అనుమానము.

సాధనమార్గము — అహింస, ధర్మములు.

(1) ప్రత్యక్ష (2) అనుమానములు రెండే వీరికి ప్రమాణములు. కనుక వేదప్రామాణ్యమును వీరు అంగీకరించరు.

ఈ దర్శనములన్నింటిలోను సమానరూపముగ ప్రవహించు సిద్ధాంతస్రోతస్సులు బుద్ధుని ఉపదేశాలనుండి బయల్వెడలినవే యగుటవలన బుద్ధుని ఉపదేశాలనుగూర్చి తెలుసుకొనుట అవసరము.

## బుద్ధుని ఉపదేశములు

బుద్ధుని ఉపదేశములు మూడురూపములుగ నున్నవి. (1) ధమ్మపథము (2) త్రిపిటకము (3) జాతకకథలు.

(1) ధమ్మపథము:— పాలీభాషలో పద్యరూపమునందు గలబుద్ధుని ఉపదేశములతోగూడిన చిన్నగ్రంథము. ఇదిభగవద్గీతవలె మృదుమధురశైలిగలిగి మహత్తరతత్త్వ విషయాన్ని బోధించును.

(2) త్రిపిటికములు:— బుద్ధుడు తన జీవితకాలములో చేసిన ఉపదేశాలసంగ్రహములే త్రిపిటికములు.

(3) జాతకకథలు:-ఇవిమనోహరమైన కథలరూపములోనున్న బుద్ధునిఉపదేశములు. బాలురుకథలరూపములోనున్న ధర్మములనుత్వరగా గ్రహింతురు. అట్లే సామాన్య ప్రజానీకానికిబుద్ధుడు చక్కని కల్పిత కథలద్వారా అహింసాతత్త్వమును బోధించెను.

* ఈ కథలలో బుద్ధుడు పూర్వజన్మమునందు బోధిసత్త్వుడను పేరుతో జీవితమునుగడపి నట్లుండును. అందుచే వీటికి జాతక కథలని పేరువచ్చినది. వీటియందు సత్య - అహింసాయుత సంఘటనలయొక్క వర్ణనలు మిక్కుటముగ కానుపించును.

బుద్ధుని ఉపదేశాలలోను, అతని జీవితంలోను అహింస యొక్క విస్తృత వికాసరూపము వృట్టిపడుచుండును. రెండు వేల సంవత్సరములకు పూర్వము భారతదేశములో రాజులు భోగలాలసులై, ప్రజలను నిరర్థక మూఢ విశ్వాసజనిత కర్మ సిద్ధాంతమునకు వదలివేసి, వారిని నానా హింసలు పెట్టుచుండెను. ద్విజులు యజ్ఞములలో పశుహింస జేయుట తప్పని సరియని తలచి ఘోరహింసా కార్యములను దైవము పేరుతో జేయుచుండిరి. పురోహిత, పూజారి వర్గముల నిరంకుశాధికారములు స్వైరవిహారము చేయుచుండెను. కులభేదముల, కులద్వేషముల క్రుళ్ళు సమాజమంతటను అలముకొని యుండెను. తమ రాజ్యభోగాలకే రాజులు పరస్పరము యుద్ధములు జేయుచుండిరి. ఈయుద్ధములలో లక్షలాది అమాయక ప్రజలు ఆహుతియైపోవుచుండిరి. ఇట్టిభయానక దారుణ స్థితిలో బుద్ధుడు క్షత్రియ కుటుంబమున జన్మించి; లోకములో దుఃఖనివారణ చేయదలచి; అమోఘ త్యాగాన్ని జేసి; కఠిన తపమాచరించెను. కాని అతపస్సు వలన ప్రయోజనముగాంచక తన హృదయము లోని బుద్ధిప్రేరణచే కలిగిన అహింసా, ధర్మమార్గములను

* బౌద్ధులలో అనేకులు బుద్ధుడు తన పూర్వజన్మ విషయాలనే జాతకకథలలో చెప్పినాడని నమ్ముదురు.

ప్రచారములోనికి తెచ్చెను. కనుకనే బుద్ధుని ఉపదేశములలో సృష్టి యంతయు దుఃఖరూపముగను, బంధనముగను వర్ణింపబడినది.

గయలోని దుర్గమారణ్యములనుండి వెడలి సారనాథ్ లో బుద్ధుడు ప్రప్రథమమున తన శిష్యులకు 'రెండు అంతములను' సేవించరాదని ఉపదేశించెను. కామాసక్తి; దేహాక్లేశము; అనునవే రెండు అంతములు. కామము- తృష్ణ- చేతనే మానవునకు దుఃఖమేర్పడుచున్నది. మోక్షాపేక్షతో శరీరమును కృశింప జేసుకొని లోకము మాట మరచినచో కామముకంటె దీనిలో భయంకరమైన దోషమున్నది. ఇందు అహంకారము; గర్వము; ఇతరులను తక్కువగచూచు దుర్గుణములు ప్రవేశించవచ్చునని బుద్ధుని యుద్దేశ్యము.

బుద్ధుడు నాలుగు ఆర్యసత్యములను తెలుసుకొనుట ప్రతి మనుజుని కర్తవ్యమని తెలిపెను. (1) దుఃఖము (2) దుఃఖమునకు కారణము (3) నిరోధము - ముక్తి (4) నిరోధమార్గము అనునవి నాలుగు ఆర్యసత్యములు. ప్రపంచము దుఖరూపము. తృష్ణ; కామవాంఛ యీ రెండే దుఃఖమునకు కారణములు. దుఃఖము పూర్తిగ తొలగుటయే నిర్వాణము. * ఈ నిర్వాణమును పొందుటకుగల సాధనములు యెనిమిది.

---

* బౌద్ధులు నిర్వాణము అను పదమును 'ముక్తి' అను అర్థములో ఉపయోగింతురు.

(1) సమ్యక్ దృష్టి (2) సమ్యక్ సంకల్పము (3) సమ్యక్ వచనము (4) సమ్యక్కర్మాంతము (5) సమ్యక్ ఆజీవము (6) సమ్యక్ వ్యాయామము (7) సమ్యక్ స్మృతి (8) సమ్యక్ సమాధి. (సమ్యక్ అనగా సంపూర్ణమైన అను అర్థము.) ఈయెనిమిది విధానములు నిర్వాణమును పొందుటకుగల మార్గములు. వీనిద్వారా పైనుదహరించిన నాలుగు ఆర్యసత్యములను గ్రహించుటయే సర్వజ్ఞత్వమని బుద్ధుడు బోధించెను.

సృష్టికర్తృత్వము, ఆత్మవాదనలను గూర్చి బుద్ధుని అభిప్రాయమిట్లుండును:—

ఆత్మవాదము:— భౌతికజగత్తులో కానుపించనట్టియు, ఊహాచే కల్పించబడునట్టియు ఆత్మవిషయమగు చర్చకు సమయమును వ్యర్థము జేయుటకంటే, ప్రత్యక్షముగ లోకములో కనుపించు దుఃఖనివారణకే బుద్ధిని వినియోగించుట శ్రేయస్కరము. నీ - నా; అను భేదమే కలహమునకు, దుఃఖమునకు మూలకారణము. కామవాంఛ వీడినచో ఆదుఃఖముతొలగును. అప్పుడు సుఖము; శాంతి కలుగును. కనుక ఆత్మవిషయమైనచర్చ అప్రస్తుతము. జన్మమరణముల (Birth and Death) మధ్యనుండునది ప్రపంచము. ఇదియే ప్రతీత్యసముత్పాదము. దీనికి అవిద్య; సంస్కారము; జాతి; వేదన; మరణము; షడాయతనము; మొదలైన పన్నెండు అంగములున్నవి. మనస్సు; పంచేంద్రియములు కలసి షడాయతనమగును.

సృష్టికర్తృత్వము:— ప్రత్యక్షవిషయమునుజూచి దాని కారణమును యోచించుట అప్రస్తుతము. బాణముదెబ్బతగిలిన మనుష్యునకు బాధను తొలగించుటయే మనకు ప్రథమకర్తవ్యము. "కాని బాణమెటువైపునుండి వచ్చినది?" అని ఆలోచించుట అప్రస్తుతము. అట్లే దుఃఖముతో కూడిన ప్రపంచమునందు దుఃఖనివారణకై కృషి జేయవలెనుగాని సృష్టికి కారణమెవరని తర్కించుకొనుట అయుక్తము.

'కామయే దుఃఖతప్తానాం ప్రాణినామార్తి నాశనమ్' అను ఆర్యవచనమును చక్కగ జీర్ణింపజేసుకొన్నచో బుద్ధుడు బోధించిన ఉపదేశములు వైదికమతాభిమానులకు ఏవగింపుగానుండవు. లోకములో బాధానివారణయే తన పరమార్థముగ బెట్టుకొని, కఠిన జీవితాన్ని గడపిన బుద్ధుడు, భారతజాతికి దివ్యమైన సంతానరత్నమై, లోకానికి అఖండజ్యోతిని ప్రసాదించెను. వేదములు, ఆస్తికదర్శనములు కూడ మానవునకు దుఃఖనివృత్తియే లక్ష్యమని బోధించునుగదా? మఱి బుద్ధుడు గూడ దుఃఖనివృత్తికొఱకేగదా తన జీవితాన్ని ధారవోసినది? కనుక వైదిక లక్ష్యము. బుద్ధునిలక్ష్యము ఒక్కటేయగుచున్నది. కులభేదములు కల్పితమని; వాటిని పాటించుట 'సమ్యక్ దృష్టి' గాదని యీమహాశయుడు బోధించి లోకమంతటకి ప్రేమపాత్రుడైనాడు.

శంకరుని అద్వైతమునుగూడ సంపూర్ణ సమదృష్టియేనని చెప్పవచ్చును. మనీషా పంచమఘట్టములో, చర్మకారునిజూచి,

అతనిపాదములపై బడి "నేటికిగదా నాకు అద్వైతము సిద్ధించి నది." అని తలచి, ఆ చర్మకారునిగూర్చి 'చాండాలోస్తుసతుద్విజోస్తు గురురిత్యేషా మనీషామమ (ఇతడు ద్విజుడుగానీ; చాండాలుడుగానీ; నాకు గురువే) అని పలికిన శంకరాచార్యుని అద్వైతము సంపూర్ణ సమదృష్టిగాక మఱియేమగును? బుద్ధుడు తన జీవితముద్వారా లోకానికిచాటిన సమత్వమును శంకరుడు అనన్య ప్రతిభతో అద్వైతవాదముతో లోకానికి చాటినాడు. పరమపవిత్ర జీవితాన్ని గడిపిన బుద్ధుడు, భారతావనిలో జన్మించి, దేశదేశాలలో తన ప్రేమసిద్ధాంతమును వ్యాపింప జేసినాడు. కాని భారతదేశములోనే, బుద్ధుని అహింసాబోధనలను చులకనభావముతో నిర్లక్ష్యముచేయుట హిందువులలో (ఆర్యులలో) పరిపాటియైనది. వాస్తవముగ ఇట్లు నిర్లక్ష్యభావముతో నుండుట మనలక్ష్యాన్ని మనము మరచుటయే.

## ఆధునిక దార్శనికులు

మానవుల దుఃఖాలను, బాధలను తొలగించుటకు నిస్వార్థమైన కృషిసల్పి సృష్టిరహస్యాన్న న్వేషించి, మహత్తరమగు మానవసేవ జేయువారందరు దార్శనికులే. ఈకాలపు వైజ్ఞానికులు, తత్త్వవేత్తలు, ఈయిరు తెగలవారుకూడ దార్శనికులనబడుదురు. వైజ్ఞానికులనుభౌతికవిజ్ఞానవేత్తలని(Scientists) రసాయనశాస్త్రవేత్తలు లేక రాసాయనికు (Chemists) లని రెండు తెగలుగ విభజించవచ్చును. కనుక భౌతిక విజ్ఞానవేత్తలు,

రాసాయనికులు, తత్త్వవేత్తలు యీముగ్వురును నేటికాలపు దార్శనికులు.

సృష్టి అంతయు ద్రవ్యమయమైయున్నది. విశాలమైన ఖాళీప్రదేశములో సూర్యుడు, చంద్రుడు, భూమి, నక్షత్రాలు, మనము, మనపనులు, మనమాటలు వ్యాపించియున్నవి. ఇవి యన్నియు ద్రవ్యములే. కొంత ఆకాశమును (Space) ఆక్రమించిన ప్రతివస్తువు ద్రవ్యమే. ఈద్రవ్యములు సూర్యునివంటి పెద్ద రూపము గల్గియుండిగూడ $1.5X10^{=31}$ ప్రదేశాన్ని ఆక్రమించు సూక్ష్మత్వమునుగూడ కలిగియున్నవి. కనుకనే "అణూరణీయాన్ మహతో మహీయాన్" అని పెద్దలన్నారు. వైశేషికాది ప్రాచీనదర్శనములు ద్రవ్యములనన్నిటిని మూలరూపములలోనికి మార్చుకుంటూ, పంచభూతముల రూపములోనున్నవే ద్రవ్యములని జెప్పిరి. కాని నేటి వైజ్ఞానికలోకము మూలద్రవ్యముల నిర్ణయము ఒక ద్రవ్యములో ఇంకొక ద్రవ్యము కలవనట్టి స్థితిపొందునప్పుడు, ఆద్రవ్యమెద్దియో దానినే మూలద్రవ్యము (Element)ని తలంచుచున్నది. గంధకములో యింకేద్రవ్యము కలవనప్పుడు అది ఒక మూలద్రవ్యమగును. ఇట్టిమూలద్రవ్యగణన ప్రాచీనకాలమందును గలదు. అయితే గంధకముగూడ ద్రవ్యమైనను అందులోని వాసనభాగము భూద్రవ్యమనీ, వెచ్చదనము అగ్నియని, చెమ్మభాగము జలద్రవ్యమనీ ప్రాచీనులుభావించిరి.

మూలద్రవ్యములను నేటివలనే ప్రాచీనులుగూడ అనేక పదార్థములనుండి ప్రయోగములద్వారా వేరుజేసెడివారు.

ఇంగిలీకములో గంధకము, పాదరసము రెండూకలసియుండును. ఇంగిలీకము (Cinnabar) నుండి పాదరస (Mercury) మనెడి మూలద్రవ్యమును క్రింది విధముగ ప్రాచీనభారతీయులు వేరు జేసెడివారు.

పారిభద్రరసైః పేష్యం హింగుళం యామమాత్రకం । జంబీరాణాంద్రవైర్వాథ పాచంపాతన యంత్రకే । తంసూతం యోజయేద్యోగే, సప్తకంచుక వర్జితం ॥ (బసవరాజీయం)

"ఇంగిలీకమును వేపచెక్కరసము, లేక నిమ్మపండ్లరసముతో ఒక ఝాముమర్దించి పాతనాయంత్రమునందు వండిన-చో, సప్తకంచుక దోషరహితమైన పాదరసము (Mercury) తయారగును. దీనిని ఔషధములలో ప్రయోగించుకొనుట యుక్తము".

ఇట్లే చరకము, వాగ్భటము, సిద్ధనాగార్జునుని కక్షపుటను తంత్రము మొదలైన గ్రంథాలలో మూలద్రవ్యములను వేరు జేసుకొని వాటిరసాది గుణములను గ్రహించు విధానములు గలవు. నేటిరసాయన శాస్త్రానికి ప్రారంభదశ చరక సుశ్రుతాది భారతీయగ్రంథములని P. C. రే గారే 'A History of Hindu Chemistry' అను గ్రంథమునుజూచినచో తెలియగలదు.

నేటి వైజ్ఞానిక రాసాయనికవేత్తలు—

చరక, నాగార్జునులవంటి ప్రాచీన భారతీయ వైజ్ఞానికు

లకు ఆధునిక వైజ్ఞానికులకు కొంతభేదమున్నది. ప్రాచీన భారతీయ వైజ్ఞానికులు, వస్తూత్పత్తితోబాటు, సృష్టికిగల కారణాన్వేషణనుగూడ ముఖ్యముగ యోచించెడివారు. కాని నేటి వైజ్ఞానికులలో అనేకులు వస్తూత్పత్తి క్రమముయొక్క వాస్తవికతను దెలుపుచు, సృష్టికారణాన్వేషణలో అధికసమయాన్ని వెచ్చించరు. ఇందుచేత ఆస్తిక తత్త్వవేత్తలలో కొందరికి వైజ్ఞానికులతో పొత్తుకుదురుటలేదు. వైజ్ఞానికులు తాముజేయు పదార్థాన్వేషణద్వారా కనుగొన్న దుఃఖనివారక సౌకర్యములను తమకొరకే దాచుకొనక లోకానికి వెంటనే నిస్వార్థముగ దెలుపుచుందురు. పైగా సాటిమానవులకావిషయాలను తెలుపునప్పుడు వైజ్ఞానికులు సత్ప్రవర్తన, ఋజుశీలతలను బోధించుచుందురు. ఇక ఆస్తికులో సంపూర్ణ సమదృష్టి నలవరచుకోవలసినవారు. లేనిచో ఆస్తికవిశ్వాసము వారికిలేనట్లగును. కనుక మానవ సౌకర్యమునకై నిరంతరము కృషి సల్పుచు, ఆత్మ; ఈశ్వరుడు, అను విషయాలను చర్చించనట్టి వైజ్ఞానికులపై ఆస్తికులకు హేయభావము కలుగుట ధర్మము గాదు. "వైజ్ఞానికులు చేసిన వస్తు పరిశోధన ద్వారా అనేక మారణాయుధాలు తయారైరె లోకంలో ఘోర ప్రమాదాలు, హింస; పెరుగుచున్నవి గదా! అని ప్రశ్నించవచ్చును. నిజమే, ఈ ఘోరహింసా కాండకు వైజ్ఞానికులకృషి యెన్నటికీ బాధ్యత వహించదు. ఎందుకనగ భౌతిక పరిశోధనను పూర్తిగ మానివేసి, పై పెచ్చుదానివల్ల హింసాభావము పెరుగుననే దురభిప్రాయమును సైతము కలిగియుండి, కేవల ఆధ్యాత్మిక తత్త్వ

మును బోధించుటలోనే కాలముగడిపిన మన మతప్రచారకుల వల్ల మనదేశములో హెచ్చు-తగ్గు భేధాలనేరూపంలో ఘోర మైన చిత్రవధా రూపకమగు హింసాకాండ జరుగలేదా ? కనుక మానవులలోని పరస్పరద్వేషమే హింసాకాండకు బాధ్యత వహించవలసియున్నది. ద్వేషములేనిదే హింస యెచ్చటనుండి పుట్టును ? విజ్ఞాని వైజ్ఞానిక పరిశోధన చేయు నప్పుడు యెవ్వరిపైనను ద్వేషమును బూనియుండడు. ద్వేషము వంటి చెడ్డభావాలు హృదయంలోవున్నప్పుడు మనస్సు నిశ్చల ముగ వుండక పోవుటచే, వైజ్ఞానికుడు పదార్థాన్వేషణ జేయ జాలడు. సర్వేంద్రియములను నిగ్రహించి నప్పుడే వైజ్ఞానిక పరిశోధనసాగును. ద్వేషాది మానసిక వికారపర్యవసానమే హింస. ద్వేషాది మానసిక వికార రహితమై హృదయముతో కూడిన దగుటచే వైజ్ఞానికుని పదార్థాన్వేషణ, హింసకు కార ణము గాని, బాధ్యురాలుగాని కాజాలదు.

అయితే దారుణహింసాకాండకు కూడ వైజ్ఞానికకృషిని, వినియోగించుకొన వచ్చును. నిప్పుతో అన్నమునువండి, ఆకలి తీర్చవచ్చును. ఆనిప్పుతోనే తృటిమాత్రంలో గ్రామాన్నంత టిని తగులవేయువచ్చును. దీనిలో నున్నదోషము "నిప్పు దహించును" అనికనుగొన్న వైజ్ఞానికునిదా ? కాదు, దానిని ఉపయోగించుకొన్న ప్రవృత్తినిబట్టి, పరిణామము కలుగు చుండును. కనుక నేటి దారుణ హింసాకాండకు, ఆయాదేశాల లోని రాజ్యాంగ వ్యవస్థలు; పారిశ్రామికుల (Industrialists) స్వార్థదృష్టి; వైజ్ఞానికుల వ్యక్తిగత జీవితములలోని బలహీన

తలు, కారణమైయున్నవి. "నూనెకు చెడ్డవాసన కలుగకుండ హైడ్రోజనేట్ చేసి ఎక్కువరోజులు వుంచవచ్చును" అని వైజ్ఞానికుడు కనిపెట్టినాడు. వాసన; రుచి; లేని ఆనూనె నేడు వనస్పతి పేరుతో నేతిక్రింద చలామణి అవుతూ వుండటానికి బాధ్యత యెవరిది ? తల నూనెలకు, సబ్బులకు ఉపయోగించుటలో పనికివచ్చే హైడ్రోజనేటెడ్ - వనస్పతి - నూనెను ప్రజలకు ఆహారముగ పంచిపెట్టి, ప్రజారోగ్యాన్ని నాశనంచేసే పనిలో, పెట్టుబడిదార్లకు, ప్రభుత్వ అసమర్థతకు, వైజ్ఞానికుడు తనవ్యక్తిగత జీవితంలోవున్న బలహీనతవలన, తోడ్పడ సాగినాడు. ఇట్లే కళాత్మకమైనట్టియు; నిత్యజీవితావసరమైనట్టియు, వస్తూత్పత్తి పరిశ్రమను కేంద్రీకృతముజేసి దేశీయ సంపదను ఛిన్నాభిన్నము జేయుటకు పైముప్వురి ప్రవృత్తులు కారణమగుచున్నవి. కాని విజ్ఞానకృషి మాత్రముగాదు.

దైవము పేరుతో జరుగుచున్న దుర్మార్గకార్యములకు, దైవవిశ్వాసముగల సాధుపుంగవుల సత్ప్రవర్తన యెన్నటికీ బాధ్యత వహించదు. ఆ సిద్ధాంతాన్ని మోసముతో వినియోగించుకునే వంచకులే దుష్టకృత్యములకు బాధ్యత వహించవలసియున్నారు.

సాధారణ మానవసంస్కృతివలెనే, వైజ్ఞానికకృషిలో గూడ పూర్వకృషి ఉత్తరకృషికి బీజమై యుండును. న్యూటన్ మహాశయుడు కనుగొన్న (Gravitation) గురుత్వాకర్షణ వంటి అనేక సిద్ధాంతములపై ఐన్‌స్టిన్ మహాశయుడు పరిశోధన

జేసి వానిలో కొన్ని మార్పులను ప్రవేశపెట్టెను. ఐన్‌స్టిన్ మహాశయుడు న్యూటన్ సిద్ధాంతమును మార్చినను, ఐన్‌స్టిన్ చేసిన పరిశోధన అంతయు న్యూటన్ సిద్ధాంతములోనే ప్రారంభ మైనది. కనుక ఐన్‌స్టిన్ కృషికి న్యూటన్ సిద్ధాంతము ప్రాతి పదిక యైనదన్నమాట.

న్యూటన్ మహాశయుడు;— భౌతికప్రపంచపు నడకకుగల కారణములను అధికముగ కనుగొన్న వారిలో న్యూటన్‌మహా శయుడు ముఖ్యుడు. ఈయనకు పూర్వపుప్రజలు యెగుర వేయ బడినవస్తువు, భూమిపైననే పడుటకు, భూమి ఆవస్తువును లాగుటయే కారణమని భావించెడివారు. కాని న్యూటన్‌మహా శయుడు అనేకప్రయోగములు జేసి, 'ప్రతి వస్తువులోను ఆకర్షణ శక్తి గలదనియు; భూమియందు తక్కినవస్తువులలోకంటె యెక్కువ ఆకర్షణశక్తి యుండుటచేత, యెగురవేయబడిన వస్తువు భూమిపైననే పడుచున్నదని తెలిపెను. దీనిని గురుత్వా కర్షణ (Gravitation) అందురు. దీనిద్వారా గోళాల బరువు; దూరము కనుగొనుటకు వీలైనది.

హార్వే:— భౌతిక పరిశోధన అనగ భౌతికప్రపంచమునుగూర్చి న్యూటన్ మహాశయుడు పరిశోధనలు జేసినట్లే, మనుష్య దేహ ములు పనిచేయుటకుగల కారణములను గూర్చి, హార్వేమహా శయుడు అన్వేషించెను. రక్తము ప్రసరించునప్పుడే హృద యము పనిచేయునని యీయన నిర్ణయించెను. ఆధునిక అల్లో పతి వైద్యవిజ్ఞానానికి యీయన కృషియే ప్రారంభమని చెప్ప వచ్చును. ఇతని జీవితకాలము క్రీ॥ శ॥ 1578 నుండి 1657.

<u>ఛార్లెస్ డార్విన్:</u>— ఇతడు మానవునిపుట్టుకను క్రమవికాస వాదముతో కనుగొనెను. ఇతని వాదమును పరిణామ సిద్ధాంత మందురు. ఈయన సృష్టిలో నాలుగు నియమములు పనిచేయు చున్నవని తెలిపెను. అవి (1) పితృనియమము, Law of Herdity (2) పరివర్తన నియమము, Law of Variability (3) అధికోత్పత్తి నియమము, Law of overproduction. (4) యోగ్యవిజయము లేక స్వాభావికమైన యెన్నిక (Natural Selection).

బాలికలుగ కొందరు జన్మించి కొంతకాలమునకు పురుషావయవములు పొందుచున్నట్లు అప్పుడప్పుడు వినుచు న్నాము. వారిని మెడికల్ ఆఫీసర్లు పరీక్షించుచున్నారు. ఇలాటి సమయాల్లో డార్విన్ మహాశయుని వాదము స్మృతికి వచ్చుచుండును.

<u>రాంజన్ మహాశయుడు:</u>— ఎక్సురే ఫుటోలునేటి వైద్యలోక మునందు ప్రముఖస్థాన మలంకరించినవి. ఈ ఫుటోలకు మూల కారణము రాంజన్ మహాశయుడు కనుకొన్న 'రాంజను కిరణ ములే.' వీనిని X కిరణములని యందురు. ఆకాశ సముద్రములో తరంగములవలె అనేకకిరణములున్నవి. వానిలోమిక్కిలిసూక్ష్మ మైనవి నీలివర్ణపుకిరణములు. వాటికంటె సూక్ష్మమైన కిరణ ములు నీలలోహిత ఉత్తరకిరణములు. ఆకిరణములకంటె సూక్ష్మకిరణములున్నవని రాంజన్ మహాశయుడు కనుగొన్నాడు. వాటికే × కిరణములని పేరువచ్చినది.

మైకేల్ ఫేరడే:— శ్రీనాథుని నైషధములోను; వాల్మీకిరామాయణములోని సుందరకాండయందును, విద్యుద్దీపాల వర్ణన కానుపించును. అయితే వాటి నిర్మాణమును గూర్చి వివరణ ఆ గ్రంథాలలో లేదు. ఈ యుగంలో మైకేల్ ఫేరడే మహాశయుడు విద్యుచ్ఛక్తి ఉత్పత్తినిలోకానికి తెలియపరచి మహోపకార మొనర్చినాడు. ఇతడు కడుబీద కుటుంబములో జన్మించుటచే, అనేక కష్టములకు గురియయ్యెను. తుదకు డేవీ మహాశయునివంటి వైజ్ఞానిక పరిశోధకునకు అంతరంగిక శిష్యుడై మహత్తరముగు ప్రకృతిపరిశోధనలను జరిపెను. తీగెచుట్టమధ్య సూదంటురాతిని, గిరగిర త్రిప్పితే, తీగెచుట్టలోనికి, విద్యుత్తు ప్రవహించుటను కనుగొన్నాడు. అప్పటినుండి విద్యుచ్ఛక్తి ఉత్పత్తి; ఉపయోగములు, విరివిగ ప్రచారమగుట వలన లోకంలోని ప్రజానీకము అనేక సుఖములను పొందుచున్నది.

జగదీశచంద్రబోసు :— కవులు తమ కావ్యాలలో చెట్లకు ప్రాణమున్నట్లు అలంకారికముగ వర్ణించు చుందురు. కాని చెట్లకు ప్రాణమున్నట్లు జగదీశచంద్రుడు శాస్త్రీయముగ ఋజువు చేసినాడు వృక్షశాస్త్ర పరిశోధనలో బోసుకు ఉన్నత స్థానము గలదు. ఈ మహాశయుడు 1894 సం॥లో కలకత్తా నగరమందు తీగె లేకయే, విద్యుత్తరంగములద్వారా కొన్ని అడుగుల దూరమువరకు వార్తలను పంపుటను ప్రయోగించి చూపెను. అప్పటినుండి యీయనకీర్తి ప్రపంచమంతటను

వ్యాపించసాగెను. మార్కోనీమహాశయుడు జగదీశచంద్రుని యీ ప్రయోగమును ఆధారముగ గైకొనియే క్రీ. శ 1901 లో రేడియోను కనిపెట్టినాడు.

ఫరీద్‌పూర్‌లో ఒక ఈతచెట్టు నిత్యమువంగి పైకిలేచు చుండెను. దీనిని ప్రజలు దైవమాయగదలచి, ఆ చెట్టుకు పూజలు జేసి నైవేద్యములు బెట్టసాగిరి. జగదీశుడు ఆచెట్టును జూచి, ఆవిధమైన కదలిక గుణము ప్రతిచెట్టుకు కలదని తెలుపుచు; సూర్యరశ్మికినీ నిత్యమువంగి పైకిలేచు ఆయీతచెట్టు లోని ఆకర్షణశక్తికిని గల సంబంధాన్ని జూపించెను. ఉష్ణగురుత్వాకర్షణ శక్తులే యిందుకు కారణమని స్పష్టము జేసెను. ఈ మహానీయుడు ప్రతిచెట్టు, ప్రతినిముషంలోను, ఎంతఎత్తు పెరిగేది కనుగొనుటకు 'క్రెస్కోగ్రాఫ్' అనే యంత్రాన్ని కనిపెట్టినాడు.

సర్. సి. వి. రామన్:— భౌతికవిజ్ఞానంలో రామన్‌మహాశయుడు నిధి. మృదుమధుర వాక్కులతో, గభీరవైజ్ఞానిక విషయాలను లోకానికిచాటగల నేర్పరి. ప్రస్తుతమీమహనీయుడు డైమండు-వజ్రము-ను పరిశోధించి అందులోనుండు సున్నము, ఇసుకభాగాలపై, పరిశోధన జేయుచున్నాడు. దానిద్వారా లోకానికి కలుగగల ఉపకారములెన్నో వున్నవని యీాయన భావము.

ఐన్‌స్టీన్:— ఈమహాశయుడు కనుగొన్నది సాపేక్షతా సిద్ధాంతము. దీనిని ఆంగ్లములో Theory of Relativity అని యందురు. పదార్థమునకు, శక్తికిని వస్తుతఃభేదములేదని, అవ

స్థాభేదముమాత్రమే కారణమని తెలిపిరి. కాలము; దేశము; ప్రత్యేకపదార్థములుగావని, అవిరెండు అవకాశము (Space) నందు వ్యాపించియున్న పదార్థజాతమేనని నిరూపించిరి. * ఈ మూడింటిలో - కాలము; దేశము; అవకాశాలలో - ఏఒక దాని ఆధారముతోనైనా మిగిలిన రెండింటిని కనుగొనవీలుండు టవల్ల వీటికి సాపేక్షభావముగలదని తెలిపిరి. న్యూటన్, యూక్లిడుల సిద్ధాంతములను మార్పుజేయదలచి యీ మహానీయుడు అమోఘకృషి సలిపెను. మాక్సువెల్ మహాశయుడు తెలిపిన విద్యుత్కాంతశక్తికి; న్యూటన్ కనుగొన్న భూతల గురుత్వాకర్షణ శక్తికిని బీజప్రాయమైన శక్తిక్షేత్రమొకటి యున్నదని ఐన్‌స్టీన్ కనుగొన్నాడు. దాని పర్యవసానమే నేటి ఆటం ఉపయోగపు ప్రచారము. ఈయన జర్మనీలో జన్మించి రెండవ ప్రపంచయుద్ధమునకు ముందు అమెరికా వెళ్ళిపోయెను. ఈయన పదిసంవత్సరాలు కృషిజేసి రచించిన పదిపేజీల పుస్తకమును ప్రపంచములో పదిమందికైనా అర్థమగుట కష్టమని ప్రముఖవైజ్ఞానికులు చెప్పుచుందురు.

<u>లూయీపాశ్చరు:</u>— ఈమహాశయుడు క్రిమి సిద్ధాంతమును కనుగొనెను. అధర్వవేదములోని క్రిమి విధానమునకును, యీ సిద్ధాంతమునకును కొన్ని పోలికలు గానుపించుచున్నవి.

* సరిగయిదే నిర్ణయము వైశేషికదర్శనమునందు, ప్రశస్తపాదుని భాష్యములో, ఆకాశ నిర్వచనమువద్ద గలదు. యీపుస్తకంలో వై. ద. ఆకాశ నిర్వచనమును చూడుడు.

వీరేగాక ప్రపంచములో ప్రొఫెసర్ నీల్సుబోరు; లార్డు రూధర్ ఫర్డు; మదామ్‌క్యూరీ, మొదలైన వైజ్ఞానికులు పదార్థాన్వేషణలో అమోఘసేవ జేసియున్నారు.

ద్రవ్యము; పరమాణువులకు నేటిపరిభాష:—

Matter : Anything which possesses weight, occupies space, offers resistance and can transfer motion is matter.

ఏవస్తువైన గొంతతూకముగలిగి, గొంతస్థలాన్ని ఆక్రమించి ఉనికిరిసి కలిగియుండి కదలికగలిగి మారునట్టిది ద్రవ్యము.

Atom:— Atom is the smallest particle of an eliment which can take part in the chemical change·

మూలద్రవ్యములలోని మిక్కిలి సూక్ష్మభాగము, రాసాయనిక మార్పులలో పాల్గొనునట్టిది 'ఆటం' అనగ పరమాణువు.

## నేటి తత్త్వవేత్తలు

ప్రపంచములో మానవులు బొందుకష్టములకు కారణముల నన్వేషించి, వాటిని తొలగించుకొనుటకై ఉత్తమసాధనములను కనుగొని లోకమునకు తెలియపరచి తద్వారా దుఃఖనివారణకు కృషిజేయుటచేత ఆధునిక తత్త్వవేత్తలు దార్శనికులుగ పరిగణింప బడవలసినదే.

టాల్‌స్టాయ్; మదామ్ బ్లావట్‌స్కీ; కారల్ మార్క్సు; ప్లాటో; అరిస్టాటిల్; సుక్రటీసు; మహాకవి రవీంద్రనాథఠాగూరు;

సర్. రాధాకృష్ణన్; గాంధీమహాత్ముడు; అరవిందఘోష్ మొదలైనవారు ఆధునిక తత్త్వవేత్తలు. వీరిలో కొందరికి ఆస్తికదృక్పథము, మఱికొందరికి నాస్తికదృక్పథము గలదు. అంతియేగాక వీరి సాధనామార్గములలోగూడ కొంత భేదము కానుపించుచుండును. అందువలన వీరిని దార్శనికులనుగా భావించుటకు అంగీకరించని ఆర్షదార్శనికాభిమానులు కొందరుండ వచ్చును. కాని వారికొక యథార్థస్థితిని మనము చూపించవలసి యున్నది. ప్రాచీనభారతీయ దర్శనములగు న్యాయ; వైశేషిక; సాంఖ్యాది శాస్త్రములను రచించిన దార్శనికులు 'ఆత్మ ఉన్నది' అనువిషయములో దప్ప మిగిలినవాటిలో విభిన్నదృష్టికోణములు గలవారేగదా? మఱియు ఆత్మను కొందరు ద్రవ్యముగాను, మఱికొందరు జ్ఞానాధికరణమైన దానినిగాను నిర్వచించియుండ లేదా? కాని సృష్టిరహస్యాన్వేషణ జేయుటచేతను, దుఃఖనివృత్తికి మార్గములను చూపించుటచేతను వారు దార్శనికులైరి. అట్లే నేటి తత్త్వవేత్తలుగూడ దార్శనికులే యగుదురు.

ఆధునిక తత్త్వవేత్తలందు నాస్తికదృక్పథముగలవారిలో కారల్ మార్క్సు ముఖ్యుడు. ఆస్తికదృక్పథముగలవారిలో గాంధీమహాత్ముడు ముఖ్యుడు. ఠాగూరు మహాశయుడు విశ్వమునంతను తనలో దర్శించి తన మధురగానముతో ఆత్మనే ఈశ్వరరూపముగ వర్ణించి దార్శనిక కవియైనాడు.

కార్లయిల్ మార్క్సు:— యూరపు ఖండములో సామ్రాజ్యవాద దృష్టిగలరాజులు; పెట్టుబడిదారులు (Capitalists) సామాన్యప్రజలను నానాహింసలు పెట్టుచుండిన రోజులలో యీతత్త్వవేత్త జన్మించెను. జర్మను తత్త్వశాస్త్రము (German Philosophy) ఆత్మికసుఖము (Spiritual hapiness) ముందు భౌతికసుఖము అప్రధానమని బోధించుచుండెను. అయితే యీవాదమును చేబూని పెట్టుబడిదారులు శ్రామిక వర్గాన్ని హింసించుచు ఆశ్రామికవర్గానికే ఆత్మిక ఆనందమును గూర్చి బోధించుచుండిరి. పర్యవసానము శ్రామికవర్గము నానాటికి దీనస్థితిని బొందవలసి వచ్చుచుండెను. ఇదిజూచి మార్క్సు మహాశయుడు సమాజములోనున్న ఆర్థిక హెచ్చుతగ్గు భేదాలే ప్రజానీకములో కొన్నివర్గములు మాత్రమే భరించలేని కష్టాల ననుభవించుటకు హేతువని నిర్ణయించెను. క్షుత్పిపాస గొని యున్న సాటిమానవునకు కనీసము పురిసెడు గంజినైనాపోసి నప్పుడే అతని ఆకలితీరి ఆనందము చెందగలడు. కాని మంచి నీటిని సైతము అతనికి యివ్వక కేవలము ఆత్మసుఖమును బోధించినంతమాత్రమున ఆకలితీరదు; ఆత్మానందమూ కలుగదు. భౌతికమైన హింసను కలుగజేయుచున్నవారే పీడితలోకానికి ఆత్మిక సుఖమునుగూర్చి బోధించుట వ్యర్థమైన పనియగును. దార్శనికదృష్టితో జూచినచో భౌతికమునకు, ఆధ్యాత్మికమునకు భేదముకాన్పించుట దుర్లభముగదా! అందువలన ప్రజానీకములో వికట తాండవనృత్యము సలుపుచున్న ఆర్థిక దోపిడీ పర్యవసానంగా యేర్పడిన దుఃఖమును తొలగించగోరి మార్క్సు

మహాశయుడు సృష్టి కారణాన్వేషణ జేయ మొదలిడెను. కను కనే సృష్టికంతటికి మూలకారణ మొకటి గలదనియు; ఆకారణ స్వరూపమైనది జడమేననియు; జడమునుండియే చేతనము పుట్టు చున్నదనియు మార్క్సు మహాశయుని విశ్వాసము. ఆవిశ్వా సమునుండి జన్మించినదే సామ్యవాదము. మార్క్సు మహాశ యుని ఊహలో నిర్మింపబడనున్న సమాజములో ప్రభుత్వము యొక్క అవసరముగూడ వుండదు.

ఈయన భౌతికసుఖములు గనిదే మానవునకు దుఃఖ నివృత్తి గాజాలదని ప్రకటించి, భౌతికముగ హింసించుచున్న పెట్టుబడిదారులను యెదుర్కొనవలసినదిగా శ్రామికవర్గములో విప్లవబీజాలను వెదజల్లెను. అందు హింసనుగూడ ఉపయోగించు టకు శ్రామికులను ప్రోత్సాహపరచెను. గాంధీమహాత్మునకు పూర్వపు భారతీయ ఆస్తికతత్త్వవేత్తలలో అనేకులు 'ధర్మరక్ష ణకు దుర్మార్గులను హింసించవచ్చున'ని ఆమోదించిరి. మార్క్సు మహాశయునికిగూడ అప్పటిదేశకాలసామాజిక పరిస్థితులను బట్టి పైమార్గమే ఉచితమనితోచెను. కనుకనే వీరు వర్గకలహ ములను ప్రోత్సాహపరచిరి.

ఎక్కువ శ్రమ జేసినను తక్కువఫలితము ననుభవించేది శ్రామికులు. కనుక వారిచేత వీలైనంతవరకు తక్కువపని జేయించి, విశ్రాంతికాలములో వైజ్ఞానిక జ్ఞానమును పెంపొం దించినచో వారిలో చైతన్యము కలుగగలదని మార్క్సు భావిం చెను. కొద్దికాలములో యెక్కువ పనిజరిగితే తప్ప శ్రామికులు

జేయుపనిని తగ్గించుటకు పిలుపడను. అందుకు మానవుని జెబ్బు పుష్టికి తోడ్పడేది యంత్రముమాత్రమే. యంత్రముద్వారా పనిజేయించినచో మానవుడు జేయు శ్రమను తగ్గించవచ్చును. కనుక వస్తూత్పత్తికి యంత్రమును ఉపయోగించుటను అమోదించి తద్వారా కేంద్రీకృత పరిశ్రమవిధానమును ఈతత్త్వవేత్త ప్రోత్సహించెను. కావున హింసాప్రయోగములోను, వస్తూత్పత్తి విధానములోను గాంధిమహాత్మునకు, మార్క్సు మహాశయునకు భేదమేర్పడినది.

* వీరు 'కాపిటల్' అను గ్రంథములో పెట్టుబడిలోగల అనేక ఆర్థిక విషయములను బోధించినారు. ఈ మహాశయుడు క్రీ. శ. 1818 లో జర్మనీలో జన్మించి 1833 లో లండను నగరమందు మరణించెను.

గాంధీమహాత్ముడు :— గాంధీజీ తత్త్వదృష్టినిగూర్చి వారిసన్నిహితులలో నొకరగు కిశోరిలాల్ మష్రూవాలాగారిట్లు నిర్వచించిరి.

"Wheu all life is one, and the whole universe iucluding myself is the manifestation of God, whom I regard, to be my enemy, a wicked being, one whom I am free to hate? Whom may I fear or nspire fear in? Whom may I regard as closer to

---

* "Das kapital" అనేది చాలా పెద్దపుస్తకము. కాని మోడరన్ లైబ్రరీవారు ప్రకటించిన "Capital" అను పుస్తకంలో మార్క్సు మహాశయుని తత్త్వశాస్త్రము సంగ్రహముగా వివరింపబడినది.

me than others? Whom may I regard as trivial enough to be sacrificed by me for an end?"

(Harijan. 26 2-'50)

"లోకంలోని జీవితం అంతా—జీవులన్నీ—ఒకటే అయి యుండగా; సర్వము భగవంతుని రూపమైనదో; నేను కూడ అందులో ఒకభాగమే గనుక; ఎవరిని నేను నాశత్రువుగా పరిగణించగలను? ఎవరినిగూర్చి నేను భయపడవలసియుండును? ఎవరిని నేను భయపెట్టగలను? సన్నిహితులని, దూరులని నేనెవరిని తలంచగలను? ఎవరిని తుచ్ఛుడనీ లేక నీచుడనీ భావించగలను? ఎవరిని నాచే సంహరింపబడవలసిన వానిగా నిర్ణయించగలను?"

మానవుడు భౌతికసుఖముతోనే తృప్తిచెందక మతాధిపత్యములకై పోరాడుకొను నేటియుగమునకు దివ్యౌషధము పైతత్త్వదృష్టియే. ఈతత్త్వదృష్టితోనే గాంధీజీ కుటుంబ వ్యవహారము మొదలు రాజకీయమువరకు అన్నిటిలోను అహింసనే సాధనముగ దీసుకొని సఫలీకృతుడైనాడు. పవిత్రమైన అహింసతో గూడిన పోరాటమును పోరాటమనుటకంటె సత్యాగ్రహమనుట యుక్తమని తెలిపినాడు. సత్యమును పూర్తిగ పట్టుకొనుట లేక గ్రహించుటయే సత్యాగ్రహము. తన హృదయములోని భావమును - అది పవిత్రమైనదే యైనను - ప్రతిపక్షులు గుర్తించనప్పుడు; దానిని వారిచే అంగీకరింప బడునట్లు జేయుటకు గల ప్రయత్నము వాదవివాదములతో గూడి

యుండును. కాని ఆ వాదవివాదములలో ప్రతిపక్షిపై ద్వేషము; అసూయ; హింసాభావము బూనినచో తన భావమే అపవిత్రమై నిష్ప్రయోజనమగునని గాంధీజీ ఉద్దేశ్యము. అందు వలననే తారీఖు, ప్రభుత్వపు మొహరు నాణెమునకవసరమై నట్లే సార్థకజీవితమునకు సత్యము - అహింస; యీ రెండు అవసరమని బోధించినాడు.

భౌతిక సుఖము; ఆధ్యాత్మిక సుఖము - యీ రెండింటి కొఱకుచేయు ప్రయత్నంలో పవిత్రత వున్నప్పుడు ఒక మానవుడు మఱియొక మానవుని భౌతికముగ - ఆర్థిక; రాజకీయముగ - హింసించజాలడని బోధించి ఆర్థిక సమానత్వముసకై కృషిజేసెను. మానవునకు విశ్రాంతితో బాటు మానసిక వికారములు కలుగని విధముగా మఱియొక కార్యక్రమము వుండాలని తలచి విజ్ఞానాభివృద్ధితో బాటు చేతిపనులనుగూడ అభివృద్ధిలోనికి తీసుకొనిరావలసిన ఆవశ్యకతను తెలియబరచెను. *

"హిందూమతము - వైదికమతము - అత్యంత విశాలమైనదనీ; దానిలో ప్రపంచములోని విజ్ఞానస్రోతస్సులనీ వచ్చి లీనమైనవనీ; భవిష్యత్తులో గూడ అట్లే లీనంకాగలవనీ; కనుక యితర మతములపై హిందువులు ద్వేషముబూనియుండరాదనీ" గాంధీజీదృష్టి. అందుచేతనే గోడ్సేకు గాంధీజీ 'హిందూ

* మహాత్ముని ఆర్థిక వికేంద్రీకరణ విధానమునుగూర్చి 'మహాత్ములు-భక్తులు' అను ప్రకరణములో క్లుప్తముగా వివరించినాను.

మతానికి ద్రోహిగా, కానుపించినాడు. ఇందుకు కారణము గోడ్సేలో నిండియున్న మతోన్మాదమే. గోడ్సేవంటి మతదురభిమానులపై ద్వేషమును వహించక గాంధీజీ హిందూ ముస్లిముల కలహాలమధ్య శాంతిస్థాపనకై కృషి జేయసాగెను. కాని గోడ్సే దృష్టిలో హింస—ద్వేషములు నిషేధములుగావు. సమాజమునుండి వేరుజేయదలచి గోడ్సే గాంధీజీని హత్యజేసినాడు. కాని గాంధీజీ తన వ్రతమును తుదిక్షణములో సైతము వీడక హంతకునికి వందనము సమర్పించి నేలనాలుగుచెరుగులలోని ఆస్తిక - నాస్తిక తత్త్వవేత్తలకు; రాజ్యాంగవేత్తలకు; వైజ్ఞానికులకు నూతన జిజ్ఞాసను కలిగించినాడు. ఆత్మ జ్ఞానాధికరణమైనదా లేక ద్రవ్యమేనా ? అను వాదన గాంధీజీకి అవసరము లేదు. భౌతికపదార్థములో అంతర్వ్యాప్తమై, మహత్తరశక్తి గలిగియున్న చేతనమే ఆత్మయని గాంధీజీ ఉద్దేశ్యం.

ము గిం పు :

భౌతిక, ఆధ్యాత్మిక వాదాలలో భౌతికవాదాన్ని నిరసించటం; అధ్యాత్మిక వాదాన్ని అనుసరించటం, ఇది మనదేశంలో యెంతకాలంనుంచి అనేది చెప్పలేముగాని, కొంతకాలమునుండి అమలులోవున్న ఆచారమనేమాట నిజం. పాశ్చాత్యులు భౌతికవాదులగుటవల్లనే సర్వదా వారు యుద్ధాలలో మ్రగ్గిపోవుచున్నారనీ, మనదేశం ఆధ్యాత్మికవాదమగుటచేతనే యుద్ధమేఘాలిక్కడ క్రమ్ముకొనుటకు సాహసించలేకపోయినవని పలుకుచుందురు. ఇందులో కొంతనిజముంటే

వృద్ధిచెందుచున్నను. కాని మధ్యకాలీన భారతసమాజములో శైవ; వైష్ణవ; బౌద్ధ; జైన; గాణాపత్య మొదలైన పేర్లతో జరిగిన ఘోరకలహాలకు, ద్వైత - అద్వైత - విశిష్టాద్వైత వివాదాలలో ప్రజానీకము మాటనే మరచిపోయి మొదకుతో నేలఆగి హృదయము పరిజేరని వ్యర్థచర్చలకు, నిన్న మొన్నటి భారతదేశములో జరిగిన హిందూ-ముస్లిము కలహాలకు, నేటివరకు దుర్గంధభూయిష్ఠమైన సామాజిక పరిస్థితులకు హేతువులైన కులద్వేషాలకు; అంటరానితనమునకు కారణము ఆధ్యాత్మికవాదమేనా? కాదు. భౌతిక వాదమునుసరించి, కేవల ఆధ్యాత్మికవాదమును గ్రహించి దానిని తర్కవితర్క కవచములోనే పొదుగుటవల్ల యీదుస్థితి యేర్పడినది. ఇట్లే పాశ్చాత్యులలో అధికసంఖ్యాకులు కేవల భౌతికవాదులగుటవల్లనే అక్కడ అనవరత యుద్ధజ్వాలలు వ్యాపించుచూ వచ్చెను. కాని ఒక్కసారి మన ప్రాచీనఋషుల జీవితవిధానాలను జూచినచో యీవిపరీతస్థితికి హేతువు మనకు బోధపడక మానదు. ఆనాటిఋషులు ఘోరతపమొనరించి, సర్వేంద్రియాలను స్వాధీనపరచుకొని, ఆధ్యాత్మిక సుఖమునకై నిరంతరము కృషిసలుపుచు, "ఏకం; మనసోజవీయో; నైతద్దేవా అప్నువన్" అనే ఆసూక్ష్మతత్వమేది? అని అన్వేషించుచున్నప్పటికీ భౌతికప్రపంచమును వారు నిరసించలేదు. అది వారికి అత్యంత ప్రియముగా కానుపించుచుండెడిది. భౌతికపదార్థ పరిశోధన వారి తపస్సులో ఒకభాగమైపోవుచుండెను. "సూక్ష్మాతిసూక్ష్మ రూపమగు ద్రవ్యానికి, అమూర్తమగు ఆత్మకు సంబంధమెక్కడున్నది?" అని నిరంతరము కృషిజేయుచు అభిన్నతయనెడి

లక్ష్యమును జేరి దుఃఖనివృత్తిని పొందుటకు వారిహృదయాలు పరితపించుచుండెడివి. అందువల్లనే వారు రాసాయనిక పరిశోధనలో అమోఘమైన మేధాశక్తిని ఉపయోగించెడివారు. అందువల్లనే మనకు చరక; సుశ్రుతాది ఉత్తమరసాయనశాస్త్ర గ్రంథాలు లభ్యమైనవి. అందువల్లనే వారు ఉత్తమదార్శనికులు కాగలిగారు !

కాని, ప్రపంచములోనున్న ఉత్తమపదార్థవిజ్ఞానశాస్త్రపరిశోధకులను, గాంధీ; మార్క్స్; రాధాకృష్ణన్ వంటి తత్త్వవేత్తలను దార్శనికులని భావించుటకు నేటి హిందూసమాజము వెనుకంజ వేయుచున్నది. నిజముగా యీ మహనీయులు అభిన్నత్వములో ఐక్యమవటానికి నిరంతరము తమ జీవితములను ధారవోసిన త్యాగులుగారా? సృష్టిరహస్యాన్వేషకులుగారా? ద్రవ్యపుపరమాణువులను యెంతమాత్రము పగులగొట్టుకొని పోయినను చివరకుమిగిలేది అమూర్తద్రవ్యముయొక్క ద్రవ్యపుభావమేనని తేలుటవల్లఆధ్యాత్మికమునకు, ఆధిభౌతికమునకు అంతరమే లేదని ఋజువు జేయుటకుపూనుకున్న సర్. ఆర్థరుఎడ్డింగ్టనువంటి సునిశిత హృదయులు భౌతికవిజ్ఞాన పరిశోధనాపరంపరనుండి ఉద్భవించిన వారేగదా? కనుక యీ జంకును నేటి హిందూసమాజము తొలగించుకొనక తప్పను. దీనిని తొలగించుకొని పదార్థవిజ్ఞాన రసాయనశాస్త్ర పరిశోధకులను, తత్త్వవేత్తలను దార్శనికుల

కోటిలోనికి జేర్చుకొను సమన్వృష్టి మనకు అలవడవలసిన ఆవశ్య కత ఒకానొకమహాశయుని జీవితమును జూచినచో బోధపడక మానదు. ఎవరామహాశయుడు? ఆజన్మమరణాంతము బ్రహ్మచర్యమునవలంబించి, నిముసమేని విశ్రాంతియెరుగక, రాసాయనిక పరిశోధనలలో కి శాశ్వతానందము నొందుచూ, ప్రాచీన భారత దేశములోని వైజ్ఞానిక సంప్రదాయాల నిగ్గునుపైకితీసి మహా తపస్విగా కాలముగడుపుచూ, నిరాడంబరుడై, పూజ్య బాపూజీకి సమకాలికుడు గానే గాక చక్కనిమిత్రుడు గాకూడా వుండి, ఉత్తమ దార్శనిక పంథాలో పయనించిన స్వర్గీయ. పి. సి. రే. గారే యీమహాశయుడు. నాటిఋషుల అమోఘమైన రాసాయనిక పరిశోధనను "భా ర త దే శ పు రా సా య ని క చ రి త్ర" ద్వారా లోకానికి తెలిపిన సమర్థుడు యీ 'రే' మహాశయుడే! ఈమహాశయుని జీవితజ్యోతినుండి వెలుగొంది పరిభ్రమించు అనంతకిరణాలలో యే సూక్ష్మకిరణ ప్రభావానో చూడగలిగిన యేదో ఒక మిక్కిలిస్వల్ప అదృష్టంవల్ల యీ ప్రకరణము (దర్శనములు - దార్శనికులు) లో నేటి వైజ్ఞానికులను, తత్త్వ వేత్తలను జేర్చుకొని పాఠకులకు సమర్పించుకొను సాహసము- అదివెఱ్ఱిసాహసమే కావచ్చును - నాకుకలిగినది. కనుక పి. సి. రే గారిని ఒక్కసారిస్మరించి యీ ప్రకరణము ముగించాలని

నాకోరిక. వీరు బెంగాలురాష్ట్రములో జన్మించి; ప్రముఖరసాయన శాస్త్రవేత్తయై, "మెర్క్యూరస్ నైట్రేట్" అను పదార్థమును కనుగొని ప్రపంచఖ్యాతిని బడసినారు.

"సత్యంజ్ఞానమనంతంబ్రహ్మ"

గమనిక:— భక్తులు: ప్రవక్తలు; దేవతలు; షోడశ సంస్కారములు–ప్రత్యక్ష సమస్యలు మొదలైన విషయములు ఉత్తరార్థములో సవిస్తరముగా వివరింపబడినవి.

రవి ప్రింటర్స్, తెనాలి.

# తప్పొప్పుల పట్టిక.

| తప్పు | ఒప్పు | పేజీ | పంక్తి |
|---|---|---|---|
| Cast | Caste | xi | 1 |
| నైదీక | నైదిక | 8 | 11 |
| నదుండు | నందుండు | 33 | 13 |
| లిత్యతే | లిప్యతే | 44 | 5 |
| లోసనలు | వాసనలు | ,, | 15 |
| ఉపాసనక | ఉపాసనకు | 47 | 14 |
| యోగ్యసాధన | యోగసాధన | 48 | 13 |
| వాచలి | వాచం | 51 | 11 |
| వదతు శంతి వాఙ్ | వదతభద్రయా | 51 | 18 |
| మంత్రయేవః | మభిమంత్రయేవః | 52 | 15 |
| మయధేహి | మయిధేహి | 54 | 1 |
| నిండియున్నది | నిండియున్నవి | 56 | 5 |
| వంహారే | వ్యవహారే | 60 | 7 |
| ముపకార్థ | ముపకారార్థ | 60 | 9 |
| వాగాంభృణీ | వాగాంభృణీ | 62 | 17 |
| గర్భాదానం | గర్భాధానం | 93 | 14 |
| గహీతం | గృహీతం | 96 | 11 |
| లాజానామంజలి | లాజానామంజలిం | ,, | ,, |
| సారథం | నారదం | 104 | 11 |
| చాదిత్యశ్చ | శ్చాదిత్యశ్చ | 105 | 7 |
| ఆభావమును | అభావమును | 147 | 11 |
| కక్షుపుటను | కక్షుపుట | 159 | 13 |
| Eliment | Element | 158 | 16 |
| మహాత్ములు—భక్తులు | భక్తులు—ప్రవక్తలు | 174 | 21 |

# లక్ష్యం ఒక్కటే

[ఉత్తరార్థం]

కొత్తమాసు కూర్మారావు

విజ్ఞానసమితి : వల్లభాపురం

గుంటూరుజిల్లా

# మా పని

ఎందుకో మాతృదేవి తన బిడ్డను జూచి తృప్తిపడు తుంది. భావికాలపు సుఖాన్ని ఊహించి వుబ్బి తబ్బిబ్బు లాడుతుంది. బిడ్డ తింటేచాలు, తాను తినకపోయినను తిన్నట్లు భావించుకొని సుఖాన్ననుభవిస్తుంది. ఎందుకీ సారూ ప్యానుభూతి? ఎందుకా! ఏవో తన హృదయాన్నావరించిన ఆశా జ్యోతుల ప్రభావం వల్లనే! ఈ జ్యోతుల సంజ వెలుగుల మధ్య మందగమనంతో, మలయానిల మందగాడ్పుల సేవనంతో, ప్రకృతి వీణాతంతు వుల మనోహర నిస్వనాన్నాలాపిస్తూ, బిడ్డయొక్క నూనూగు మీసాల యౌవనాంకురముల మధ్య, భావికాలమనెడి కోకిలా రావమునకు వంత పలుకుచూ ఆకాశపథంలో ఆమె పయ నిస్తుంది. అయితే నిండు జవ్వనంలోనే ఆబిడ్డ అదృశ్యమైతే ఆతల్లి హృదయం యేమవుతుంది? వికలమవుతుంది! ఆశా జ్యోతులు అంధకార రేఖలుగా మారిపోతాయి! దారీతెన్నూ కానుపించదు! తనబిడ్డ కఠినుడై తననీవిధంగా అంధకార సముద్రంలో పడత్రోయటానికి హేతువు ప్రకృతిదేవి చుప్ప నాతితనమేనని నిశ్చయించుకొనుటకు ప్రయత్నిస్తుంది. కాని విసిగివేసారి చివరకు "యీచిద్విలాసమేమిటి" అని యోచించ సాగుతుంది.

స్వర్గీయ అగ్గు బసవపున్నారెడ్డి తన మాతా పితరుల కిదేస్థితిని కలిగించి ఆకాశపథంలో అందకుండా దాగురుమాత

లాఘుచున్నాడు. తూములూరులో జన్మించి, తలిదండ్రులకు ముద్దుబిడ్డడై అనేకఅశలు చూపించి, ఒజ్జలకు ప్రియశిష్యుడై నూనూగుమీసాల యౌవనంలోనే కాలవాహినిలో కాలుజారి పదునెనిమిదవయేటనే తలితండ్రుల కన్నుదోయికి కానుపించక అదృశ్యమైనాడు. తమ ఏకైక పుత్రవియోగంతో వికలహృదయులై మాతాపితరులు వెలుగునీడల ప్రభావాన్ని యోచించడానికి ఆత్మపరిశోధన సాగించుకున్నారు.

ఈగ్రంథంలోని ఉత్తరార్థమును ముద్రించుటకు యీ పుణ్యదంపతులు–శ్రీ గుర్వారెడ్డిగారు వారి సతీమణి సీతమ్మగారు–సమయంలో సహాయపడి మా పని గట్టెక్కించినారు. వీరొసగిన మొత్తముద్రవ్యమును పుస్తకాలు విడుదలకావటంతోనే తూములూరులోని కమలానెహ్రూ గ్రంథాలయమునకు స్వర్గీయ బసవపున్నారెడ్డి స్మారకంగా సమర్పించి కృతజ్ఞత చూపదలచితిమి.

కూర్మారావు



స్వ॥ అగ్ర బసవపున్నారెడ్డి

## ముద్రాపకులకు మా కృతజ్ఞత

సర్వోదయ ప్రెస్ (పటమటలంక), రవిప్రింటర్సు (తెనాలి) వారి కృషితో మా యీ గ్రంథ ముద్రణ పూర్తియైనది. ఇందుకు యీ రెండుముద్రాలయముల వారికి మేము కృతజ్ఞులము. ప్రచురణవిషయములో తగిన సలహాలొసగుటయేగాక మాయందు పూర్ణమైన ప్రేమతో తామే ప్రూఫులు వగైరాలు సరిచూచి కొద్ది వ్యవధిలోనే ఉత్తరార్థమును ముద్రించి యిచ్చి మా యీ గ్రంథ ప్రచురణకు అంగవైకల్యము రాకుండా కాపాడిన మిత్రులు పాతూరి నాగభూషణం గారు మాకు సర్వదా వందనీయులు.

విజ్ఞానసమితి : వల్లభాపురం

## విషయసూచిక

# భక్తులు – ప్రవక్తలు

అసత్యము హింస మొదలగు చెడ్డగుణములవలన దుఃఖము కలుగుననియు, వాటిని విడిచినచో శాశ్వత సుఖమును పొందవచ్చుననియు సామాన్య ప్రజలందరికి తెలిసినప్పటికీ తాత్కాలికముగ యెదుర్కొనవలసిన కష్టములను సహించలేక సత్య, అహింసామార్గములను వారు అనుసరించలేరు. కాని ఎవరైనా అట్టి తాత్కాలిక కష్టములను సహించి సత్య, అహింసామార్గములను అనుసరించినచో వారిని భక్తితో గౌరవించి ప్రేమింతురు. ఇట్లు సామాన్య ప్రజలచే కొనియాడబడువారే భక్తులు; ప్రవక్తలు.

భజ – సేవాయాం అను ధాతువునుండి భక్తిశబ్దమేర్పడినది. కనుక సేవాజీవితము భక్తునిలక్షణము. సృష్టిలో ప్రతిచోటను భగవంతుడున్నాడని తలచి, అతని దర్శనమునకై పరితపించుచూ, తననుతాను అణువుకంటెతక్కువగా జూచుకొనుచు, సత్యజీవితము గడుపుకొనువాడు భక్తుడు. తన రూపము అణువుకంటె చిన్నదియైనను, "మహతో మహీయాన్" అనికూడ భావించి లోకానికి సదుపదేశములు జేయుచు సత్యజీవనము గడుపుకొనువారు ప్రవక్తలు. దార్శనికులకు కావలసినంత తర్కము ప్రవక్తలుకోరరు. భక్తులకసలే తార్కికదృష్టితో పనిలేదు. సత్యము, ప్రేమ ఇవి రెండు యీశ్వరగుణములే గనుక వాటిని నిజమైనభక్తులు సేవించుచుందురు.

## భక్తులు

మనదేశములో ప్రహ్లాదుడు, నారదుడు మొదలైన వారు పౌరాణికకాలపు భక్తులు. తులసీదాస్, కబీర్‌దాస్, మీరాబాయ్, తుకారామ్, పుండరీకుడు, నందనార్, పోతన, త్యాగయ్య మొదలైనవారె యిటీవలిభక్తులు. వేమన భక్తిపరుడైనను ఆయనది దార్శనికదృష్టి. రామకృష్ణపరమహంస సగుణోపాసకుడైనను విశ్వమంతటిని మాతృరూపములో ఆరాధించి, తన భార్యను సైతము మాతృదేవిగా దర్శించగలిగినాడు.

సగుణోపాసకులైన భక్తులొక్కొక్కతూరి తమ లక్ష్యమందున్న భగవంతుని గాంచ లేక నిర్వేదమునకు వశమయ్యెదరు. పోతనమహాకవి యిట్లే ఒకతూరి నిస్పృహ జెందినాడు.

క॥ "కలడందురు దీనులయెడ,
కలడందురు పరమయోగి గణములపాలన్
కలడందు రన్నిదిశలను
కలడు కలండనెడువాడు కలడో లేడో !"

కనుక సగుణ, నిర్గుణోపాసనలలో భేదముగాంచని స్థితినిగూడ భక్తులు పొందుచుందురు. అంధవిశ్వాసాలకు వశమైనచో భక్తిశబ్దము నిరర్థకమగును. ఇక మోసమును చేబూని భక్తులమనుకున్నయెడల భక్తిశబ్ద మింతకంటె నిరర్థకమగుటయేగాక భయంకరముగాగూడ కానుపించుట

సహజము. లక్ష్యమైన శాంతి – సుఖములను పొందుట దుర్లభము.

## ప్రవక్తలు

రాముడు, కృష్ణుడు, సుక్రటీసు, బుద్ధుడు, ఏసు క్రీస్తు, మహమ్మదు, గురునానక్, గాంధీమహాత్ముని వంటి ప్రవక్తలీ భూమిపైజన్మించి మానవాదర్శపు వెలుగును సామాన్య ప్రజానీకానికి చూపించినారు. వీరేగాక శంకర, రామానుజ, మధ్వాచార్యులుగూడ ప్రవక్తలుగ పరిగణింప బడవచ్చును. బుద్ధుడు, గాంధీమహాత్ముడు యిరువురు దార్శనికులైనను ప్రవక్తలుగాగూడ జీవించినారు.

రాముడు :-- దశరథకుమారుడగు రాముని పాత్ర మధురమైనది. ఒకపురుషుడు బహు భార్యలను, ఒక స్త్రీ అనేక నియోగములను * కలిగియుండు ఆచారము, సోదరులు పరస్పరకలహాలకులోనై కుటుంబ జీవితమును కలుషితమొనర్చుకొను దుస్థితి రామునకు పూర్వము, రామునకు తరువాత సమాజములో లేకపోలేదు. కాని ఏకపత్నీవ్రతము, పాతివ్రత్యము, కుటుంబ ఐక్యత యివి అందరికి యిష్టమైనవే. వీటిని తన ఆదర్శజీవితంద్వారా లోకానికి చాటి 'ఇంటగెలువనిదే రచ్చగెలుచుట దుర్లభము' అనే గుణపాఠాన్ని బోధించిన ప్రవక్తరాముడు. రాజకీయ

* స్త్రీ పునర్వివాహాన్ని నిరసించు ఉద్దేశ్యముతో యీవాక్యమును వ్రాయలేదు.

ప్రశాంతత రామునిలో మచ్చునకైనా లభించదు. హృదయము శ్రీసీతారామునకు సంబంధము. రాముని నిరాడంబరజీవితము, కరుణదృష్టులు వాల్మీకి మహాకవి శైలిలో ద్రాక్షాపాకమైనవి. రాముని జీవితంలో ఎత్తుకు పైయెత్తులు లేవు. సూటిగతా పజేసిన పనిని చేసినట్లు ఒప్పుకొనుట రాముని ఆదర్శపాత్రలో ఒక ప్రత్యేకత. సమత్వంలో కనుపించు కర్తవ్యమును యెట్టి మినహాయింపులు లేకుండ పాలించుటయే రామునిపంథా.

దశరథునకు కైక, రాముడు యిద్దరూ ప్రియులే. పైగా కైకకు మాటయిచ్చి సంతోషపరచాడు. తీరాసమయ మాసన్నమగుసరికి కైక తనవరము రాముని అరణ్యవాసము, భరతపట్టాభిషేకరూపములోనికి మార్చివేసినది. దశరథుడేమి చేయగలడు? ముందు కర్తవ్యము! వెనుకపుత్రప్రేమ! కైక యెదుట సత్యమును నిలబెట్టుకొనవలెను. రామునివంటి ప్రియపుత్రుని వియోగమూ భరించరానిది! ఈ మానసిక ద్వంద్వయుద్ధములో దశరథుడుమూర్ఛిల్లును. రాముడువచ్చి కైకద్వారా సమాచారం తెలుసుకొనును. తనకర్తవ్యము అరణ్యవాసమేనని నిర్ణయించుకొనును. అందువలన తండ్రి పుత్రవియోగజనిత దుఃఖముతో మరణించునని రామునకు తెలియకపోలేదు. తండ్రి తన సత్యవాక్యమును పాలించుటలో పుత్రప్రేమ అడ్డువచ్చి బాధపడుచున్న విషయాన్ని రాముడు గ్రహించుటవల్లనే బాహ్య ప్రపంచమునకు 'రాముడరణ్యమునకు వెళ్లుటచే తండ్రి దుఃఖించి మరణించ

వలసి వచ్చినది' అను రూపము కానుపించినను, తండ్రిఆత్మ శ్రేయస్సుకొరకై తానరణ్యమునకు వెళ్ళుటకే నిశ్చయించు కొన్నాడు.

తనతోగూడ సీత అరణ్యవాసము చేయవలెనని రాముడుకోరలేదు. పైగా సీతను అరణ్యమునకు రావద్దని గూడ నివారించును. కాని సీత బలవంతముపైన రాముడంగీ కరించక తప్పలేదు. రాజ్యభోగము లనుభవించుట, వాటిని త్యజించుట రామునకు సమానమే. అందుకు లక్ష్మణునితో పలుకు యీక్రింది వాక్యములే నిదర్శనము.

> "సౌమిత్రే! యోభిషేకార్థే మమ సంసారసంభ్రమః ।
> అభిషేకనివృత్త్యర్థే, సోస్తు సంసార సంభ్రమః ॥"
>
> వా। రా। అ। కాం। 22 సర్గ॥ 5 శ్లో॥

ఇక సీతావియోగములో రాముని విలాపకము కఠిన హృదయాన్ని సైతము కరగించివేయును. "రాజ్యచ్యుతి, బంధువియోగము, తండ్రిమరణము, ఇవి నాహృదయాన్ని శల్యములై బాధించినమాట నిజం - కాని అరణ్యవాసములో వాటివల్ల కలుగుబాధ నివారణమై శాంతిని పొందితిని. అయితే యిప్పుడీసీతావియోగము మరచిపోయిన దుఃఖాన్ని గూడ ప్రజ్వరిలజేయుచున్నది" అని పల్కిన యీ వాక్యమును జూడుడు.

> "సీతా వియోగా త్పునరప్యుదీర్ణం, కాష్ఠైరివాగ్నిః సహసోపదీప్తః"
>
> అరణ్యకాం॥ 63 సర్గ॥ 6 శ్లో॥

చిత్రకూట పర్వతమువద్ద రాముడు భరతునకుబోధించిన తత్త్వవిషయములు వాల్మీకిమహాకవి మృదులేఖినీనిర్మితమైన వందలకొలది శ్లోకాలలో పాఠకులకు యింపుగొలుపు చున్నవి.

నేటి దేవాలయాలలో బంధింపబడిన రాముడు దప్ప దశరథ కుమారుడగు రాముడు జాతి, మత భేదాలను పాటించ లేదనుటకు ఒకనిదర్శనముగలదు. మాతంగ అను తెగ నేడస్పృశ్యులుగ జూడబడు "మాల - మాదిగలు" అను తెగయేనని అమరకోశములో లేదా? శబరి యీమాతంగ తెగకు జెందియుండెను. ఆమెచేత ఆతిథ్యము గైకొను టయేగాక, ఆమెకు అంత్యక్రియలుసలిపి ధన్యుడ నైతినని రాముడు భావించుకొన్నాడు. అయితే శంభుకవధ రాముని ఆదర్శపాత్రలో ఒకమచ్చవలె గానుపించవచ్చును. నిజమాలోచించిన యీ కళంకము రాముని కంటగట్టు టకు వీలు లేదు. సంయోగాంతము, వియో గాంతమని కావ్యములు రెండురకములు. రామాయణము సంయోగాంత కావ్యము. ఆరవ కాండముతో సంయో గాంతమైన కావ్యము పూర్తియైనది. కనుక ఉత్తరకాండలో గల శంభుకవధ ఘట్టము రామాయణకావ్యము లోనిదేనని అనరాదు. అది ఉత్తరకాండకు చెందినదే. కనుక కులద్వేషా లను ప్రోత్సహించువారు యీ కథను ఉత్తరకాండలో ఉటంకించుటకు అవకాశము గలదు. శబరి తపస్సునకు సంతసిల్లి, ఆమెచే ఆతిథ్యమునుబొందిన రాముడు బ్రాహ్మణ

బాలుడు మరణిస్తే తపస్సుజేసుకొను శంభుకుని సంహరించ గలడా? శంభుకుని రాముడు వధించినాడనే వాదించినట్లయితే ఒక సమాధానము చెప్పకతప్పదు. శూద్రునింట బుట్టిన శంభుకుడు తపస్సు జేయునపుడు బ్రహ్మజ్ఞానం లేని బ్రాహ్మణులిప్పటివలెనే వున్నారన్నమాట. అందువల్ల ఈర్ష్యతో బ్రాహ్మణబాలుడు మరణించినాడను నెపంతో రాముని శంభుకవధకు అప్పటి బ్రాహ్మణులే ప్రేరేపించి యుండాలి. స్వార్థపరమగు బ్రాహ్మణాధిపత్యముక్రిందనే అప్పటిరాజ్యాంగముండుటచేత రాముడు ఆత్మవిరుద్ధంగా శంభుకుని వధించుటకు అంగీకరించి యుండాలి. అన్యాయంగా వధించవలసి వచ్చినందుకు తరువాత దుఃఖించి యుండాలి. రాముడేగాదు, భవభూతివంటి మహాకవిగూడ యీ ఘట్టాన్ని వర్ణించేటప్పుడు విలపించక తప్పలేదు. ధార్మిక పెత్తందారీతనాన్ని నిలుపుకొనుటకై శంభుకవధ ధర్మసమ్మతమైనదేనని వాదించు సోదరులకే పై సమాధానము. వాస్తవముగా రామునివంటి కోమల హృదయముగల పాత్ర యీ ఘోర అన్యాయమును చేయజాలదు. నిశిత తార్కిక విమర్శకులకు రామునిపాత్ర అక్కడక్కడ కటువుగా కనుపించుటకు హేతువు ప్రక్షిప్త, ప్రక్షేపములేనని భావింపవలసి వచ్చుచున్నది. నిజమాలోచించినచో ఆరవకాండ లోపలనే అనేక ప్రక్షేపములు కానుపించునప్పుడు ఉత్తర కాండలో వాటికి ప్రవేశము లభించుటలో ఆశ్చర్యమేమున్నది?

శ్రీకృష్ణుడు – భగవద్గీత : శ్రీ కృష్ణుడు కర్మయోగి. జ్ఞాతి వైరముతో కొట్లాడుకొనుచున్న కౌరవ పాండవులమధ్య

రాజ్యాంగ వ్యవహారములలో రాయబారములు నెరపిన రాజనీతి విశారదుడు. జ్ఞాతివైరము వలన రానున్న హానిని యిరు పక్షాలవారికి తుదివరకు తెలియపరచిన శాంతిప్రియుడు. కృష్ణునిదృష్టి యెల్లపుడు స్వధర్మపాలనవైపే మ్రొగ్గుచుండెను. స్వధర్మము మానవుని పుట్టుకతోనే ఆవరించి యుండునని యీయన బోధించెను. స్వధర్మ పాలనలో 'నీ—నా' అను భేదమును పాటించరాదు అనేదే యీయన ఉపదేశాలలో ముఖ్యభాగము. అర్జునుడు కృష్ణునకు విశ్వాసపాత్రుడగు అంతేవాసి యయ్యెను. కృష్ణార్జునుల సంబంధమును జూచి భావుకులు వీరిని నరనారాయణులుగ వర్ణించినారు. కర్మయోగియై కృష్ణుడు వేదశాస్త్రములలోని నిష్కామ కర్మయోగమును బలపరచినాడు. సాంఖ్య దర్శనములోవలె గీతలో సృష్టికి మూలము సత్వరజస్తమోగుణముల సామ్యావస్థయేనని తెలిపినాడు. కృష్ణునిది ఒక్కటేమతము. అది కర్మయోగముదప్ప వేరొండుగాదు. "జ్ఞానాగ్ని దగ్ధకర్మాణం తమాహుః పండితం బుధాః" అనుటచేత కర్మలో జ్ఞానము ఓతప్రోతమై యుండవలెనని కృష్ణునిసంకల్పము. ఆజన్మ మరణాంతము నిముసమేని విశ్రాంతియెరుగని కర్మయోగియై పని జేయనివానికి మానసిక వికారములు నశించుటకు బదులు వృద్ధి చెందునుగనుక నిష్కామదృష్టితో పనిచేయుటయే ముక్తియనీ, ఆనందమనీ నిరూపించెను. కృష్ణుడు అర్జునునకు జేసిన జ్ఞానోపదేశములను వ్యాసుడు పద్యరూపములో రచించెను. అదే భగవద్గీత. వేదోపనిషత్తుల సారమే భగవద్గీత వలె కానుపించును. ఏకాల మందైనను ధర్మజిజ్ఞాసువులు

గీతలోని పదములకు ఆ యా దేశ కాల పరిస్థితులకు తగినట్లు అన్వయము జేయుచున్నపుడు గీతకు శోభ పెరుగునేగాని తగ్గదు. గాంధీ, వినోబావంటి వారలు గీతలోని పదములను నకు పూర్వకాలపు అన్వయములకంటె విలక్షణాన్వయములనుజేసి నూతనార్థములను బయటికిదీసిరి. గాంధీజీ 'యజ్ఞము' అను పదానికి సత్కార్యము, నిష్కామకర్మ, నూలు వడుకుట అనీ, వినోబాగారు 'వికర్మ' అను పదమునకు 'మిక్కిలి సత్కర్మ' అనీ అన్వయించిరి. 'యజ' దేవపూజాసంగతి కరణదానేషు—అను ధాతువునుండి యజ్ఞశబ్ద మేర్పడినది. కనుక గాంధీజీ చెప్పిన అన్వయమును త్రోసిపుచ్చుటకు వీలులేదు. ఇట్లే "వి" అను ఉపసర్గకు విశేషమైన, నికృష్టమైన అని రెండు అర్థములు వుండుటచేత వినోబాగారు "వికర్మ" అను పదమునకు విశేషమైన, ఉత్కృష్టమైన అను అర్థమును తెలుపుట గూడ యుక్తమే. పైగా గీతలో యిట్లున్నది.

> కర్మణోహ్యపి బోద్ధవ్యం, బోద్ధవ్యంచ వికర్మణః ।
> అకర్మణశ్చ బోద్ధవ్యం, గహనా కర్మణోగతిః॥ అధ్యా 4-శ్లో 17.

ఇందు కర్మ, అకర్మ, వికర్మల పేర్లున్నవి. వీటిగతి గహనమైనదని తెలుపబడినది. ఈ 'కర్మలనుగూర్చి తెలుసుకొనవలెను' అని శ్లోకములోని భావము. కర్మ, అకర్మలకు గీతలో అక్కడక్కడ నిర్వచనము గలదు. కాని వికర్మ శబ్దము మాత్రము నిర్వచింప బడలేదు. పోనీ వికర్మ ఆచరణీయము గాదు అని తెలుపబడినదా? అట్టి నిషేధము వివరింపబడిలేదు. కర్మ, అకర్మ, వికర్మ—యీ మూడును ఉపాసనీయములేనని

గీతాకారుని అభిప్రాయమై యుండవచ్చును. వినోబాగారు కర్మ-అకర్మలు కలసినచో 'వికర్మ' అనగా ఉత్కృష్ట కర్మగా పూరునని వ్యాఖ్యానించినారు. వినోబాగారికి పూర్వపు పండితులు కర్మ, అకర్మలు ఆచరణీయములని, వికర్మ అనగా దుష్టకర్మ గనుక దానిని విసర్జించవలెనని చెప్పుచుండిరి. వినోబాగారి వ్యాఖ్యానమును జూచినపిమ్మట పూర్వపు వాఖ్యాతల నిర్ణయములు అంతయుక్తముగా కనుపించుట లేదు.

వేదమునకు గీతకు ఘనిష్ఠ సంబంధముగలదు. అనేక శ్లోకములు వైదికమంత్రాల అర్థములను పోలియుండుట గమనించదగిన విషయము. మచ్చునకీ దిగువశ్లోకమును జూడుడు.

> యజ్ఞశిష్టాశినః సంతో, ముచ్యంతే సర్వకిల్బిషైః।
> భుంజతే తే త్వఘం పాపా, యేపచంత్యాత్మకారణాత్ ॥
>
> అ 3-శ్లో 13.

యజ్ఞశేషమును భుజించువారు సర్వవిధములగు దుఃఖముల నుండి విముక్తిని బడసెదరు. ఎవరు తమకొరకే అన్నమును తయారుజేసుకొందురో అట్టివారు అఘమ్=పాపమును, అనగా దుఃఖమును పొందెదరు. ఇదేవిషయము వేదములో—

"మోఘమన్నం విందతే అప్రచేతాః, సత్యంబ్రవీ మివధఇత్ వధస్య । నార్యమ పుష్యతినో సఖాయం, కేవలాఘో భవతి కేవలాదీ ॥ఋగ్వే॥ మం 10-సూ॥7-మం 6. "మూర్ఖుడు అన్నమును (మోఘం) వ్యర్థముగ పొందును. నేనుమీకు శాశ్వత సత్యమును చెప్పుచున్నాను. ఆవిధమైన అన్నమును

తినుట అతనికి మృత్యువుతో సమానమే. అట్టి మూర్ఖుడు (అర్యమణం) ఆదిత్యుని తృప్తిపరచడు. అట్టి (కేవలాది) తన పొట్టకుమాత్రమే ప్రయత్నించి తినువాడు పాపమునే అనుభవించుచుండును. ఆనంద మెన్నటికి కలుగదు."

వృత్తినిబట్టియే కులములేర్పడినవని గీతనిర్ణయము. కావుననే గీతాశాస్త్రము సర్వజనాంగీకార మైనది. వినోబా గారు గీతను మాతృదేవిగా వర్ణించినారు. గీతయనెడి మాతృదేవి స్తన్యములనుండి మాధుర్యములగు క్షీరములను గ్రోలి ఋషిసత్తములు సాత్త్వికసంపదను క్రమవికాసము నొందించు కొనుచుందురు. అయితే యీ గీతాక్షీరములను కేవలము బ్రాహ్మణులే త్రాగుటకు హక్కుగలిగి యున్నారా? లేక మానవమాత్రుడై దుఃఖమునుండి విముక్తిని పొందగోరిన ప్రతి వ్యక్తియు హక్కుగలిగి యున్నాడా? జిజ్ఞాసువైన ప్రతి వ్యక్తికి అట్టి అవకాశము కలిగించనిచో గీతాశాస్త్రము మోక్షదాయక మైనదేకాదు. ఆత్మ నిత్యత్వ ప్రతిపాదిత గ్రంథమే గాజాలదు. "సమత్వం యోగఉచ్యతే" అనే మాట బూటకం కావలసిందే. నిజముగా గీతాదేవికి యీ భేదము లేదు. మఱినేడుగూడ లోకంలో గీతాశాస్త్రమును బ్రాహ్మణులే అధ్యయనము చేయుటకు హక్కుగలిగి యున్నారని వాదించువారు సమాజములో లేకపోలేదు. వారు గీతాదేవి పట్ల ఘోరాన్యాయము జేసి మాతృహంతకు లగుచున్నారు. "నిర్వైరః సర్వ భూతేషు" అని వాత్సల్యముతో గీత బోధించుచుండ కులద్వేషములను ఆమెకు అంటగట్టి ఆమె

కీరములను మేమే త్రాగుటకు హక్కుగలిగి యున్నామని వాదించువారు మాతృహంతకులుగారా? "విద్యావినయ సంపన్నే బ్రాహ్మణే గవిహస్తిని శునిచైవ శ్వపాకేచ, పండితాస్సమదర్శినః" అని ఆ తల్లి మనకందరికి బోధించుచుండ పండితుల మనుకొనువారికి చెవులుండియు వినబడుటలేదు. ఒక్క మాటలో చెప్పవలెనంటే గీతాశాస్త్రము జ్ఞానమును పొందగోరిన ప్రతి జిజ్ఞాసువునకును బోధింపబడినది. ఆ జ్ఞానము— "నిర్వైరః సర్వభూతేషు" "పరందృష్ట్వా నివర్తతే" "యే యథామాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహమ్" "సాంఖ్యయోగోపృథక్ బాలాః ప్రవదన్తి, నపండితాః" అను వాక్యాలలో ప్రకాశించుచున్నది. ఇదేగీతాలక్ష్యము. అయితే "నకర్మణా మనారంభాత్ నైష్కర్మ్యమ్యం పురుషోశ్నుతే" అని కర్మనువీడరాదని తెలుపుచు "కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన" అని ప్రేమపూర్వకంగా హెచ్చరిక చేయుచున్నది. ఎందుకనగ, ఫలాపేక్షగల జీవితము పనిలో నేర్పరితనము పొందలేదు. అందువలన స్వధర్మచ్యుతి యేర్పడును. కర్తవ్యము మరపునకు వచ్చును. కనుక గీతాదేవి బోధించిన పై హెచ్చరికను మరువకుండినచో లక్ష్యమును జేరుట సులభమగును.

ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశోర్జున తిష్ఠతి ।
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా ॥

అ 18 శ్లో 61.

"యంత్రముపై అమర్చబడిన వాటివలె సర్వభూతము లను ఈశ్వరుడు (మాయచేత) తనశక్తిచేత త్రిప్పుచూ ఆభూతముల హృదయాలలో వుంటును" అని అర్థము. అనగా సర్వమానవుల హృదయాలె భగవత్స్వరూపమని భావించవలెను. సర్వజీవుల హృదయాల ఏకీకృతరూపము- అదికంటికి కనుపించకపోయినను - భగవత్స్వరూపమై వెలు గొందుచుండును. కనుక భగవంతునిపై విశ్వాసముగల వారు గీతనుచేబూని సాటిమానవులను జాతి, మత, కులముల పేరుతో ఘోరహింసలపాలుజేయుట న్యాయమా? అది మానవత్వ లక్షణమగునా?

## సుక్రటీసు

గ్రీకుదేశములో సామ్రాజ్యశక్తుల దుష్టపరిపాలనా విధానాన్ని ఖండించి ఆ సామ్రాజ్యాధిపులచేతనే మరణ దండన విధింపబడిన మహనీయుడు సుక్రటీసు. ఇతడు తన మరణ దండనను - విషము త్రాగుటను - శత్రువుపై అఖండప్రేమతో అనుభవించి ప్రజాస్వాతంత్ర్యమును నలు మూలల చాటిన అహింసాయోధుడు.

## ఏసుక్రీస్తు

రెండువేల సంవత్సరముల నాడు పాలస్తీనా ప్రజలు రోమన్ పాలకులచే పరిపాలింప బడుచుండిరి. పాలకుల హింసాకృత్యములు, పురోహితుల దుండగములు పెచ్చుపెరిగిన కాలములో ఈ మహనీయుడు ఈశ్వరుడే అందరకు ప్రభువని బోధించి "అధికార ధన మదాంధుడైన

మానవుకుచేయు దారుణకృత్యాలకు సాటిమానవు లెవ్వరు లొంగవలసినపని లేదని" తెలిపి, సామాన్య ప్రజానీకములో చైతన్యము కలిగించెను. దాని ఫలితముగ పురోహితవర్గము, పీఠాధిపులు, ప్రభుత్వము జీసనుమహానీయునకు ఉరిశిక్షను విధించిరి. కాని యీాయన తుదివరకు పరిపూర్ణప్రేమ తత్వముతో దైవముపై విశ్వాసమును వీడలేదు. శత్రువుపై ద్వేషముకు బూనరాదనునది వీరిసిద్ధాంతాలలో ముఖ్యమైనది. వీరి ఉపదేశాలసంగ్రహామే బైబిలు. కొండమీాది ఉపదేశము- (Sermon on the Mount) అను ప్రకరణము బైబిలుకు గుండెకాయవంటిది. ఈఉపదేశములో "ఎవరైనా మిమ్మొక చెంపపైగొట్టినచో రెండవ చెంపనుగూడ చూపుడు" అనే వాక్యము సత్యసాధకులకు దివ్యజ్యోతిఃపుంజములను వెదజల్లు శాశ్వత జ్యోతిగానుండి మార్గమును జూపుచుండును. బైబిలునే చేబూని, ప్రజాస్వామ్యరక్షణ కొరకని చెప్పుచూ, నిత్యము దారుణహింసాకాండకు ప్రోత్సాహపరచే నాగరికలో కానికిది వెర్రిమాటగా మాత్రము కానుపించుచుండును. ఏది యెంతవరకు నిజమో నేటి స్పర్ధయుగము ఋజువు చేయక మానదు!

సిలువపై నెక్కించి మేకులుగొట్టిన పిమ్మట జీసను మహానీయుని తుదిపలుకులు:-

"తండ్రీ! నాసంకల్పమునునీచేతులలో నుంచుచున్నాను!"

ఉపాధిరహితమగుట తోడనే జీవుకు పరమాత్మలో లీనమగునను ఉపనిషద్ధోరణితో యీావాక్యము పలికి జీసనుమహా

నీయుడు విశ్వమానవ ప్రేమయొక్క విశాల రూపంలో లీనమైనాడు.

అయితే జీసను తానే దేవునినుండి సందేశము తెచ్చిన వాడనియు, తననే నమ్మవలెననియు బోధించినాడుగనుక అది వైదిక సిద్ధాంతమునకు విరుద్ధమై, తార్కికదృష్టికి వెగటుగ కొందరికి తోచవచ్చును. కాని గురుశిష్యులమధ్య యీపాటి సంబంధములేనిచో విశ్వాసమునకు తావుండుట కష్టము. గీతలో చివరి అధ్యాయమునందు కృష్ణుడు అర్జునునితో "మయ్యేవమన ఆధస్వ" అని పలుకలేదా? కాని "రహస్యంహ్యే తదుత్తమం" అని బోధించినట్లు పీటరుతో జీసను తాను ఈశ్వరదూతనని చెప్పుకొన్నను "ఈవిషయ మును మరెవ్వరికీ చెప్పకుము" అని పలుకును. కాని ఏసుక్రీస్తు తన్నుదానెల్లప్పుడు మానవుడనే – Son of Man– నని చెప్పుకొన్నట్లు బైబిలులో లేదా? స్వచ్ఛమైన మాన వత్వమునకు, మహాత్మునకు అంతరములేదు. కనుక క్షమా శీలతకు జీసను పుట్టినిల్లై వెలసినాడు.

మహమ్మదు

అరేబియా దేశములో షుమారు 13 వందల సంవ త్సరములకు పూర్వము యీ ప్రవక్త జన్మించెను. ఆకాలములో ఇరాక్, ఇరాన్, అరేబియా మొదలగు పడమటి దేశాలలో బహుదేవతారాధన, బహు భార్యాత్వము వంటి దురాచారములు పెచ్చుపెరిగి సమాజము కలుషితమై యుండెను. వారల నాదురాచారములనుండి ఉద్ధరింపగోరి

మహమ్మదు సత్యప్రబోధము జేయసాగెను. మహమ్మదు జేసిన ఉపదేశాల సంగ్రహమే "కురాన్‌షరీఫ్".

నాటిదేశకాల పరిస్థితుల ననుసరించి అప్పటి సమాజమును పూర్వపు అధోగతిస్థితినుండి ఒక అంతస్థైనా పురోగమింపజేయుటయే మహమ్మదునకు ప్రత్యక్ష సమస్యగానుండెను. కనుకనే మహమ్మదు ఉపదేశాలలో కొన్ని గౌణముగను, మరికొన్ని ముఖ్యముగను కానుపించుచుండును. తానుజేయు కఠినోపవాసములను ఇతరులు అనుసరించరాదని పదేపదే విశదీకరించుటకుగూడ యిదేహేతువై యుండెను. సంస్కృత వాఙ్మయములోనున్న ఆర్య ధార్మికగ్రంథాలలోను ఇట్లే ముఖ్య, గౌణధర్మములు పొడసూపుచుండును. మహమ్మదీయ సోదరులు నిత్యము జపించు మంత్రములలో ముఖ్యమంత్రము :-

"లా ఇల్లాహ్, ఇల్ల అల్లాహు, ముహమ్మద రసూల అల్లాహి."
ఉర్దూ అర్థము : నహీం హై కోఈ మాబూద్, మగర్ అల్లాహ్, ముహమ్మద్ అల్లాహ్ కా పైగంబర్ హై॥

"అల్లాదప్ప మరియే ఇతర దేవతలు ఉపాసనీయములుగావు. ఈవార్తను తెలుపుచున్నది పైగంబరుమహమ్మదు." కురానుకు ఆంగ్లములో భాష్యము వ్రాసిన మౌలానా మహమ్మదాలీగారు "అల్లా" శబ్దమునకు జేసిన నిర్వచనమును జూడుము.

"Allah"–the being who exists necessarily by himself, comprising all the attributes of

perfection." "ఎవనిలో సంపూర్ణగుణములుండునో, ఆవశ్యకమై ఎవరు తనసత్తాపైననే నిలువబడి యుండునో, అతడు అల్లాహ్." కనుక వేదప్రతిపాదితమగు 'సర్వహితా' శబ్దమునకు 'అల్లా' శబ్దమునకు భేదమేమున్నది?

మహమ్మదు - గోమాంసము :- * అరేబియా దేశములో గోమాంసమును తినవచ్చునని మహమ్మదు చెప్పినాడని తలచి కృషి ప్రధానమైన భారతదేశంలో గూడ ముస్లిము సోదరులు గోమాంసమును తినవలసినదేనని పట్టుబట్టినచో అది అయోగ్యమగును. ఇతర జంతువులలో కంటె గోశరీరంలో ఉత్కృష్టగుణాలున్నవి. నేడు గూడ అరేబియాలో గోవులు విస్తారంగా కానుపించవు. ఇక మహమ్మదు కాలంలో అరేబియాలో గోసంపద యెట్లుండె డిదో ఊహించుకొనవచ్చును. అయితే అప్పుడా దేశంలో తృణధాన్యముల కొరతవల్లనేమి, శాకాల ఉత్పత్తి లేక పోవుటవల్లనేమి, వ్యావసాయిక సంస్కృతి వికసించకపోవుట చేతనేమి మాంసాహారము విరివిగానుండెను. సంస్కరణాభిలాషియగు మహమ్మదు మాంసాహారమును ఒక మేరకు తగ్గించగోరి, మాంసాహారములో సైతము వైజ్ఞానికదృష్టితో అభివృద్ధిని మేళవింపనెంచి "మాంసాహారమును జేయ

* మాంసాహార నిషేధమును ప్రతిపాదించగోరి యీ విషయాన్ని వ్రాయుటలేదు. పశుపోషణచేయని వారందరూ గోసంపద కుంటుపడుటకు బాధ్యులే. చేతనైనంతవరకు మాంసాహారులు గోమాంసమును కోర కుండినచో వ్యవసాయాభివృద్ధికి దోహదమిచ్చిన వారయ్యెదరని నా మనవి.

గోరుచో ఉత్కృష్టగుణగణములు గల గోమాంసమునే గ్రోలవలెనుగాని క్షుద్రతత్వములుగల పంది మొదలైనవాటి మాంసమును తినరా"దని శాసించెను.

అయితే భారతావని అతిప్రాచీనకాలమునుండియు కృషి ప్రధానమైనది. నెత్తురుసారము మాంసము. మాంసములోని నిగ్గు క్రొవ్వు. దానిసారభూతమైనవి పాలు. పాలలోఘనీభవించి శాశ్వతముగనుండు విటమినులు నెయ్యి. కనుక గోమాంసములోకంటె గోక్షీరములలోను, ఘృతములోను ఉత్తమ గుణములుండుట వైజ్ఞానికదృష్ట్యా వాస్తవము. పైగా ఆవును చంపనిదే అనగా హింసపెట్టనిదే దాని మాంసము లభించదు. కాని ఆవును మేపినకొలదీపాలు, నెయ్యి వృద్ధియగుచుండును. ఆవుమాంసమునే గోరినచో పశుసంపద నశించి వ్యవసాయము స్తంభించిపోవును. కనుక ఆవును సంతోషపెట్టి, దాని మాంసములో కంటె ఉత్కృష్టగుణములుగల పాలను, నేతిని సేవించుచు వ్యవసాయాభివృద్ధికి పశుపోషణ జేయుట లాభకరముగాదా? అయితే లేగదూడలను జీవచ్ఛవాలనుగజేసి వ్యాపారదృష్టితో పాలను పితుకుకొను నైచ్యస్థితిమాత్రము బహుభయంకరమైనదే!

రెండవది నాగరికత పెరిగినకొలదీ మానవుడు తన ఆహారముకొఱకు చైతన్య మెక్కుడుగగల జీవులను హింసించుట దోషమేనని సభ్యలోకము గుర్తించుచున్నది. ఇతర జంతువులలో కంటె గోవునందు సత్వగుణమధికము. కనుక చైతన్యముగూడ అధికమే. కాబట్టి దానిని చంపి మాంస

మును తినుటకంటె దానిపాలను, నేతిని ఉపయోగించుట సభ్యతాలక్షణము. కనుక దేశకాలముల ననుసరించి గౌణ ధర్మములను ముస్లిము సోదరులు మార్చుకొన్నచో మత కలహము లుండవు. లక్ష్యమును జేరుటకు - శాంతిని పొందుటకు - విలంబమేర్పడదు.

## గురునానక్

హిందూ మహమ్మదీయులు మత భేదములతో కఠోర హింసలకు పాల్పడుచుండ నానక్ ఉభయ మతాలలోని మూలసిద్ధాంతములను చేబూని ఒక నూతన మతమును స్థాపించెను. దానినే శిఖ్ఖుమతమని యందురు. హిందూ మహమ్మదీయ ఐక్యతే శిఖ్ఖు మతములోని ప్రధానాంశము.

## శంకరాచార్యులు

"శంకరుడు ప్రవక్తా?'' అని కొందరికి ఆశ్చర్యము కలుగవచ్చును. ప్రవక్త : ప్ర+వక్తా = ప్రవక్తా; ప్ర=ఉత్కృష్టేణ, యో వక్తి వదితవా, సః ప్రవక్తా అని నిరుక్తి చేయబడును. అంటే ఉత్కృష్టముగ మహత్తర మైన సత్యవిషయాన్ని (లోకులకంటె విలక్షణముగా) ప్రబోధించువాడు ప్రవక్తయే. కనుక శంకరుడు మాత్రము ప్రవక్తకాడా? మఱియు గౌడపాదుని అద్వైత సిద్ధాంతమును వేదాంతదర్శనములోని సూత్రములలో మేళవించి, మత కలహాలలో కల్లోలితమై పోవుచున్న విజ్ఞలోకానికి ఏక

మార్గాన్ని చూపుటకు అమోఘమైన మేధాశక్తినిచూపుట యేగాక, అనన్య శ్రమకుసైతము లోనుగావలసి వచ్చెను. ఎందువల్లనోగాని ఆయన కృషి పండితలోకమువరకేవచ్చి ఆగిపోవుట విచారకరమే.

బుద్ధుడు సృష్టిని దుఃఖరూపముగా భావించియుండెను. ఈవిషయాన్నే ప్రాచీన దార్శనికులు ప్రతిపాదించి, ఆత్మ సత్తాను గుర్తించి దుఃఖమునుండి విడివడు సాధనలను ఎవరికి తోచిన తీరునవారు నిర్ణయించిరి. అయితే శంకరుడు దీనిని కాదనలేదుగాని దుఃఖమని భావించుట భ్రమయని నిరూపించినాడు. నిజానికి దుఃఖరూపకమైన సృష్టిలోనేగదా ఈశ్వరుని సర్వవ్యాపకత! దుఃఖరూపకమైన సృష్టిలో తానుండియు ఈశ్వర సాక్షాత్కారము నొందవలసిన ఆవశ్యకతయెంతైనా కలదు. అప్పుడు దుఃఖరూపమునుండి ముక్తుడైతే ఈశ్వర సారూప్యమే, అనగా నిత్యానందరూపమగు బ్రహ్మకు - తనకు భేదములేదుగదా? ముక్తుడు కానంతవరకు భిన్నత్వం - ముక్తుడైనచో అభిన్నత్వంఅనగా దుఃఖానుభూతిలో నున్నంత వరకు "పిప్పలంస్వాత్తి" రూపమును, దుఃఖానుభూతి లేనిచో "అనశ్నన్నన్యోఅభిశాకసీతి" అనురూపమును పొందును గదా? అందువల్లనే "జగన్మిథ్యా - బ్రహ్మసత్యా" మనే వాదన శంకరునిలో ఉద్భవించినది. మాండూక్యోపనిషత్తునకు గల అద్వైతకారికలే శంకరుని అద్వైతసిద్ధాంతమునకు ప్రాతిపదిక. ఈకారికలను రచించినది గౌడపాదులు. ఈశ్వరుడు సృష్టికి ఉపాదానకారణమని శంకరుని మతము. కుండలో

మట్టి సర్వత్రా వ్యాపించి యున్నది. కుండ నిర్మాణానికి పూర్వరూపము, ఉత్తరరూపము మట్టియే కదా? అట్లే సృష్టి యొక్క స్వరూపము ఈశ్వరుడే అయి సృష్టికి ఉపాదాన కారణమైనాడని నిరూపించినారు. కుండ యొక్క ఆకారమును జూచి, కుండరూపములో వ్యాపించియున్న మట్టిని గుర్తించక మట్టి కంటె కుండను వేరుగా భావించుట భ్రమయగును. మట్టి యొక్క స్వరూపమును గుర్తించినప్పుడు మధ్యలో యేర్పడిన తాత్కాలిక రూపమునుగల కుండ యొక్క ఆకారక జ్ఞానము మిథ్య - మారునది - అగును. అయితే శంకరుని యీ వాదమును దీసికొన్నది మానవులలో స్థిరమైన మానసిక ప్రవృత్తిని, ఏకత్వమును, "అహం" అనగా స్వశక్తిపై విశ్వాసాన్ని కలిగించుటకేనని తోచుచున్నది. జగత్తును నిరసించుటయే శంకరుని అభిమతమైనట్లు భావించరాదు. బ్రహ్మనిరూపణకు జగత్తునేఆధారముగను, ఉపమానముగను తీసుకొనుట గమనించతగిన విషయము. శారీరిక భాష్య భూమికలో "ఐశ్వాదిభిశ్చావిశేషాత్ - - - - సమానయితి నిశ్చీయతే" అను వాక్యములు యీఅభిప్రాయమును బలపరచుచున్నవి. "ఏకమేవా నాద్వితీయం" ఇదే శంకరుని దృష్టి.

వేదాంత దర్శనమునే అద్వైతమత ప్రచారమునకు సాధనగ గైకొని యుండుటవలన శంకరుని వ్యాఖ్యానములలో చేర్చలేము. వేదాంత దర్శనములోని సూత్రములను అద్వైత విధానముతో అన్వయము చేయుటకు యీ మహనీయుడు అమోఘమైన తార్కిక శక్తిని వుపయోగించెను.

## రామానుజాచార్యులు

విశిష్టాద్వైతమును ప్రతిపాదించినది వీరే. ప్రకృతి - జీవుడు - బ్రహ్మఅనునవి వేరుగా కనుపించుట దృష్టిభేదమేనని శంకరుని అభిప్రాయమైయుండగా, యీమూడును భిన్నములే నని, ముక్తిలో జీవునకు బ్రహ్మసారూప్యమే కలుగునుగాని ఐక్యతకలుగదని రామానుజునిఅభిమతము. అయితే శంకరుని వలె తీక్ష్ణతార్కికశక్తిని తమ "శ్రీభాష్యము" లో వీరుప యోగించలేదు. అస్పృశ్యులుగాజూడబడు నిమ్నజాతీయులకు గూడ తిరుమంత్రోపదేశముజేసి వారుమోక్షార్హులేనని నిరూ పించి విశాలత్వమును ప్రదర్శించెను. కనుక రామానుజునివలె శంకరుడు సర్వ ప్రజానీకమునకు తన సిద్ధాంతమును ప్రబో ధించలేకపోయెనని చెప్పకతప్పదు.

మధ్వాచార్యులుగూడ యీకోటిలోనివారే. అయితే వారి సిద్ధాంతములతో నాకువిశేషపరిచితి లేనందువలన వారి విషయమిట వ్రాయలేను.

## గాంధీమహాత్ముడు

ప్రాచీనులకంటె గాంధీమహాత్ముడెట్లు విలక్షణ దార్శనికుడో అట్లే విలక్షణ ప్రవక్తయని గూడ జెప్పవచ్చును. ఆర్థిక రాజకీయాలను, మతమును వ్యక్తిగత వ్యవహారాలను, కుటుంబజీవితాన్ని వేరుజేసి ప్రతి దానికి మినహాయింపులు గోరుట గాంధీజీప్రకృతికి విరుద్ధమైన పని. అన్ని వ్యవహారములలోను సత్యమును అహింసను పాటించవలసిన ఆవశ్యకతను తన జీవితంద్వారా వెల్లడిజేసెను.

తనదొక మతమని యెన్నడూ ప్రకటించలేదు. లోకంలో యింతవరకు జన్మించి, విశ్వపథములో పయనించిన సత్పురుషు లందరి జీవితాల సారమును తన పవిత్ర ప్రేమజీవితం ద్వారా మనముందుబెట్టి లక్ష్యమగు ఏకత్వమునుజేరుటకై అసువుల బాసిన కరుణామూర్తి గాంధీజీ.

అర్థబలము, అంగబలము, ధనబలము వీటిని ఆధార ముగ జేసుకొని కలవాడు కడుబీదవానిని, జమీందారు కడు బీదనైతును, పెట్టుబడిదారు శ్రామికుని, విద్యాధికులు నిరక్ష రాస్యులను, ఉన్నతపదవుల నలంకరించినవారు సామాన్య ప్రజలను హింసించుట పూర్తిగ తొలగనంతవరకు లోకంలో శాంతిరాజ్యము - దైవరాజ్యము - స్థాపింప బడదని గాంధీజీ నొక్కి వక్కాణించును. అసలీ కలిమిలేములకు సమాజంలో నిండియున్న స్వార్థపరత, తన్మూలమైన దోపిడీవిధానమేనని యీయన విశ్వాసము. అగ్రకులాలవారు నిమ్నజాతీయులను, సంపన్నులు తినతిండి, కట్ట బట్టలేని మూక ప్రజానీకమును హింసించు కఠోరదృశ్యాలను చూచినప్పుడు కఠినహృదయము సైతము కరిగిపోక తప్పదు. కాని యిట్టిదృశ్యాలను జూచు చుండియు 'ప్రాపంచిక వ్యవహారములతో నాకేమి పని' యని తలచిమోక్ష మెక్కడోనున్నదని, యెండమావులకై యెగ బ్రాకుచందమున పరుగులిడు వెఱ్ఱితత్వము గాంధీజీజీవితములో కానుపించదు. "త్రివిధం దుఃఖాత్యంత నివృత్తి రత్యంత పురుషార్థః" అను సాంఖ్యవచనము గుర్తున్నచో 'ప్రపంచమునుండి వేరైనప్పుడే మోక్షము లభిస్తుంద' ని తలచి ముక్కుమూసు

కాని, కామక్రోధాది దుర్గుణములను విసర్జించుటకు బదులు కర్మజేయుటనే వదలివేయు సన్యాసమ్మన్యుల పంథా ఎంత వికృతమైనదో తెలియగలదు. గాంధీజీని కొందరు మతాభిమానులు కేవల రాజకీయవాదియనీ, ఆధ్యాత్మిక తత్వము తెలియని భౌతికవాదియనీ, కొందరు రాజకీయ వాదులు యీయనకు ఆధ్యాత్మిక దృష్టితప్ప రాజకీయము, ఆర్థికము మొదలగు భౌతిక విషయాలలో అనుభవము లేదని పలుకుచు యెట్లైనను బాపూజీకి లౌకికజ్ఞానము లేదని నిరూపించుటకు ప్రయత్నించుచుందురు. కాని మహత్తరమైన ప్రకృతిదేవి అనుగ్రహము వలన ఇట్లు వాదించువారే లౌకికజ్ఞానముకొరవడిన వారని కాలము ఋజువుజేయుచుండును. వీరే ఒకవేళ రాజకీయవాదులుగానో లేక ఆధ్యాత్మిక వాదులుగానో గానుపించవచ్చును. కాని గాంధీజీ సర్వకాల సర్వావస్థలయందును యెంతమేరకు రాజకీయదృష్టి గలవాడో అంతమేరకు మతదృష్టి గలవాడు; యెంతమెరకు భౌతికదృష్టి గలవాడో అంతమెరకు ఆధ్యాత్మికదృష్టి గలవాడే. రెండింటిలోను పవిత్రపరిశోధన సాగించిన ధీశాలి. రెండింటిలోను భేదమును గాంచని సమదర్శకుడు. సామాన్య ప్రజానీకపు వాంఛలను వెనుకకునెట్టుచు, పైపెచ్చు వారిక్షేమారకేనని సమర్థించుకొనుచూ, యుద్ధమేఘాలను ప్రపంచమంతటా వ్యాపింపజేయటానికి కోట్లకొలది ధనాన్ని, మారణాయుధాన్ని సమకూర్చుకొనుటలో వెచ్చించుచుచూ, ఆధ్యాత్మికముగ అహింసను పాటించుచున్నామని చెప్పటానదో అది కేవలము హాస్యాస్పదమైన విషయమని బాపూజీవిశ్వాసము.

సాంఘిక, ఆర్థిక అంతరాలు తొలగి భూమిలోని సంపదను అందరూ సహజంగా అనుభవించినపుడే సమాజంలో సుస్థిరశాంతి నెలకొనగలదని గాంధీజీ సమ్మతము. దీనినే సర్వోదయ దృక్పథమనవచ్చును. ఆత్మ ప్రేరణతో (Instinctiveness) బయలుదేరిన యీ దృక్పథముతో సమాజస్థితి మారిపోయినచో, అద్భుత తార్కిక శక్తితో మార్క్సు ఊహించినట్లు సమాజంలో ప్రభుత్వముయొక్క అవసరమేవుండదు. మార్క్సు ఒక ఉన్నతాదర్శముగల సామాజిక స్వరూపాన్ని స్వాప్నికజగత్తులో దర్శించెను. అయితే దానిని సాధించుటలో ఆయనకు హింసాప్రయోగం నిషేధముగాదు. కాని స్వాప్నికజగత్తులోని యీ అపురూప సామాజికస్వరూపాన్ని గాంధీజీ అహింసాసాధనతోనే తన జీవితంలో చిత్రించి, నాగరికలోకాన్నంతటినీ గభీరపరిశోధనా సముద్రంలో ముంచివేసినాడు. 'హింసలేనిదే మార్క్సుగనిన కలలు సార్థకమగునా?' అని పశ్చిమ ముఖముగా పరుగులెత్తు సభ్యలోకపు దృగ్జాలములను ప్రాఙ్ముఖముగా మళ్ళించిన నేర్పరియైనాడు. వ్యక్తిగతఆస్తి అంటూ లేనినాడు—ఆసమాజపు రూపము—ఆహా! ఎంత శోభావంతము! ఎంత నిర్భయ భూయిష్ఠము! అపరిగ్రహవ్రతధారియై అట్టి సమాజములో పౌరసత్వమును సంపాదించుకొని మార్గదర్శియైనాడు. ఈ అపరిగ్రహవ్రతములో ప్రభుత్వపు అవసరమున్నట్లు యెంత సూక్ష్మపరిశోధన జేసియైనను బయటపెట్టగలప్రయోగికులున్నారా? ద్రౌపదివలె రెండు చేతులను

పైకెత్తి భగవంతుని భుజస్కంధములపైనిడి, సంతోషముతో కాలము వెళ్ళబుచ్చుకున్న అదృష్టవంతుడుగాడా గాంధీజీ?

భౌతికసమత్వమునకు హృదయసామ్యము, హృదయ సామ్యమునకు భౌతికసమత్వము సాక్షీభూతములని పదేపదే నొక్కిచెప్పుట గాంధీజీ శైలిలో గమనించతగ్గది. అందువల్లనే గాంధీజీని కమ్యూనిస్టనీ, సోషలిస్టనీ, నిజమైన డెమోక్రాటిక్ అనీ, జీసను పునరురూపనీ, బుద్ధుని అవతారమనీ, యెవరి యిష్టముననుసరించి వారు వర్ణించుట సహజము. కాని 'గాంధీజీ కల్తీలేని మానవత్వ లక్షణాలెన్నివుండాలో అన్నిటినీ కలిగియుండిన మనిషిమాత్రమే' అనేది నిజము! ముమ్మాటికీ నిజము!!

మార్క్సు మహాశయుడు సమాజంలో కొందరు కడు దరిద్రులుగాను, మరికొందరు మిక్కిలి ఐశ్వర్యవంతులు గాను వుండుటకు కారణమును యోచించెను. అధికశ్రమ జేసినను ఫలితము నేమాత్రము అనుభవించని శ్రామికుల సంఖ్య అధికము! పనిజేయకయే సంపద నధికముగా అనుభవించు వ్యక్తులు తక్కువ! ఈ విచిత్రస్థితికి హేతువేమి? ప్రకృతిదేవికిగల పక్షపాతదృష్టియా? కాదు, కాదు! శ్రమ జేసినపుడేగదా భూమిలో పంటపండేది? మరి యేమిటీదుస్థితికి కారణము? పైగా అధికసంపదననుభవించు తక్కువమంది సంపదలోని కనీసపుపాలునైనా అనుభవించటానికి నోచుకోని ఎక్కువమందిని హింసించుటయా? ఇట్లు యోచించి యోచించి, ఎక్యూమలేటివ్ క్యాపిటలు అనగా కూడబెట్టబడిన–

ప్రోగుచేయబడిన - పెట్టుబడిద్వారా యేర్పడు సర్ప్లస్ కాపి
టలే దీనికి కారణమని మార్క్సు మహాశయుడు కను
గొన్నాడు. ఎక్యూమలేటివ్ కాపిటలుద్వారా ఉత్పన్నమయ్యే
ద్రవ్యములో శ్రామికుడు అనుభవించుటకు కోల్పోవుట
వల్ల, అతనిభాగము యజమానిభాగముతో కలసి పెద్దదగు
చున్నది. అనగా యజమానికి చెందవలసినదానికంటె అద
నముగా చేరుచున్నది. ఇది యజమాని స్వాధీనములోఉండి
పెట్టుబడిగా మారుచున్నది. ఈఅదనపు పెట్టుబడియే సర్ప్లస్
కాపిటల్ అని పిలువబడును. ఒకే కర్మాగారములో శ్రామి
కుడు, యజమాని సమానపాత్రలైనప్పటికీ అనగా యిద్దరూ
కర్మాగార నిర్వహణలో సమానబాధ్యులే ఐనప్పటికీ కర్మా
గారములో జరిగిన పనిద్వారావచ్చిన ఫలితాన్ని-ఆదాయాన్ని-
అనుభవించుటలో యజమాని అధికభాగమును శ్రామికుడు
మిక్కిలి తక్కువభాగమును పొందుటకు మూలకారణము
ఎక్యూమలేటివ్ కాపిటలే. అయితే యేదేని ద్రవ్యోత్పత్తికి
మూలము పెట్టుబడి కావలెనుగదా? మఱి ఆ పెట్టుబడి ప్రోగు
చేయనిదే-కేంద్రీకరించనిదే-లభించినదా? ఈ ప్రోగుచేయుట
అనేది, అనుభవించగా మిగిలినరూపపు ద్రవ్యమే కావలెను
గదా? కనుక ఉత్పత్తివిధానమే యీ ఎక్యూమలేటివ్ కాపి
టలుకు మూలమగుచున్నదే! ఉత్పత్తిలేకపోతే వినియోగ
మెట్లు జరుగును? అని ప్రశ్నించుకొని యీ ఎక్యూమలేటివ్
కాపిటల్ అనగా అదనపుపెట్టుబడి ద్రవ్యపు కేంద్రీకృత
రూపము - శ్రామికునిశ్రమ, యజమాని బుద్ధికుశలత,
పనులుగాక వేరుగా నుండు ద్రవ్యము - ఒకేవ్యక్తి లేక

కొద్దిమంది వ్యక్తుల స్వాధీనములో వుంచుటయే ఒకే ప్రదేశములో కొంతమేరకు తగులు జీవితానుభవము, కొంత మేరకుమిగులు జీవితానుభవమునకు హేతువగుచున్నదని తెలుపుచూ, ఎక్యూమలేటివ్ కాపిటలును ప్రభుత్వపరము - స్టేట్ పరము - చేయాలని సూచించాడు. అనగా పరిశ్రమలన్నిటినీ జాతీయం చేయటమే యీ వ్యాధికి విరుగుడని మార్క్సు అభిప్రాయపడెను. ఇక సర్ప్లస్ అనేరూపమే రాకూడదని స్పష్టపరచెను. కాని కేంద్రీకృతము చేయబడుట అనేదే ఎక్యూమలేటివ్ కాపిటలుకు స్పష్టమైన రూపమని మార్క్సు మహాశయుడు "కాపిటలు" లో పదే పదే తెలిపినాడు. కేంద్రీకృత ఆర్థికవిధానమే సంపదను హెచ్చు తగ్గులుగా అనుభవించు వికృతిస్థితికి హేతువైనప్పుడు, అది వ్యక్తుల పరమైనదైనను, ప్రభుత్వపరమైనదైనను, దానిలోని చెడ్డగుణము తొలగిపోజాలదని గాంధీజీ అభిప్రాయము. ఈవిషయము ప్రపంచపు మార్కెట్టు అధికారమునకై పోరాడుకొనే నేటి ప్రభుత్వాలను జూచినచో బోధపడక మానదు. అందువలనే సంపదకు మూలకందమైన పరిశ్రమను వికేంద్రీకృతము జేయుటయే తరణోపాయమని యీాయన సలికెను. అయితే యీపని సక్రమంగా జరుగవలెనంటే ప్రభుత్వముగూడ వికేంద్రీకృతము చేయబడవలసినదేనని చెప్పి పంచాయతీ రాజ్యాంగ స్థాపనకు ప్రచారము సలిపెను. నిజమైనవ్యక్తి స్వేచ్ఛ, బాధ్యతానిర్వహణ, పౌరస్వాతంత్ర్యములు దీనినుండియే చేకూరగలవు. మానవునికి నిత్యజీవితావసరమైనట్టి, కళాత్మకమైనట్టి వస్తూత్పత్తి, కేంద్రీకృత

పరిశ్రమపై ఆధారపడినచో భావ దాస్యముగూడ కలుగక తప్పదని నిరూపించి, నిత్యజీవితావసర వస్తువులలో అతిముఖ్యమగువస్తువును ఉదాహరించి దానిని వికేంద్రీకృత పరిశ్రమపై ఉత్పత్తి జేసుకోవలసినదిగా ప్రబోధించెను. అయితే సామూహిక వ్యవహారాలకు కావలసిన రైలు, విమానం మొదలగు భారీవస్తువులు కేంద్రీకృత పరిశ్రమ-Centralised industry - ద్వారానే లభించగలవు. కనుక వాటి ఉత్పత్తిని గాంధీజీ నిరసించలేదు. అందువలన గాంధీజీ దూరదృష్టి బోధపడక మానదు. యంత్రము మానవుని స్వాధీనములోనే ఉండవలెనుగాని యంత్రమునకు మానవుడు స్వాధీనము గారాదని మాత్రమే బోధించెను. కావున యంత్రానికి గాంధీజీ ఎన్నడూ విరోధిగాడు. ఆర్థికవిధానంలో గాంధీజీకి, మార్క్సునకు యిక్కడే భేదమేర్పడెను. సమాజంతోపాటు కాలంగూడ మారునని మార్క్సుమహాశయుడే అంగీకరించెను. నేడు మార్క్సుమహాశయునినాటి పరిస్థితులు లేవు. కనుక బాపూజీ చూపిన పంథాయే నేటి విషమపరిస్థితులకు చక్కని విరుగుడని ప్రముఖ ఆర్థికవేత్తలుగూడ అంగీకరించక తప్పుటలేదు.

అపకార మొనర్చువానిని సంహరించుటకంటె హృదయ పరివర్తనజేసి అతనినే లోకసేవలో వినియోగించిన యెడల లభించు మాధుర్యమును, సుఖమును వర్ణించలేము. అయితే అది సాధ్యమాఅని యోచించుకొన్నప్పుడు సామాన్య మానవులకు నివ్వెరపాటు కలుగక మానదు.

కాని గాంధీజీ తన జీవితంద్వారా యిది సాధ్యమేనని నిరూపించెను.

నీవునమ్మిన సత్యసిద్ధాంతమును ప్రేమతో ప్రచారము సలుపనిచో నీ వేశాంతికొఱకు కృషిసలుప బూనినావో అట్టి శాంతి దుర్లభమగును. ఎందుకనగ ప్రతిపక్షి నీకంటె హింసాసాధనములను అధికముగా వుపయోగించక మానడు. సిద్ధాంతాల మాటమరచి హింసాసాధనలను ప్రయోగించుటలోనే మనస్సు లగ్నముగాక తప్పదు. కనుక మిగిలేది హింస! అశాంతి! భిన్నత్వము! ఇంతే! నేటి ప్రపంచపు స్థితికూడ దీనికి నూలు వాసి యెడముగా నైనాలేదు. శాంతి లక్ష్యముతో అనేక ఇజములు, మతములు యేర్పడినను వాటి ప్రచారములో అశాంతిదాయక సాధనములనే ఉపయోగించుటవలన ఒక్క త్రుటిలో మానవుని వేలకొలది సంవత్సరాల కృషిఫలితంగా నిర్మాణమై సమాజ సౌధమును కూల్చుటయేగాక ప్రపంచాన్నంతటినీ మరుభూమిగా మార్చి వేయగల ఆటం, హైడ్రోజను బాంబులు వికట నృత్యాన్ని సలుపుచున్నవి. పాపము! రాజకీయవేత్తలు మాత్రము నామమాత్రపు ఐక్యసమితిలో దాగురుమూతలాడుచున్నారు! కనుకనే ప్రపంచాన్ని కాపిటలిస్టు వరల్డు అనీ, కమ్యూనిస్టు వరల్డు అనీ అగ్రవాలాగారు విభజించినారు. విచ్ఛేదమునకు సిద్ధముగానున్న యీ మానవ సముదాయములకు బాపూజీ యెన్నడో నిర్మాణసాధనను కనుగొన్నాడు. ఏది ఆసాధన? ఆత్మ బలిదానము! తన సిద్ధాంతమును ప్రేమతో ప్రచా

రము నలుపుకొనుటలో ప్రాణాలను సైతము వదలవలసి వచ్చినప్పటికీ ఎదుటివానిని హింసించకుండుట! ఇదే బాపూజీలోగల విశ్వరూపము! ఇదే 'గాడ్సే' పిస్తోలుగుండు విశ్వవిరాట్ గాంధీజీ గుండెలోనికి జొచ్చుకొనుటకు హేతువైనది.

వస్తు పరిశోధనతో సామాన్య మానవుని నిత్యజీవితావసరములను నెరవేర్చుటకు వలయు సాధనముల నన్వేషించుటద్వారా, సామాజిక శ్రేయస్సుకొరకు బాటలు వేయుట ద్వారా, వైజ్ఞానికుడుగాను, నిర్విరామ కార్యక్రమాన్ని కొనసాగించుటలో నిష్కామ కర్మయోగిగాను, విశ్వమంతటను అనగా స్త్రీలలో, సంఘ బహిష్కృతులలో, నిమ్న జాతీయులలో, ఆకలిచే అలమటించే గర్భ దరిద్రులలో భగవంతు డున్నాడని తలచి, సగుణోపాసన ప్రారంభించి, మానవసేవనే మాధవసేవగా మార్చుకొని అనవరత సేవోపాసన జేయుటద్వారా నిష్ణాతుడైన ఉపాసకుడుగాను, తత్త్వ విమర్శనలో మహాజ్ఞానిగాను వెలుగొంది విజ్ఞాన, కర్మ, ఉపాసనా, జ్ఞానరూపకమైన వైదికతత్త్వమును అక్షరాల ఆచరించిన శుద్ధవైదికుడు గాంధీజీ!

## మహాత్ములు — మనము

పైవారందరు ఆత్మయొక్క మహచ్ఛక్తిని దర్శించ గలిగియుండుటచేత మహాత్ములైనారు. మనమో? వారి

పేర్లను మాత్రమే ఉపయోగించుకొని 'ఎవరికివారే యమునాతీరే' అగుటవల్ల కఠినాత్ములమగుచున్నాము. పైగా విగ్రహాలు ప్రతిష్ఠించటంలోను, ఎలెక్షన్లలో జయధ్వానాలు చేయటంలోను, వెఱ్ఱిమహాత్ముల నాప్రవక్తలపై అంటగట్టుటలోను సమర్థులమగుచున్నాము. ఈపనిని మానక పోతే మహాత్ములకు మనకు అంతరం పెరుగుటయేగాని తగ్గదు. వారుపైకి వెళ్ళటం, మనం దిగజారటం ఖాయం.

# దేవతలు

ఈ ప్రకరణంలో వేదములలోను, పురాణములలోను, తరచుగ ఉపయోగింపబడు దేవతలు, అసురులు, ఋషులు మొదలగు పేర్ల విషయము పరిశీలింపబడును. పురాణములు చరిత్రాత్మక విషయములతో కూడి యుండుటచే, వాటిలో కనుపించు దేవ - అసురాది శబ్దములు ఐతిహాసికములు. వేదములు ఇతిహాసములు కావుగనుక వానియందలి అసుర, దేవ మొదలైన పదములు వైజ్ఞానికములు, యౌగికములు. కనుక పురాణాలలోని దేవతలు చరిత్రాత్మక మనుష్యులనియు వేదములలోని దేవతలు వైజ్ఞానికార్థముగల యౌగిక పదములనియు మనము గ్రహించవలెను. నేడు హిందూసమాజము నందు ధార్మికగ్రంథములను జదువునప్పుడు యీ నియమము త్రోసివేయబడుచున్నది. దాని పర్యవసానమే నేటి పరస్పర స్పర్థలు.

'సూర్య' అనుపదమును జూడుడు. ఇదియొక దేవతాశబ్దము. వేదమునందీశబ్దము సూర్యగ్రహానికి, ఆధిభౌతికముగ రాజునకు, ఆధ్యాత్మికముగ పరమాత్మకు అన్వయింపబడును. కాని పురాణాలలోను, ఇతిహాస గ్రంథాల లోను కనబడే సూర్యుడను దేవత సూర్యగ్రహముగాజాలదు. ఎట్లనగ సూర్యుని వరముచేత కుంతి వివాహముగాక పూర్వమే కర్ణునిబడసినట్లు భారతములోగలదు. ఇక్కడ "సూర్యుడు" అనుపదమునకు ప్రత్యక్షముగ, మనకు కనుపించు బ్రహ్మాండ

మైన అగ్నిగోళమగు సూర్యగ్రహమనియే అర్థము జెప్ప కొన్నచో, ఈసూర్యుని ప్రార్థించు సంతమాత్రమునే స్త్రీ-పురుషులు కలుసుకొనకయే పిల్లలు బుట్టుట అసంభవము. ఒకవేళ కుంతి సూర్యగ్రహమునే ఆలింగనము జేసుకొన్నదని తలచినచో, అది మిక్కిలి అసంభవమైనమాట. ఎన్నోవేల మైళ్ళదూరములో నున్నప్పటికీ, సూర్యరశ్మిధాటికి తాళలేని మనుష్యదేహము సూర్యగ్రహము దరిజేరుసరికి భస్మముగాక మానునా? వైజ్ఞానిక దృష్టితోను, దార్శనికదృష్టితోను, చరక సుశ్రుతాది వైద్యగ్రంథాల ప్రమాణమునుబట్టినీ పురుష సంయోగము లేనిదే సూర్యగ్రహము వల్లనే స్త్రీలకు (స్త్రీ - పురుషబీజ సంయోగము లేకుండ) సంతానము కలుగుననుట వెర్రిభ్రమ యగును. కనుక కుంతీదేవి దేవతల తెగకు జెందిన 'సూర్యుడు' అనే మనుష్యునితో వివాహ ముగాక పూర్వమే సంగముజేసి యుండెను. పోనీ - సూర్యు డనే దేవతయొక్క వరముతోనే కర్ణుడు పుట్టినచో, లోక భయమునకు వెఱగుపడి బిడ్డను గంగలో పారవేయనేల? సామాన్య మానవులెవ్వరికీ కనుపించక సంకల్ప మాత్రము చేతనే కుంతీదేవికి కనుపించి, వరమొసగిన సూర్యుడు, ఆశంకించే మానవులనేమైనా శిక్షించలేడా? నిజమునకు కుంతీదేవి సూర్యుడు యెదురు పడగనే, భయాకులితయై సంగమక్రియకు యిష్టపడనట్లు భారతంలోనే వున్నది, కనుక సూర్యుడనే దేవత చరిత్రాత్మకమగు ''దేవతలు" అనే తెగకుజెందిన మనుష్యుడై యుండవలెను.

## వేదములలోని దేవతలు

వేదములలోని దేవతాశబ్దములు కొన్ని సందర్భములలో సర్వవ్యాపకుడగు పరమాత్మ పరముగను, మరి కొన్ని సందర్భములలో అగ్ని, రాజు, విద్వాంసుడు, విద్యుత్తు మొదలైన అర్థములలో నుపయోగింపబడును. ముందు భగవంతుని పేర్లనుగూర్చి విచారింతము. ఆధ్యాత్మిక అన్వయములోగల నిరుక్తనియమ మిచట వర్తించును.

### భగవంతునికిగల అనేక పేర్లు

భగవంతుడు సర్వవ్యాపకుడు, సర్వకర్తా అని వేదము వర్ణించుటచేత, భగవంతుని గుణకర్మలనుబట్టి, భగవంతునికి అనేక పేర్లు యేర్పడినవి. అనగా గుణియొక్క గుణములను బట్టి, ఆ గుణ వాచకములగు శబ్దములు ఆ గుణికే అన్వయింప బడును. అందుకే ఈశ్వరుని విజ్ఞులు అనేక పేర్లతో బిలచిరను, ఆపేర్లన్నియు నిరాకారుడగు ఒకే పరమాత్మకు జెందును. ఇందుకు ఋగ్వేదమునందొక ఆధారమున్నది.

"ఇంద్రం మిత్రం వరు మగ్ని మాహు రథో దివ్యస్ససుపర్ణో గరుత్మాన్ ఏకం సద్విప్రా బహుధా వదంత్యగ్నిం యమం మాతరిశ్వాన మాహుః॥" ఋగ్వే॥మం 10- సూ 164. మం 46.

"ఒకే సత్పదార్థమగు పరమాత్మను జ్ఞానులు ఇంద్రుడు, మిత్రుడు, వరుణుడు, అగ్ని, దివ్యః, సుపర్ణః, గరుత్మాన్, యమ, మాతరిశ్వా యని చెప్పుదురు". కనుక భగవంతునికిగల పేర్లు యౌగికములని తెలుసుకొనవలెను.

## భగవంతునికిగల పేర్లలో కొన్ని పేర్లు

దేవదేవః = దేవతలందరకు ప్రకాశము నిచ్చువాడు.

ఓం = అకార, ఉకార, మకారాత్మకమగు సర్వ దివ్యత్వము గలవాడు.

ఖం = ఆకాశమువలె వ్యాపకత్వము గలవాడు.

బ్రహ్మ = "బృహ, బృహి, వృద్ధౌ" అను ధాతువునుండి బ్రహ్మశబ్ద మేర్పడినది. కనుక అందరికంటే గొప్పవాడై, అందరి కంటే వేరుగనుండగలవాడు భగవంతుడు. బ్రహ్మ పరివృఢః సర్వతః॥ నిరుక్తం అధ్యా 1. ఖం. 9.

విష్ణుః = (వ్యాపకత్వాత్ 'విష్ణుః') వ్యాప్తి అర్థముగల "విష్లృ" అను ధాతువునకు "ను" ప్రత్యయము జేరగ విష్ణుశబ్దమైనది. అనగ వ్యాపకత్వముగలవాడగుటచే భగవంతునికి విష్ణువని పేరువచ్చినది.

ఈశ్వరుడు = ఐశ్వర్యార్థముగల 'ఈశ' అను ధాతువునుండి ఈశ్వర శబ్దము వచ్చినదిగనుక అనంతైశ్వర్యముగలవాడు భగవంతుడని అర్థము.

యముడు = "యమ" ఉపరమే అను ధాతువునుండి యమశబ్దము వచ్చినది. కనుక సర్వభూతములను తనయందు రమింపజేయువాడు యముడు అనగా పరమాత్మ.

గణపతి = సాంఖ్యదర్శనములో ప్రకృతినంతటిని ఇరవైయైదు గణములుగ విభజించిరి. (గణానాం పతిః గణపతిః).కనుక పంచవింశతి గణాత్మకమైన ప్రకృతికి పతి అంటే అధిపతి "గణపతి" అనగా పరమాత్మ.

వరుణుడు = వృఞ్, వరధాతువులకు 'ఉనన్' ప్రత్యయము వచ్చుటచే వరుణశబ్ద మేర్పడును. అందరిచే వరింపబడుటవలన పరమాత్మ వరుణః॥

గరుత్మాన్ = గురు+ఆత్మవాన్ గరుత్మాన్, అనగ పరమాత్మ.

రామః = సర్వభూతములు ఎవని మహత్తులో రమింపబడునో అట్టి పరమాత్మ.

వాయుః = "వాతీతి వాయుః" చరశక్తియుండుటచే భగవంతునకు వాయువను పేరుగలదు.

అగ్ని = అగ్ర+నీ = అగ్ని; అగ్రగామియై సర్వమును ముందుకు గొంపోవుటచే భగవంతునికి 'అగ్ని' అను పేరుగలదు.

కవి = (కు = శబ్దే) సమస్తవిద్యలు ధ్వనింపజేయువాడు.

భగవంతునికిగల శబ్దములయొక్క ఉత్పత్తులను ఉణాదికోశము, ధాతుపాఠముల సహాయమున గ్రహింపవచ్చును. పైపేర్లన్నియు నిరాకారుడగు ఈశ్వరునకే జెందును. ఎట్లనగా,

> స పర్యగాచ్ఛుక్ర మకాయ మవ్రణ మస్నావిరగ్ శుద్ధమపాపవిద్ధమ్।
> కవి ర్మనీషీ పరిభూః స్వయంభూర్యాథాతథ్యతో ర్థాన్ వ్యదధా
> చ్ఛాశ్వతీభ్యః సమాభ్యః॥ యజు. అధ్యా 40. మం 8.

(సః) ఆపరమాత్మ (పరి అగాత్) సర్వత్రా వ్యాపకుడైయున్నాడు. ఆపరమేశ్వరుడు (శుక్రమ్) కాంతిమయుడు, శక్తివంతుడు (అకాయమ్) స్థూలసూక్ష్మకారణ శరీరరహితుడు (అవ్రణమ్) వ్రణములు లేనివాడు (అస్నావిరమ్) నాడీసంబంధమైన బంధనములేనివాడు, శుద్ధుడు (అపాపవిద్ధమ్) పాపరహితుడు (కవిః) సర్వజ్ఞుడు, మేధావీ (మనీషీ) సర్వ భూతముల మనస్సును గ్రహించువాడు (పరిభూః) సర్వత్రవ్యాపకుడు, దుష్టులను వశపరచుకొను

వాడు (స్వయంభూః) తల్లిదండ్రులద్వారా పుట్టుక లేని వాడై తన సత్తాపైనే నిలుచునట్టివాడును అగు పరమేశ్వరుడు (శాశ్వతీభ్యః) సనాతన కాలమునుండి వచ్చుచుండిన (సమాభ్యః) ప్రజలకు (యాథాతథ్యతః) యథార్థరూపముగ (అర్థాన్) సమస్తపదార్థములను (వి+అదధాత్) విశేషరూపము నిర్మించుచున్నాడు.

ఈశ్వరునికిగల అనంతనామముల గూర్చి గాంధీ మహాత్మునిఅభిప్రాయము :-

"God has many names. Each person can choose the name that appeals most to him. Iswar, Allah, Khuda, God mean the same."

"భగవంతుని కనేక పేర్లున్నవి. ప్రతివ్యక్తియు తనకు ముఖ్యమని తోచినపేరును ఎన్నుకొనవచ్చును. ఈశ్వరుడు, అల్లా, ఖుదా, గాడ్ అనే పేర్లన్నీ ఒకే అర్థమును గలిగి యున్నవి."

"My Rama, the Rama of our prayers is not the historical Rama, the son of Dasaratha – the king of Ayodhya. He is the eternal, the unborn, the one without a second – –– He belongs equally to all."

"నారాముడు, అనగా మన ప్రార్థనలకు సంబధించిన రాముడు అయోధ్యా మహారాజగు దశరథుని కుమారుడైన చరిత్రాత్మక రాముడు గాదు. అతడు శాశ్వతుడు, జన్మ

రహితుడు, భిన్నత్వములేని ఏకస్వరూపుడు -- అతడందరకు సమానుడే *"

## ఇతర దేవతలు

భగవంతుని పరముగాని ఇతర దేవతాశబ్దములు ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక, పృథివీస్థాన, అంతరిక్షస్థాన, ద్యుస్థానభేదములతో అన్వయింపబడు చుండును. ఈనియమమును "వేదముల శైలి" అనువిషయమున కొంతవరకు వివరించితిని.

"దివ్" అనుధాతువునకు "అ" ప్రత్యయము వచ్చుటచే దేవశబ్దమేర్పడినది. "దివ్" క్రీడా, విజిగీషా, వ్యవహార, ద్యుతి, స్తుతి, మోద, మద, స్వప్న, కాంతి, గతిషు; దివ్ అనుధాతువు క్రీడా, విజిగీషా = జయము పొందవలెననెడి కోరిక, వ్యవహారము, ద్యుతి=ప్రకాశము, మోదము, మద= సంతృప్తి, స్వప్న=ఉత్తమనిద్ర, కాంతి, గతి అను అర్థములలో ఉపయోగింపబడును. అనగ యీలక్షణములున్నచో దేవత్వమున్నదన్నమాట.

(1) దేవో దానాద్వా - దీపనాద్వా - ద్యోతనాద్వా - ద్యుస్థానో భవతీతివా। యో దేవః సాదేవతా॥ నిరుక్తం అ 7- ఖం 15.

(2) విద్వాంసో హి దేవాః॥ శత 3/7/3/10.
(జ్ఞాన ప్రాప్తిచెందుటచే) విద్వాంసులు దేవతలు.

(3) దేవాః గమనవంతో వ్యవహారవంతో వా ఇంద్రియ సంజ్ఞకాః॥
సాయణభాష్యం ఋగ్వే. మం. 164 సూ. 39 మం.

---

* ఈవాక్యాలు Ramanama the Infalliable Remedy అను గ్రంథములోనివి.

గమనము గలిగినట్టియు, వ్యవహరించునట్టియు ఇంద్రియ సంజ్ఞలు దేవతలు.

(4) దేవాః ద్యోతనాద్దేవాశ్చక్షురాదీని ఇంద్రియాణి॥ శం. భాష్యం. ఈ. ఉ. - 4 మం.

ప్రకాశవంతములగుటచేత కండ్లు మొదలైన ఇంద్రియములు దేవతలని పిలువబడును.

పై ఆధారములనుబట్టి ప్రకాశవంతములై సామాన్యముకంటే విలక్షణమగు క్రియాకలాపములుగలవి దేవతలని తెలిసినది. ఆ దేవత లెన్నిరకములో నిరుక్తములో దైవత కాండము నందు వివరింపబడినది. నిరుక్తము అధ్యాయము 7, ఖండము 5 ననుసరించి ఒకే దేవతకు అనేకపేర్లున్నట్లు గ్రహించవలెను. దేవతలన్నిటిని మూలరూపములనుబట్టి మూడువిధములుగ విభజించవచ్చును. (1) పృథివీస్థాన దేవతలు (2) అంతరిక్షస్థానమందుండు దేవతలు (3) ద్యుస్థాన అనగా విశాలాకాశమునందుండు దేవతలు, అని మూడు రకములు. ప్రతిస్థానమందుండు దేవతలకు మూల రూపమైన దేవత ఒక్కొక్కటి యుండును గనుక మూలదేవతలు మూడు. పృథివీస్థానము - అగ్ని; అంతరిక్షస్థానము - గాలి, ఇంద్రుడు లేక మేఘరూపమును పొందుటకు సమీపము లోని గాలి; ద్యుస్థానము అనగా విశాలాకాశమునందు - సూర్యుడు. ఇందుకు ప్రమాణము:-

> అగ్నిః పృథివీస్థానో, వాయుర్వేంద్రోవా అంతరిక్షస్థానః, సూర్యో ద్యుస్థానః॥ నిరుక్తం అ 7 - ఖం 5.

అగ్ని భూమియందు మండునప్పుడు మంటరూపములో నుండును. అనగా పృథివీ వికారమగు అనేకపదార్థరూపములు మంటలో కలిసి యుండును. ఆమంటయే క్రాంతదూరము పైకిబోయిన తరువాత మంటరూపముమారి, చురుకైన వెచ్చదన రూపములో నుండును. అప్పుడది మధ్యస్థాన, లేక అంతరిక్షస్థాన అగ్నియగును. ఆవెచ్చదనము ఇంకను పైకి బోయినచో స్వచ్ఛమైన సూర్యకాంతిలో లీనమగును. అప్పుడది ద్యుస్థాన "అగ్ని" యగును. కనుక భూమి యందున్న అగ్ని అనేక దేవతలను పిలుచునట్టిదియు, అనేక దేవతలకు పదార్థమును జేర్చునట్టి ప్రధానదేవతయని జెప్పిరి.

ఆకాశమండలములోని గ్రహాలకు, నక్షత్రములకు కూడ వేదములలోని దేవతానామములున్నవి. ఖగోళ శాస్త్రజ్ఞులు, జ్యోతిశ్శాస్త్రజ్ఞులు, ఆయాసమయాలలో తాము కనుగొన్న గ్రహాలకు వేదములలోని యౌగిక, వైజ్ఞానిక పదవాచకములగు దేవతాపేర్లను బెట్టిరి. గ్రహజాలమంతయు కాంతివంత మైనవగుటచే వేదములోని దేవతాశబ్దములను వాటికి సాంకేతిక మొసర్చిరి.

## వేదములోని కొన్ని దేవతాశబ్దములు

### (1) అగ్ని - నిప్పు

అగ్ + నీ = అగ్రగామి; ముందునడచునట్టిది.

అంగం నయతి సన్నమానః = తనవంటిరూపమును కలుగజేయు నట్టిది.

న క్నోపయతి, న స్నేహయతి — స్నిగ్ధత్వమును పోగొట్టునది.

అ + గ్ + నీ = గతి, ఉష్ణత్వమును గలిగించునట్టిది.
నిరుక్తం అ 7. ఖం 15.

(2) ఇంద్రుడు (వాయువు, ప్రాణవాయువు)

ఆధిదైవికం = వాయువు, సూర్యుడు.
ఆధ్యాత్మికం = ఆత్మ, ప్రాణవాయువు.
ఆధిభౌతికం = రాజు.

ఇరాం దదాతీతి ఇంద్రః = (ఇరాం) అన్నమును యిచ్చునట్టి, పోషించునట్టి, ధరించునట్టివాడు.
చంద్రునివైపు నడచునట్టిదియు, చంద్రునియందు రమించునట్టిదియు నగు గాలి.

ఇన్ + దరాతీతి ఇంద్రః = శత్రువులను, క్రిములను సంహరించునట్టిది ఇంద్రుడు గనుక రాజు, సూర్యుడు.
ఇన్ధే భూతానీతి వా = సర్వభూతములను ప్రకాశింపజేయునట్టి సూర్యుడు, విద్యుత్తు, మేఘముల సమీపములోని వాయువు, పరమాత్మ-ఇవన్నియు ఇంద్రవాచకములు.
నిరుక్తం అ 10. ఖం 10.

గ్రహములలో ఒకటగు ఇంద్రగ్రహము (యురేనస్) ఇంద్రుడు.

(3) యముడు

యమో యచ్ఛతీతి వా = జీవితముద్వారా సర్వమును రమింపజేయుటచే వాయువు యముడు.

అగ్నిరపి యమ ఉచ్యతే = అగ్నిగూడ యముడని చెప్పబడును.
నిరుక్తం. అ 10. ఖం 19, 20

యమో వై సూర్యః = సూర్యుడు యముడనబడును (శ. బ్రా.)
సూర్యునిపుత్రుడగు సూర్యకిరణము యముడు.

ఋగ్వే. మం 7. సూ 6. మం 24.

ఆరు ఋతువులు "యమ" అని పిలువబడెను.

ఋగ్వే. మం 1. సూ 164. మం 25.

యమలోకమనగా సూర్యకిరణములు, వాయువు వ్యాపించిన ప్రదేశము. మనుష్య దేహము మృత్యువుపిమ్మట యమలోకము జేరుననగా, దహనముపిమ్మట దేహభాగమంతయు గాలిరూపములో మారి ఆకాశములో జేరునని అర్థము.

## (4) అశ్వినీదేవతలు

అశ్వినీదేవతలనగ భూమి-ఆకాశము, రాత్రి-పగలు, సూర్యుడు-చంద్రుడు అను అర్థములున్నవి. 'అశ్వినౌ' ఇవి జంటదేవతలు. అశ్వినౌ-యద్వ్యశ్నువాతే సర్వం రసేనాన్యో, జ్యోతిషాఽన్యః॥ (సర్వం) సమస్తమును (వ్యశ్నువాతే) వ్యాపించుటచే యీ రెండు అశ్వినీదేవతలగుచున్నవి. ఆ రెండింటిలో ఒకటి (రసేన) ఉదకముతోను, రెండవది (జ్యోతిషా) కాంతిచేతను సర్వమును వ్యాపించుచున్నది.

అశ్వైరశ్వినావితి=అశ్వశక్తితో కూడియుండుటచే రాజులు అశ్వినీదేవతలు.

తత్కావశ్వినౌ = ఆ అశ్వినీదేవతలెవరు ?

ద్యావాపృథివ్యావిత్యేకే = ఆకాశమును భూమిని అశ్వినీదేవతలనియందురు.

అహోరాత్రావిత్యేకే = రేయిపగలు అశ్వినీదేవతలు.

సూర్యాచంద్రమసావిత్యేకే = సూర్యుడు చంద్రుడు అశ్వినీదేవతలు.

రాజానౌ పుణ్యకృతావిత్యైతిహాసికాః = సత్కార్యము నాచరించు రాజులు అశ్వినీ దేవతలని చరిత్రకారులందురు.

నిరుక్తం. అ 12. ఖం 2.

ఆధ్యాత్మికం = ఉచ్ఛ్వాస నిశ్వాసలు.

అధిదైవికం = చికిత్స - శాస్త్రము.

ఋగ్వేద మం 10. సూ 125. మం 1.

## (5) అసురః

అసురః = మేఘము (వై. నిఘంటువు. అ 1. ఖం 10.)

చపలమైనవి అసురులు.

అసురితి ప్రాణనామ = అసురఅనగా ప్రాణమని పేరు.

అసూన్ రాతీతి అసురః = ప్రాణములనిచ్చు ప్రాణశక్తియు, పరమాత్మయు "అసురః" అనబడును.

నిరుక్తం. అ 2. ఖం 7.

## (6) వరుణుడు

వరుణుడు = ఆదిత్యుడు లేక సూర్యుడు.

వృణోతీతి వరుణః = (మేఘములచేత) ఆచ్ఛాదింపబడునట్టియు, వ్యాపించునట్టివాడు వరుణుడు.

నిరుక్తం అ 2. ఖం 14.

గ్రహములలో ఒకటగు నెప్ట్యూన్ (వరుణ) గ్రహము వరుణుడు.

"నీచీనవారం వరుణః కబంధం ప్రససర్జ రోదసీ అంతరిక్షమ్॥"

(వరుణః) సూర్యుడు (నీచీనవారం) క్రిందివైపు ద్వారముగలిగినట్టి (కబంధం)మేఘమును (రోదసీఅంతరిక్షమ్) ద్యులోక భూలోకముల మధ్యనుండు అంతరిక్షమునందు అనగా మేఘము ఆవరించు ప్రదేశమునందు (ప్రససర్జ) ఉత్పన్నముజేయుచున్నాడు. (క=ఉదకమును, బంధం=బంధించునట్టిది మేఘముగనుక కబంధమనగ మేఘము.)

ఋగ్వే. మం 5. సూ 85. మం 3.

## (7) బృహస్పతి

బృహతః పాతా వా పాలయితావా = జగత్తునకు పాలకుడు పరమాత్మ.

బృహతః = ఉదకమునకు పాలయితా = పాలకుడు అనగా మేఘము. లేక మేఘముక్రమ్మ ఆవరణలోని వాయువు (ఋతు పవనం)

బ్రహ్మణః పతిః పాతావా = (బ్రహ్మణః) అన్నము లేక సంపదకు పాలకుడు అనగా వర్షము లేక మేఘము.

(గ్రహములలో ఒకటగు బృహస్పతిగ్రహము)

నిరుక్తం అ 10. ఖం 12.

## (8) పితుః

పితురిత్యన్ననామ పాతేర్వా పి బతేర్వా ప్యాయతేర్వా।

(పితుః) అనగ అన్నము లేక ధాన్యము. ఇది (పాతేర్వా) రక్షణార్థమునకును (పిబతేర్వా) తినుటకును (ప్యాయతేర్వా) వృద్ధిజేయుటకును అను అర్థములలో నుండుటచే అన్నము శరీరమునురక్షించును; శరీరముగల జీవిచే తినబడును, శరీరమును వృద్ధిచేయును. నిరుక్తం. అ 9. ఖం 24.

పితుః = అన్నము (వై.నిఘం. 2–7)

## (9) పితృదేవతా

తండ్రి పితృదేవత; తల్లి మాతృదేవత.

మనశరీరమునకు కారణభూతులై, కర్తలై, తమ రక్త, మాంస, అస్థులలోని సారరూపమగు శుక్ర శోణిత ము ఏకముజేసిన మాంసము, రక్తము, ఎముకలతో గూడిన మనశరీరమునకు పూర్వరూపములుగనుక వారిరువురే ముందు పితృదేవతలు.

పితా పాతావా పాలయితావా = పాలించునట్టి లేక పాలింప జేయునట్టి పితృదేవత.

## (10) స్వర్గము : నాకము

(స్వః) సూర్యుడు, ఆతనివైపు (గమనం) వెళ్ళుట స్వర్గమనబడును. అనగ మృత్యువునకు బిమ్మట జీవుడు, ఇంద్రియములు వాయురూపమున కలసి విశాలాకాశములో వ్యాపించుటయే స్వర్గము (స్వర్గమనము).

నాక ఆదిత్యో భవతి = నాకః అనగ సూర్యుడు.
నేతా రసానాం నేతా భాసాం జ్యోతిషాం ప్రణయః ॥

ఆకాశమునందుండు జలధాతువులకు నాయకుడు, తనకిరణములకు నాయకుడు, కాంతులను నడుపువాడును అగుటచే సూర్యునకు నాకః అనుపేరు వచ్చినది. సూర్యుని లోకమగు విశాలాకాశము నాకము అనగా స్వర్గము.

న+అకం=నాకం, కం=సుఖము, అకం=దుఃఖము, నఅకం= దుఃఖము లేని స్థితి; నాకం అంటే మానవుడు తన జీవితములో దుఃఖము లేకుండ నుండు స్థితి.

నిరుక్తం. అ 2. ఖం 14.

## (11) వసు

వసు=సూర్యరశ్మి (వై. నిఘంటువు 1-5) రాత్రి (వై. ని. 1-7) ధనము (వై. ని. 2-10)

వసవ ఆదిత్యరశ్మయో వివాసనాత్తస్మాద్ద్యుస్థానాః॥ వసుదేవత లనగ సూర్యునికిరణములు. ఇవి అంధకారము (వివాసనాత్) పోగొట్టుటచే ఆకాశము నందుండును.

వాసవుడనగ అగ్ని; ఎట్లనగ "అగ్నిర్వసుభిర్వాసవః" సూర్యకిరణములచే కూడియుండుటచే అగ్నికి వాసవుడని పేరు.

వాసవుడనగ ఇంద్రుడు లేక వాయువు="ఇంద్రోవ సుభిర్వాసవః" ఇంద్రుడు సూర్యకిరణములతో గూడి యుండుటచే వాసవుడు.

నిరుక్తం అ 12. ఖం 45.

## (12) దానవః (మేఘము)

దానవ అనగా మేఘము.

" -- మహాన్తం వృత్రం వృత్రతరం వ్యంసమింద్రో వజ్రేణ మహతా వధేన । పర్వతం విదద్వ్యః సృజో వి ధారా అవ దానవంహన్ ॥ " ఋగ్వే మం 5. సూ 32. మం 1.

ఇంద్ర=ఇంద్రుడా! మహాన్తం పర్వతం=గొప్పదగు మేఘమును వ్యాపించి ధారాః=ప్రవాహములను వ్యసృజః=సృజించినాడవు ఏనం దానవం=ఈ మేఘమును, అవహన్=హతము జేసినాడవు.

నిరుక్తం అ 10. ఖం 10.

దానవుడనగా మేఘము. సూర్యునినుండివచ్చు కిరణములు మేఘము నావరించి విద్యుత్తగును. అప్పుడా విద్యుత్తు మేఘమును వర్షరూపములోనికి మార్చి మేఘరూపము లేకుండ నాశనముజేయును. ఇంద్రుడు దానవులను సంహరించుట అనగా ఇదే భావము.

## (13) పర్జన్యః

"తృప్' అను ధాతువు ఆద్యంత విపర్యయము చెందగ "పృత్" అగును. పృత్+జన్య=పర్జన్యః 'తర్పయితా జన్యః' పరో జేతా వా జనయితా వా, ప్రార్జయితా వా రసానామ్॥

(పరః) అకాలము, దుష్కాలము అంటే కరవు (Famine) ను, మిక్కిలి జయించునట్టిది పర్జన్యము అనగా ఉరుములతో గూడిన మేఘము. ఈమేఘము పిడుగులను (విద్యుత్తులను) పడవేసి భూమిలోని చెడ్డతనమును పోగొట్టును.

నిరుక్తం అ 10. ఖం 11.

ఋగ్వేద మం 5. సూ 82. మం 7 లో (పర్జన్యః) ఉరుములతో గూడిన మేఘము పిడుగులను (విద్యుత్తులను) పడవేసి చెట్లు

వర్గైరాలను తలక్రిందును జేయుచుగూడ, సమస్తభూతము
లను వర్షజలముచేత పోషించుట వర్ణింపబడినది.

(14) రుద్రః

(రుద్రో రౌతీతి సతః) ఎల్లప్పుడు ధ్వనిజేయుటచే "రుద్ర" అంటే
మేఘము. (రోరూయమాణో ద్రవతీతి వా) మిక్కిలి శబ్దము
జేయుచు, ద్రవించునట్టిది జలరూపము రుద్రుడు.

(రోదయతేర్వా) దుష్టక్రిములను దుఃఖింపజేయునట్టిది గనుక
ప్రాణవాయువు రుద్రుడు.
అగ్నిరపి రుద్ర ఉచ్యతే—నిప్పు (Fire) కూడ రుద్రుడని జెప్ప
బడును.

నిరుక్తం అ 10. ఖం 7.

(15) శివః (శివుడు)

శివమ్ అనగా సుఖము. సుఖమునకు అధిపతి శివుడు అనగా పర
మాత్మ. ఏపనివలన సుఖముగలుగునో అది 'శివః' అగును. "శివ
ఇతిసుఖనామ" శివమ్ - సుఖము (వై. ని. 3 అ. 6 ఖం)

నిరుక్తం అ 10 ఖం 18

(16) బ్రహ్మ

బ్రహ్మ అను దేవతాశబ్దమునకు గల అర్థములు.
ఉదకము (వై. నిఘంటువు. అ 1. ఖం 12)
అన్నము లేక ధాన్యము ( ,, 2 అ. 7 ఖం. 25 శబ్దం)
ధనము లేక ఐశ్వర్యము ( ,, 2 అ. 10 ఖం 24 శబ్దం)

(17) భారతాః

(భా+రతాః) ఋత్విక్కులు భారతాః (వై. ని. అ 3. ఖం 10)

## (18) భూదేవత

భూః — భూమి — (వై. నిఘం. అ 1. ఖం. 1.)
అంతరిక్షము ( ,, అ 1. ఖం. 3)

## (19) భూతమనే దేవత

భూతమ్ అంటే నీరు (వై. నిఘం. అ 1. ఖం 12.)

## (20) భగః అనేదేవత

భగః; భజ్యతే భోగ్యతే భోగార్థిభిః
అనగా ధనము; సంపద భగః (వై. నిఘం. అ 2. ఖం 10)

## (21) మఘమ్ అనేదేవత

మఘమితి ధననామ అంటే మఘమనగా ధనము.
(వై. నిఘం. అ 2 ఖం 10.)

## (22) గయ

సంతానము, గృహము, ధనము (వై. నిఘం. అ 2 ఖం 10.
అ 3. ఖం 10)

## (23) 'గౌః' గార్దేవత

గౌః = భూమి (వై. నిఘం. అ 1 ఖం 1)
,, = ఆవు ( ,, అ 1 ఖం 4)
,, = వాక్కు, మాట ( ,, అ 1 ఖం 11)
,, = స్తోత్రనామము ( ,, అ 3 ఖం 16)
(జ్యాపి గౌరుచ్యతే) ధనస్సుయొక్క నారి(త్రా)టినికూడ 'గౌః' అని యందురు. నిరుక్తం అ 5 ఖం 5.
గాం ధత్తీతి నైరుక్త నిర్వచనాత్ — గన్ధర్వః, సుషుమ్ణః॥
"సుషుమ్ణః" అనే సూర్యకిరణమొకటి 'గోవు' అని పిలువబడును.
సర్వేఽపి రశ్మయో గావ ఉచ్యంతే = సమస్తకిరణములు గోవులని చెప్పబడును. నిరుక్తం. అ. 2. ఖం 7.

గౌరాదిత్యో భవతి గమయతి రసాన్ గచ్ఛత్యన్తరిక్షే
'గౌః' అనగా సూర్యుడు. రసములను (జలాదిధాతువులను జలాశయములనుండి భూమినుండి) తనవైపునకు నడుపుకొనును. అంతరిక్షమునందు తనకుతానై నడచుచుండును.

నిరుక్తం అ 2 ఖ14 .

## (24) గన్ధర్వాః

గాం ధరతీతి గన్ధర్వః = భూమిని, వాణిని ధరించునట్టిది 'గంధర్వః' అనబడును. అగ్ని, సూర్యుడు, చంద్రుడు, గాలి, యజ్ఞము, సత్కర్మము, ప్రజాపతి, యివి అన్నియు గంధర్వులు.

యజు. అ 18. మం 38, 43.

గాంధరతీతి నైరుక్త నిర్వచనాత్ — గన్ధర్వః
నిరుక్తం అ 2. ఖం 7.

## (25) చంద్రుడు.

య సర్వాన్ చందయతి ఆహ్లాదయతి సః చంద్రమాః॥

సర్వులను సంతోషపెట్టునది చంద్రుడు. చల్లని కిరణములతో లోకములో నందరను సంతోషపెట్టుటచే చంద్రుడు ఆధిదైవిక చంద్రదేవత యగును.

నిరుక్తం అ 11 ఖం 9.

## (26) అప్సరసః

యా అప్స్వంతరిక్షే జలాదౌచ సరంతి గచ్ఛంతీతి తాః అప్సరాః॥

జలమునందు, అంతరిక్షమునందు నడుచునట్టివి అనగా వాయువులు, ఋతుపవనములు, సూర్యకిరణములు అప్సరసలనబడును.

అథర్వవేదము కాం 2. వ 2. సు , యజుర్వేదం, దయానంద భాష్యం. అ 18. మం 39. ను చూచినచో యీ అర్థము యెంత యుక్తమో బోధపడగలదు.

నిరుక్తం అ 5. ఖం 13.

## (27) ఊర్వశీ లేక ఉర్వశీ

"ఉర్వశ్యప్సరా ఉర్వభ్యశ్నుత ఉరుర్వా వశోఽస్యాః॥ "

ఉర్వశీఅనగా అప్సరా, అనగా జలమునందు సంచరించునది. (ఉరు) మిక్కిలి (అశ్నుత) వ్యాపించునది (ఉరు) మిక్కిలి (అస్యాఃవశః) దీనికి సర్వము వశమగుటచేత జలాదులలోని "విద్యుత్తు" ను ఉర్వశీయని యందురు. (దయానందుడు)

నిరుక్తం అ 5 ఖం 13.

## (28) సోమః

సామానాం - సంవత్సరాణాం మాస ఆకృతిః సోమో రూప విశేషైరోషధిశ్చంద్ర మావా ॥

చంద్రుని కళలవలె పూర్ణిమకునిండి, అమవసకు తగ్గిపోవు కళలతో నుండు సోమలతయను ఓషధియు, చంద్రుడును, సోమ అను దేవతయగును.

నిరుక్తం అ 11 ఖం 6.

చరక, సుశ్రుతములలోని చికిత్సాస్థానములందు సోమలతను గూర్చి తెలుపబడినది.

## (29) పురోహితః

లోకములందు రాజును ముందిడు కొందురుగనుక రాజు అని అర్థము.

నిరుక్తం అ 3. ఖం 12,

పురస్యహితః పురోహితః = పురము యొక్కయు, శరీరము యొక్కయు, ప్రపంచము యొక్కయు మేలుగోరువాడు పురోహితుడు

ఆధ్యాత్మికము - ప్రాణవాయువు, ఆత్మ

అధిదైవికము - అగ్ని

## (30) విశ్వకర్మా

విశ్వస్య కర్తా విశ్వకర్మా = సమస్తమును జేయువాడు విశ్వకర్మ అనగా పరమాత్మ.

అధిదైవిక విశ్వకర్మా = సూర్యుడు

ఆధ్యాత్మిక విశ్వకర్మా = ఆత్మ, ప్రాణవాయువు

నిరుక్తం అ 10 ఖం 26.

## (31) దక్షుడు-దాక్షాయణీ.

ఆదిత్యో దక్ష ఇత్యాహుః = సూర్యుని 'దక్షుడు' అని యందురు. ఆదితిర్దాక్షాయణీ = దక్షునికుమార్తె (అదితి)ను అనగా సూర్యకాంతిని దాక్షాయణి యందురు.

నిరుక్తం అ 11. ఖం 25.

## (32) అదితిః

అదితిః = అదీనా అఖండనీయా॥ ఋ. మం 1 సూ ·9 మం 10

(సాయణభాష్యం)

అదీనము, అఖండనీయమైనది అదితియగును.

అదితిర్దాక్షాయణీ = సూర్యుని కాంతి అదితియగును.

అగ్నిరప్యదితిరుచ్యతే = అగ్నిగూడా అదితియనబడును. (నిఘ)

నిరుక్తం అ 11. ఖం 25.

## ముప్పదిమూడు దేవతలు

"...అష్టౌ వసవ ఏకాదశరుద్రా ద్వాదశాదిత్యాస్తఏకత్రింశ దింద్రశ్చైవ ప్రజాపతిశ్చ త్రయస్త్రింశాఇతి॥"
(అష్ట) ఎనిమిదివసువులు (ఏకాదశ) పదకొండురుద్రులు (ద్వాదశ) పన్నెండు ఆదిత్యులు, ఇంద్రుడు, ప్రజాపతి మొత్తము ముప్పది మూడుదేవతలు.

## అష్టవసువులు - 8

అగ్నిశ్చ పృథివీచ, వాయుశ్చాంతరిక్షంచాదిత్యశ్చ చంద్రమాశ్చ నక్షత్రాణిచైతే వసవ॥

1. అగ్ని 2. భూమి 3. గాలి 4. ఆకాశము - ఖాళీ 5. సూర్యుడు 6. చంద్రుడు 7. (ద్యౌ) విశాలాకాశము 8. నక్షత్రములు. ఈయెనిమిది పదార్థములు అష్టవసువులు. సమస్తము ఈయెనిమిదింటిలోనే (హితం) గర్భితమై యుండుటచే వీటికి వసువులను పేరువచ్చినది.

## ఏకాదశ రుద్రులు - 11

"... దశేమే పురుషే ప్రాణా ఆత్మైకాదశస్తే యదాస్మాచ్ఛరీరా న్మర్త్యా దుత్క్రామయంతి అథ రోదయంతి తద్యద్రోదయంతి తస్మాద్రుద్రా ఇతి॥" 1. ప్రాణవాయువు 2. అపాన (బొగ్గుపులుసుగాలి) 3 వ్యాన 4. ఉదాన 5. సమాన 6. నాగ 7. కూర్మ 8. కృకిల 9. దేవదత్త 10. ధనంజయ అను భేదముతో మనుష్యదేహములోనున్న పదివాయువులు, ఆత్మ - 1 కలసి మొత్తము పదకొండు పదార్థములు ఏకాదశరుద్రులనబడును. మృత్యు సమయమున ఇవి శరీరమును వీడుచు, జీవుని దుఃఖింప జేయుటచే రుద్రులైనవి.

## ద్వాదశాదిత్యులు - 12

"... ద్వాదశవై మాసాః సంవత్సరస్యైత ఆదిత్యా ఏతేహీదగ్ం సర్వమాదదానయంతి తేయదిదగ్ం సర్వమాదదానయంతి తస్మాదాదిత్యా ఇతి" సంవత్సరములోని పన్నెండు మాసములు ద్వాదశాదిత్యు లనబడును.

### ఇంద్రుడు

"స్తనయిత్నురేవేంద్రో - - - కతమ స్తనయిత్నురిత్యశనిరితి
స్తనయిత్నుః=మేఘము, పిడుగు, విద్యుత్తు ఇవి ఇంద్రుడనబడును.

### ప్రజాపతిః

"యజ్ఞః ప్రజాపతిః - - - కతమో యజ్ఞ ఇతి పశవ ఇతి"
యజ్ఞమే ప్రజాపతి - యజ్ఞమనగ పశువులు, ఇంద్రియములు.
(శతపథ బ్రాహ్మణం. కాం 17. అ 3. బ్రా 9.)
ఆధిభౌతికము-రాజు, విద్వాంసులు, తల్లిదండ్రులు, గురువు, సభాపతి.
(President)

ఆధ్యాత్మికము-ఆత్మ, ఇంద్రియములు, ప్రాణవాయువు మొదలైనవి
ఆధిదైవికము-సృష్టిలోని సూర్యుడు, చంద్రుడు, ఋతుపవనములు,
భూమి, వాయువు మొదలైన పదార్థములు.

ఇవే వేదమునందలి దేవతలు. "ఒకప్పుడెప్పుడో పుట్టి దేహధారులై యుండి, ఆకాశములో, యెవరికీ కనుపించక తిరుగుచూ వుండి, యే మండపారాధనలు జేసే మంత్ర పాఠకులకో, యజ్ఞాలలో మేకల మాంసాన్ని వ్రేల్చే సోమయాజులకో అప్పుడప్పుడు దివ్యదర్శనమిస్తూ, విమానారూఢులై వుంటారనే" అంధవిశ్వాసజనిత దేవతలు వేదములలో లేరు. చిన్నపిల్లలకు బూచి అని భయపెట్టితే ఆపిల్లవాడు పెరిగి

పెద్దవాడైకూడ బూచి అనే ఒక భయంకర వస్తువున్నట్లు ఊహిస్తూనే వుంటాడు. కాని వస్తుతః "బూచీ" అనేది లేనే లేదుగదా! అట్లే ఊహాకల్పిత దేవతలుగూడ వేదములలో లేరు.

## పౌరాణిక దేవతలు

సృష్టిక్రమము, భూగోళము, వంశచరిత్రలు గలవి పురాణములు*. పురాణమంటే ప్రాతకాలపు చరిత్ర అని అర్థము. సంస్కృత వాఙ్మయములోని వాయు, మత్స్య, బ్రహ్మాండ మొదలైన పురాణములలో యీవర్ణన విశేషముగనుండును. రామాయణ భారతములకు ఇతిహాసములని పేర్లున్నను, భూగోళవర్ణన ఉండుటచేతను, అవిగూడ ప్రాత కాలపుచరిత్రలే అగుటచేతను వాటినిగూడ పురాణములలో లెక్కింపవచ్చును.

పురాణములలో చరిత్రాత్మకమైన వ్యక్తులవర్ణన, భూగోళ వివరములతోబాటు, ఆయాసంఘటనలను వర్ణించు సందర్భమునందు అలంకారములకొరకు వేదములలోని వైజ్ఞానికములగు అధ్యాత్మిక, ఆధిదైవిక (యౌగిక) దేవతా వివరములు, ఉపమానములుగ దీసుకొనబడుటను పురాణములను జదువునప్పుడు గమనించవలెను. ఆకాలమునాటి కవులు వేదములలో వర్ణితమగు పదార్థములపేర్లను తమతమ

---

* సర్గశ్చప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణిచ । వంశానుచరితం చేతి పురాణం పంచలక్షణం॥ అమరకోశం.

రచనలలోని పాత్రలకు ఉపమానములుగ తీసుకొనేవారు. పురాణవాఙ్మయంఅంతా పద్యరూపంలో ఉండటమే ఇందుకు నిదర్శనము. పద్యరూపక కవిత్వంలో అలంకారములుండుట సహజము.

ఇవిగాక పురాణములలో, వేదాల్లోని శబ్దాలను తీసికొని వాటిని పాత్రలుగ సృష్టించి నిర్మించబడిన ఆఖ్యాయికలు అంటే కల్పితకథలు కనుపించుచు డును. కనుక కల్పితకథలను, అలంకారములను మినహాయించగ మిగిలిన వ్యక్తులపేర్లు చరిత్రాత్మకములు. కొందరు వ్యక్తులపేర్లు సృష్టిలోని భౌతిక పదార్థముల పేర్లతోను, వైదిక పదముల తోను పోలియుండును. కాని భౌతిక పదార్థముల పేర్లు, వైదిక పదములు ఆయావ్యక్తుల నామధేయములుగ మాత్రమే గ్రహించబడినవని గుర్తుంచుకొనవలెను. ఉదాహరణకు "ఇంద్రుడు" అను పదమును జూతుము. ఈపదము వేదముల లోనేగాక పురాణములలోగూడ నుండును. అలంకారముల కొరకును, ఆఖ్యాయికలకొరకును, వ్యక్తులసాంకేతిక నామ ధేయములకును (Proper-nouns) ఆయాకాలపురాజ్యాంగ ములలోని పదవులకొరకును, యీ ఇంద్రశబ్దము వేదముల నుండి తీసికొనబడినది. రామాయణ, భారతాది పౌరాణిక గ్రంథములను జదువునప్పుడు మనకీవివరము చక్కగ బోధ పడును. కాని దురదృష్టవశాత్తు పురాణాలను చదివేటప్పుడు యీవిషయము పూర్తిగ మరచిపోవుట జరుగుచున్నది. అందువల్ల పౌరాణికపదములను వైదికపదములుగను, వైదిక

పదములను పౌరాణికపదములుగను అన్వయము జేసికొను టయు, తద్వారా అయోమయస్థితి యేర్పడుటయు జరిగినది*.

ఇంకొకవిషయము. ఒకేపేరు అనేక కాలములందు కనుపించు చుండును. దానినిబట్టి ఒకే వ్యక్తి సర్వకాలము లందు వున్నాడని భావించరాదు. జాగ్రత్తతో పరిశీలించినచో ఒకేపేరుగల అనేకమందివ్యక్తులు అనేక కాలాలలో ఉన్నట్లు తెలియును. ఇంద్రుడు హరిశ్చంద్రుని కాలమునను, దశ రథుని కాలమునను, పాండవుల కాలమునను ఉన్నట్లు కను పించును. హరిశ్చంద్ర, అర్జునునికాలములనాటి ఇంద్రులు దేవలోకము (టిబెట్టుప్రాంతము) నకు జెందిన అధిపతులు లేక అధ్యక్షులు. దశరథకాలమునాటి ఇంద్రుడు ఆకాలపు రాజులలో ఇంద్రుడనుపేరుగల ఒకరాజు. ఇట్లే నారదుని విష యములోగూడ, అనేక కాలములలో నారదునిపేరు కనుపిం చును. దేవతలు, అసురులు లేక దైత్యులకు మధ్య తగాదా లున్నను నారదుడు అందరిమధ్యను నిరాటంకముగ ప్రవేశ మును పొంది యుండెడివాడు. అనేక దేశాల ప్రభుత్వాల మధ్య రాయబారాలు సలుపుచుండెడివాడు. కనుక నారద అంటే ఆయాకాలపు అంతర్జాతీయమైన ఒక పదవి అని గ్రహించవలసి వచ్చుచున్నది. ఛాందోగ్య ఉపనిషత్తులో నారదుడు సనత్కుమారునితో తన అర్హతలను గూర్చి

---

* పురాణవిషయమును తెలుసుకొనుటకు పండిత భగవద్దత్తగారి "భారత్ కా ఇతిహాస్" అనే హిందీగ్రంథమును చదువుకొనగాక.

చెప్పిన యీ వాక్యాలను చూచినచో యీభావము స్పష్టము గాక తప్పదు. 'స హోవాచర్వేదం భగవోఽధ్యేమి యజుర్వేదం -- సర్వదేవజన విద్యామేదద్ భగవోఽధ్యేమి'.

నేటికాలంలో గూడ పైనియమములు గనుపించును. చరిత్రలో 'జార్జిరాజు' అనేపేరున్నది. అన్నికాలము లందును జార్జిరాజు అనేపేరుగల ఒకే వ్యక్తివున్నాడని భావమా? ఎందరో జార్జిరాజు అనేపేరుగల రాజులు రాజ్యమును అనేక కాలములలో పరిపాలించి యుండిరి. అదీగాక ఒకేకాలములో ఒకే పేరుగల అనేకవ్యక్తు లున్నారుగదా! ఇదీగాక ఒకే వంశములో 'కృష్ణుడు' అనేపేరుగల వాళ్లు అనేక తరాలలో పుట్టి పెరుగుచుందురు. ఏ 'కృష్ణుడు' యేకాలానికి చెందినవాడో అతని సమకాలికుల చరిత్ర, తలి దండ్రుల పేర్లను బట్టి తెలిసికొనగలము. కనుక పురాణాలలో ఒకే పేరు అనేక కాలములలో కానుపించుటను చూచి భ్రమజెంద నక్కఱ లేదు. పౌరాణిక వ్యక్తులలో కొందరికి, వారి యోగ్యతలనుబట్టి కూడ (సాంకేతికమైన) యౌగికపదములు నామధేయములుగ నున్నట్లు తెలియుచున్నది. కుంతీ పుత్రుడగు ధర్మరాజునకు "యుధిష్ఠిరుడు" అను పేరుగూడ గలదు. యుధిష్ఠిరుడనగ (యుధి+స్థిరః) యుద్ధమునందు, కార్యరంగమునందు, స్థిరమైనబుద్ధి, మనస్సుగల వాడని అర్థము. ధర్మజునకు అతనికిగల శాంతగుణమునుబట్టి యీపేరు వచ్చినది. ఇవిగాక రచయితలు, తమకు మంచినడతగల వారుగ కనుపించిన పాత్రలకు దేవతలనిపేరు బెట్టెడివారు.

## దేవతలు — అసురులు (రాక్షసులు)

పురాణములలో యీ రెండు తెగలకు వైరముగలిగి నట్లును, యీ రెండు తెగల నివాసస్థానములు, రాజ్యములు, రాజ్యాంగములు, వేరైనట్లును కనుపించును. దేవాసుర తెగలను గూర్చి ఆధునికులనేకులు పరిశోధనలు సలిపిరి. ఈ సందర్భంలో స్వర్గీయ త్రిపురనేని రామస్వామిచౌదరిగారిని (తెలుగునాటి కవిరాజుగారిని) స్మరించుకోనక తప్పదు. వీరి సూతపురాణాలలో దేవ - దానవ - అసురజాతుల విశ్లేషణ అత్యంత నిష్పక్షపాతముతోను, కడు సమర్థతతోను జేయ బడినది. దేవదానవ రహస్యాన్ని మృదుమధురమగు తెలుగు నుడికారముతో గూడిన కవితతో బయటపెట్టి, సమాజంలో నున్న మూఢ, అంధ విశ్వాసాలను తొలగించుటకు తీవ్ర కృషిసలిపి, నిజముగ కవిరాజై వెలసిరి. కాని తెలుగునాటి దురదృష్టమేమోగాని, సాంఘిక సంస్కార వాదులు సైతము స్వర్గీయ కవిరాజుగారి పౌరాణిక పరిశోధనలను తెరవెనుకకు నెట్టివేయుచున్నారు. ఇదిచాలా అన్యాయమైన పనియని భావించవలెను. అట్లనుటచేత దేవదానవజాతుల పరిశోధన వారినిర్ణయముల వరకే ఆగవలెనని గాదు. కవిరాజుగారు జేసినపరిశోధనలను ముందిడుకొని, మనబుద్ధిని ఉపయోగించి, ఇంకను అనేక సత్యములను వెదకవచ్చును గదా?

పురాతనకాలంలో - కృత త్రేతాయుగాలలో - రాజ్యములనేలు ప్రభువులకు, తాపసులగు బ్రాహ్మణులకు మధ్య ఘనిష్ఠసంబంధముండెడిది. భరతఖండము అనేక చిన్నరాజ్య

ములుగను, రాజ్యకూటములుగను విభజింపబడి ఆ యాభాగ ములకు అధిపతులైనవారు రాజులుగ వ్యవహరింపబడెడి వారు. ఇలాంటిరాజులు, రాజ్యకూటములు కలసి వర్గములుగ యేర్పడి తమకొక అధిపతిని యేర్పాటు జేసుకొనెడివారు. ఆ యారాజ్యకూటము లెవరి నాయకత్వమున నుండునో, అచ్చటిప్రజలు, రాజులు ఆనాయకులపేర్లతో కూడిన తెగ లుగ వ్యవహరింపబడు చుండెడివారు. దేవతలను వారి అధీ నములోనున్న రాజ్యము దేవరాజ్యము. అసురులను వారి అధీనములోనున్న రాజ్యము అసుర లేక రాక్షసరాజ్యము.

దేవతలు—అసురులు అనేతెగకు మూలము కశ్యపుడే. అంటే దేవతలకు, అసురులకు మూలపురుషులు కశ్యపుని సంతానమేనన్నమాట. వీరేగాక దానవులను వారుగూడ కశ్యపునిసంతానమే. కశ్యపునకు దితి, అదితి, దను అను ముగ్గురు భార్యలుండిరి. దితి గర్భమున జన్మించినవారు దైత్యులు అనగ అసురులు. అదితి గర్భమున జన్మించినవారు ఆదితేయులు అనగ దేవతలు. దనుగర్భమున జన్మించినవారు దానవులు. వీరందరిలో దైత్యులే అనగ దితి గర్భమున జన్మించినవారే పెద్దవారని, వీరే ముందు రాజ్యాధిపత్యమును పొందినట్లును వాల్మీకిరామాయణము అరణ్య కాండలో నున్నది.

దితి స్త్వజనయత్ పుత్రాన్, దైత్యాన్ స్తాత యశస్వినః
తేషామియం వసుమతీ పురాసీత్ సవనార్ణవా॥

దితి, అదితి, దను అనువారలు ముప్పురును అప్పచెల్లెండ్రు. వీరు ప్రాచేతస దక్షుని కుమార్తెలు. వీరలకు కలిగిన సంతానములలో రాజ్యకాంక్షవలన పరస్పరము కలహము లేర్పడెను. వీరు షుమారు 12 తఫాలు యుద్ధములు జేసినట్లు పురాణాలలో కనుపించును.

దేవతలు అందమైనవారని, సుసంస్కృతి గలవారని, అసురులు లేక దైత్యులు వికృతాకారము గలిగి, మనుష్య మాంసము సైతము దినువారని పురాణములలో అక్కడక్కడ వుండును. దితి, అదితి, దను అనువారలు ఒకే గర్భజనితులగు అప్పచెల్లెండ్రుగదా? వారిముప్పురికి భర్త ఒక్కడేగదా? ఒకే భర్తగలని ముప్పురు అప్పచెల్లెండ్రకు కలిగిన సంతానమే దేవ - అసుర - దానవులు అని ఒకవైపు జెప్పుచూ, రెండవవైపు వీరిలో కొందరు అతిసుందరులని, మరికొందరు జంతువుల ఆకారములుగల వికృతరూపులని వర్ణించుటలో అర్థములేదు. కనుక దైత్యాసుర తెగల కాలమునకు తరువాత, దేవతల తెగకు జెందినవారు బలవంతులై దైత్యతెగను అణగద్రొక్కి, దేవతల తెగపైనున్న అభిమానముతోను, దైత్యులపైనున్న ద్వేషముతోను యిట్టి వర్ణనలుజేసి పురాణములలో జొప్పించి యుండవచ్చును. వాల్మీకి రామాయణంలో సుందరకాండలో రావణాసురుని సౌందర్యమును, అచ్చటి శిల్పాన్ని చక్కగ వర్ణించిన వాల్మీకి మహాకవి చిరస్మరణీయుడు, కృతజ్ఞతాపాత్రుడు.

## కొన్ని పౌరాణిక పదములు

### ప్రజాపతి

అనేక రాజ్య కూటములపై ఆధిపత్యముగల రాజును లేక రాజర్షిని ప్రజాపతి యని పిలిచెడివారు. ప్రజాపతులనేకు లొకేసమయమునగూడా ఉంటూ వుండిరి. కశ్యప ప్రజాపతి ప్రాచేతస దక్షప్రజాపతికి అల్లుడగుటయే ఇందుకు నిదర్శనము. (మారీచ) కశ్యపప్రజాపతేగాక అత్రికుమారుడగు చంద్రుడు (సోముడు) గూడ యీ ప్రజాపతుల లోనివాడే.

### సభాపతి

ప్రతిగ్రామానికి ఒక పంచాయితీ ఉండెడిది. దానికి గల అధిపతి లేక అధ్యక్షుని సభాపతియని పిలచెడివారు.

### గణపతి

దక్షిణదేశములోను, ఉత్తర కురు పాంచాలదేశముల లోను గణతంత్రరాజ్యములున్నట్లు మహాభారతము ఉద్యోగ పర్వము, యితర పర్వములలోను గలదు. ఆయా గణ రాజ్యములకు గల అధిపతులు గణపతులు.

### జనపతి

భారతయుద్ధకాలములో చిన్న చిన్న రాజ్యములన్నీ జనపదములుగను, మహాజనపదములుగను వ్యవహరింప బడుచుండెను. ఒక్కొక్క జనపదమునకుగల రాజును జనపతి యని యనెడివారు. వీటి వివరము విరాటోద్యోగపర్వము

లలో నున్నది. సౌరాష్ట్ర, బాహ్లీక మొదలగు జనపద వివరములు సుగ్రీవుడు సుషేణునితో జెప్పెను.

వా. రా. 42 సర్గ. 6-8 శ్లోక.

కులపతి

పదివేలమంది విద్యార్థులకు భోజనాది సౌకర్యములు గలుగజేసి, చదువుచెప్పే కళాశాలలకు అధిపతిని లేక ప్రధానాచార్యుని కులపతి యనెడువారు. ప్రభుత్వముద్వారా యీ యేర్పాటు చేయబడుచుండెను.

శతపతి *

నూరు గ్రామాలలోని అధిపతులచేత యెన్నుకొనబడిన అధ్యక్షుని 'శతపతి' అని చెప్పేవారు.

సహస్రపతి

పైవిధముగనే వెయ్యిగ్రామాలకు పైగా అధిపత్యము గలిగి క్రింది పంచాయితీలనుండి యెన్నుకొనబడిన అధిపతిని సహస్రపతియని అందురు.

ఇంద్రుడు

అదితి సంతానమగు ఆదితేయులు, వారి సంతతి రాజులు, వారి అధీనములోనుండు రాజ్యాధిపతులు అందరు కలసి యెన్నుకొనే సభాధ్యక్షుడు ఇంద్రుడని పిలువబడుచుండెను. అధర్వాంగీరసులలో ఇంద్రుడను నొక ఋషి యుండెను. ఈశ్వరుడు, విష్ణువు అనువారుకూడ ఆయాపద

---

* శతపతి, సహస్రపతులని నియామకమునుగూర్చి మనుస్మృతి 7వ అధ్యాయం 116 - 120 శ్లోకమువరకు చూడనగును.

వుశే. ఈశ్వరుడు అనేకవిలోనుంకువ్య క్తి దితిపుత్రులు, వారి సంతతి వారి అధీనరాజ్యాధిపతు లందరిచేత ఎన్నుకొనబడు చుండినట్లు కనుపించును. ఎందుకనగా ఈశ్వరుడు దైత్యులకు అత్యంత ఆప్తుడైనట్లు పురాణాల్లో వర్ణింపబడుచుండును.

### బ్రహ్మ

ఇరువదియేడుగురు అథర్వాంగిరసులలో బ్రహ్మ ఒక అంగీరసుడై యుండెను. బ్రహ్మ దేశాధిపతికి గూడ బ్రహ్మయను పేరుండెను. వీరుగాక మూడు యుగాలలోను నవబ్రహ్మలు అంటే తొమ్మిది మంది బ్రహ్మలు పుట్టిరి. వారిలో మొదటిబ్రహ్మ అగ్ని, వాయు, సూర్యులనే మనుష్యులవద్ద వేదాధ్యయనము జేసెను.

### ఆదితేయులు లేక ఆదిత్యులు

మారీచకశ్యపునకు అదితి గర్భమున పన్నెండుగురు పుత్రులు జన్మించిరి. 1. ధాతా 2. అర్యమా 3. మిత్ర 4. వరుణ 5. అంశ 6. భగ 7. ఇంద్ర 8. వివస్వాన్ 9. పూషా 10. పర్జన్య 11. త్వష్టా 12. విష్ణు వీరు పన్నెండుగురు పుత్రులు. ఈపేర్లు వైదికపదములనుండి తీసుకొనబడినట్లు పం. భగవద్దత్తగారి అభిప్రాయము.

### నాగులు

హిమాలయపర్వత ప్రాంతపు లోయలగు కాశ్మీర్, నేపాల్ మొదలగు పర్వతప్రాంతపు నివాసులు ఈప్రాంతాల లోని స్త్రీ పురుషులు నేటికిని అత్యంత సౌందర్యవంతులు. వాల్మీకిరామాయణము కిష్కింధకాండ 40 నుండి 43 వ

సర్గవరకుగల శ్లోకాలలో కొన్ని శ్లోకము శ్రీ నాగజాతి విషయ మును తెలుపుచున్నవి.

గంధర్వులు

గాంధారి దేశములోనివారు గంధర్వులు. సింధునదికి యిరువైపులనున్న భూమిని గాంధార దేశమందురు. (రామా; వాయు. పు; భారతం ఉద్యో.) "సింధు తక్షశిలాదిభ్యో ణఞా॥అష్టా 4/3/93 సూత్రమునకు వామనజయాదిత్యులు వృత్తి వ్రాయుచు, సింధు వర్ణు గన్ధార మధుమత్ కంభోజ కశ్మీర సాల్వ కిష్కింధా గబ్దికా ఉరస్ దరత్ అని గణపాఠ మును వివరించినారు. కనుక గంధార దేశములోనుండెడివారు గాంధర్వులు లేక గాంధారులు అని చెప్పబడవచ్చును. పురా ణాలలోని ఆయాపాత్రలు పవిత్రవంతులైనచో గ్రంథకర్తలు వారికి దేవతలని, అపవిత్రులని వారికి తోచిన అసురులని పేరిడుటగూడ పురాణములలో గమనించవలసిన విషయము.

పౌరాణిక ప్రదేశములు

పురాణకాలపు ప్రదేశాలను సరిగ నేటి ప్రదేశాలకు సరిజేసి లెక్కగట్టుట అతికష్టము. మధ్య మధ్య అనేక భూకంపములు వాటిల్లుటచేత యెన్నో పట్టణాలు భూగ ర్భంలోలీనమై వాటిపేర్లు మాత్రమే నిలచియుండ వచ్చును. కాని పౌరాణిక కాలములోగూడ దైత్యులు, ఆదిత్యేయులు, దానవులు, కాంభోజులు, గంధర్వులు, నాగులు మొదలైన వారు నివసించిన ప్రదేశము లీభూమిపైనవేనని, అవి యెక్కడో

ఊహాశ్రితములగు ఆకాశంలో ఉండే దేశాలు, పట్టణాలు గావని రామాయణాది గ్రంథములలో స్పష్టముగనున్నది. కుబేరభవనము – అప్సరసల తెగలు నివసించేది–హిమాలయ పర్వతములో చాలా ఉత్తరభాగములోను, టిబెట్టునకు దక్షిణముగను, కైలాస శిఖరమునకు దగ్గరలోను ఉన్నట్లు "కుబేరభవనం రమ్యం నిర్మితం విశ్వకర్మణా॥" — — — "అప్సరోగణసేవితా॥" వా. రా. కిష్కిం. 43 స. 21, 22 శ్లోకములలో గలదు. రామాయణం కిష్కింధా కాండంలోను, భారతం ఉద్యోగ పర్వంలోను, మనుస్మృతిలోను, వాయు బ్రహ్మాండ పురాణాలలోను అప్పటి వ్యవహారములలోనున్న పేర్లతోగల ప్రదేశముల భూగోళ వర్ణన కలదు.

# షోడశ సంస్కారములు

ఈ సంస్కారములను మనుష్యదేహపు పదహారు మార్పులని చెప్పవచ్చును. మనుష్యునకు కావలసిన మానవత్వమనెడి ఉత్తమ పరమావధిని సూచించునవి షోడశ సంస్కారములు (16 సంస్కారములు). ఇవి ప్రాచీనకాలము నుండి ఆర్యసంస్కృతిలో కనుపించుచున్నవి. గృహ్యసూత్రములలో యీ సంస్కారములనుగూర్చి వివరించిన నియమాలు సంఘ క్షేమాన్ని, జాతీయాభివృద్ధిని, మానవ సంస్కృతియొక్క విశాలత్వమును గమనించవలసిన అవసరమును బోధించుచుండును.

వైదిక గ్రంథములలోని యీ షోడశ సంస్కారములనుగూర్చిన విషయాలను జూచినచో మతముల పేరుతో మానవత్వమును పోగొట్టుకొనుస్థితి యెంత గర్హనీయమైనదో బోధపడగలదు. మనుష్యుడు పుట్టుక మొదలు మరణపర్యంతము పొందు మార్పులను సూత్రకారులు పదహారు సంస్కారములుగ నిర్ణయించి ప్రతిమార్పునకు సంఘముతో ముడిపెట్టిరి.

గృహ్యసూత్రములు, స్మృతులు యీ సంస్కారముల నియమాలను బోధించును. సంస్కారముల సమయ విధులలోను, మరికొన్ని కార్యములలోను కొద్దిపాటి మార్పులుండును. కాని యీ సంస్కార నియమాలలో సంకుచిత

మరే, గల తత్త్వములకు గాని, మత ద్వేషములకు గాని స్థానము లేదు.

ప్రతి మనుష్య దేహమునకు ఆదిరూపము, గర్భాధాన సమయములో స్త్రీ పురుష సంయోగ సమయమందు స్త్రీ గర్భాశయములో పురుషవీర్యమగు శుక్రము, స్త్రీ వీర్యమగు రజస్సు కలసిన ద్రవరూపమగు పిండోత్పత్తి. కనుక మనుష్యునకు తనదేహపు మొదటి సంస్కారము (మొదటి రూపమును పొందుట) స్త్రీ పురుషులమధ్య జరుగు గర్భాధానమని చరక సుశ్రుతములవంటి వైద్యశాస్త్రములు, ఇతర గృహ్యసూత్రములు తెలుపుచున్నవి. మనుష్య దేహము తుదిమార్పును పొందుట (సంస్కారము) మరణముపిమ్మట శరీరము మట్టిలోగాని, అగ్నిలోగాని కలియుటయే. తలి దండ్రుల గర్భాధానముతో ప్రారంభమైన మానవ దేహరూపము (సంస్కారము) మృత్యువు పిమ్మట గలుగు శరీర దహనముతో అంతమగుచున్నది. అందువల్లనే మనుస్మృతి కారుడు "నిషేకాదిస్మశానాంత"మని తెలిపినాడు. గర్భాధానాది దహనపర్యంతము కలుగు రూపముల మధ్యలోనే జీవుడు శరీరము నాశ్రయించి మరల వీడుచున్నాడు.

1. గర్భాధానము 2. పుంసవనము 3. సీమంతోన్నయనము 4. జాతకరణము 5. నామకరణము 6. నిష్క్రమణము 7. అన్నప్రాశన 8. చూడాకర్మము 9. కర్ణవేధ 10. ఉపనయనము 11. వేదారంభము 12. సమావర్తనము 13. వివాహము 14. సన్యాసము 15. వానప్రస్థము 16. అంత్యేష్టి

లేక దహనం. ఉపనయనము మొదలు సమావర్తనంవరకు బ్రహ్మచర్యాశ్రమమగును. వివాహమునుండి సన్యాసము వరకు గృహస్థాశ్రమమగును. సన్యాసము, వానప్రస్థములు రెండు వేరు వేరు ఆశ్రమములుగ పరిగణింపబడును. పై నుదహరించిన మార్పులను లేక జీవితములోని అంతస్థులను (సంస్కారములను) ప్రతిమనుష్యుడును పొందుచుండును. వివాహము జేసికొననివారు మాత్రము కొన్ని మార్పులను (సంస్కారములను) పొందరు. మంత్ర తంత్ర విధులు లేక పోయినను సమాజములోని ప్రతిగృహస్థులును షోడశ సంస్కారములలోని 1, 4, 5, 6, 7, 10, 12, 13, 14, 15, 16 సంస్కారములను (మార్పులను) పొందుచున్నారు.

మనుష్యుడు తానుపొందు శారీరిక మానసిక మార్పులను (సంస్కారములను) గమనించి, ఆ యా మార్పుల కాలములందు పరిసరబృందముతో సంబంధము బెంచుకొనుచు, సేవాజీవితమును గడుపవలసిన ఆవశ్యకతను సూత్రములు బోధించినవి. ఈ సంస్కారములను జరుపుకొనునప్పుడు హైందవులు (ఆర్యులు) వైదికమంత్రముల నుచ్చరించుచుందురు. మహమ్మదీయ క్రైస్తవ సోదరులు తమ తమ ఆత్మ విశ్వాసముతోగూడిన కొన్ని పవిత్రవాక్యములను, ఆ యా భాషలలోని మంత్రములను చదువుచుందురు. బౌద్ధమతస్థులును, నాస్తికులును దైవముపై విశ్వాసము లేక పోయినను యీ సంస్కారముల సమయములలో పవిత్ర మనస్కులై సమాజమునందు తమకుగల బాధ్యతలను

గుర్తించి, సంఘము - ధర్మముల ఉత్కృష్ట రూపములను జ్ఞప్తికి దెచ్చుకొంటూ, నిష్కల్మష సేవానిరతికి కంకణము గట్టుకొనుచుందురు.

"మనుష్యునకు గల మార్పులతో సంఘానికేమి సంబంధము? అసలట్టి సంబంధము నేల కల్పించుకొనవలె" నని సందేహము కలుగవచ్చును. జీవి జన్మించక పూర్వము తల్లిదండ్రులతోగూడ సంబంధము గలిగి యుండదు. మాతృ గర్భములో శిశు వున్నపుడుగూడ తల్లి, తండ్రి సైతము జన్మించనున్న శిశువు మగశిశువువో, ఆడశిశువో కూడ సామాన్యంగా ఊహించలేరు. కాని శిశువు జనించినతోడనే తల్లికి బిడ్డకు అఖండసంబంధ మేర్పడి 'పుట్టిన బిడ్డ తన బిడ్డ యని' తల్లి భావించును. కుటుంబములోని ఇతర బృందము తమ యింటిలో శిశువు జన్మించినందుకు సంతసించును. కాని వీరిభావాలు ఆశిశువునకు తెలియవు. ఆతల్లినుండి వేరుజేసి శిశువును మరియొకరి వద్ద పరుండబెట్టినను శిశువు నిరాకరించదు. కాని ఆశిశువునకు కావలసినది స్తన్యము - క్షీరము. క్షీరము గలిగి స్తన్యపానము జేయించు యే వనితయైనను అతనికి తల్లితో సమానమే. లేక అట్టి స్త్రీతోనే ఆశిశువునకు సంబంధముండును. అయితే తల్లి గర్భములో నున్నప్పుడు, తల్లి శరీరమునందలి రక్త మాంసాదులనుండి యేర్పడిన నెత్తురు (రజస్సు), రసరూపములగు ఆహారము బొడ్డు ద్వారాటి గుండ శిశువునకు జేరి శిశువు పోషింపబడు చుండును. ఈరస రక్తములు శిశువు బొడ్డునుండి శరీరభాగములకు జేరి శిశువు

పెరుగుచుండును. కాని ఆరస, రక్తములు బొడ్డు త్రాటి గుండ శిశువు బొడ్డులోనికి జేరినప్పుడు సంతసమును, జేర నప్పుడు దుఃఖమును వెలిబుచ్చును. అంటే సుఖ, దుఃఖాది భావములు కలుగవన్న మాట. ఆసమయమున శిశువునకు తల్లికి గల సంబంధము ప్రకృతి మాతలోనున్న అద్భుతకళా కౌశలమే.

భూమిపైపడిన శిశువునకు సుఃఖదుఃఖానుభూతులను ప్రకటించు స్వభావముండుటచే ఆ సుఖదుఃఖానుభూతులను చూచి శిశువునకు సమీపములోనున్నవారు సానుభూతిని ప్రకటింతురు. ఈ సానుభూతి క్రియారూపములోనికి మారు టకు శారీరిక సంబంధములు కారణమగును. ఒక యింటిలో శిశువు ఆకలియై యేడ్చుచున్నాడనుకొనుము. ఆయేడ్పును సమీపములోనున్న ఒక వ్యక్తివినును. వెంటనే "ఎవడో శిశు వేడ్చుచున్నాడే!" అని సహానుభూతిని, కరుణను ప్రకటించును. కాని ఆశిశువునకు, ఆవ్యక్తికి శారీరిక సంబంధము లేనిచో యింటివద్దకువచ్చి, పిల్లవాని విషయము గమనింపడు. కాని అదేసమయములో శిశువు తండ్రిగాని, మరియే యితర దగ్గర శారీరిక సంబంధముగల వారైనను శిశువు యేడ్పును విన్నచో వెంటనే శిశువుదగ్గరకు వెళ్ళి, తల్లిని పిలచి, శిశువుకు పాలు యిప్పించి, శిశువుయేడ్పును మాన్పించెదరు. ఇక తల్లియే ఆయేడ్పును విన్నచో శిశువు హృదయములో కలిగిన మొత్తము దుఃఖము, ఆమె హృదయంలో ప్రతిబింబించి, తన స్తన్యముల నా పిల్లవాని

నోటియందుంచి క్షీరములనిచ్చువరకు బాధతీరదు. అనగా తల్లికి – శిశువునకుగల శారీరిక సంబంధము మానసిక సంబంధములు పెరుగుటకు తోడ్పడిన దన్నమాట.

అయితే శారీరిక సంబంధములుగూడ భావ సంబంధములతోనే యేర్పడును. నవయౌవనములో ఒక బాలిక, ఒక బాలుడును వుందురు. వీరిద్దరు వేరువేరు దేశీయులు. తలిదండ్రులు, పరిసరవాసులతోనే వారికి పరిచయము. ఒకవేళ యీనవ యువతీయువకులు యేమద్రాసు వంటి పట్టణములోనో యెదురుపడినను, ఒకరినొకరు పలుకరించుకోనవలసిన అవసరముండదు. అట్లు పలుకరించుకొనుట గూడ దోషము, అసభ్యతగా యెంచబడును. వీరిరువురి మధ్య తమంతటతాము గాని, పెద్దవారిద్వారాగాని వివాహము జేసుకొను విషయము నిశ్చయింప బడినదనుకొనుడు. అప్పుడు వారిరువురి శరీరముల మధ్య రాగోదయమేర్పడును. వివాహమునకు పూర్వము, అపరిచితులగు ఆయిరువురు యువతీయువకులు, వివాహమైన వెంటనే సుపరిచితులగుదురు. ఇరువురిమధ్య ప్రేమోదయమై సంతానమును గనెదరు. ఒకరి జీవిత బాధ్యతను మరియొకరు తమ నెత్తిపై బెట్టుకొందురు. వీరిద్దరి శారీరిక తత్త్వముల కలయికతో యేర్పడిన శిశువుతో యిద్దరికీ శారీరిక సంబంధము పెరుగుచుండును. అంతేగాదు. ఇద్దరి శరీరాలలోనుండే శారీరికధాతువుల దోషాదోషములు ఒకరి వలన రెండవవారి శరీరములో ప్రతిబింబించు చుండును.

అంటే శారీరకసంబంధానికి భావసంబంధము తోడ్పడినదన్న మాట. వీరిరువురిలోను యేఒక్కరో మరణించినచో, రెండవవారు వియోగ దుఃఖముతో విలపింతురు. వివాహమునకు పూర్వము, పుట్టుకకు పూర్వము, వీరిద్దరిమధ్య సంయోగము, కలయిక, స్నేహములు లేవుగదా? మరి శరీర ధర్మప్రకారము మరణించినప్పుడు వియోగదుఃఖమెందుకు? పుట్టుకకు పూర్వము, పుట్టిన పిమ్మట, చచ్చినప్పుడు మనుష్యుడు భిన్నజీవియే. కాని ఇచ్ఛాప్రయత్నములతో భిన్నజీవియగు మానవుడు, యితరజీవులతో అభిన్నత్వమును (సంబంధమును) కలిగించుకొనుచున్నాడు. మానవుని స్థితి భిన్నత్వము, ఆదర్శము అభిన్నత్వము. అభిన్నత్వమును దంపతులు తమ యిద్దరిలోనే దర్శించగలిగినప్పుడు ఒకరి వియోగముతో రెండవవారు విలపింతురు. ఈ అభిన్నత్వము (కలయికలేని సంబంధము) తమ వివాహమునకు పూర్వము లేకుండ తరువాత యేర్పడిన అభిన్నత్వమేనని దీనిని సహజముగ లోకమంతటిలోను ఇచ్ఛాశక్తితో కలిగియుండవచ్చునని, తలచినచో దుఃఖము కలుగదు. కనుక మానవుని ఆదర్శమగు అభిన్నత్వమువైపు భిన్నజీవియగు మానవుని గొంపోవునట్టి మానవుని శారీరిక, మానసిక మార్పుల (సంస్కార) సమయాలను ప్రాచీన ఋషులు సంఘపరముజేసి ఆయాసంస్కార సమయాలలో ఋత్విక్కులను, విద్వాంసులను, గ్రామస్థులను, పురోహితులను బిలచి, వారికి తమ సంస్కారములను దెలిపి, తమజీవితాన్ని ఆదర్శమగు సంఘసేవకు వినియోగిస్తామని ప్రమా

ణము జేసెడివారు. వైదిక సంస్కారవిధు లీపరమార్థముతో
కూడినవే. తల్లి, తండ్రితో ప్రారంభమై విశాలప్రపంచంతో
అంతమయ్యేది సంఘం. ప్రతి మనుష్యుడు సంఘజీవిగనుక
తన సంస్కారములన్నీ (మార్పులన్నీ) సంఘ పరమైనవేనని
భావించవలెను. షోడశసంస్కార రూపములను ఆలోచించిన
కొండ్ ప్రకృతి- జీవుడు - బ్రహ్మ అనగా ఆధ్యాత్మికమునకు,
భౌతికమునకు అవినాభావ సంబంధమున్నట్లు తోచును.

## వైదిక సంస్కారములలో అగ్ని హోత్రము

వైదిక సంస్కారములలో అగ్నిహోత్రమునకు
ముఖ్యస్థానమీయబడినది. అగ్నిహోత్రము జేయనిచో
ప్రత్యవాయదోష మేర్పడునని ప్రాచీనులు తెలిపిరి. అగ్ని
హోత్రము జరుపుటచే, సమాజమునకెన్నో ఉపయోగ
ములుండుటచేతనే యీనియమాన్ని విధించిరి. ముఖ్యముగ
వాయు, జలశుద్ధులు, క్రిమి సంహారణ జరుగును. అగ్ని
హోత్రములో హవన మొనర్పబడు ఓషధులు, నేయివంటి
సాత్త్విక ధాతువును పెంచునట్టి పదార్థములు ధూమరూప
మునమారి, ఆకాశమంతటను వ్యాపించును. అందువలన
వాయువులో, ఆవస్తువులు (రేణువు రూపములో) లీనమగును.
గాలిపీల్చు వారి కాఓషధులు, సాత్త్విక పదార్థములు
వాయురూపమున లభించి, వాయుశుద్ధి యేర్పడి, నరములు,
మెదడు, ఊపిరితిత్తులు మొదలగు శరీరావయవములు
బలిష్ఠములై క్రిములు నశించును. ఆధూమమే ఆకాశమున
వ్యాపించి మేఘరూపమగు వర్షపు గాలిలోను, భూమిపై

నున్న జలాశయములలోను కలియుటచేత జలశుద్ధియేర్పడును. అగ్నివల్ల (Purification of weather and water) జల వాయు శుద్ధులేర్పడునని తెలిసినది.

అగ్ని తనలో కలియు యితర పదార్థములను, గాలిని తేలిక జేయుచు, ఆయా ఓషధులకు - పదార్థములకు, తన రూపమిచ్చుచు అనగా మంటరూపమును గలుగ జేయుచు, వాటిని అంతట వ్యాపింపజేయును. అందుచేతనే అగ్నిలో ప్రేల్చబడు పదార్థములను అగ్నిహోత్రుడు దేవత లందరికి చేర్చుచున్నాడని చెప్పుదురు. ఒక మిరపకాయను ఒక మనుష్యునిచేత తినిపించినచో, ఆ మిరపకాయలోని గుణము, దానికారము, ఆమనుష్యునకు మాత్రమే గలుగును. ఆ కాయనే చూర్ణము జేసి, దానిని గాలిలో విసరినచో, కొంత ప్రదేశములో నుండు కొందరు మనుష్యులకే జేరును. అంటే మిరపకాయ గుణము, కారము ఒకని కంటె యెక్కువ మందికి తెలియును. అమిరపకాయనే నిప్పులో కాల్చినచో మిరపకాయ కోరు అనేకమందికి జేరి దగ్గుచుందురు. అంటే మిరపకాయలోని కారపుగుణము, గుణముతో బాటు గుణముగల పదార్థము దగ్గుచున్నవారి కందరికి లభించిన దన్నమాట. అట్లే ఓషధులను, సాత్త్విక పదార్థములను, అగ్నిలో ప్రేల్చినచో ఆవస్తువు లనేకులకు జేరుటయు, వాయు శుద్ధి కలుగుటయు, పరిశుద్ధారోగ్యమును పొందుటయు కలుగును.

ఇట్లగ్నిహోత్రమును జేయుట ప్రతివానికి విడువరాని కర్తవ్యమని ధర్మశాస్త్రములు చెప్పుచున్నవి. ఎందుకనగా ప్రతి వ్యక్తియు ఊపిరిపీల్చి మరల మరల వదలుచుండును. ఊపిరివదలునపుడు మన శరీరములోని అనేక రోగక్రిములు, బొగ్గుపులుసుగాలి బయటికి వచ్చును. దీనిచేత క్రిములు అంతట వ్యాపించి వృద్ధిజెందును. అదేసమయమున ఊపిరి బీల్చువారి కీఅపరిశుద్ధవాయువు జేరును. ఒక్కక్షణము గూడ ఊపిరి వదలుటను మనము మానలేము. కనుక ఇతర మనుష్యులకు, మనవలన అపకారము తప్పనిసరిగ జరుగుచున్నదన్నమాట. అందుకు నిత్యము ఒక్కతూరియైనను ప్రతిమనుష్యుడు అగ్నిలో ఉత్తమ ఓషధులనువ్రేల్చి జలవాయువులను శుభ్రము జేయుట కనీసకర్తవ్యముగ ప్రాచీన భారతీయులు తలంచిరి. కనుకనే వివాహాది సంస్కార సమయాలలో అనేకులొకచోటికి చేరుచుండుగనుక, అగ్నిహోత్ర క్రియకు ప్రధానస్థానమీయబడినది.

ఈరోజుల్లో హిందూసమాజమునందు అగ్నిహోత్రము జేయుటను పూర్తిగ మానివేసి ద్విజుల మనుకొనేవారే, ద్విజేతరులు అగ్నిహోత్రమును జేయుటకు వీలులేదని, తామే అగ్నిహోత్రమునుజేయుటకు హక్కుగలవారమని వాదింతురు. ఇది వెర్రియూహ. అగ్నిలో ఉత్తమ ఓషధులను వ్రేల్చినచో అవి తగులబడకుండునా? ఇట్లు తగులబడుటలో ఎవరు వేసినారను వివక్షతలేదు. కనుక జలవాయుశుద్ధికై ప్రతివారును అగ్నిలో ఓషధులను వ్రేల్చ

వచ్చును. స్మృతులలో యీ క్రియకు సంబంధమగు నియమాలు వారివారి వృత్తులలో, వెనుబాటు ననుసరించి, ఆర్థిక స్థితిగతులపై ఆధారపడి రచింపబడినవి. ఈకాలమున జలవాయుశుద్ధికై నూతన ప్రయోగములను వైజ్ఞానికులు కని పెట్టినచో వాటినైనను అగ్నిహోత్రమునకు బదులు సంస్కార సమయాల్లోను, సభాసమావేశాల్లోను, అనేక లోకచోటికి పేరుపరుగినుక ఆచరించుట యుక్తము. అగ్నిహోత్రము జేయునప్పుడు అర్థము దెలిసినచో వేదమంత్రములను జదువవచ్చును. అర్థము తెలియనిచో పవిత్రమనస్కులై "ఈఅగ్నిద్వారాపరిశుభ్రత వ్యాపించి సంఘము క్షేమముగనుండుగాక" అని తలంచుకొనవలెను. అర్థము దెలియని మంత్రములను పవిత్రసమయాలలో చదువుటకంటె ఆమంత్రములలోనున్న పవిత్రసేవాదృష్టిని మనస్సునందిడు కొనియుండుట సులభము - ఉత్తమము.

అగ్నిహోత్రమును జేయునప్పుడు సనాతనాచారము గలకొందరు మిత్రులు సంకుచిత దృష్టిని వెల్లడింతురు. ఇతర మతస్థులు, ఇతర కులముల వారు, హరిజనులు, ఆయగ్ని చెంతకు వచ్చినచో అగ్నిహోత్రము మైలబడి పోవునని తలంతురు. అగ్నిలో వేల్చబడువస్తువులు గాలిలో వ్యాపించి, ఆగాలిని బీల్చు ప్రతి మనుష్యునకు ఆవస్తువులు, వాటితో బాటు అగ్నిభాగము జేరునుగదా? ఆవాసనను, అగ్నిని అందరకు జేరుటను ఆపనిలేని పెద్దలు అగ్నిహోత్రమును మైలబడనీయక కాపాడుదురా? అసలు నిప్పు సర్వమును

దహించును గదా! మఱి అది మైలబడునని మానేల? నిప్పులో తగులబడు ఓషధిని యెవరు వ్రేల్చినను అది తగులబడును. కనుక అగ్నిహోత్రవిధిని ప్రోత్సహించిన ప్రాచీనులలో మానవ శ్రేయస్సే లక్ష్యమైయుండెను. సంకుచిత తత్త్వములకు తావులేదు.

## (1) గర్భాధానము

ఈ సంస్కారమును ప్రపంచములోని గృహస్థులందరు సంతానాపేక్షగలవారై జరుపుకొనుచున్నారు. స్త్రీ పురుషులిరువురు మిక్కలి ప్రశాంతమనస్కులై, ఆరోగ్యవంతులై యుండి, అన్యోన్యానురాగముతో పవిత్రమైన ప్రజోత్పాదకమగు యీ సంగమక్రియను సలిపిననేగాని ఉత్తమ సంతానము కలుగదని వైజ్ఞానికులు, తత్త్వవేత్తలు నిర్ణయించిరి. కనుకనే గర్భాధాన సమయాన పవిత్ర మనస్సు గలిగియుండి, ఉత్తమ సంతానాపేక్షగల అర్థములున్నట్టి వైదిక మంత్రములను చదువవలెనని గృహ్యసూత్రకారులు విధించిరి. ఉత్తమ సంతానాపేక్షగల దంపతులు చరకసుశ్రుత సంహితలలో శరీరస్థానములను జదువుటమంచిది. చరకసంహితలో "తతః పుష్పాత్ ప్రభృతి త్రిరాత్రమాసీత బ్రహ్మచారిణ్యధఃశాయినీ" పుష్పవతి యైనది మొదలు స్త్రీ మూడు రాత్రులు బ్రహ్మచర్యముతోనుండి భూమిపై బరుండవలెను, ఇట్లేపురుషునకుగూడ గర్భాధానమునకుపూర్వము బ్రహ్మచర్యముతోనుండి, భూమిపై బరుండవలెనని గృహ్యసూత్రములు తెలుపుచుండును. ధాతువు లుద్రేకము చెందకుండుటకును,

మానసిక శక్తులు బలిష్ఠముగ నుండుటకును యీ నియమాన్ని ఆచరించవలెను.

"తత్ర — — — క్షుధితా, పిపాసితా, భీతా, విమనాః, శోకార్తా, క్రుద్ధా, అన్యంచపుమాంసమిచ్ఛంతీ మైథునేచాతికామా వా నగర్భంధత్తే। విగుణాంవా ప్రజాం జనయతి। అతిబాలామతివృద్ధాం దీర్ఘరోగిణీ మన్యేనవావికారేణోపసృష్టాం వర్జయేత్। పురుషేష్వేత ఏవదోషాః। అతః సర్వదోషవర్జితౌ స్త్రీపురుషౌ సంసృజ్యేయాతామ్॥"

చరక సం. శరీరస్థానం, అధ్యాయం 8. సూ 5—6.

గర్భాధానమునందు (సంగమములో) ఆకలి, దప్పి, భయము కలిగినట్టిగాని, అయిష్టమైనట్టిగాని, దుఃఖముచే ఆర్తురాలైనట్టిగాని, కోపముతోనున్నట్టిగాని, అన్యపురుషుని కోరునట్టిగాని, మైధునమును యెక్కువగ వాంఛించునట్టి గాని స్త్రీ గర్భమును ధరించజాలదు. అధవా గర్భము గలిగినచో చెడ్డసంతానమును పొందును. బాలికను, వృద్ధురాలను, దీర్ఘ వ్యాధిపీడితురాలను, గర్భాధాన క్రియకు వర్జించవలెను; అనగా అట్టి స్త్రీ సంగమక్రియకు పనికిరాదు. అయితే యీదోషములు స్త్రీయందున్నప్పుడే, అట్టి స్త్రీని నిషేధించవలెనుగాని పురుషునిలో నున్నచో, అట్టిపురుషుని విడువక, ఆపురుషునితో పై చెడ్డలక్షణములు లేనిస్త్రీ, స్త్రీయై పుట్టినదిగనుక సంగమమునకు అంగీకరింపవలెననెడి నిర్బంధము లేదు. పై సూత్రములో "పురుషేష్వేత ఏవదోషాః" "సర్వదోష వర్జితౌ స్త్రీ పురుషౌ" అనుటచేత పై తెలిపిన దోషములలో యే ఒక్కటి పురుషునిలోనున్నను, అట్టి పురుషుని సంగమక్రియకు వర్జించవలెను అనగా విడువవలెను.

కనుక ఏదోషములేని స్త్రీ పురుషు లిరువురే సంతాన ప్రాప్తికై గర్భాధాన (సంగమ) క్రియకు అర్హులు.

గర్భాధాన సంస్కారములో దంపతులు గుర్తుంచుకొనవలసిన కొన్ని వాక్యములు—

అన్యోన్యస్యావ్యభిచారో భవేదామరణాన్తికః ।
ఏషధర్మః సమాసేన జ్ఞేయః స్త్రీ పుంసయోః పరః ॥

మను అ 9. శ్లో 101.

"భార్యా భర్త లిరువురు ధర్మాచరణకు పరస్పరము అవ్యభిచారులై యుంకుట మంచిది." మనుస్మృతిలోని మూడవ అధ్యాయం 45 నుండి 50 శ్లోకములను చదువవలెను. ఈసందర్భములో క్రిందివాక్యములుగూడ గమనించదగినవి.

"భర్తయొక్క దోషకార్యమునందు భార్య సహకారము సలుపవలసిన విధిలేదు. ఆమె దేనినేని దోషముగా నిర్ణయించుకొనినయెడల తాను ధర్మమునే అనుసరించుటకు సాహసింపవలెను."

గాంధీజీ. స్త్రీధర్మప్రకాశినీ. (తత్వానంద అనువాదం) పేజీ 283.

ఈవాక్యములు మనుస్మృతి వాక్యానికి విరుద్ధము గావు. ఎందుకనగా దంపతు లిరువురిమధ్యగల సంబంధము ధర్మముతోగూడినది. వివాహములో యిరువురు "ధర్మణైవహం గృహపతిస్త్వ" అని ప్రమాణము చేయుదురు. "అధర్మణా" అని చెప్పలేదు. కనుక యిరువురిలో య్యే

ఒక్కరు అధర్మమార్గములో నున్నను తమ ప్రమాణమును ఉల్లంఘించినట్లే.

"Innocent youth is a priceless possession not to be squandered away for the sake of a momentary excitement, miscalled pleasure."
By Gandhiji, Good life.

“అమాయకత్వముతో గూడిన యౌవనము అమూల్య సంపద. హాయి, సుఖము అని పిలువబడు తాత్కాలిక వినోదానికి, ఆ యౌవనమును వ్యర్థము చేసుకొనరాదు. అనగా దుర్వినియోగము చేసుకొనరాదు.”

## (2) పుంసవనము

నేడీ సంస్కారము ఆచరణలో ఎక్కువగ లేదు. మూడవమాసము, లేక రెండవమాసమునందు పుంసవనమని పారస్కరుడు విధించినాడు. (పార.గృ.కాం1.కం14.) చరకమునందు.

“తృతీయేమాసి సర్వేంద్రియాణి సర్వాంగావయవాశ్చ యౌగపద్యేన అభినిర్వర్తంతే” చర. శరీరస్థానం. అ 4. సూ 11.

గర్భిణీ మూడవ మాసమున గర్భస్థ పిండమునకు సర్వేంద్రియములుగల చిన్న రూప మేర్పడును. కనుక యీసమయమున గర్భిణీస్త్రీ కుడిముక్కు రంధ్రమునుండి ఉత్తమ ఓషధులను వాసనజూపించుట, పుంసవనక్రియలోని ప్రధానభాగము. మర్రిఊడల లేతచిగుళ్ళను తెచ్చి వాటిని చూర్ణరూపములోగాని లేక ద్రవరూపములోగాని మార్చి,

దానిని భర్త స్వయముగ గర్భిణీస్త్రీ కుడిముక్కు రంధ్రము నందుంచి వాసనజూపించవలెనని, స్త్రీ ఆపదార్థమును పైకి పీల్చుకొనవలెనని గృహ్యసూత్రములలో గలదు. పారస్కరమునందు "కుశకంటకం, సోమాంశుం చైకే" అనుటచేత సోమలత, కుశాది ఓషధులనుగూడ వాసనజూపించవలెనని ఒక అభిప్రాయము గలదు.

గర్భములోనున్న పిండమునకు పురుషత్వము - బలిష్ఠమును - కలుగజేయుటయే పుంసవనము. కాని పురుష సంతానము కొరకు జేయు క్రియగాదు.

యదహః పుంసా నక్షత్రేణ చంద్రమాయుజ్యేత॥
పారస్క. కాం 1 కం 14.

ఓషధయః సుమనసోభుత్వాఽస్యాంవీర్యం సమాధత్త॥
గోభిల ప్ర 3. కం 6. సూ 8.

చంద్రుడు పుష్యమీ నక్షత్రముతో కలిసియున్నపుడు గర్భమునకు జరుగు సంస్కారము పుంసవనమని పైసూత్రముల ద్వారా బోధపడును. చరకమునందు -

ద్వితీయే మాసి ఘనః సంపద్యతే పిండఃపేశ్యర్బుదంవా। తత్ర ఘనః, పురుషః, పేశస్త్రీ, అర్బుదం నపుంసకమ్॥
చ. శరీర ఆ 4. సూ 10.

రెండవ మాసమునందే పిండమునకు స్త్రీ, పురుష, నపుంసక రూపము లేర్పడునని తెలుపుటచేత పుంసవన క్రియవలన పిండమునకు వీర్యపటుత్వము పెరుగును గాని పురుషసంతానమే కలుగునని భావముగాదు. ప్రాచీన భారతదేశంలో

ప్రతి గర్భిణీస్త్రీకి పుంసవనము జేసెడువారు. వారికి పురుష సంతానముతోబాటు స్త్రీ సంతానముగూడ కలిగెను. కేవల పురుష సంతానమే కలిగియుండ లేదు.

## (3) సీమంతోన్నయనము

గర్భిణీస్త్రీకి, నాలుగవ మాసమున, నేతిలో ఆమె ప్రతిబింబమును చూపింతురు. పిమ్మట ఆమె వెంట్రుకలకు సుగంధ ద్రవ్యములతోగూడిన తైలమును రాసి, భర్త తన చేతిలో మేడి లేక మద్ది పుల్లలను పుచుకొని, ఆపుల్లలతో స్త్రీ వెంట్రుకలను సవరించి, పాపట (సీమంతం) తీసి వెంట్రుకలను ముడివేయును. ఈక్రియను పుంసవన సంస్కారమందురు. ఆచరణలో ఈ సంస్కారముగూడ నేడెక్కువగ కానిపించుట లేదు. పుంసవన, సీమంత సంస్కారములు గర్భములోని పిండము బలిష్ఠముగ నుండుటకే చేయబడును. కనుక, అవి చేయకపోయినను ఉత్తమ ఓషధులను సేవించుట మంచిది.

## (4) జాతకర్మము (Delivery)

ఇది పుట్టుక సంస్కారము. గర్భములో నున్నప్పుడు శిశువునకు సుఖదుఃఖానుభూతులు కలుగుట, వాటిని శిశువు ప్రకటించుట జరుగదు. కాని భూమిపైబడిన దాది శిశువునకు సుఖదుఃఖానుభూతులు గలుగుట ప్రారంభమగుటచేత, జీవిత ప్రారంభమని చెప్పవలెను. ఈ సమయమున బొడ్డు కోయుట, తల్లికి తీసుకొనవలసిన జాగ్రత్తలు, పరిశుభ్రత,

శయనగృహమును శుభ్రముగ నుంచుట, బిడ్డకు స్నానము చేయించుట మొదలగు పరిశుభ్రకార్యములే యీసంస్కారోద్దేశ్యము. ఈసందర్భమున ప్రసవము జరిగినగదిలో భర్త వచ్చి అగ్నిహోత్రములో ఉత్తమ ఓషధులను వ్రేల్చ వలసినదిగ గృహ్యసూత్రములు జెప్పుచున్నవి. వైదిక విధులలో తెలుపబడిన అగ్నిహోత్రాది విధానములు లేక పోయినను, అసలు నియమములు, లక్ష్యము నేడు అల్లో పతి విధానపు ఆస్పత్రులలోదప్ప మరెచ్చటను గాన్పించుట లేదు. ఆచారపరుల మనుకొనువారి యిండ్లలో జాతకర్మము (Delivery) జరుగు ప్రదేశము, నరకభూయిష్ఠమైయుండును. వేదమంత్ర పఠనముతోగూడిన పవిత్రమగు యీజాతకర్మ సంస్కారమును మానివేసి, పైపెచ్చు "పురుడు వచ్చినది" అనే క్రొత్తరకపు అంటరాని తనమును పాటించుచు, ప్రసవ స్త్రీ చెంతకెవరును జేరక దుర్గంధ భూయిష్ఠమగు స్థితిలో మాతృదేవిని వుంచుట ఘోరనేరముగాదా? వైదిక సంప్రదాయములో జరుగు జాతకర్మ సంస్కారములో ముఖ్యాంగములివి.

అగ్నిహోత్ర విధితో, శిశువు తండ్రి స్నానముజేసి ప్రసవ గృహములోనికివచ్చి "అచ్ఛిన్నాయాంనాడ్యాం" అనుటచే (పారస్కరం) బొడ్డుకోయకముందే శిశువునుజూచి, పిమ్మట బొడ్డుకోయవలెను. తన అనామిక వ్రేలితో తేనె, నేతిని శిశువు నోటికి "భూస్త్వయిదధామి" అనే మంత్రాలతో రాయును. తల్లిపై శుద్ధోదకమును జల్లి 'ఇడాసి

మైత్రావరుణీ వీరే వీరమజీజనథాః' అని సంబోధించవలెను. (తరువాత తండ్రి స్వయముగ బిడ్డకు తల్లియొక్క స్తనములు కడిగి పాలుత్రాపించును. తండ్రి తల్లి స్తన్యమును బిడ్డ కిచ్చుట పారస్కరములోనే వున్నది.)

అథాస్యై దక్షిణగ్ స్తనం ప్రక్షాల్య ప్రయచ్ఛతీమం స్తనమితి యస్తే స్తనఇత్యుత్తరమేతాభ్యామ్॥

పారస్కరం. కాండ 1. కండి 16. సూ 16—17.

పిమ్మట పదిదినములవరకు గదిలో సుగంధ ద్రవ్యాలతో అగ్నిహోత్రము చేయుచుండవలెను.

## (5) నామకరణము

నామకరణమంటే పేరుబెట్టుట. పుట్టినబిడ్డ తనపేరుకు బూర్వము మగశిశువు లేక ఆడశిశువు అనే పిలువబడు చుండును, కాని వ్యవహారముకొరకు ప్రపంచములో సాంకేతిక పదము కావలెను. మనుష్యుడు అన్నంతమాత్రముతో లక్ష్యమందున్న మనుష్యుని గుర్తించజాలరు. 'రాముడు' అనేపేరుతో జెప్పినప్పుడు లక్ష్యమందున్న మనుష్యుడు వచ్చును. కనుక జీవితంలో పేరుబెట్టుకొనుట: ఒక సంస్కారమైనది.

"దశమ్యాముత్థాప్య బ్రాహ్మణాన్భోజయిత్వా నామకరోతి"

పారస్కరగృహ్య. అ 1. కం 17.

పదియవరోజున బాలెంతను సూతికాగృహమునుండి బయటికి దీసికొనివచ్చి, ఉత్తమ సాధువులకు భోజనముబెట్టి, పిల్లవానికి పేరుబెట్టవలెను.

## (6) నిష్క్రమణము

ఎండను జూపుటకై బిడ్డను బయటకు తీసుకొని వచ్చుట నిష్క్రమణ మనబడును. మూడు లేక నాల్గవ మాసమున యీపని జేయుదురు. పా. గృ. 1-17.

## (7) అన్న ప్రాశనము

తల్లిపాలపై ఆధారపడియున్న శిశువునకు అన్నరసమును అలవాటుజేయుటయే యీ సంస్కారములోని ఉద్దేశ్యము. శిశువు ఆరవమాసమునకు జీర్ణకోశము పెరిగి అన్నరసమును జీర్ణముజేసుకొనుటకు తగిన బలముగలదై యుండును. కనుక "షష్ఠేమాస్యన్న ప్రాశనం" అను విధికలదు. "దధి మధుఘృతమిశ్రితమన్నం ప్రాశయేత్" (ఆశ్వలా. గృహ్యసూ 1-16-3.) పెరుగు, తేనె, నెయ్యి యీమూడు సాత్త్వికపదార్థములతోను అన్నమునుగలిపి బిడ్డనోటికి రాయవలెను.

చూడాకర్మ కర్ణవేధ సంస్కారములు 8 - 9 :- ఇవి వెంట్రుకలు తీయుట, చెవులు కుట్టించుటకు సంబంధించినవి. సరియైన సమయాల్లో వీటిని నేడు జరుపుటలేదు.

## (10) ఉపనయనము

తలిదండ్రుల చెంతనే గారాబుగ బెరుగుచున్న బిడ్డజ్ఞానసాధనకు - విద్యాప్రాప్తికి - తలిదండ్రులను వీడుటయే యీసంస్కారము. ఉప+నయనం=ఉపనయనం. ఉప= సమీపే, నయనం=ప్రాపణం అంటే పంపుట. ఎవరిరొద్దకు?

గురువునొద్దకు. ఎవరిని? విద్యార్థిని. అనగా 'విద్యాధ్యయనము జేయగోరు పిల్లవానిని గురువునొద్దకు చదువుకై పంపుట' ఉపనయనమనెడి శబ్దమునగల అర్థము. గురువును యింటికిరావించి బిడ్డకు బుద్ధులుసెప్పి, తండ్రి తన బిడ్డను గురువు స్వాధీనము జేయును. అప్పటినుండి బిడ్డ – విద్యార్థి – భిక్షాటనజేసి చదువుకొనవలసినదే. బ్రహ్మచర్యాది నియమములకు కట్టుబడి, వ్యక్తి సంఘజీవి యగుటకు ప్రారంభదశ యిదియే. యజ్ఞోపవీతము – ప్రజాహిత కార్యదీక్షను పూనుటయే ఉపనయనమైన వటునికిగల చిహ్నము. ఈ ప్రజాహిత కార్యక్రమమునకు పూనుకున్నట్లు (ప్రాచీనకాలమున) చిహ్నముగ (Uniform) వస్త్రమునుగాని, నూలు పోగులనుగాని, దర్భత్రాటినిగాని భుజముపై ధరించెడివారు. "యజ్ఞోపవీతం కురుతే సూత్రం, వస్త్రంవా, కుశరజ్జుమేవ॥" నూలుపోగులుగాని, వస్త్రముగాని, దర్భత్రాడుగాని యజ్ఞోపవీతముగా జేయబడును (గోభిల. గృహ్య. ప్రపా. కండి 2. సూ 1.).విద్యాధ్యయనమనెడి యజ్ఞమును జేయుటకే గలచిహ్నము యజ్ఞోపవీతంగాని, విద్యాధ్యయనము లేనిదే నూలుపోగు యజ్ఞోపవీతమని చెప్పబడదు.

తండ్రి బిడ్డను గురువు స్వాధీనము చేయగనే పిల్లవానికి గాయత్రీ మంత్రోపదేశము జేయబడు చుండెడిది.

## (11) వేదారంభము

ఈ సంస్కారముకూడా ఉపనయన సంస్కారములో అంతర్భాగమే. ఉపనయన సంస్కార దినముననే ఆయింటి

వద్దనే గురువు పిల్లవానికి వేదాధ్యయనమును ప్రారంభించెడి వాడు. పిమ్మట విద్యార్థిభిక్షాటన జేయుట ప్రారంభించును.

"మాతరమేవాగ్రే, ద్వే చాన్యే సుహృదౌ, యావత్యో వా, సన్నిహితాః స్యుః॥"

గోభి. గృ. ప్ర 2. కం 10. సూ 43.

"మాతరం ప్రథమామిత్యేకే ఆచార్యాయ భైక్షం నివేదయిత్వా"
పార. కాం 2 కం 5. 7–8.

పైసూత్రములద్వారా వటువు తల్లివద్దనే ముందుగ భిక్షాన్నమును అడిగి పిమ్మట యితరులవద్ద యాచించి, ఆ లభించిన దానిని గురువుగారి స్వాధీనముజేసి, ఆయన అనుమతితో దానిని వినియోగించవలెను.

పూర్వమువలె నేడు మనదేశమునందు గురుకులములు లేకపోవుటచేత రాసాయనిక, వైజ్ఞానిక, సారస్వతవిద్యలకు బిడ్డలను కళాశాలలకు, విశ్వవిద్యాలయములకు పంపుటయే నేటి కాలమున నిజమైన ఉపనయన మనబడును. కాని ఉపనయనమను పేరుతో నేడు జరుపుచున్న మంత్ర తంత్ర విధులు వాస్తవమునకు దూరమై పోవుచున్నవి. జందెమును వేయుటయే ఉపనయనమని భావించి, యీ జందెమునుద్విజులే ధరింప నర్హులని వాదించుట నేటి ఉపనయన సంస్కారములో ముఖ్యాంగమై పోయినది. పైగా వయస్సు వచ్చిన కుర్రవానికి ఉపనయన సమయమున జాతకర్మ, నామకరణ, అన్నప్రాశన మంత్రములు జదువుచు ఆకర్మలను జేయుదురు. ఈపను లెంత అసహ్యమో యోచించుట యుక్తము.

పండ్రెండు సంవత్సరముల కుర్రవానికి, సంవత్సరము లోపల జరుపవలసిన అన్నప్రాశనాది పనులు జేయునప్పుడు, ఆకుర్రవాని వయస్సు తగ్గిపోయి, అతడు పసిబిడ్డ కాఁగలఁడా? పైపెచ్చు అంతదనుక దిట్టముగ అనేకపదార్థముల గుడుచునట్టి బాలునకా అన్నప్రాశనము! ఎందుకీ పిచ్చిపనులు? బ్రహ్మ చర్యాది నియమములు నేర్పి గురువునొద్దకు చదువుకై పంపుట మానివేసి, ఉపనయనముజేసినామని జెప్పుచు, ద్విజులమని తమ్ముదాము ప్రశంసించుకొను పెద్దల నేమనవలెను? ఉపనయ నములోని ఉపనయన తత్త్వమును మఱచివేసి, ఉపరిగ అసత్య కర్మల నాచరించుకొనుచు సంతృప్తిపడుటయే నేటి ద్విజుల మనుకొనువారి యిండ్లలో ఉపనయన సంస్కారములైనవి. ఈపాపపు పనిజోలికి రానట్టి చాకలి, మంగలి, కుమ్మరి మొదలైన పవిత్ర వృత్తులలోని వారిని న్యూనముగ జూచుట పైపెచ్చు చిలిపితనము.

## (12) సమావర్తనము

ఈసంస్కారమునకు స్నాతకమను పేరుగూడ గలదు. బ్రహ్మచర్యముతో విద్యాధ్యయనము జేసినపిమ్మట గురువు నొద్ద అనుజ్ఞాతుడై వివాహము కొఱకు యింటికేగుట సమా వర్తనము. ఇంటివద్ద సుగంధజలములతో స్నానము సేయుట స్నాతకము. ఈపని నెవరు జేసినను, వారు స్నాతకులే. వేదా ధ్యయనము పూర్తిజేసిన పిమ్మటనే ఈ సంస్కారము సూత్రములలో విధింపబడి యుండగ, వేదమును చదువని పిల్లలకు, సమావర్తనము జేసినామనుట అసత్యమగును.

పైగా తనయింటి యందే పెరుగుచున్న బిడ్డ, గురువుగారి ఆశ్రమమునుండి, తిరిగివచ్చి నట్లెట్లగును? సమ్+ఆవర్తనం= సమావర్తనము.

## (13) వివాహము

వివాహము, అంత్యేష్టి (Funeral cereny), యీ రెండు సంస్కారములు మానవులందరిచేత బహిరంగముగ జరుపబడు చున్నవి. అసలు నేడీ రెండు సంస్కారములే సమాజములో ఆచరింపబడు చున్నవని చెప్పవచ్చును. అపరిచిత వ్యక్తులిరువురు సుపరిచితులగు నట్టి ఒక విచిత్ర గాంభీర్య పవిత్రసంకల్పము, ప్రమాణమే వివాహము. మంత్ర తంత్ర విధానములేవియు లేకపోయినను, వధూవరుల పవిత్ర సంకల్పమే వివాహవిధి. సంఘమునందు వారిపై నుండబోవు బాధ్యతలను గుర్తించి వాటిని జ్ఞాపకముంచు కొనుటయే మంత్ర తంత్రములు. గృహ్య సూత్రములలో వివాహ మంత్రముల అర్థమును జూచినచో యీ సత్యము తెలియగలదు.

యుక్తవయస్కులైన వధూవరు లిరువురు పవిత్ర హృదయములతో ఒండొరులు యావజ్జీవితము కలసి మెలసి యుండి, ఉత్తమసంతానమును బడసి లోకసేవజేయుటకు ప్రమాణము జేయుటయే వైదికవివాహ విధియై యుండెను. "త్రీణివర్షాణ్యుదీక్షేత కన్యా ఋతుమతీసతీ" మను. అ9 శ్లో 90 ననుసరించి పుష్పవతిగాని బాలకకు వివాహము చేయరాదు. వివాహమనగ వధూవరుల మధ్యనుండు ఒడంబడికయేగాని,

తలిదండ్రులు, మంత్రములు చదువువారి మధ్యనుండు కొంత్రొత్త గాదు. వధూవరుల హృదయములు కలసినచో వివాహమునకు తెగలు, కులములు, మతములు అడ్డు రావు. మనుస్మృతి అధ్యాయం 3 శ్లోకం 13 ననుసరించి వర్ణాంతర వివాహము సమర్థింపబడినది. పౌరాణిక వాఙ్మయంలో వర్ణాంతర వివాహమునకు అనేక నిదర్శనములు గలవు. వధువుతో వరుడిట్లనును.

అమోహమస్మి సా త్వం, సా త్వమస్య మోహమ్। సామాహమస్మి ఋక్త్వం ద్యౌరహం, పృథివీత్వం, తావేవవివహావహై। సహ రేతో దధావహై ప్రజాం ప్రజనయావహై। పుత్రాన్ విందావహై బహూన్॥

పారస్కర కాం 1. కం 6.

"నేను నిన్ను (అమో, అమసర త్రగచ్ఛతి, జానాతి వా) జ్ఞానపూర్వకముగ నిన్ను గ్రహించువాడను. నీవు ఋగ్వేదము వంటిదానవు. నేను సామవేదమువంటి వాడను. నీవు కూడా నన్ను జ్ఞానపూర్వకముగ గ్రహించుచున్నావు. ఆకాశమువంటినేను, భూమివంటి నీవు వివాహమాడుచున్నాము. ఇరువురము ఒకేమనస్సు గలవారమై వీర్యమును ధరించుచున్నాము. సుసంతానమును బడయుచున్నాము". వైదిక విధిలో సప్తపదీతంతు గలదు. సమావేశమైన పెద్దలయెదుట అగ్నిసాక్షిగ పాణిగ్రహణముజేసిన నూతన వధూవరులు అగ్నికి ఉత్తరదిశగ, పరస్పరము కలసి ఏడు అడుగులు వేయవలెనని, ఏడవఅడుగు వేయునప్పుడు 'సఖా సప్తపదీ భవ, సామామనువ్రతాభవ, విష్ణుస్త్వా నయతు పుత్రాన్, విందావహై, తే సంతు జరదష్టయః' అని చెప్పవలెనని సూత్రములు

తెలుపుచున్నవి. ఇది చాలా మంచిక్రియ. ప్రధానమైనది గూడ. వైదికవివాహవిధిలో ప్రధానభాగములివి. 1. కన్యాదానము 2. జయాదిహోమము 3. పాణిగ్రహణము 4. సప్తపదీ 5. కేశబంధవిమోచన 6. అరుంధతీదర్శనము.

ప్రమాణములు జేయునపుడు వధూవరులు ముఖాముఖిగ మాట్లాడవలెను. ఒకరుజేయుప్రమాణము రెండవవారికి అర్థముకావలెను. తాము జేయుప్రమాణము తమకే అర్థముగానట్టియు, రెండవవానికి అర్థముగానట్టియు భాషలో ప్రమాణములు జరిగినచో వారిరువురా ప్రమాణముల నుల్లంఘించినచో, ఆబాధ్యత దంపతులిరువురిపై నుండక, అర్థము తెలిసియో, తెలియకయో ప్రమాణ మంత్రములను జదివించిన యాకాలపు పురోహితునిపై నుండును. కనుక వధూవరులకు అర్థముగాని భాషలో అది సంస్కృతమైనను, ఆంగ్లమైనను, అరబ్బీయైనను-వధూవరులచేత ప్రమాణములు చేయించుట దురాచారమగును. ప్రాచీనకాలములో వధూవరులిరువురు గురుకులములలో "వేదానధీత్య వేదౌ వా" అనుట చేత చక్కగ అర్థసహితముగ వైజ్ఞానిక రసాయనిక విద్యలతో బాటు వేదాధ్యయనము జేసెడువారుగనుక తాము జేయు ప్రమాణములు సంస్కృతభాషలో నున్నను వారికి అర్థమయ్యెడివి. కాని నేడాపరిస్థితి మూర్తిగ మారినది. కనుక సంస్కృతభాషలోనే ప్రమాణములు జేయాలని వధూవరులును, చేయించాలని పురోహితులును, ఇతర పెద్దలును గోరినచో ఆప్రమాణవాక్యాలను ముందుగ మాతృభాషలోనికి అనువదించి, వధూవరులకు తెలిపి వారిరువురి అంగీకా

రము పైన వివాహసమయములో ఆ ప్రమాణములను వధూవరులచేత జేయించవలెను. అర్థముగాని భాషలో ప్రమాణములు చేయుట భావహానిసత్వము, భాషా హానిసత్వము అగును. అట్టి భాషా, భావహానిసత్వములను విడువగోరినచో అర్థముగాని భాషలో కర్మకలాపముల నాచరింపజేయు నేటి పురోహితుల వారినుండి బయటపడి, పదుగురు పెద్దమనుష్యుల యెదుట వధూవరులిరువురు తాము "గృహస్థాశ్రమములో జేరి, పరస్పరము ప్రేమించుకుంటూ, పవిత్రజీవితాన్ని గడుపుటకు నేడు తమ సమక్షములో సత్యసాక్షిగా వివాహమాడుచున్నాము." అనే మాటలతో ప్రతిన బూనుటయే నిజమైన వైదికవిధి (యీ కాలానికి) యగుననినాయుద్దేశ్యము.

వానప్రస్థ సన్యాసములు

ఇవి రెండును లోకసేవకు తనసర్వస్వమును త్యజించు జీవిత అంతస్థులు.

## (16) అంత్యేష్టి లేక దహనసంస్కారము
## (Funeral ceremony)

మనుష్యునకు ఇది తుది సంస్కారము లేక మార్పు. జీవి శరీరమును వీడినతరువాత ఆశరీరములో ప్రాణవాయువు లేక పోవుటచేత అది క్రుళ్ళిపోయి సమాజమునకు హాని కలిగించును. కనుక మృత్యు కళేబరమును చనిపోయిన వ్యక్తియొక్క సపిండీకులు ఆనగా దగ్గర శరీరసంబంధముగల వారును, గ్రామములోని యితర పెద్దలును తుది సంస్కార

మును — దహనము — జేయవలెను. మృత కళేబరములోని శరీరభాగాలు వాయువులోను, సూర్యకిరణములలోను కలసి పోవు వర్ణనగల యమసూక్తమును (ఋగ్వేదము) చదువ వలెనని సూత్రములలో నున్నది. ఈసూక్తమును జదివి నచో "చచ్చిపోయిన వాడు యెక్కడో, పున్నామ నరకంలో వుంటాడని, చిత్రగుప్తుడు లెఖ్కలు వ్రాస్తుంటాడనే" గ్రుడ్డి విశ్వాసాలకు అవకాశముండదు. అంత్యేష్టితో సంస్కార ములు లేక కర్మలు పూర్తియగును. పంచభూతముల రాసా యనిక క్రియ వలన యేర్పడిన శరీరభాగమంతయు, చూచు చుండగనే పంచభూతములలో కలిసిపోయినచో అంధవిశ్వా సము, భూత ప్రేతాతుల భయము యేర్పడవు. అందుకొరకే వైదిక విధానములో దహన సంస్కారము నేర్పాటుచేసిరి. యజుర్వేదంలో చివర 'భస్మాంతగ్ శరీరం' దహనమగుట తోడనే శరీరము అంతమై పోవుటవలన శరీరికి సంస్కార కర్మలు లేవు అని యున్నది. కనుక పిండములు మొదలైనవి ఎవరికొరకని మనము పెట్టుచున్నామో వారు తినజాలరు. జీవుడు జడమగు శరీరము నాశ్రయించినప్పుడే సుఖదుఃఖాను భూతులను జెందునని వైజ్ఞానికులు, దార్శనికులు స్పష్టముగ జెప్పిరి. కనుక పెద్దల గుణగానము జేయుచు, మృత్యువు యొక్క మహత్తరశక్తిని గుర్తించి, ఉత్తమ ఆధ్యాత్మిక జిజ్ఞాసతో కాలక్షేపము జేయుటయే శ్రాద్ధకర్మ. శ్రద్ధతో జేయబడునది శ్రాద్ధకర్మయని గృహ్యసూత్రములలో స్పష్ట ముగ గలదు.

## శ్రాద్ధకర్మ

త్రిరాత్రం బ్రహ్మచారిణోఽధశ్శాయినో న కించన కర్మకుర్వన్త
ప్రకుర్వీరన్॥ పారస్కర గృ. కాం 3. కం 10. సూ 25

ప్రేత (Dead body) కు అంత్య సంస్కారము జేసినపిమ్మట మూడు దినములు బ్రహ్మచర్యము నవలంబించి, భూమిపై పరుండుచు, కామమును వీడి, గృహ సంబంధమైన కార్య కలాపమును జేయుటనుగాని, చేయించుటనుగాని మాని వేయవలెను. అంటే పూర్ణమైన ఆధ్యాత్మిక జిజ్ఞాసలో నుండ వలె నన్నమాట. కొందరీ నియమమును పదిరోజు లాచరించ వలె నందురు. శ్రాద్ధకర్మలో జేయవలసిన పని:-

స్వాధ్యాయం శ్రావయేత్పిత్ర్యే ధర్మశాస్త్రాణి చైవ హి।
అఖ్యానానీతిహాసాంశ్చ పురాణాని ఖిలాని చ॥
మను. అ 3. శ్లో 232.

శ్రాద్ధకర్మలో వేదములను, ధర్మశాస్త్రములను, కథాసాహి త్యమును, ఇతిహాసములను చదువ వలెననుటలో మనశ్శాం తికి జేయుకార్యకలాపమే శ్రాద్ధమని భావం. పురుషుడు మరణించినచో అతని భార్యయొక్క అభరణములను ఊడ బెరికి, పైపెచ్చు ఆమెను అంటరాని దానినిగా చూచే నీచ స్థితి శ్రాద్ధకర్మలోనిదిగాదు. ఐచ్ఛికముగా స్త్రీ గాని, పురుషుడుగాని, తమ ప్రేమికుల వియోగములో అలంకరణ ములను విసర్జించవచ్చును.

## ఆశౌచం

మనుష్యుడు మరణించగనే యీ ఆశౌచమును సప్త దినము లాచరించవలెనని పూర్వులు నిర్ణయించిరి. 'దశాహం

శావమాశౌచం' అని మనుస్మృతికారుడన్నాడు. పారస్కరుని మతములో "త్రిరాత్రం శావమాశౌచమ్" (కాం 3. కం 10 సూ 29.) అని యున్నది. "దశరాత్రమిత్యేకే" అనుటచే పది దినములుగూడ ఆశౌచమును పాటించవలెనని యున్నది. మరణమనగ శరీరి దేహమును వీడుట. ఒక జీవి శరీరధారి గాక పూర్వమూతని యెఱుగనట్టి మనము మధ్యకాలములో మిక్కిలి పరిచితుల మయ్యెదము. కాని ఆవ్యక్తియొక్క మృత్యువుతో ఆపరిచయము తొలగిపోవును. ఎక్కువ కాలము పరిచయము తొలగిపోవుటయే వియోగము. భౌతికానికి, చేతనమునకు – జీవునకు గల – సంబంధమేమిటో యోచించుటకు ప్రయత్నించినచో అనగా సృష్టిరహస్యాన్వేషణ జేయబూనినచో వియోగజనిత దుఃఖము మటుమాయమగును. ఎందుకనగా సృష్టి రహస్యమును యీలోకంలో అనంతకాలంలో నుండి అన్వేషించటయే జరిగినది గాని, నిర్ణయించటము చేతగాలేదు. నిర్ణయించుటకు చేతగానిదీ, తప్పక యోచించవలసినదీ అగు యీసృష్టి రహస్యాన్వేషణ 'నాకెందుకులే' అని మానవుడు వివేచనా దృష్టికి విముఖుడు గాజాలడు. అసలాబాధ్యత అతనిపైన వుండనే వున్నది. అందువల్లనే దుఃఖమావరించిన సమయంలో ప్రకృతిని, బ్రహ్మాండాన్ని చూచినచో దుఃఖంకాస్తా తొలగి చిత్రమైన "మజా" కనిపిస్తుంది. అసలు దుఃఖము కలుగుట మానవుని పురుషార్థముగాదు. కనుక మరణించినవ్యక్తి యొక్క బంధువులు – యెవరికైతే దుఃఖము కలుగుటకు అవకాశము గలదో అట్టి సన్నిహితులు–సపిండీకులు దుఃఖము

కలుగకుండుటకై ఆశౌచమును అనగా ప్రత్యేకమైన, విశాలమైన, అఖండమైన శౌచమును-ఆధ్యాత్మిక జిజ్ఞాసను పాటించవలెను. ఆశౌచమనగ అపరిశుభ్రతగాదు. సూత్రాలలో విధించబడిన నియమాలనుబట్టి ఆ – సమంతాత్, శౌచం ఆశౌచం అని తలచుటయు క్తము. ఆనందశబ్దమువలెనే: ఆశౌచ శబ్దముగూడ నిర్మాణమైనది. వ్యక్తితో ప్రారంభమై, సంఘముతో కలసిమెలసి, విశ్వముఃలో లీనమగు సహజ సంస్కారములను-జీవియొక్క మార్పులను-గమనించి ఆయామార్పుల సమయాలలో సంఘమునకు – తనకు మధ్యగల సంబంధాన్ని స్మరించుకొని విశ్వప్రేమను పొందుటయే వైదిక షోడశ సంస్కార విధులలక్ష్యము.

# ప్రత్యక్ష సమస్యలు

## స్త్రీల సమస్య

మహాభారతకాలమువరకు స్త్రీకి ఉన్నతస్థాన మిచ్చిన పవిత్ర భారతావనిలో నేడు స్త్రీలస్థితి మిక్కిలి శోచనీయమై పోయినది. పెద్దకాలమునుండి రాజ్యాంగ చట్టములలోను, ధార్మిక సామాజిక కట్టుబాట్లలోను స్త్రీలకు కలుగుచున్న అన్యాయము హృదయవిదారక మైనది. రాజారామమోహన్ రాయ్, దయానందుడు మొదలు గాంధీజీవరకు అనేకులు యీహృదయ విదారకస్థితిని తొలగించుటకు అమోఘమైన కృషిసలిపినను అధికసంఖ్యాకులలో హృదయపరివర్తన జరుగకపోవుటవలన ఆశించిన ఫలితము గగనకుసుమము కాజొచ్చెను. కనుక నేడు మనకు స్త్రీలసమస్య ప్రత్యక్ష సమస్యగా నున్నది.

మనదేశములో కొన్నిశతాబ్దములనుండి పురుషుడు స్త్రీని తనకంటె తక్కువ బలముగలదనీ, తక్కువ విజ్ఞానవతియనీ యెంచి, ఆమెను తనపై నాధారపడి జీవించు బలహీనజాతిగ చూడ ప్రారంభించినాడు. అందువలన పవిత్ర మాతృదేవి స్థానము అవహేళన చేయబడి సమాజములో భరించరాని బాధలు అధికము కాజొచ్చెను. కనుకనే మనుస్మృతికారుడిట్లు పలికినాడు-

యత్ర నార్యస్తు పూజ్యంతే, రమంతే తత్ర దేవతాః।
యత్రైతాస్తు న పూజ్యంతే, సర్వాస్తత్రాఫలాః క్రియాః॥

మను అ 3. శ్లో 88.

(యత్ర) ఎచ్చట (నార్యః) స్త్రీలు (పూజ్యంతే) గౌరవింపబడుదురో (తత్ర) అచ్చట (దేవతాః) ఉత్తమ విద్వాంసులు, తత్త్వవేత్తలు, కాంతివంతమగు మహత్తర ప్రకృతి పదార్థములు (రమంతే) సంతోషింతురు లేక అనుకూలముగనుందురు. (యత్రైతాస్తు నపూజ్యంతే) ఎచ్చటైతే స్త్రీలు గౌరవింపబడరో, పూజింపబడరో (తత్ర) అచ్చట (సర్వాః క్రియాః) చేయుపనులన్నీ (అఫలాః) నిష్ఫలములగును అనగా వ్యర్థములగును.

వివాహ సంస్కార సమయములో పురుషుడు వధువుతో "ద్యౌరహం పృథివీత్వం" అని పలుకవలసినదిగా విధింపబడియుండుటవలన సూత్రకాలములో స్త్రీకి మిక్కిలి గౌరవస్థానమీయబడినట్లు బోధపడక మానదు. అంతేగాదు, ఋగ్వేదం మం 3. సూ.53. మం 4. లో స్త్రీయే గృహమని నిర్వచింపబడినది. గృహము మానవునకు నివాసస్థానము. గృహములేనిదే మానవుడు నిరాధారుడగును. కనుక స్త్రీయే పురుషుల జీవితానికి ఆధారభూతమైనది. స్త్రీ లేనిదే పురుషుడు బ్రతుకజాలడని ఆర్యుల సిద్ధాంతమైయుండెను. అందుకొరకే మనుస్మృతికారుడు 'గృహిణి గృహముచ్యతే' అని చెప్పక తప్పలేదు. శతపథ బ్రాహ్మణములో "మాతృవాన్ పితృవాన్ ఆచార్యవాన్ పురుషోవేద (14-6-10)" అనుటచేత గురువులస్థానములో

స్త్రీకి ప్రథమస్థాన మీయాబడినది. కనుకనే అతిప్రాచీన కాలమునుండి నేటివరకు భారతదేశమునందే గాక ప్రపంచ మంతటను ఆదర్శపురుషులు స్త్రీలను ప్రత్యక్షదైవములుగ భావించి వారిని పూజించవలసిన ఆవశ్యకతను బోధించిరి. కాని భారతదేశమునందు అనేక సంవత్సరాలనుండి సమాజ ములో ఎక్కువమంది పురుషులు స్త్రీలను తమ ఇంద్రియ వ్యసనములను తీర్చుకొనుటకై సృష్టింపబడిన యంత్రములని భావించి, వైదికలక్ష్యాన్ని మరచి, స్త్రీలకు చదువుకొను టకై తగిన వసతులను కల్పింపరైరి. అంతటితో ఆగక వారికి రత్నఖచిత సువర్ణాభరణాలవంటి చీని చీనాంబరాల వంటి క్షణికాలంకారములతో 'నరస్యరూపమధికం' ఐనట్టి 'వీణావరదండ మండితకరము' గలిగినట్టి విద్యాలంకారము లేనిలోటును పూర్తిచేయుటకు ప్రయత్నించ సాగినారు. దురదృష్టవశాత్తు ఈ ప్రయత్నము సఫలమై పంజరములో బ్రతుకుటకు అలవాటుపడిన చిలుకవలె, స్త్రీలు తాము పురుషులకంటే తక్కువనీ, పురుషుల ఇంద్రియ వ్యసనాలను తీర్చుటకే తాము సృజింపబడినామనీ తలచి భావబానిసత్వము నుండి విముక్తి నొందజాలకపోయిరి. కాని కాలమొకేరీతిగా నుండదుగదా! రాజ్యాంగయంత్రముతోబాటు సాంఘిక సంస్కృతీ పరిమళముగూడ పడమటిదేశాలనుండి తూర్పు వైపువీచిన మందవీచికలద్వారా ప్రవహించి భారతనారీలోక మును రసగ్రహణపారీణతకు ఉత్తేజపరచెననుటలో సందేహ మేమాత్రము లేదు. కనుకనే బాపూజీ స్వాతంత్ర్యశంఖాన్ని పూరించడంతోనే అసంఖ్యాక నారీమణులు బ్రిటిషువారి

కర్కశ రాజ్యాంగయంత్రాన్ని బ్రద్దలుచేయటానికి నడు ములు బిగించినారు. వారి ముఖాకృతులనుండి వెల్లివిరిసే తీక్ష్ణజ్యోతిఃపుంజములను జూచినపుడు నాటి ఝాన్సీలక్ష్మి, రుద్రమదేవి ప్రత్యక్షమైనట్లు భాసించేది. జాతీయోద్యమంలో భారతనారి సాహసాన్నేగాక సునిశిత బుద్ధికుశలతను గూడా జూపి సత్యాగ్రహ స్రష్టయొక్క బోసినోటి మందహాసాన్ని పారితోషికంగా పొందుచుండగా గార్గి, మైత్రేయి, మదాలస, సత్యభామ, లీలావతులు స్మృతిపథానికి రాక తప్పేదిగాదు. తుదకు భారతజాతి సంపాదించుకున్న స్వాతంత్ర్యములో భారతనారి తనవంతుగూడ గలదని చాటి వీరనారియైనది! ఇది మరువరాని మహదానందముగాదా?

అయితే, పోరాటభాగంలో చూపిన సాహసాన్ని కార్యదీక్షను, బుద్ధికుశలతను, సుమధుర మాతృత్వాన్ని నిర్మాణభాగంలో భారతనారి చాలినంతగ చూపకపోవుట వలన ముందుకలిగిన ఆనందమునకు ఆటంక మేర్పడినది. ఇందుకు పోరాటభాగముకంటే నిర్మాణభాగమే కష్టతర మగుట ఒక కారణము కావచ్చును. కాని ఖేదాత్మకమగు బలీయకారణాలనేకములు లేకపోలేదు. వానిలో భారత మగువలు తమలోకలిగిన చైతన్యాన్ని పురుషులతో పోటీ జేసి ఉన్నతపదవుల నాక్రమించుటలోనే ఉపయోగించుటకు ప్రయత్నించుట అనగా పురుషులవలెనే స్త్రీలుగూడ పదవీ వ్యామోహములో బడిపోవుట ఒకటి. పురుషులు పోరాట భాగంవరకే స్త్రీల నుపయోగించుకొని, నవసమాజ నిర్మా

కాని కుపయోగపడవలసిన స్త్రీలశక్తిని వ్యర్థము చేయుటకు చట్టరీత్యా స్త్రీలకుగల అన్యాయములను తొలగించక పోవుట రెండవది. సాటిస్త్రీలకు కలిగే కౌటుంబిక, సాంఘిక బాధలలో చేతనైతే సహాయపడటం, లేకపోతే సహానుభూతినైనా ప్రకటించటం మానివేసి వారిని బాధించు దురభ్యాసాన్ని నేటికీ ఉన్నతవిద్య నభ్యసించామని భావించుకొను నాస్తిక సంస్కారవిహీనస్త్రీలను స్త్రీలే వీడవాలకి పోవుట మానవలెను. స్త్రీచేయు శ్రమకు పురుషుని ఆర్థికముగ సరియైన లెక్క-కట్టకపోవుట నాలుగవది. కౌటుంబికంగాను, చట్టరీత్యాను స్త్రీగా తాననుభవించు బాధలనే సాటిస్త్రీ అనుభవించు నప్పుడు తనకు కలిగిన బాధలను మరచి ఆమెను తదితర మగు బాధలకు లోనుచేయుటం—యెట్లనగా కోడలుగా తానను భవించు బాధలు మరచి, ఆడుబిడ్డగా అన్నభార్యను హింసించటం, తనసోదరి పతిత్యక్తయై వారసుల బాధ ననుభవించు చున్నను తనభర్తకు యితర వితంతువుద్వారా వారసత్వపు ఆస్తి సంక్రమించనున్నప్పుడు ఆమెను హింసించుటకు తన భర్తనే పురిగొల్పుట – ఐదవది. ఈ కారణాలవల్లనే స్త్రీ పురుషులమధ్య యేర్పడవలసిన సుస్థిరవ్యవస్థ, సంబంధములకు బదులు రానురాను చిక్కులు అంతకు మీరడుచున్నది. స్త్రీల శిక్షణావిధానములో మార్పు, స్త్రీ పురుషుల మానసిక ప్రవృత్తులు సక్రమమార్గములో పడుటయే యిందుకు నివారణోపాయము.

సాంసారిక జీవితానికి స్త్రీ పురుషు లిరువురు సమాన బాధ్యులే. వీరిరువురి శారీరక ప్రకృతులనుబట్టి గృహనిర్వా

అంభృణస్య మహర్షేర్దుహితా వాక్ నామ్నీ బ్రహ్మవిదుషీ స్వాత్మానమస్తౌత్ సచ్చిత్ సుఖాత్మకః పరమాత్మా దేవతా తేన హ్యేషా తాదాత్మ్యమనుభవంతీ సర్వజగద్రూపేణ, సర్వస్యాధిష్ఠానత్వేన చాహమేవ సర్వంభవామీతి స్వాత్మానం స్తౌతి॥

"అంభృణీ మహర్షియొక్క కుమార్తెయగు 'వాక్కు' అను ఆమె "అహంరుద్రేభిః" అను ఋక్కునకు మంత్ర ద్రష్టయై బ్రహ్మజ్ఞానమువలన ఆత్మశక్తినిగుర్తించి స్తుతించుచూ సర్వజగద్రూపమగు సర్వాధిష్ఠానమగు పరబ్రహ్మతో తాదాత్మ్య భావమును జెంది 'సర్వమునేనే' నని స్తుతించుకొనగలిగినది."

ఉత్తమవిజ్ఞానం లభించడంవల్లనే మండనమిశ్రునిభార్య శంకరుని వాగ్వాదములో పట్టికొట్టించటానికి ప్రయత్నించ గలిగినది, నవవధూ ఉర్మిళా సౌమిత్రి వియోగాన్ని పదు నాలుగు సంవత్సరాలు సహించుటకు సన్నద్ధురాలైనది. మీరాబాయి భక్తిరసపూరితమగు గీతాలద్వారా మానవ లోకాన్ని జాగ్రత్తపరచగలిగినది. విక్టోరియారాణి కడు సమర్థతతో రాచకార్యాలను చక్కబెట్టగలిగినది. సూర్య కాంతి తగులకుండా వుంచబడిన ఫోటోగ్రాఫిక్ ప్లేటుమీద బొమ్మపడునట్లు చేయగల యురేనియమును కనిపెట్టిన బెకరలుమహాశయుని వైజ్ఞానికలోకము స్తుతించుచుండగా, అట్టిశక్తియేకలిగిన "రేడియం"అను విచిత్రపదార్థాన్ని కనిపెట్టి దానిలోని రేడియో ధార్మిశక్తిని బయటపెట్టుటకు భర్తకు తోడ్పడి మదాంక్యూరీ నోబుల్ బహుమతిని వడసి భర్తకు

నిజమైన అర్ధాంగియైనది. సరోజినీనాయుడు రాజ్యాంగ వ్యవహారాలలో సమర్థురాలగుటయేగాక తన సుమధుర కవితాస్రవంతులద్వారా "ఆసియాకోకిల" యైనది. కమలా నెహ్రూ సువర్ణసుగంధములబోలు బుద్ధికుశలత, విశాలప్రేమలతో నెహ్రూ పండితుని పవిత్రకమలాసక్తునిగా జేయుగలిగినది. ఇంతో అంతో విజ్ఞానవతియగుటవల్లనే - అవిజ్ఞానమును తన భర్తద్వారానే సంపాదించి యుండవచ్చు - కస్తూరీబాయి గార్హస్థ బ్రహ్మచర్యాన్ని స్వీకరించి, భర్తకు సహకరించి బాపూజీ సంపాదించిన యశస్సును ఖచ్చితముగా తన సగపాలు పంచుకొనుటకు అర్హతకలిగిన వనితయైనది.

నవమాసములు బిడ్డ గర్భములో పెరుగుచున్నప్పుడును, ప్రసవమైనతరువాత షణ్మాసిక సంవత్సరమువరకును స్త్రీ శిశుపోషకురాలైయున్నది. పురుషుడు తన వీర్యమును స్త్రీ గర్భమున వదలినపిమ్మట పిండపోషణ భారమంతయు స్త్రీయే వహించవలసియుండును. అనగా స్త్రీ గర్భస్థపిండమునకు తన నెత్తురునుండి నెత్తురును, మాంసమునుండి మాంసమును చేర్చుచుండును. అందువలన పురుషునిలోకంటె స్త్రీ యందు శారీరకబలము తగ్గి ఆమె పురుషునితో సమానముగ కాయకష్టము చేయజాలకపోవచ్చును. మఱియు ఆమె పురుషుడు చేసినంతకాలము పనిని చేయజాలదుగూడ. దీనినాధారముగ దీసికొని నేటి ఆర్థికవేత్తలు, పారిశ్రామికులు స్త్రీని అబల - Weaker sex-అని నిర్వచించి పురుషులకంటె స్త్రీలకు తక్కువవేతనముల నివ్వాలని నిర్ణయించిరి. ఈనిర్ణయ పర్యవ

సానంగా స్త్రీలోకంలో నిరుత్సాహము వేదనతోబాటు ప్రతీ కారవాంఛగూడ ప్రబలుట సహజము. ఏదేని ఒక కర్మా గారములో భార్యాభర్తలిద్దరు పని చేయుచుందురు. అక్క డొక విచిత్రవిషయము జరుగుచుండును. భర్త కర్మాగార ములో పనిచేయువరకే తన బాధ్యతయని తలచి విశ్రాంతి సమయంలో యింటిపనివైపుకు వెళ్ళడు. కాని గృహనిర్వ హణ, గర్భధారణ, శిశుపోషణవంటి పనులు భార్య అదన ముగా చేయవలసియుండును. ఈ బాధ్యతానిర్వహణలో పురుషునకు పనిచేసినన్ని రోజులు స్త్రీ చేయలేకపోవుట, పురుషుడు పనిలో కేంద్రీకరించినంత ఏకాగ్రతతో అధిక సమయమును స్త్రీ కేంద్రీకరించకపోవుట జరుగు చుండును. కనుక పురుషునకు దినములో ఒక రూపాయి లభిస్తే అతని భార్యకు లేక యితర యేస్త్రీకైనా అర్ధరూపాయి మాత్రమే లభించుచుండును. అంకెల రూపములోనున్న యీ భేదమును జూచుకొని పురుషుడు తాను స్త్రీకి పోషకుడనని భావించి గర్వించవచ్చును. కాని స్త్రీకివ్వబడు విలువతో శిశుపోష ణాది కార్యములకుగూడ విలువగట్టి మొత్తమును కూడినచో పురుషునకివ్వబడు వేతనముకంటె స్త్రీచేయు శ్రమ విలువయే యెక్కువగును. అయితే ప్రస్తుతం సంఘములో ప్రతికుటుంబ మందు కుటుంబపోషణకు ఆర్థిక భారాన్నంతటినీ పురుషుడే వహించునట్లు లెక్కలువ్రాసుకొనుటచేతను, స్త్రీ నిత్యము చేయు కృషికి కుటుంబ జమాఖర్చు పుస్తకాలలో స్థానం లేకపోవుటచేతను స్త్రీలకు గౌరవమర్యాదలు, ఆదరణలు తగ్గినవి. ఇందువల్లనే ప్రేమతో కనిపెంచిన తల్లి తనభర్త

మరణించితే కుమారుని మనోవర్తికోరి అతని దయాదాక్షి
ణ్యాలపై ఆధారపడి బ్రతకవలసి వచ్చినది. ఒకవేళ అత
డంగీకరించనిచో ఆమె మానపతిగా జీవించటమే దుర్లభమై
పోయినది. రానురాను యీదుస్థితియొక్క పరిణామము వితం
తువు యెదురగుటయే దుశ్శకునమైనది. తుదకు బాలిక
జన్మించుట బాధాచిహ్నముగా మారి మగబిడ్డ పుట్టుట
ముచ్చటగా యెంచబడటం పరిపాటిగా తయారైనది. ఇందుకు
తోడు కట్నాల పెనుభూతంగూడ ప్రవేశించగా పర్యవ
సానం యేంజరుగుతుంది? అంతో యింతో ఉన్నతవిద్య-
అది పాశ్చాత్యసంస్కృతితో కూడినదే కావచ్చు-అభ్యసించిన
మహిళామణులలో వనితాలోకమునకు బుద్ధిపూర్వకముగా
పురుషుడుకలిగిస్తూవున్న అన్యాయాన్ని చూచి సహించలేక
అసహనం పెరిగింది. పోటీ ప్రారంభమైంది. గృహనిర్వహణ
బాధ్యతను వీడుటే గత్యంతరమని సాటి స్త్రీలోకానికి వారు
బోధించసాగినారు. ఫలితం? తెలియందేముంది? అగాధమే!

'అయితే యీఅగాధమిట్లుండవలసినదేనా? ' అని
ప్రశ్నించుకొన్నచో యే మానిసి హృదయమైనా అందు
కంగీకరించదు. మఱి యీఅగాధమును పూడ్చుకొనుటకు
ఉపాయం? స్త్రీ పురుషులమధ్య ఆర్థిక సమదృష్టియే!
చట్టరీత్యా భారతనారికి కలుగుచున్న అన్యాయాన్ని మాటలలో
గాక క్రియారూపంలో తొలగించి సభ్యప్రపంచంలో భారత
పౌరుడు తల యెత్తుకొని తిరుగుటకు తగిన యోగ్యత సంపా
దించుటయే! బుద్ధుడు, రామకృష్ణుడు, గాంధీజీ మనదేశంలో

జన్మించి ప్రపంచంలో అఖండకీర్తిని భారతమాతకు తెచ్చి పెట్టిన మాటనిజమే. కాని, మనము భారతనారిని అవమానపరచి, "పురుషుడు వ్యభిచరించినను దోషము లేదని స్త్రీ బయటి ప్రపంచము చూచినచో నిందితురాలనీ, భర్త భార్యను అకారణంగా వదలివేయవచ్చునుగాని, భార్య మాత్రము భర్త కురూపియైనను, ఇంద్రియ లోలుడైనను, వ్యసనుడైనను, వ్యాధిగ్రస్థుడైనను అతని ఇంద్రియవ్యసనాలను తీర్చుచూ పతిసేవచేస్తూనే వుండాల"ను కర్కశభావాలనువీడక, సభ్య ప్రపంచముతో కలసి పయనించక 'మాదేశంలో మహోన్నత వ్యక్తులుదయించార'ని చెప్పుకున్న మాత్రాన మనము నాగరికులమయ్యేది అబద్ధం! ఏనాడో భారత దేశంలో స్త్రీని మాతృదేవిగా చూచినమాట నిజంకావచ్చు. కాని అంబేద్కరు వంటి ఉదారులు చేయబూనిన శాసన సంస్కరణకు వ్యతిరేకము జూపు సనాతన హిందూమతాభిమానులు "ఇంతవరకు స్త్రీకి గౌరవస్థాన మీయబడినది" అని పలుకుమాటలు పవిత్ర డెందములనుండివచ్చినవి కావని చెప్పుటకు సాహసించవలసి వచ్చుచున్నది. ప్రజాప్రతినిధులే హిందూలానుసవరించాలట! ఎవరాప్రజాప్రతినిధులు? సాంఘిక బానిసత్వాన్ని, అస్పృశ్యతా పిశాచాన్ని శాశ్వతంగా నిలబెట్ట డానికి కంకణం కట్టుకొన్న పండితులా! ద్విజుడుతప్ప వేదము చదువరాదనిశాసించు ఛాందసులా! మానవసేవజేయు కోమల హృదయుల్ని బలిగొను గోడ్సేలా! భారతభూమికి హిందువే అధికారియని ప్రకటించు మతోన్మాదులా! వీరే ప్రజాప్రతినిధులైతే భారతదేశము సెక్యూలర్ స్టేటని చెప్పుకోవటం

బూటకంగాక మానదు. కాని ప్రకృతి దేవత నిర్దయు రాలుగాదు. ఇట్టివారు ప్రజాప్రతినిధులుగారని కాలమే ఋజువు చేయుచున్నది.

చట్టరీత్యా చేయవలసిన సంస్కరణలతోబాటు ఆర్థికముగా స్త్రీచేయు శ్రమకు సరియైన విలువగట్టుటను మనము నేర్చుకొనవలెను. ఒక పురుషుడు అతని భార్య కర్మాగారములో పని చేయునప్పుడు యిరువురి వేతనమును వేరుగా గాక 'ఆదంపతుల వేతనము' అను పేరుతో జమాఖర్చు చేయు పద్ధతిని యజమానులు అమలులో పెట్టవలెను. అంతే గాదు. పురుషుడొక్కడే పనిజేసినను అతని వేతనమును భార్యాభర్తల పేరుతో లేక కుటుంబము పేరుతో జమకట్ట వలెను. ఎందుకనగా స్త్రీ గృహనిర్వహణ, శిశుపోషణజేసి పురుషునికి పనిజేయుటకు అవకాశమిచ్చుచున్నది. డాక్టరు, ప్లీడరు, వర్తకుడు, కృషీవలుడు ఒకరేమి, యేవృత్తిలోనున్న వారైనా తామార్జించు ద్రవ్యపు విలువను భార్య, యితర స్త్రీలు చేయు యింటిపనుల శ్రమ విలువను కలిపి మొత్తము సంపాదన "స్త్రీ పురుషులు కలసి సంపాదించినది" అను మానసిక ప్రవృత్తి అలవడినచో 'గృహిణీగృహముచ్యతే' అను మాట సార్థకమగును. అప్పుడు స్త్రీల విద్యకై పురుషు డాటంకముల జేయజాలడు. ప్రతిగృహిణియు తన భర్తకు తోడ్పడుచు కుటుంబ ఆర్థిక విషయాలను జాగరూకతతో జూచు చుండును. నిజముగా అప్పుడే 'తావేవవివహావహై' అను ప్రమాణము పాలించినట్లగును. 'కుమారాతానజాయతే'

అను ఆరోక్తి మన హృదయాలకు పట్టినట్లగుచు! అప్పుడే స్త్రీలు కాముకులని పురుషులు నిందించ జాలరు! ప్రతిభారతీయ కుటుంబములోను సుఖ-శాంతులు వెల్లివిరియుచున్నవి.

## స్త్రీ పునర్వివాహము

పురుషునకు రెండవ వివాహానికి హక్కుంటే స్త్రీకి కూడ కలదనుమాట నిర్వివాదమే. "దేవరాద్వాసపిండా ద్వాస్త్రియాసమ్యఙ్నియుక్తయా। ప్రజేప్సితాధిగంతవ్యా సంతానస్య పరిక్షయే॥" మను అ 9 శ్లో 59. "విధవాయాం నియుక్తస్తు" మను అ 9 శ్లో 10. యీ ప్రమాణాలు స్త్రీ పునర్వివాహము కాగూడదని నేడుగూడ వాదించువారికి కనువిప్పు చేయగలవు.

'యత్రైతాస్తు న పూజ్యంతే సర్వాస్తత్రాఫలాః క్రియాః' అను మాటను స్మరించుకొని యీవిషయాన్ని ముగిద్దాము.

## కులద్వేషాలు

సంఘ క్షేమానికై చేయబడిన వృత్తుల విభజనయే కులముల యేర్పాటు. ఋగ్వేదం మం 10. సూక్తం. 90 లో 'బ్రాహ్మణోఽస్యముఖమాసీత్'ను మంత్రము యీకులముల యేర్పాటుకు చక్కని రూపకము. పుట్టుకనుబట్టిగాక వృత్తిని బట్టియే కులములయేర్పాటు చేయబడినదని నేటి సత్పురుషులే గాక నాటిఋషులుగూడ ప్రకటించిరి. కాని నేడు యీకుల

ముల మధ్యనున్న ద్వేషాల క్రుళ్ళు మన దేశములో భయంకరమైన ప్రత్యక్ష సమస్యగా మారినది.

ఒక శతాబ్దమునకు పూర్వము విభిన్న కులములలో సహపంక్తి భోజనము లేక పోయినను అఖండమైన ఐక్యత కానుపించుచుండెడిది. ఒకరి కష్టసుఖాలలో మరియొకరు పాల్గొనుట గ్రామ రివాజై వుండేది. కాని నేడో? భోజనాదులలో నామమాత్రపు ఐక్యత పాటింపబడుట, హృదయాలు కులభేదాలకేగాక కులద్వేషాలకు గూడ ఆట పట్టుగా మారుచుండుట మనకు ప్రత్యక్షమే. అయితే మూఢనమ్మకాలు గలవారు కులముల హెచ్చుతగ్గు భేదాలను పాటించినను కొంతవరకు క్షమించ వచ్చును గాని సంస్కారవాదులుగ కానుపించు సోదరులు వీటి హెచ్చుతగ్గు భేదములను పాటించుట క్షంతవ్యముగాదు సరిగదా మిక్కిలి ప్రమాద కరముగూడ!

కృషి గోరక్షణములను వీడి కేవలం వ్యాపారమునే-అదియు సంఘ క్షేమానికి గాక స్వార్థమునకే-అనుసరించుచు వైశ్యులమే ననుకొనువారు వైశ్యులా? సత్వగుణ ప్రధానులై, ఆస్తిపాస్తులను ప్రోగుచేసుకొనుటను మాని, సర్వ సమత్వము కలిగి యుండుటకు బదులు ద్వేషమును, అసూయను ఆయుధములుగా తీసికొని నేడములలోనున్న పౌరోహిత్యమనెడి నిరంకుశ ఇంపీరియలిజమును అమలు పరచుచూ, విభిన్న వృత్తులలో ప్రవేశించి లక్ష్మీసేవకులగుచూ బ్రాహ్మణులమే నని భావించువారు

బ్రాహ్మణులా? ప్రాతకాలపు సమాజమునందు గాకపోయి నను ప్రాక్ప్రతీచీ సంస్కృతుల సమాగమానంతరం యేర్పడిన ఉన్నత విద్యాభ్యాసజనిత నూతన సమాజములోనైనను యీవిషయము బోధపడని వారుండరు. ఎవరికివారు గుండెపై చేయివేసుకొని మేము ఫలానా కులము వారమేనని గాని లేక పుట్టుకనుబట్టియే కులము లేర్పడినవని గాని చెప్ప సాహసించగలవారున్నారా? కాని కులభేదములను సూచించు ఉపాధులు, చిహ్నములు నానాటికి సర్వత్రా పెరుగుచున్నవి. ఆయాచిహ్నములను తమ పేర్ల వెంట కలిగియున్న వారికి నొప్పి కలిగించుటకై యిట్లు వ్రాయుట లేదు. కులభేదములవలన 'అగ్రకులాలు - తక్కువకులాలు' అనే తరతమభేదం లేకుండా సర్వప్రజానీకానికి ఘోర ప్రమాదం వాటిల్లుచున్నసంగతి లోకవిదితమే. ఏగ్రామంలో యే కులమువారు అధికసంఖ్యాకులుగా నుందురో వారక్కడ అల్పసంఖ్యాకులుగానున్న కులమువారికి గలిగించు బాధలు వర్ణింప నలవిగానివి. ఇంతేగాదు, బుద్ధి బలము లేక ధనబలముగల ఒక సోదరుడు యీ కులభేదాల నాధారముగ దీసికొని తన కులమని చెప్పుకొను వారిలోగల అమాయకులకు కులతత్త్వమనే మత్తు పదార్థము నొసగి, వారందరినీ తన స్వార్థమునకు వినియోగించు కొనుటకై అంగ బలాన్ని సైతము సంపాదించ గలుగుచున్నాడు. ఈనైచ్యము నేటి రాజకీయరంగంలోకూడ స్థానం సంపాదించుటవలన "అసలు రాజకీయమంటే యేమిటి?" అని యోచించుకొనవల సినదీనస్థితి రాజకీయవేత్తలకు కలుగుచున్నది. కట్నాలబాధ

ననుభవించు కన్నియనుగన్న తలిదండ్రులే తమ కుమారుని పెండ్లికి కట్నానికై బేరమాడుట వారికొక సరదాగా మంరి నల్లే, కులభేదముల వలన కలుగు బాధల ననుభవించుచు కులభేదములను ప్రోత్సహించు ప్రవృత్తి నానాటికి పెరుగు చున్నది. బ్రాహ్మణేతరు లన్యాయము జేయుచున్నారని బ్రాహ్మణులును, బ్రాహ్మణులన్యాయము జేయుచున్నారని బ్రాహ్మణేతరులును పరస్పర నిందారోపణ జేసుకొనుటయే గాక యిరువురును వెనుకబడిన జాతులను పీడించుటమాన లేదు. ఇందుకు నిదర్శనము అస్పృశ్యతా నిర్మూలనకు చేయ బడిన శాసనము గ్రామములలో ఆచరణరూపమునందు పని జేయక శాసన రూపములోనే మిగిలియుండుటయే. ఈఅస్పృ శ్యతా జాడ్యాన్ని నిర్మూలించుటకు బాపూజీ వంటి ఘన వైద్యులు తమ శక్తినంతటినీ ధారవోసి నప్పటికీ సమాజము లోనున్న బలహీనతవల్లనే ఆశించినంత ఫలితము చేకూరలేదు.

"జాతి, మత, కులముల హెచ్చుతగ్గుభేదములను పాటిం చక పవిత్ర సేవాకార్యముల నాచరించు వ్యక్తులు బ్రాహ్మణ కుటుంబములో జన్మించినంత మాత్రమున, బ్రాహ్మణ సంఘము నిరంకుశ సాంఘిక పెత్తందారీతనమునకు, కులముల హెచ్చుతగ్గు భేదాలకు కారణమైనదనెడి నెపముతో, పవిత్ర మైన ప్రేమజీవితమును గడుపు బ్రాహ్మణసోదరులను ద్వేషించుచూ, వారికి ప్రభుత్వ వ్యవహారాలలోను, విద్యా సౌకర్యాలలోను అన్యాయము జేయబూనుట సభ్యతా లక్ష ణమా? ఇట్లే బ్రాహ్మణేతరులలోనున్న సత్ప్రవర్తనులను

బ్రాహ్మణసంఘము గుర్తించకపోవుట అనాగరిక లక్షణము గాదా? గాంధీజీ అస్తికలను నదులలో కలుపుటకు జాతి, మత విభేదములను పాటించు మంత్రభాగములు, వాటి నుచ్ఛరించు పురోహితు లెందుకవసర మయ్యెను? మానవ మాత్రులమై మనమా పుణ్యపురుషుని భౌతిక దేహానికి అంత్యక్రియలు సలుపలేకపోయితిమా? మహాత్ముని విశ్వమత సిద్ధాంతము మన కంగీకారమైనచో యీ పనులు చేయుటకు మన హృదయము లంగీకరించునా?" అని ప్రశ్నించుకొన్నచో లక్ష్యానికి మనమెంత దూరములో నున్నదీ బోధపడక మానదు.

వెనుకబడిన జాతుల నుద్ధరించుట కేర్పరుపబడిన కమ్యూనల్ జి. ఓ. నేడు వికృతరూపము ధరించుట విచారకరమే. నూతన రాజ్యాంగాశయానికి ఇది విరుద్ధమే. నాగరిక ప్రపంచములో యిట్టి తర, తమభేదాలు పాటించబడగూడని మాట నిజమే. అయితే యీ కమ్యూనల్ జి. ఓ. వికృతరూపానికి బాధ్యులెవరో ద్విజులమని భావించు బ్రాహ్మణాది ఉచ్చవర్ణస్తులని పిలువబడువారు యోచించుకొనుట యుక్తము. ఏఒక మనుష్యుడో యిందుకు బాధ్యుడని మనము చెప్పలేము. కాని, మూలకారణమును వెదకినచో కులము హెచ్చుతగ్గు భేదాలే బాధ్యత వహించక తప్పదని తెలియగలదు. వీటితోబాటు డాక్టరు, ప్లీడరు వృత్తులలోనే గాక వర్తకవాణిజ్యములలోగూడ అంటవేసిన చేతులై ద్రవ్యార్జన జేసుకొనునట్టియు, రాజకీయ క్షేత్రములో

సర్వసమత్వభావాన్ని ప్రబోధించునట్టియు బ్రాహ్మణ, వైశ్య మొదలగు అగ్రకులాలవారి యిండ్లలో సంస్కార సమయము లందు బ్రాహ్మణులకే పురోహితస్థాన మొసగుటగూడ కమ్యూనల్ జి. ఓ. యొక్క వికృతరూపానికి హేతువని అంగీకరించకతప్పదు. ఎందుకనగా, పౌరోహితము వృత్తి గాదు. అది చేతిపనులలో చేరదు. "పురోహితస్యకర్మ వాభావం పౌరోహిత్యం". కనుక అది ఒక పదవిమాత్రమే కావలసి యుండును. కన్నబిడ్డయే పెరిగి పెద్దవాడైన పిమ్మట అతని మలమూత్రములను యెత్తివేయుటకు తల్లి సమ్మతించదు గదా? మఱి ఆ పనినే పాకీవాండ్రు తమ వృత్తిగా జేయు నప్పుడు సమాజ మంతటికీ ప్రత్యక్ష మాతృదేవి రూపము గదా? ఇంత పవిత్రమైన పనిజేయు పాకీవాండ్రకు, యిలాగే సేవజేయు చాకలి, మంగలి మొదలైనవృత్తులవారికి సరియైన వసతుల నేర్పాటుజేసి ద్విజులమనుకొను వారి యిండ్లలో సంస్కార సమయములందు పురోహితులమని చెప్పుకొను బ్రాహ్మణసోదరులకిచ్చు గౌరవస్థాన మిచ్చినయెడల ఆయా వృత్తులవారు తాము గౌరవనీయమైన వృత్తినే అవలంబించు చున్నట్లు భావించి, "తమసేవను సమాజము గుర్తించినది గదా?" యని సంతసిల్లుదురు. అట్లుగాక పవిత్ర సేవా కార్యము జేయువారికి సాంఘికముగా అమర్యాదను జూపుచూ; సేవాదృష్టి, సమత్వము, తపస్సు యివి లేకుం డానే కేవలము పౌరోహితులమని చెప్పుకొను అగ్రకులాలకు చెందినవారికి గౌరవ మర్యాదలు చూపుచూ "ఏవృత్తి చేసినా పవిత్రమైనదే"నని పలుకు జాతీయవాదుల మాట

లకూ చిలుకపలుకులకూ భేదము కానుపించదు. సంఘములో మర్యాద, ఆదరణ పొందటానికి ప్రతి మానవుని ప్రకృతి కృషి చేయుచునే యుండును. ఒక శిల్పి తన మనోవాక్కాయల నన్నిటినీ కేంద్రీకరించి సజీవమైన చిత్రాన్ని రచించగా దాన్ని చూచి చుట్టూవున్న సమాజము అతనిని పోషించుటకుబదులు నిరుత్సాహపరచి, అగౌరవము చేసినచో ఆశిల్పి రెండవమారు శిల్పమును రచించగలడా? సమాజముపై రోతకలిగి, తనకృషికి తగిన విలువ గట్టనివారిపై కసి తీర్చుకొనుటకు వెఱ్ఱివాడుగా మారిపోవును, లేక నిష్క్రియుడై సోమరిగానైనా తయారగును. మృష్టాన్నము గుడిచిన పిమ్మట యెంగిలి ఆకులకై యెదురుజూచు పాటిమానవులకు యెంగిలివిస్తళ్ళను విసరివేయుచూ, అట్టి నీచమైనపని చేయుటను సమర్థించుకొనుటకై "కాయకష్టము చేసికొన్నచో యెంగిలివిస్తళ్ళకై యెందుకు యెగబ్రాకవలసివచ్చును" అని వాదింతురు. నిజమే, కాని కాయకష్టముచేయువారి శ్రమకు సరియైన విలువగట్టి, సమాజమువారిని గౌరవించుచున్నదా? అని ప్రశ్నించితే సమాధానమురాదు. కనుక పవిత్రమైన సేవాకార్యక్రమమును సలుపువారిని గౌరవించుట, వారికి తగిన వసతులు కలిగించుట మనవిధి. లేనిచో వెనుకబడిన కులాలలో విప్లవభావ మంకురించకమానదు. చేనేత పారిశ్రామికులు నేసిన గుడ్డను ఉపయోగించక, మిల్లుగుడ్డనే ఉపయోగించుచూ, వర్ణాశ్రమధర్మాన్ని ప్రబోధిస్తూ, పైపెచ్చు కులముల హెచ్చుతగ్గుభేదాలను రెచ్చగొట్టువారు అభివృది

విరోధకులుగాక మరి యేమగుదురు? వీరివలన వెనుకబడిన కులాలలో విద్వేషభావ మంకురించక యేమగును?

ఒక కలెక్టరాఫీసులో పని చేయు గుమాస్తాలలో బ్రాహ్మణుడైనను, బ్రాహ్మణేతరుడైనను ఆఫీసులోవున్నంత వరకు వారు గుమాస్తాలుగానే వ్యవహరింపబడుదురు. దానికి తగినట్లు ఆదరింపబడుదురు. వారిరువురు గుమాస్తాలే అగుట వలన వారికులము గుమాస్తాకులమే అగును. కాని బయటికి వచ్చినతరువాత బ్రాహ్మణగుమాస్తా బ్రాహ్మణేతరగుమాస్తా యింటికివస్తే అగ్రతాంబూలము బ్రాహ్మణ గుమాస్తాకు యీయవలసి వచ్చుటయు, బ్రాహ్మణేతర గుమాస్తా బ్రాహ్మణ గుమాస్తాయింటికి వచ్చినప్పుడు అతను యే పెంట పోగులవద్దనో భోజనముచేయవలసి వచ్చుటయు జరుగునప్పుడు, బ్రాహ్మణేతర గుమాస్తాహృదయంలో "మేమిద్దరం కలెక్టరాఫీసులో గుమాస్తాలమేగదా? నాకీ అమర్యాద; ఆయనకీ మర్యాదయా?" అను అసహనము కలుగుటలో ఆశ్చర్యములేదు. దీని పర్యవసానము బ్రాహ్మణేతర గుమాస్తా తనకు చేతనైన మార్గములో బ్రాహ్మణ గుమాస్తాకు కావలసిన సౌకర్యములను కలిగించక యిబ్బంది పెట్టును. ఈతర తమభేదాల పోటాపోటీలోనే నేటి కమ్యూనల్ జి. ఓ. వికృతరూపము ధరించినది. ఈ జి. ఓ. ను సరిదిద్దవలెననీ లేక రద్దుచేయవలెననీ ఆందోళన చేయుటతో పాటు వర్ణాంతర వివాహాలకు అడ్డురాకుండ వేదాది ధార్మిక గ్రంథాలఅధ్యయనము, అధ్యాపనము, పౌరోహిత్యపుపదవిని

పొందు హక్కు అన్నికులములవారికి కలదని యెలుగెత్తి చాటి జాతీయ వాదులమని భావించుకొను అగ్రకులాలవారు తదనుగుణ్యముగ ప్రవర్తించినచో కులద్వేషాలకు తావుండదు. అప్పుడు అన్ని వృత్తులు గౌరవింపబడినట్లగును. కమ్యూనల్ జి. ఓ. దానంతటదే మాయమైపోవును. సభ్య ప్రపంచములో హిందువులుకూడ స్థానాన్ని సంపాదించుకొన గలరు. మనుస్మృతిలోని క్రిందిశ్లోక మీసందర్భమున మరువ రానిది.

శూద్రా బ్రాహ్మణతామేతి, బ్రాహ్మణశ్చైతి శూద్రతామ్।
క్షత్రియాజ్జాత మేవంతు, విద్యాద్వైశ్యాత్తథైవచ॥

మను. అధ్యా 10 శ్లో 65.

"చాండాలోస్తు సతుద్విజోస్తు గురురిత్యేషా మనీషామమ" అనిపలికి అద్వైతస్థితినిపొందిన శంకరాచార్యులు జన్మించినట్టి భారతావనిలో కులద్వేషాల అంటుజాడ్యాన్ని నిర్మూలించుటకు అద్వైతవాదులు ముందుగా నడుము కట్టుకొన్నచో కుల ద్వేషాల సమస్య తీరిపోవుటలో ఆలస్యము జరుగదు.

## మతకలహాలు

మానవుడు స్వభావ సిద్ధంగానే సామాజిక జీవియని వైదిక సంస్కార విధులద్వారా మనకు బోధపడినది. సమాజమునకు వ్యక్తి మధ్యనుండు నైతిక బాధ్యతలు, వాటిని నెరవేర్చినప్పుడు కలుగు ఫలితాలు రాజకీయమైనవి. సామాజిక జీవియగు మానవుడు యీబాధ్యతలకు దూరము గానుండ జాలడు గనుక అతడు రాజకీయజీవికూడ అగు

చున్నాడు. సమాజముతో వ్యక్తికిగల రాజకీయబాధ్యతలను నెరవేర్చుటకే ప్రాచీనఋషులు ధర్మశాస్త్రములను రచించిరి. ఇందుకొఱకే జీసను మహాశయుడు తన అనుచరులకు హితోపదేశములను చేసెను! మహమ్మదు ప్రజానీకములో చైతన్యమును కలిగించెను! బుద్ధుడు మహాత్యాగి కావలసి వచ్చెను! సుక్రటీసు విషముత్రాగి అసువుల బాసెను! టాల్‌స్టాయ్ తన సారస్వత జీవితాన్నంతటినీ కరుణారసంలోనే ముంచివేసెను! రవిబాబు విశ్వమనే రంగస్థలంపైన నృత్యం సలుపుతూ మనోహర కోకిలారావాన్ని జేసెను! బాపూజీ విశ్వానికే 'బాపూ' అయినాడు! ఈ సామాజిక రాజకీయ బాధ్యతలను నిర్వర్తించుటకే కమ్యూనిజం, సోషలిజం, డెమాక్రసీలు ఆవిర్భవించాయి!

వ్యక్తి సమాజంలో లీనంకావటం, వ్యక్తితో ప్రారంభమైన 'స్వ' అనే పరిధి విశ్వమనే విశాల ప్రదేశాన్ని వ్యాపించటం, ఒకరికోరిక పదుగురి కోరికలలో విలీనం కావటం, ఒకరిమాట పదుగురి మాటలలో కలసి ఏకరూపమై ప్రవహించటం అభిన్నత్వములేక దుఃఖనివృత్తి యగును. ఈ అభిన్నత్వాన్నే అన్నిమతములు, ఇజములు కాంక్షించినవి. ఈ అభిన్నత్వముకొఱకే బుద్ధుడు "సంఘం శరణంగచ్ఛామి" అని పలికెను. ఈ ఏకత్వముకొఱకే "The Government of the people, by the people, for the people" అని అమెరికా ప్రజానీకము లింకను మహాశయుని కంఠముతో కలసి ఉచ్చైస్స్వరముతో పలికెను.

ఈ ఏకత్వ సాధనకే భారతదేశము "స్వాతంత్ర్యము నా జన్మ హక్కు"ని ప్రకటించుకొనెను.

అయితే యీ లక్ష్యాన్ని గుర్తుంచుకొన్నవారే నేడు ప్రపంచాన్నంతటినీ ఆవరించియున్న మతకలహాలు - అభిప్రాయాల ప్రచారంలోగల కలహాలు - ఆవిర్భవించి వుండేవా? దీనికి వెంటనే సమాధానం లభిస్తుంది - "ఆయా ఇజముల, మతముల ప్రచారంలో నాయకులే తమలక్ష్యాన్ని మరచిపోవుటవలన మతకలహమారి ప్రపంచాన్నంతను ఆవరించినది" అని. "ఆర్థికదుస్థితి తొలగి, అందరికీ సమానంగా తిండి - గుడ్డ - ఇల్లు సౌకర్యాలు కలిగినప్పుడే మానవులందరూ సుఖవంతులై ఏకకుటుంబంగా మనగలరు" నే సూత్రాన్ని ముందుబెట్టుకొని బయలుదేరిన 'ఇజము'ల మధ్య జరుగు పరస్పర కలహాలకూ; శ్వ, చాండాల, భూత పతిత వాయసేభ్యో అన్నం భూమౌ నిక్షిపేత్ అని పలికి, సమాజంలో ఘోరతప్పిదాలు జేసి శిక్ష ననుభవించే నీచులకు సైతము అన్నముబెట్టి భుజింపవలసిన ధర్మమును బోధించిన ఋషిసంతతివారై, 'వసుధైక కుటుంబకం' అని నిత్యమూ జపిస్తూ, 'సమానోమంత్రః సమితిస్సమానీ' అను వైదిక ధర్మానికి అనుయాయులమని గర్వించుకొను హిందువుల మధ్య, 'అల్లాహో అక్బర్' అని జపించు మహమ్మదీయుల మధ్య జరుగు కలహాలకూ; శాంతి స్థాపకులే ధన్యులని బోధించిన బైబిలునే చేతబట్టుకొన్న కాథలిక్కులకు ప్రొటెస్టంటులకు మధ్య జరిగిన ఘోర హింసాకాండకూ అభిన్నత్వమనేది లేక దుఃఖనివృత్తియనెడి లక్ష్యాన్ని మరచుటయే కారణము

"క్రిస్టియను మతములోని కాథలిక్కుల విగ్రహారాధనకు వ్యతిరేకులైన ప్రొటెస్టంటుల నైతిక వాదమునుండి క్రమవృద్ధి జెందుచూ నేటి ఇజములన్నీ బయలుదేరినవని * సి. యి. యమ్. జోడ్‌గారి అభిప్రాయము. నైతికవాద ప్రచారము విపులముగా సాగినను, సమాజములో అధిక సంఖ్యాకులు ఆర్థికదుస్థితికి లోనుగావలసివచ్చినప్పుడల్లా నైతిక వాదములో ఒకవినూత్న పరివర్తన యేర్పడుతూ వచ్చెను. "సామాజిక పరిస్థితులనుబట్టి నైతిక సూత్రములు మారుచుండవలెను" అనునదే ఆపరివర్తన. ప్లాటో మహాశయుడీ పరివర్తనకు పునాది వేసినాడు. తరువాత సోషలిజం, పిమ్మట తార్కికవాదం, కమ్యూనిజం, ఫాసిజం క్రమంగా జన్మించినవి. సోషలిజం పుట్టుకతోనే డెమోక్రసీ ప్రారంభమైనది. 'సమాజంతోపాటు నైతికసూత్రాలు మారాలి' అనుటలో సమాజమునకు – సొసైటీకి – ప్రధాన స్థానమేర్పడినది. ఈ సూత్ర ప్రభావంతో 'సంపదను సమాజపరం చేయాలి' అనే సోషలిజం జన్మించగా, దీనిని అమలుపరచే విధానాన్ని గూర్చి కలిగిన అభిప్రాయాలు రెండుగామారి ఒకటితార్కిక (Dialectic) వాదమై, రెండవది ప్రజాస్వామిక వాదమైనది. ఇక తార్కికవాద పర్యవసానం సామ్యవాదంగా మారినది. "ప్రజానీకమంతా విజ్ఞానవంతులు గానప్పుడు, నిర్బంధముగానైనా వారిచేత అభివృద్ధికరమైన పనులు చేయించవలసినదే. లేనిచో సామ్యవాదము నిరర్థకమగును" అను దృష్టి ప్రబలు

* వీరి "Guide to the philosophy of morals and politics" అను గ్రంథము యొక్క ఆధారముతో.

టతో ఫాసిజం బయలుదేరినది. కొద్దిమంది వ్యక్తులే యీ వాదాన్ని ఉపయోగించుకున్నప్పుడు ఫాసిజం మిక్కిలి భయంకరంగాను, బలమైన ఒక పార్టీ దీనిని ఉపయోగించుకున్నప్పుడు తక్కువభయంకరంగానువుండును. కాని మొత్తం మీద యీఫాసిజం భయంకరమైనదే గనుక సమాజంలో అధిక సంఖ్యాకుల నిర్ణయమును అల్ప సంఖ్యాకులకుగూడ వర్తింపజేయు నప్పుడు అల్పసంఖ్యాకులకు సహేతుకమైన విమర్శన చేయుటకుగూడ అవకాశముండవలెనను దృష్టితో నేటి డెమోక్రసీ బయలుదేరినది. ఈవిధంగా పాశ్చాత్య దేశాలలో ఇజముల ప్రాభవం యేర్పడినది. నైతిక బాధ్యతలు, అవసరాలు, వాటిని సాధించేమార్గాలు – Ethics' Ends, Means – అనే దృష్టితో బయలుదేరిన ఇజముల మధ్యను, 'సర్వమానవ సౌభ్రాతృత్వమే వ్యక్తిసుఖం' అనే మార్గంతో బయలుదేరిన హిందూ, ముస్లిం, సిఖ్ఖు, బౌద్ధ, క్రైస్తవ మతాలకు మధ్యను జరిగే కలహాలకు కారణం అభిన్నత్వ లక్ష్యాన్ని మరచుట అనగా 'స్వ' యొక్క పరిధి – My- Myself యొక్కపరిధి విశాల ప్రదేశాన్నాక్రమించ లేక పోవుటయేనని గ్రహించాము. 'స్వ' యొక్క వర్తులము సంకుచితమగుటయే హింస. కనుక హింసాభావమే మతకలహాలకు కారణము. అహింసాభావమే యీకలహాలకు నివారణోపాయము. ఈఉపాయం మనకెలా బోధపడుతుంద నేది ముఖ్యమైన ప్రశ్నయే. 'నాలక్ష్యం యేమిటి?' అనగా 'నాకర్తవ్యంఏమిటి? దాన్ని నేనెంతవరకు నెరవేరుస్తున్నా[illegible]' అనే జిజ్ఞాస కలిగితే యీఉపాయం బోధపడుతుంది. [illegible]

నెహ్రూ పండితుడు "ఈనాడు కావలసినది యే 'ఇజము' అనే ప్రశ్నగాదు, నాకర్తవ్యం ఏమిటి? నేనేంచేస్తున్నాననేదే ప్రతి వ్యక్తికీ కావలసిన విషయం" అని పదే పదే ప్రకటించినాడు. ఈభావాన్ని అలవరచుకున్న యెడల ప్రపంచనాశనానికి తోడ్పడే మారణాయుధ నిర్మాణానికి రాజకీయవేత్తలబుద్ధి కుశలత తోడ్పడేదిగాదు. హిందూ ముస్లిములు రాక్షసుల వలె స్త్రీ మానభంగములు, శిశుహత్యలు జరుపుకొనేవారు గారు. ఇప్పటికైనా యీభావమలవడితే సామాన్య ప్రజానీకపు యుద్ధ వ్యతిరేక వాంఛను రాజకీయనేతలు మభ్యపరచి, ప్రతిష్ఠలకై పెనగులాడుచూ, ఐక్యరాజ్య సమితిని చదరంగంగా మార్చివేయ జాలరు. 'నిర్వైరః సర్వభూతేషు' అనే యీసూత్రాన్ని స్వీకరించకపోతే కమ్యూనిజము ఫాసిజముగాక తప్పదు. డెమోక్రసీ కాపిటలిజం, ఇంపీరియలిజంగా మారిపోక తప్పదు. హిందూమతం – ఆర్యమతం – నామ మాత్ర వైదిక మతమై కోట్లకొలది గోడ్సేలు జన్మించటానికి నిలయమైపోవడమే మాట ఖాయం. బౌద్ధమతంలో అహింసకు స్థానమే దొరకదు. మహమ్మదీయులకు 'అమీన్' అందని ఆశయే అవుతుంది. క్రైస్తవులకు 'సిలువ' ఆట వస్తువుగా మారిపోవడమే మాట నిజం!

## మతం — తిండి

పూర్వపురోజుల్లో సంగతు లెలావున్నా, నేడు ప్రత్యక్షంగా మతంపేరుతో ఆర్థికసమస్యలను మభ్యపరచి, తిండి లేని జనాన్ని పీడించడం కళ్ళారా చూచుచున్నాము. దరి

ద్రుని యింట తెలివిగల కుర్రవాడు పుట్టినను చదువుకొనుటకతనికి అవకాశం లేకపోవుటయు, ధనవంతుని యింటిలో మూర్ఖుడు జన్మించినను అతడు చదువుకొనుటకై ప్రాణావకాశములు కలుగుటయు, ఈ రెండు స్థితులకు "పూర్వజన్మకర్మ" అనే సిద్ధాంతాన్ని సరిపెట్టుటయు జరుగుచున్నది. ముస్లిములలో కొందరు జమీందారులు, పెట్టుబడిదారులు కలసి, చదువురాని సామాన్య ముస్లిం ప్రజానీకానికి "ముస్లిం మత సంస్కృతిగల రాజ్యం" లేక "పాకిస్థాన్" అనే నల్లమందువేసి వారిని మత్తులో పడద్రోసిరి. ఇట్లే హిందూ పెట్టుబడిదారులు హిందూమతపు వెర్రి ఆవేశాన్ని సామాన్య ప్రజలలో కలిగించి కర్తవ్యవిముఖుల్నిగా జేసిరి. పర్యవసానం, హిందూ-ముస్లిమ్ కలహాలు, స్త్రీ మానభంగములు, శిశుహత్యలు, గృహదహనాలు, దోపిడీలు చెలరేగినవి. వీటిని నివారించడానికి ప్రభుత్వము వ్యయప్రయాసలకు లోనుగావలసి వచ్చెను. ఎట్టకేలకు "చావుతప్పి కన్నులొట్టవోయె" నను సామెతగ దేశవిభజన కంగీకరించి, కొంతవరకైనా సామాన్య ప్రజానీకపు వాంఛితాలను తీర్చుటకై కాంగ్రెసునాయకులు ప్రభుత్వమును చేపట్టిరి. కాని ఇప్పటికీ భారతదేశంలో తిండిసమస్య తీరలేదు. కమ్యూనిజమ్ - డెమోక్రసీ - కాపిటలిజమ్ - అనే మతాల లేక ఇజమ్‌ల పరస్పర పోటాపోటీ యుద్ధాలలో ప్రపంచ ప్రజలందరి తిండి సమస్య ఆహుతియైపోవనుండగా భారతదేశపు మాట లెక్కయా ?

తిండి, తిండితోబాటు గుడ్డ, ఇల్లు– ఇవి మూడు ప్రతి మానవుని కనీసపు అవసరములు. వీటిని సమాజమునుండి వాంఛించుట కనీసపు హక్కులు. ఇవి సమాజంలో అందరికీ సమానంగా కలుగునంతవరకు హృదయపూర్వకంగా కృషిసల్పటం కనీసపు విధి. ఏమతంగాని, యే 'ఇజం'గాని యీ విధానానికి అడ్డురాగూడదు. వాస్తవంగా యేమతము లేక యే 'ఇజమ్' అడ్డురాదు. పైగా ప్రతి మతము లేక మతప్రవక్త ఆర్థిక సమానత్వమునే బోధించును. ప్రకృతి సంపదలగు తిండి, గుడ్డ, ఇల్లు ఇవి అందరికీ సమానంగా వుండాలనే వాదనజేయుట చేతనే, ప్రతి ప్రవక్తగూడ బీదల హృదయాల నాకర్షించగలిగెను.

వేదములోని క్రింది మంత్రమును జూడుడు.

"సమానీప్రపా, సహవోన్నభాగః। సమానేయోక్త్రేసహవోయునజ్మి సమ్యంచోగ్నిం, సపర్యతారా నాభిమివాభితః॥ అథర్వ (3-30. 6)

ఈమంత్రంలో "సమానీప్రపాసహవోన్నభాగః" అనే వాక్యం ఆర్థికసమానత్వాన్ని సూచిస్తున్నది. ప్రకృతిలోని సంపదను మానవుడనుభవించును. అయితే శ్రమ జేయనిదే సంపద – పదార్థములు – లభ్యముగాదు. అందుకు అందరు శ్రమజేయాలి. ఎకరంభూమిని సాగుచేయాలంటే ఒక్కమనుష్యుడే చాలడు. ఎడ్లు, రైతు, శ్రామికులు, ఎంజనీయరు, పర్తకుడు, యిందరిపాటు కావలసియున్నది. పండిన పంట విలువ అందరికీ చేరవలసియున్నది. ఎకరంభూమిలో లభించే ద్రవ్యానికి పెట్టుబడి డబ్బుకు చెందుభాగం వడ్డీఅనీ, చేసిన

కృషికి పోవలసినభాగం కూలి అనీ, భూమికి చేరవలసిన భాగము అద్దె అనీ చెప్పబడును. అందరూ శ్రమజేసినప్పుడు ప్రకృతిసంపదను అందరు అనుభవించాలి. శ్రమ పైననే సంపదయొక్క ఉత్పత్తి ఆధారపడియుండుటచేతను, శ్రమ అనేది మానవుని అధీనమై యుండుటచేతను, ఎందుకనగా – బుద్ధితోకూడిన కాయకష్టమే వస్తూత్పత్తికి మూలమగుట చేతను, ఆర్థికశాస్త్రమునందు 'ప్రకృతిలోని మహత్తరపదార్థముల తర్వాత మానవుడే మొదటిసంపద' అని పేర్కొనబడుచున్నది. ఎక్కువగా కష్టపడువారు, తిండి – గుడ్డ – ఇల్లు వసతులను తక్కువగ పొందడం, ఏమాత్రము శ్రమ జేయని వారు వీటిని యెక్కువగా పొందడం, ప్రకృతిమాతకు కృత్రిమపుటలంకారము జేయుటయే. అందుచేతనే వేదమునందు యీమంత్రము జెప్పబడెను. "సమానీప్రపాసహావోన్నభాగః" మీరు జలమును, అన్నమును సమానంగా మైత్రీభావంతో అనుభవించుడు" అని అర్థము. దీనికి విరుద్ధంగావుండే సమాజపరిస్థితులకు కారణము, పైసిద్ధాంతానికి విరుద్ధంగా పనిజేయుట లేక "కర్మ" యేకారణముకాని, అర్థములేని కర్మసిద్ధాంతముగాదు. 'కర్మ' అంటే పని. పనిలేనిదే ఫలితం లేదు. వేపవిత్తునాటి మామిడిపండు రావాలంటే రాదు. మామిడిపండు ఫలించని స్థితికి వేపవిత్తునాటుట అనేపని, లేక కర్మయే కారణము. అట్లే సమాజంలో ఆర్థిక హెచ్చుతగ్గు భేదాలకు ప్రకృతిలోని సమత్వ సిద్ధాంతాన్ని గుర్తించలేని స్థితిలో సామాన్యప్రజలుండుట అనేకర్మ లేక పని, తెలివి గలవారు వాస్తవికసత్యానికి విరుద్ధంగా అమాయకప్రజలను

దోపిడీచేయుట అనేకర్మ కారణములై యున్నవి. నిన్నటిపని నేటికి పూర్వజన్మ. పుట్టుకకు పూర్వకర్మవిశ్లేషణ సంగతి అనవసరము. దాని స్వరూప నిర్ణయాలనుగూడ యెవరును చేయజాలరు. పురుషార్థము అనగ పురుష ప్రయత్నంతో కర్మ ఫలితాన్ని మార్చుకొనవచ్చునని భగవద్గీతలోఁ జెప్పలేదా ? వేపవిత్తును నాటిన ఫలితాన్ని జూచినపుడు బుద్ధినుపయోగించి మామిడివిత్తును నాటుటయే పురుషప్రయత్నము. అనగా కర్మఫలితాన్నుండి కర్మరూపాన్ని మార్చుకొనుటకు బుద్ధి తోడ్పడినదన్నమాట. కనుక బుద్ధి బలాన్ని ఉపయోగించుకొని అందరికి తిండి-గుడ్డ-ఇల్లు సౌకర్యాలను కలిగించుకొనుటలో మతము అడ్డురాదు. అడ్డేదయినా మతము అడ్డువచ్చునని వాదించినచో అది వాస్తవిక మతము గాజాలదు. ఆర్థిక వికేంద్రీకరణ, సమత్వములకు చిహ్నమైన రాట్నాన్ని బాపూజీ మరణాంతము వీడక పోవుటను యీ సందర్భములో గుర్తుంచుకొనవలసిన విషయము.

# శరణ్యం

ఎంతదూరం వెళ్ళినా, ఎంత యోచించినా మానవుని లక్ష్యం "శాంతి" అని మాత్రమే తేలుచున్నది. శాంతి అక్కరలేనివారంటూ వుండరు. స్వార్థముయొక్క విశాల రూపపు తుదిహద్దే యీ "శాంతి". మానవుడు నేటికి తన బుద్ధికుశలత, ఊహాశక్తి, గతానుభవములను ఉపయోగించి అభిన్నత్వస్థితి నొకదానిని కనుగొన్నాడు. అదే అంతటికీ మూలమని భావించక తప్పలేదు. అయితే దానిని చేతిలో బెట్టి చూపించమంటే అతనికి సాధ్యమగుటలేదు. అందువలన యేమీ చేయలేక "తదేజతితన్నైజతి" అది కదలును - కదలదు, "తద్దూరేతద్వదంతికే" అది దగ్గరలోను దూరంగాను వున్నది, "తదంతరస్య సర్వస్య తదుసర్వస్యాస్య బాహ్యతః" అదిలోపల బయటగూడ నున్నది అని నిర్వచించుకున్నాడు. కాని ఆ "తత్" యెట్లావుంటుందో చూద్దామని మరల కోరిక పుట్టకుండునా? అందువల్ల ప్రయత్నించి అంతు దొరకక తుదకు "నవిద్మో నవిజానీమో" అని అనక తప్పలేదు. ఇంత అద్భుత శక్తిగలిగి భిన్నరూపమైన సముదాయాని కంతటికీ మూలమైన అభిన్నత్వమే సర్వమును ఆవరించి యున్న మాట కాదనలేము. కనుక 'తత్'ను కొందరు దైవమన్నారు. మరికొందరు శక్తియని అన్నారు. ఇంకొకరు 'అహం' అన్నారు. ఇంకొకరు పరమాత్మ అన్నారు. అది సర్వకాల సర్వావస్థలలోను వుండు సత్యరూపము.

దానిని 'తత్ సత్యం' (అది సత్యం) అన్నారు. కాని దైవం అనేపేరుగూడ దుర్వినియోగమవుతూ వచ్చింది. అందువల్ల గాంధీజీ అఖండసత్యమే దైవము (Truth is God)అని చెప్పి నారు. దానిలో లీనమగుటకే స్వార్థముయొక్క విశాల రూపమును పొందవలసి యున్నదని అనగా త్యాగమును అలవరచుకొనవలసియున్నదని తన జీవితముద్వారా బోధించి నారు. త్యాగమనగా తేలికైనవిషయమా? ఇతరునికొరకు తాను కష్టాలను యేరికోరి తెచ్చుకొనుటయే త్యాగము. కష్టాలు మానవునకు వాంఛనీయమా? దూరమాలోచిస్తే త్యాగంలో అంతర్భూతమైన కష్టాలు వాంఛనీయములుగానే కానుపించును. త్యాగదృష్టిలో అవి బాధలుగ నుండవు. తల్లి తనబిడ్డకొరకు చేసేత్యాగంలో తనకెదురయ్యే బాధలన్నిటినీ సుఖాలుగ అనుభవిస్తుంది. అనగా వాటిని ఆమె సుఖంగా భావిస్తుంది. అప్పుడామె వర్ణించలేని ఆనందాన్ననుభ విస్తుంది. బిడ్డలో ఐక్యమౌతుంది. బిడ్డకుకలిగే సుఖమంతా తనకుకలిగి నట్లు కనుపిస్తుంది. ఇదేస్థితిని మానవుడు తన సార్వజనికజీవి తంలోకి మార్చుకున్నప్పుడుగూడ త్యాగంవల్ల అతనికి బాధ కలుగదు. ఈవిషయాన్ని బాపూజీ తనజీవితంద్వారా స్పష్టంగా చూపించినారు. వారు సూచించిన వికేంద్రీకృత విధానమే యిందుకుసాక్షి. దీనినే అహింసయొక్క విస్తృత రూపమనవచ్చును. ఈఅహింస పిరికివాని పిరికితనముగాదు. పీడించువాడు పీడితలోకానికి చెప్పే కల్లబొల్లి మాటలలో యీ అహింసాతత్త్వము నివసించలేదు.

కనుక అహింస అనే మార్గంతో ఆ 'తత్' అను అభిన్నత్వమును – సర్వమానవుల లక్ష్యాన్ని–చేరుకొనటం యెవరికి వాంఛనీయంగాదు? రేఖలోపలబింపువు ఓతప్రోతమై యుంపునట్లు మనలో యీ అహింసాదృష్టి – సమదృష్టి యేర్పడినచో లక్ష్యమగు అభిన్నత్వము మన జీవితంలో ఓత ప్రోతమై వుంటుంది. లేకపోతే? లేకపోతే యేమయేది మనకు తెలుస్తూనేవున్నది. మనం అనుభవించే బాధలే దాని లోటుయొక్క ప్రభావం. ఈబాధలేగాదు, తృటిమాత్రంలో సర్వనాశనంగూడ రాగలదనేది నేటిసభ్యలోకం గుర్తిస్తూనే వున్నది. ఈ సర్వనాశనం మనకక్కరలేదు గనుక అభిన్నత్వ దృష్టే – సమదృష్టే – బాపూజీ మాటల్లో అహింసే–మనకు శరణ్యం! ముమ్మాటికీ శరణ్యం!! కనుక 'మా విద్విషావహై' అనే ప్రమాణం మనం గట్టిగా తీసుకోవలసింటేగదా!

ఓమ్ తత్సత్

సర్వోదయప్రెస్, పటమటలంక. 1000—3/1951

# సవరణలు

| తప్పు | ఒప్పు | పేజీ | | పంక్తి |
|---|---|---|---|---|
| నివృత్యర్థే | నివృత్త్యర్థే | 5 | - | 11 |
| కర్మ—అకర్మలు | కర్మ-హృదయము | 10 | - | 2 |
| సార్యమ | సార్యమణం | 10 | - | 19 |
| సర్వ | సర్వ | 11 | - | 22 |
| హృద్దేశోర్జున | హృద్దేశేఽర్జున | 12 | - | 21 |
| సర్వహితా | సర్వపితా | 17 | - | 3 |
| వాడనియము | వాడననియము | 15 | - | 4 |
| స్థిరమై | స్థిరమైన | 21 | - | 10 |
| అభిమతమ్మైట్లు | అభిమతమైనట్లు | 21 | - | 13 |
| వస్తువును | వస్తువును వస్త్రముగా | 29 | - | 8 |
| సాద్వితీయం | ద్వితీయం | 29 | - | 18 |
| సంగము | సంగమము | 34 | - | 14 |
| సూర్యుడనే | యిక్కడసూర్యుడనే | 34 | - | 22 |
| మైనవగుటచే | మైనదగుటచే | 41 | - | 16 |
| పాతేర్వా | పాతేర్వా | 45 | - | 9 |
| సామానాం | సమానాం | 51 | - | 13 |
| వాచర్వేదం | వాచగ్వేదం | 58 | - | 2 |
| భిన్నత్వము | అభిన్నత్వము | 73 | - | 11 |
| కలయిక లేని | కలయిక లేక | 73 | - | 14 |
| ఆ పని లేని | ఆప లేని | 77 | - | 22 |
| పుంసవన | సీమంతోన్నయన | 83 | - | 10 |
| Cereny | Ceremony | 90 | - | 5 |
| సరగచ్ఛతి | సర్వత్రగచ్ఛతి | 91 | - | 12 |

—o—

# ఉత్తమ గ్రంథాలు

| | |
|---|---|
| ఆంధ్రవిజ్ఞానము. 7 సంపుటములు | 5-0-0 |
| శ్రీ వీరేశలింగ గ్రంథావళి. 3 సంపుటములు | 15-0-0 |
| రామకథ (రామతీర్థస్వామి జీవితము) | 5-0-0 |
| మతము (రామతీర్థస్వామి ఉపన్యాసములు) | 2-8-0 |

డా॥ భో. పట్టాభి సీతారామయ్యగారి

| | |
|---|---|
| కాంగ్రెసు చరిత్ర, ద్వితీయ సంపుటము | 8-0-0 |
| గాంధీ-గాంధీతత్వము. 2 సంపుటములు | 8-0-0 |

డా॥ యే. శ్రీ రాములు చౌదరిగారి

| | |
|---|---|
| అనుభవ పశువైద్య చింతామణి (క్రొత్తకూర్పు) | 10-0-0 |

శ్రీ గోశేటి జోగిరాజుగారి

| | |
|---|---|
| పంప్లు 4 వ భాగము | 5-0-0 |
| డిటో 5 వ భాగము | 4-0-0 |
| వ్యవసాయ శాస్త్రము. 2 సంపుటములు | 10-0-0 |

శ్రీ మానికొండ సత్యనారాయణశాస్త్రిగారి

| | |
|---|---|
| భూమి - రైతు - రాజు | 5-0-0 |

ప్రాప్తిస్థానము: గ్రంథాలయ పుస్తకశాల

పటమట పోష్టు, కృష్ణాజిల్లా.